# శ్రీమద్భాగవత ప్రకాశము

- ఎక్కిరాలకృష్ణమాచార్య

# శ్రీమద్భాగవత ప్రకాశము

## తృతీయ స్కంధము

### చతుర్థ భాగము


కులపతి

ఎక్కిరాల కృష్ణమాచార్య





ది వరల్డ్ టీచర్ ట్రస్ట్ ప్రచురణ

# ఉపోద్ఘాతము

ఇంచుమించుగా రెండువందల పద్య గద్యముల ప్రమాణముగల కపిల దేవహూతి సంవాదమును ఒక స్వతంత్ర గ్రంథముగా గూడ దర్శింప వచ్చును. కపిల దర్శన మని కీర్తింప దగిన ఈ పవిత్ర గ్రంథము మోక్షవిద్యకు నారాయణుని ప్రతిరూపము. సనాతన వేదవిద్యా సంప్రదాయమున భగవద్గీతకు, సనత్సు జాతీయమునకు, బ్రహ్మసూత్రములకు, ప్రధాన ఉపనిషత్తులకు గల స్థానమే కపిలదర్శనమునకు కూడ ఉన్నది. సంసారబంధములను తొలగించుకొను విద్యను నేర్పుటలో ఈ గ్రంథములు వెన్నతో పెట్టినట్లు పిల్లలకు గూడ ఆస్వాదనీయమగు నట్లు నేర్పును. పండితుల గ్రంథముల వలె అంతుపట్టకుండ చేయవు.

భాగవతమును భక్తితో పఠించితి మనుకొనువారిలో గూడ చాలమంది ఈ కపిల దర్శనమందు తగిన శ్రద్ధ వహింపరు. పండితులలోనే ఇది కనుపించును. ఇక తెలిసినదానిని గూడ పామరులకు వివరించు సద్బుద్ధి పండితులలో నశించినది గనుక ఆస్తిక ప్రజలైన సామాన్యులకు ఇందేమున్నదో తెలియదు. గజేంద్ర మోక్షము మున్నగు ఘట్టములతో సమానమైన దృష్టి కలిగి దీనిని చదువుకొన వలెనని వారికి బోధించిన పెద్దవారు లేరు. ఇట్టి కారణములచే స్థూలదృష్టితో నేర్పరచుకొన్న అపోహలు దీనిని గూర్చి ప్రస్తావించుకొనబడుచున్నవి. కపిలుడు తల్లికి కొన్ని నీతులు చెప్పెనని కొందరు, సాంఖ్యము నేర్పెనని కొందరు నూహించుచున్నారు. సాంఖ్య మనగా నేమో స్పష్టముగా తెలియదు. దానితో మిక్కిలి అర్వాచీనమైన షడ్దర్శనములలోని సాంఖ్యము చెప్పబడెనని కొందరు నిర్ణయించిరి. ఈశ్వరకృష్ణు డనువాని సాంఖ్యకారికలలో ప్రతిపాదింపబడిన విషయముతో దీనిని ముడిపెట్టవలెనని కొందరు చూసిరి. భగవద్గీతలోని సాంఖ్య మను పదమును గూడ అట్లే సమన్వయింప జూచిరి.

వాస్తవమునకు కపిలుడు తల్లి కుపదేశించినది సాంఖ్య మొక్కటే కాదు. అష్టాంగయోగము, భక్తియోగము, తత్త్వదర్శనము, బ్రహ్మాండవిజ్ఞానము, పిండోత్పత్తిక్రమము, జనన మరణ జరావ్యాధి స్వరూపములు మున్నగు సమస్తము నుపదేశించెను. గీతలోని విశ్వరూప సందర్శనము, పురుషోత్తమప్రాప్తి, గుణత్రయ విభాగము, శ్రద్ధాత్రయ విభాగము, మోక్ష సన్యాస యోగములలో

చెప్పబడిన విషయము నంతటిని వివరించి కరతలామలకముగా నుపదేశించెను. అంతేకాక యిందలి సాంఖ్యము షడ్దర్శనములలో చెప్పబడినదికాదు. సాంఖ్య యోగము లనబడు జ్ఞానకర్మల సమన్వయమునకు కావలసిన పరిజ్ఞానమును సాంఖ్య మందురు. ఈ యర్థమే ప్రాచీనము. ఇందు వివరింపబడిన సాంఖ్య విధానము అనాదిగా వేదములలో, నుపనిషత్తులలో, బ్రాహ్మణములలో, నారణ్యకములలో కనుపించును. సాంఖ్య మను పేరు మాత్రము వాడబడలేదు. అంగములతో, నుపాంగములతో, సాంఖ్యముతో, యోగముతో, భక్తిసాధనతో, ఆగమవిధానముతో సమన్వయింపబడి, సమగ్రమైన బ్రహ్మవిద్యా సర్వస్వము ఈ కపిల దర్శనమున నుపదేశింపబడినది గాని సాంఖ్య మొక్కటే కాదు.

కృష్ణార్జున సంవాదముగా భగవద్గీతను రచించినట్లు కపిల దేవహూతి సంవాదముగా వ్యాసుడే దీనిని రచించెను. భగవద్గీతకన్న గ్రంథము విస్తారమై. యితిహాస వ్యాఖ్యా వివరణలతో, నుదాహరణములతో నిది పరిపూర్ణమై కనిపించును. గీతతో సామ్యములు గూడ చాలాచోట్ల నున్నవి.

గురు శిష్య సంవాద రూపమైన యీ గ్రంథమున జిజ్ఞాసువునకు కావలసిన పరిప్రశ్న మిందు పొందుపరుపబడినది. ఇందలి ప్రశ్నల సారాంశము :

1. ఇంద్రియములతో ఘర్షణపడుచున్న జీవునకు అజ్ఞానము తొలగించుకొను మార్గమేది ?
2. భక్తిని అభ్యాసము చేయుట ఎట్లు ?
3. తత్త్వశాస్త్రమును భక్తితో సమన్వయించుట ఎట్లు ?
4. ప్రకృతి పురుషుల లక్షణములను సత్తు, అసత్తు అనువానిని తెలియుట ఎట్లు ?
5. ఒక్కమారు బోధింపబడినంత మాత్రమున పురుషుడు సంసార భయము నుండి ఎట్లు తప్పించుకొనును ? మోక్ష మెట్లు పొందును ?
6. సాంఖ్యముతో జోడించుకొని భక్తిసాధన చేయుట ఎట్లు ?
7. సృష్టియు, జీవుని మోహము దేవుని మాయయే అయినప్పుడు జీవుడు దానిని పోగొట్టుకొనుటకు యత్నించుట సాధ్యమా ? సాధ్యమైనను ఈ మార్గము సహజమా ?

8. ఉపదేశము పొందిన తరువాతగూడ జీవికి శోక మోహములు కలుగుచుండును. ( దేవహూతి ఉపదేశము పొందిన తరువాతనే పుత్ర, భర్తృ వియోగమునకు దుఃఖించెను ) అటుపైన సాధన మెట్లు జరుగును ?

ఈ ప్రశ్నలాధారముగా చేయబడిన విపుల వివరణమే కపిలుని బ్రహ్మవిద్యా దర్శనము. ఇందుపదేశింపబడిన అంశముల నిట్లు పేర్కొనవచ్చును :

1. మనస్సే బంధమునకుగాని, మోక్షమునకుగాని కారణము. దేనిని కావలె ననుకొనినను బంధము కలుగును. నారాయణుని యందు న్యాసము చేసినచో మోక్షము కలుగును.

2. ఆహారము జీర్ణమైనప్పుడు వేరుగా నుండక తిన్నవాని శక్తి యుక్తులతో నొకటియై మెలగును. అట్లే జీవ ప్రజ్ఞ అను నాహారము భక్తి యను భోజనముచే అంతర్యామి యను భోక్తయం దొకటిగా పనిచేయును.

3. మోక్షము పొందదలచినవాడు మోక్షము కోరుట మరచిపోవలెను. సుతులు, మిత్రులు, భార్య, భర్త, గురువు, శిష్యుడు మొదలగు రూపములలో ప్రవర్తించుచు, ఆ రూపములలోని భగవంతునియందు ఆ ప్రవర్తనను సమర్పింప వలయును. అప్పుడు మోక్షము కలుగును. లేనిచో నీ సంబంధములే సంసారబంధనము లగును. వానిని తప్పించుకొని వేరుగా నుండదలచినవాడు వానిలో చిక్కుకొనును.

4. సృష్టిక్రమము, మహదహంకారాదుల యుత్పత్తి, బ్రహ్మాండ, పిండాండ ములు, జనన మరణములు, గర్భ నరకము, వ్యాధి, ముసలితనము, మృత్యువు అను వాని సహజ స్వరూపములు నుపదేశింపబడినవి. ఇవి యన్నియు అంతర్యామియొక్క ఆటలని తెలియుటయే మోక్షము,

5. కలలో దృశ్యములు, పాత్రలు తనకన్న వేరుగా కనుపించును. తానుగూడ నట్లే కనిపించును. మెలకువతో అన్నియు మాయమై తానే యని తెలియును. అట్లే మోక్షజ్ఞానముతో అంతర్యామియైన తా నొక్కడే మిగులును.

6. నదులు వేరువేరు రుచులతో, గుణములతో, పేర్లతో ప్రవహించును. సముద్రముతో సంగమించిన క్షణమున అన్నియు తొలగి సముద్రమే యుండును. అట్లే నారాయణుని ప్రజ్ఞతో సంగమము చెందిన భక్తున కే సృష్టి యంతయును.

7. కలలో కలిగిన ధనప్రాప్తి, దారిద్ర్యము, అప్పులు, సుఖదుఃఖములను నిజముగా కలిగించును. అవి ఎంత బలీయములైనను మెలకువతో మాయ మగును. అట్లే జీవితమందలి కష్టసుఖములు, కర్మలు, ఫలములు నారాయణుని యందు మేల్కొనుటతో మాయ మగును.

8. అవయవములు, ఇంద్రియములు, ఊహలు అనేకములు. అయినను వానితోగూడిన ఆరోగ్యవంతుడు ఒకడుగానే జీవించును. అట్లే యోగి యీ చరాచర జగత్తు నడుమ నొకడుగానే జీవించును.

9. నిర్గుణుడు, సగుణుడుగా పరమాత్మను దర్శింపవలెను. అంతేకాని సగుణునికన్న నిర్గుణుదెక్కువ పెద్ద దేవుడని వ్యామోహపడుట అజ్ఞానము. అవ్యక్త పరబ్రహ్మము నుపాసించుట గగనకుసుమమువలె గొప్ప చెప్పుకొనుటకు మాత్రము పనికి వచ్చును. సగుణమైన సృష్టిని సృష్టిగా నంగీకరింపక నారాయణుని సగుణరూపముగా నంగీకరించినపుడు ధ్యానము నిలుచును. ధ్యానములో నిర్గుణపరబ్రహ్మము తెలియును. అంతేకాని నిర్గుణుని చేరుటకు దగ్గరదారులు లేవు.

10. సగుణధ్యానమున జీవులపై కరుణ, సద్గుణ గ్రహణము, ఆచరణ రూప మైన దాన పోషణాదులతో భూతదయ ఉండి తీరవలెను. ఇవి సాధన లోని తప్పనిసరియైన సోపానములు. ఇవి లేని యజ్ఞయాగాదులు, అనేక యోగసాధనలు అర్థము లేని భారము కలిగించును. తుదకు అసత్యముగా పరిణమించును.

11. దేవునితో సారూప్య, సాయుజ్యాదులు సిద్ధింపవలెనన్నచో దేవుడు జీవులను చూచుచున్నట్లు చూచుట, మెలగుచున్నట్లు మెలగుట నభ్యసింపవలెను.

12. సృష్టిలోని సకల పదార్థ ధర్మములు, జీవ ధర్మములు, లోకముల ధర్మములు, దేవతల ధర్మములు దేవుని ప్రభుత్వముగా వర్తించును. వాని నుల్లంఘించుట ఎవరికిని సాధ్యము కాదు. వాని అస్తిత్వమును వేరుగా నంగీకరించుట అజ్ఞానము. అంతర్యామి ప్రభుత్వ ధర్మములుగా, చట్టములుగా, శాసనముగా దర్శించుట జ్ఞానము.

13. వేదము, సంప్రదాయము నంగీకరించిన వారిలో కొందరు సుఖజీవనమునకై అందలి పుణ్యకర్మల నుపాసింతురు. వారు నిజమైన వేదమార్గము నవలంబించువారు కాదు, వేదవాదరతులు. వారికి సుఖదుఃఖములే కలుగుచు,

పునర్జన్మ లుండును గాని ఆనందము, మోక్షము కలుగవు. మరియొక మార్గమువారు వేదమును, సంప్రదాయమును, సత్కర్మలను అంతర్యామి కర్పణ బుద్ధితో నుపాసింతురు. వారు నిజమైన వేదవిదులు. వారు ఆనందస్వరూపులై మోక్షమున నుందురు.

14. వేదము కామ్యకర్మలను, సుఖదుఃఖములను, పుణ్యఫలములను మాత్రమే కలిగించుననియు, వేదాంతమగు మోక్షవిద్య దానికన్న వేరనియు భావించు వారు వేదబాహ్యులు, అనగా పాషండులు, నాస్తికులు అగుదురు.

15. తత్త్వదృష్టితో, సృష్టి నర్థము చేసికొని సాంఖ్యముతో సృష్టి తత్త్వముల కూర్పు నర్థము చేసికొని అష్టాంగయోగముతో ఆత్మనిగ్రహము సాధించుచు భక్తియోగముతో వీనిని జోడించుకొనుట సర్వోత్తమమైన మోక్షవిద్య.

ఇట్టి బ్రహ్మవిద్యాసర్వస్వముతో కూడిన భాగవత శ్లోకముల ననువదించుటలో పోతన అవలంబించిన పద్ధతి పరమసాధువై, మధురమై పామరులకు గూడ నవగతము కావలె నను అపార దయాగుణమును ప్రదర్శించుచున్నది. మరియు నిట్టి ఘట్టములలో భారతానువాదమున తిక్కన చేసిన మార్పులను, పరికరణములను సంగ్రహీకరణమును చేయక పోతన మహాకవి సమర్పణ బుద్ధితో యథాతథముగా తేనెతో రంగరించినట్లు భవరోగౌషధ గుణములలో దేనిని వ్యర్థము కానీక తెనుగువారి కందించెను. దాని నందుకొనుట తెలుగువాడుగా పుట్టిన వానికి జన్మసాఫల్యము.

విశాఖపట్టణము
1-1-1981

ఇట్లు
ఎక్కిరాల కృష్ణమాచార్య

# విషయ సూచిక

## భాగవత రహస్య ప్రకాశము

# భాగవత రహస్య ప్రకాశము

[ పోతన భాగవతము తృతీయ స్కంధము 864-వ పద్యము నుండి 1052-వ పద్యము వరకు ]

864. అని చెప్పి మైత్రేయుడు విదురునితో మరల నిట్లనెను : కర్దముడు తపోవనమునకు వెడలిన వెనుక కపిలుడు తల్లి యాపేక్ష చూరగొనుచు, తల్లియం దాపేక్ష కలిగి బిందుసరమున వసించి యుండెను. ఒకనాడు బ్రహ్మ వచనములను దలచుకొని దేవహూతి తన కుమారుని తత్త్వమార్గము నుపదేశించు పరమగురువుగా స్మరించి వానితో నిట్లనెను :

865. "ఇంద్రియముల పరస్పర సంఘర్షణము చెడ్డది. దానితో మనస్సు పరిపరి విధముల తిరుగును. అట్టి నాకు ఈ మోహమును తొలగించుకొనుటకు మార్గము నుపదేశింపుము. (దేవహూతికి అట్టి స్థితి లేకున్నను ఇట్లు చెప్పుకొనుట, గురువును శిష్యు డాశ్రయించు పద్ధతిని తెలియజేయుచున్నది. ఇంద్రియ జయము కలవాడు కూడ ఇంద్రియములను జయించితి నని అను కొన్న క్షణమున దెబ్బతినును. "నే నింతవరకు సాధించుకొంటిని. మిగిలినది నీ వుపదేశింపుము" అని గురువు నడుగరాదు.)

866. "దట్టమైన చిక్కని అజ్ఞానపు చీకటిచే నావరింపబడిన జగత్ప్రపంచమునకు సూర్యునివలె నీవు ఒకే కన్నుగా వెలుగు చున్నావు. (కన్నులు రెండైనను ఆత్మదర్శనమునకు కావలసినది జ్ఞానమను నొకే కన్ను. ఒక్కటియని చెప్పుట యా కన్నుయొక్క అనన్యత్వమును, అఖండత్వమును వ్యంజకము చేయును.)

867. "నా మోహమను చీకటిని తొలగించుటకు సమర్థుడవు నీవు కాక మరియొక రెవరున్నారు? నీవు సంసార బంధములకు

త్రవ్వగోలవంటి వాడవు. సర్వజీవులకు శరణ్యుడవు. ధర్మమును విస్తరింపజేసి సర్వలోకములకు శుభములు కలిగించుటకు పుట్టితివి. శాశ్వత వైభవమునకు నాయకుడవు.

868. "నిన్నే శరణంటిని. నన్ను రక్షింపు" మని దేవహూతి వినయమున స్తుతించి వేడుకొనగా, దయామయుడైన కపిలుడు తల్లి వాక్యములను అనురాగముతో నాలకించెను. ఆ మాటలు సజ్జన సంప్రదాయ బద్ధములై మోక్షఫలమును సాధించునవియై యున్నవి.

869. విని యతడు చిరునవ్వున వికసించిన ముఖముతో సంతోషించి తల్లితో ప్రశాంతముగా నిట్లు పలికెను :

870. "తల్లీ! వినుము. బంధమనగా, మోక్షమనగా నెక్కడివి ? జీవుని మనస్సుననే యున్నవి. బంధమునకు గాని, మోక్షమునకు గాని మనస్సే కారణము. త్రిగుణముల యందు పని చేయు మనస్సే బంధమునకు కారణము. ( దేనినైన కావలె నను కొనుట రజోగుణ లక్షణము. అక్కర లే దనుకొనుట తమోగుణ లక్షణము. ఈ రెండును లేకుండుట సత్త్వగుణ లక్షణము. సత్త్వ గుణము కావలెననుకొనుట రజోగుణ లక్షణము. రజోగుణ మక్కర లే దనుకొనుట తమోగుణ లక్షణము. ఇక మరి సత్త్వగుణమును కావలె ననుకొనకుండ గుణాతీతస్థితి యెట్లు లభించును ? లేదా గుణము లక్కర లేదని అనుకొనినచో, గుణములు దాటుట యెట్లు అనుకొనినచో గుణములు స్మరింపబడును కదా ? ఇక వీనినుండి మోక్షము పొందు మార్గ మేమి ? అది రాబోవు వాక్యమున చెప్పబడుచున్నది. )

871. "మనస్సు నారాయణుని యందు నిలుపగోరినచో మోక్షకారణమగును" అని చెప్పి కొంచె మాగి కపిలుడు మరల తల్లితో నిట్లనెను :

( ఇం దుపదేశించినది మిక్కిలి సూక్ష్మమైన విషయము. దానియందు మనస్సు నిలువవలె నన్నచో మనస్సును దానియందు విడిచిపెట్టవలెను. దానిని గూర్చి చెప్పుట గూడ చెదరగొట్టుటయే

యగును. కనుక కపిలు డప్పటికి ఆగి తరువాత కొంతకాలమునకు మరల తత్త్వబోధ ప్రారంభించెను. ఇట్లు మనస్సును పరతత్త్వము పైకి మరల్చి విడిచిపెట్టవలెను. మరల్చిన మరుక్షణమునందు చెప్పువాడు, వినువాడు భాసింపరాదు. దీనినే నిశ్శబ్దముద్ర యందురు. మౌనవ్యాఖ్య యనియు, దక్షిణామూర్తి తత్త్వమనియు కూడ నందురు. "ఇచ్చట మౌనమే గురువు వ్యాఖ్యానము, సందేహము విడిపోవుటయే శిష్యులు పొందు స్థితి" అనియు, "శిష్యులు వృద్ధులు, గురువు యువకుడు" అనియు చెప్పబడిన దక్షిణామూర్తి సంప్రదాయమునకు అర్థవాదమే యీ కథ.)

872. (చిత్త మనగా ఇంద్రియ ప్రవృత్తులతో కూడిన మనస్సు. నిద్రపట్టని వాడు నిద్రపోవుటకై ఐదుగురు మిత్రులు నిద్రను గూర్చి ప్రశంసించుచుండగా వినుచున్న చో నెట్లుండునో, సుఖమును గోరిన చిత్తవృత్తులతో కూడిన జీవి మనస్సు అట్లుండును.) చిత్తమునకు "నేనున్నాను" అను భావము ముద్రపడరాదు. (అప్పుడే చిత్తము బదులు భగవంతు డుండి "నేనున్నాను" అనును.) "ఇది నాది, వీడు నావాడు" అను భావము రూపమున చిత్తము దేనియందును ప్రసరింపరాదు. ఇందు మొదటిది అహంకార మనబడును. రెండవది మమకార మనబడును. ఈ రెండును చిత్తవృత్తి వలన నేర్పడు రూపములు. ఈ రెంటి వలన అభిమానము పుట్టును. (అభిమాన మనగా నొక దానిని మిగిలిన వానికన్న నెక్కువగా తెలిసికొనుట. దీని వలన అంతర్యామి ప్రజ్ఞ మరుగుపడును.) అభిమానము వలన నొకదాని యందు కోరిక పుట్టును. (మనస్సను బంగారముతో కోరికయను విగ్రహము ఘనీభవించును. అప్పుడు విగ్రహము యొక్క ముఖ కవళికలు, చేష్టలు కనిపించుటచే బంగారము గుర్తుండదు. గుర్తులేనపుడు అది మనస్సగును. గుర్తున్నప్పుడు తానులేక పరబ్రహ్మమగును.) కోరికవలన నొక వస్తువుపై నాశపుట్టును. ఇట్లు పెరిగిపోవునట్టి భావముద్రలే దోషముల సమూహములు. వాని నుండి విడుదల చెందినపుడు చిత్తము పరిశుద్ధమగును. (విగ్రహము కరగించినచో బంగారము విగ్రహము యొక్క చేష్టల నుండి, కవళికల నుండి విడుదల యగును.)

అప్పుడు సుఖము, దుఃఖము నుండవు. ఒకే తత్త్వ ముండును. (బంగారము కరగించుటకు ముందు విగ్రహమున గల కవళికలు మొదలగువాని మొత్తమే ప్రకృతి యనబడును.) ఒకే తత్త్వము ప్రకృతికి అతీతుడై వెలుగును. అతడే పరమ పురుషుడు. అతడు వేర్పరుపరానివాడు. అతనియందు విభాగములు, విభేదములు లేవు. అతడు తానే వెలుగు గనుక వెలిగింపబడడు. (ప్రకృతిలో దాగి వెలుగుచుండును. ప్రకృతిని వెలిగించుచుండును. ప్రకృతికన్న పరుడుగా నున్నప్పుడు వెలుగు మాత్రమే. వెలుగు లేని పదార్థములు, గది గోడలు ఉన్నచో వెలుగు వానిని వెలిగించును. కనుక వెలుగున్నట్లు తెలియును. వస్తువులు, గదులు, గోడలు లేనపుడు వెలుగు వెలిగింపదు. వెలుగుగా నుండును. కనుక కనిపింపక అంతర్యామియై దాగి యుండును.)

అతడు సూక్ష్మస్వరూపుడు. (వస్త్రములకన్న అందలి నూలుపోగులు సూక్ష్మములు. వానికన్న అందలి ప్రత్తి సూక్ష్మము. దానికన్న అందలి పరమాణువులు సూక్ష్మములు. అంతకన్న అందలి శక్తిసూక్ష్మము. అంతకన్న అందలి యంతర్యామి సూక్ష్మము. వస్త్రము చూచుచున్నపుడు అందలి నూలు పోగులపై మనస్సు నిలువనట్లు, జగత్తును చూచుచున్నప్పుడు అందలి అంతర్యామిపై మనస్సు నిలువదు. కనుకనే అంతర్యామి సూక్ష్మ స్వరూపుడు.) వానికి ఇతర వస్తువు లుండవు. కనుక రెండు వస్తువుల నడుమ నున్న భేదముచే విడదీయబడడు.

ఆ పరమ పురుషుడు వస్తువుల మంచి చెడ్డలతో సంబంధము లేనివాడు. వ్యక్తుల మంచి చెడ్డలతో సంబంధము లేనివాడు. కలుగుచున్న భావములు, జరుగుచున్న సృష్ట్యాది కర్మలు వానికి పట్టవు.

ఈ ప్రపంచమంతయు వాని మయము. (మయ మనగా వానితో నిండినది. వానినుండి యేర్పడిన స్థితి భేదములు కలది యని యర్థము. ఈ రెండంశములలో మొదటి దానిని ప్రాచుర్య మందురు. రెండవ దానిని వికార మందురు.) ఈ ప్రపంచము వానియందు తన యస్తిత్వమును కోల్పోవును. (ఈ యస్తిత్వ

మునే ఓజస్సు అందురు. ఓజస్సు అనగా ఓంకార స్వరూపుని పుట్టించునది. ఓంకార స్వరూపుని నుండి పుట్టునది యని యర్థము. ఈ యోజస్సునకు వానియందస్తిత్వ ముండదు.)

అట్టి పరమ పురుషుని చూచువారు యోగు లనబడుదురు. వారికిని మనస్సుండును. దానిని ప్రయోగించి జ్ఞానము, వైరాగ్యము, భక్తి సాధించుకొని వానిని దర్శింతురు. (జ్ఞాన మనగా తెలియువాడు, తెలియబడునది, తెలిసికొనుట యను మూడిటిని దేవుడుగా వెలిగించుట. వైరాగ్య మనగా చూడబడు దాని యందును, వినబడుదాని యందును దప్పిక పుట్టకుండుట. ఒక వ్యక్తి యొక దుష్టుని గూర్చి నిందించుచున్నప్పుడు, ఆ వాక్యములలోని శబ్దమును విని అర్థమును విడిచిపెట్టుట వైరాగ్యము. అందమైన వస్తువును చూచినపుడు అది యెవరిది అను విషయమునందు మనస్సు నిలువకుండుట వైరాగ్యము. భార్యతో సంభాషించునపుడు అందలి భార్యా సంబంధమున మనస్సు నిలువక అంతర్యామిత్వమున నిలుచుట వైరాగ్యము. "చూడబడిన, వినబడిన విషయములయందు దప్పిక పుట్టకుండు లక్షణము, తన వశమున నుండుటయే వైరాగ్యమునకు గుర్తు" అని పతంజలి తన యోగసూత్రమున అనుశాసించెను.

జ్ఞానమును, వైరాగ్యమును అభ్యాసము చేయవలెను. అనగా అడుగడుగునను మరల మరల మనస్సున కంటించవలెను. అట్లు చేయుచుండుటలో ప్రయత్నము ప్రాతవడక నిత్యనూతనమై యుత్సాహము పుట్టించుకొనుటయే భక్తి సాధన. ఈ యుత్సాహ మునే పరమప్రేమ యని నారదుడు నిర్వచించెను. దీని కుదా హరణముగా వ్రజగోపికలు కృష్ణుని యందు సాధించిన సేవాక్రమము పేర్కొనెను. ఇట్లు మనస్సున జ్ఞానము, వైరాగ్యము, భక్తి ముద్రించుకొనుటతో యోగులు పరమ పురుషుని దర్శింతురు.)

పరమ పురుషుని దర్శించు చుండుటయే, వాడుగా జీవించు టయే పరతత్త్వము సిద్ధించుట. అన్నిటియందు అతడున్నాడు గనుక మనస్సున కందినంతవరకు వానిని కల్పించుకొని వానియందు భక్తిని ప్రయోగింప వలెను. దానితో మార్గము ప్రత్యక్షమగును.

ఇతరమార్గములు దీనితో సరిగావు. (మార్గము తనకన్న నితరముగా అర్థము చేసికొనుటకు యత్నించుట వ్యర్థము. కనిపించిన దారిని నడువవలెను గాని, ఈ దారియొక్క విశిష్టత యేమి యని మీాన మేషములు లెక్కింపరాదు. చేతిలో టార్చిలైటు పట్టుకొని చీకటిలో ప్రయాణము చేయువానికి దారి రెండు మూడడుగులు కనిపించును. ఆ దారి వెంట నడచుట యారంభించినచో అటుపైన దారిపై వెలుగు పడును. అట్లు కాక మిగిలిన దారి యెట్లు కనిపించునని ఆలోచించినచో బద్ధుడగును.)

సంగమనగా మనస్సు దేనికైన నంటుకొనుట. ఇది తప్పని కొందరందురు. తెలిసిన వారు అట్లనరు. ఇంద్రియార్థములైన శబ్దము, స్పర్శ, సుఖము, రూపము, రుచి, వాసన అనువానికి మాత్ర మంటరాదు. అంటినచో బంధము కలుగును. కారణ మేమనగా నివి అసద్విషయములు. (అసద్విషయమనగా లేనిది యున్నట్లు కల్పించుకొను విషయములు. చెవులకు శబ్దము వినబడును. అది సద్విషయము. ఇతరులు మాటాడుచున్నప్పుడు ఆ శబ్దమునకే మనకు నచ్చిన యర్థము కల్పించుకొని విందుము. అది అసద్విషయము. స్పర్శజ్ఞానము సద్విషయము. మనబిడ్డను ముట్టుకొన్నచో హాయిగా నుండుట, భార్యను స్పృశించినచో సంతోషము కలుగుట అసద్విషయములు. ఇవి స్పర్శ జ్ఞానమునందు మనస్సు ఆరోపణచేసికొనుటవలన కలిగిన విషయములు. ఇట్టి అసద్విషయ ముల యందు మనస్సంటుట బంధమునకు కారణము.)

సంగము సంయమమునం దుండి తీరవలెను. అనగా శబ్ద స్పర్శాదులను ఇంద్రియ ప్రవృత్తులచే లొంగదీయుట, ఇంద్రియము లను మనస్సుచే వశపరచుకొనుట మొదలగు ప్రయత్నములను మనస్సు అంటించుకొనవలెను. అనగా సంగము ఆవశ్యకము. (జేబురుమాలలో కర్పూరము మూట కట్టినచో దాని వాసన యంటును. ఉల్లిపాయ మూట కట్టినచో దాని వాసన యంటును. అట్లే మనస్సునకు అసద్విషయము లంటును. జేబురుమాలలో నిప్పును మూటకట్టినచో నిప్పు వాసన యంటదు. రుమాల నిప్పులోనికి మాయమగును. అట్లే మనస్సునకు సంయమ మను

సద్విషయము నంటించినచో మనస్సు దైవమయ మగును.) కనుక సత్ప్రవర్తన కలవారికి మనస్సుయొక్క సంగము సూటియైన మోక్షద్వార మగును.

సహనము శీలముగా నభ్యాసము కావలెను. (సహన మనగా కష్టము, సుఖము అను నభిప్రాయములను జీవిత ఘట్టముల పైకి ప్రసరింపనీయక అంతరింపజేయుట. సౌకర్యము, అసౌకర్యము అను నభిప్రాయములను కర్తవ్యము వైపునకు సోకనీయకుండుట. మంచివారు, చెడ్డవారు అను నభిప్రాయములను జీవులపైకి సోకనీయకుండుట. నచ్చుట, నచ్చకుండుట అను నభిప్రాయము లను సృష్టివైపునకు సోకనీయకుండుట) ఈ శీలము నలవరచు కొనినవారు సమస్త శరీరధారులకు ఆప్తమిత్రు లగుదురు. వారికి పరమ ప్రశాంతి లభించును. కరుణ యనుభవమునకు వచ్చును. చేసిన పనుల ఫలితముపై దృష్టి సోకదు. తనవారు, చుట్టములు అను నభిప్రాయములు తొలగును. నా పాదముల ఆశ్రయము లభించును. నా గుణములను ధ్యానించుటయందు పారము లభించును. (జీవుల గుణములు నా గుణములుగా తెలియును) నా పుణ్యకథలను ప్రసంగము చేయుచు, వివరించి చెప్పుచు, వినుచు, ఆనందము పొందుచుందురు. (గుణవంతుల, పుణ్యాత్ముల కథలను నా కథలుగా మెచ్చుకొని, చెప్పుకొని వినుచుండుటచే సద్గుణముల ధ్యాన సంతోషము కలుగును. "ఇతడు మంచివాడు, ఇతడు తెలివిగలవాడు" మున్నగు నభిప్రాయములకు అభిమానము, అసూయ మున్నగునవి అడ్డురావు గనుక సంతోషము కలుగును.) అట్టివారే పరమభాగవతోత్తములు. ఆధ్యాత్మికము, ఆధిదైవికము, ఆధిభౌతికము అనబడు తాపత్రయములు వారి నంటవు.

ఈ మార్గమున సంగములను విడిచిన పరమభాగవతుల సాంగత్యమును కోరి కల్పించుకొనవలెను. అది సకల దోషములను పోగొట్టును. అట్టి సహవాసము వలననే జీవుల హృదయమునకు, చెవులకు మాధుర్యము కలిగించు నా కథల ప్రసక్తి పుట్టును. నా గుణములను చెప్పుకొని వినుచుండుట వలన సక్రమమైన దారిలో శీఘ్రముగా శ్రద్ధాభక్తులు పుట్టును. వాని వలన వారు నేనుగా నుందురు.

ఈ జగత్తు సమస్తము నా కల్పనమే. అందు జీవులు స్వేచ్ఛగా విహరించుచుందురు. కనుక నెప్పుడో ఒకప్పుడు వారికి జగత్తునందు నేను తగులక తప్పదు. దానితో భక్తి పుట్టును. వాడెవడైనను తప్పులేదు. ఒక్కమారు భక్తిభావ ముదయించి నచో క్రమముగా నింద్రియ సుఖముల పట్టు విడిపోవును. ఇహము, పరము అను భేద భావముల పట్టు గూడ విడిపోవును. అట్టివాడు చిత్తమును స్థిరము చేసికొన గోరును. వానికి సూటి యైన యోగమార్గ సాధనలను నేనే కలిగింతును. అట్టివాడు ప్రకృతి గుణములను సేవించుచునే వైరాగ్యము పొందును. (అందమైన స్త్రీలయందు కామాసక్తుడై చరించువానికి ఒక స్త్రీయందు మిక్కిలి యాదరము కలుగవచ్చును. దానితో భక్తిభావ ముదయించి సౌందర్యమును దైవముగా ధ్యానించును. దానితో సౌందర్యము మిగిలి, కామమునందాసక్తి తొలగును.) వైరాగ్యము గుణముగా విస్తరించుటచే జ్ఞానయోగము కలుగును. నాయందు భక్తిసాధన పుట్టినవాని మనస్సును నేనే నియమము చేయుదును. కారణమేమనగా వానిలో నేనే ప్రత్యక్షమైన తానుగా నున్నాను. ఈ యుపదేశము విని దేవహూతి యిట్లు ప్రశ్నించెను :

873. "ఏ భక్తి నీ గుణములను స్థాపించి సంసార పాపము లను నశింప జేయునో, ఏ విధమైన భక్తి అల్పకాలమున ముక్తి సంపదను గలిగించునో ఆ భక్తిసాధనకు మార్గమును తెలుపుము.

874. నీవు యోగసాధనను గూర్చి ప్రసక్తి చేసితివి. ఆ విషయమున నేను మందబుద్ధిని. నాకు విశదపడునట్లుగా యోగ విద్యను, దాని యంగములను వివరింపు" మని ప్రశ్నించిన దేవ హూతితో కపిలు డిట్లనెను :

875. "తల్లీ ! వినుము. సృష్టిలోగల సకల పదార్థముల యందును సద్వినియోగ మున్నది. దాని పరిజ్ఞానము కావలెను. దానికై ఆ పదార్థముల యథార్థ స్వరూపమును తెలియవలెను. దానిని తెలియుటకు వేదశాస్త్రము తప్ప మరియొక గతి లేదు. వేదములందు చెప్పబడిన సత్కర్మలే ఆచరించుటకు యత్నింప

వలెను. దానివలన దేవతలు తృప్తి చెందుదురు. వారందరును ఆ కర్మల నాచరించి వర్తించుచున్నారు. సత్కర్మ లాచరించుట స్వభావము కావలెను. అంతర్యామియైన భగవంతుని సేవించుటకు మనసున కారణ ముండరాదు. పలువురు ముక్తికొరకు దేవుని సేవించువారున్నారు. ముక్తి యనబడు వారి యభిప్రాయము కన్న నన్ను సేవించుట మిన్న. తిన్న యన్నమును గర్భములోని యగ్ని యేవిధముగా జీర్ణము చేయుచున్నదో గమనింపుము. ఆ విధము గనే నన్ను సేవించుట వలన తన్ను గూర్చి జీవుడు తాను గుర్తు పెట్టుకొన్నదంతయు జీర్ణమైపోవును. కనుక సర్వవ్యాపియైన వాని యందు భక్తిసాధన చేయు వైభవమును వివరింతును వినుము :

876. నిర్మలమైన భక్తి నభ్యసించు మహాత్ములు నా పాదములను హృదయమున నిలిపి కుతూహలముతో నొకరితో నొకరు సంభాషించుకొందురు. (ఎవరితో సంభాషించు చుందురో వారిని నా రూపములుగా నుద్దేశించి ప్రసంగించు చుందురు.) అట్టి సంభాషణములలో నా దివ్య శరీరముల ధారణను గూర్చియు, అందు నేను పురుషుడుగా చేయు లీలలను గూర్చియు కీర్తించుకొను చుందురు. (మహానుభావుల జీవిత కథాంశములను ప్రసంగించు కొనుటలో వారి భౌతిక జీవితములకు సంబంధించిన వివరములకై చూడక వారు చేసిన లోకోత్తర సత్కర్మలను స్మరించుచు నా వైభవములుగా పాడుకొను చుందురు.) ఇట్టి వైభవములోని ఆనందముతోనే వారి జీవితము గడచును. ఇట్టి మహనీయులకు మోక్షము కోరుట మొదలగు వెఱ్ఱివేషము లుండవు. తమ సర్వ కర్మలును నా కర్పితములుగా జరుగును. (ఇంక మోక్ష మును గూర్చి నిర్వచనములతో వారికి పనియేమి ?)

877. కొందరు భాగవతోత్తములు పూర్వము ప్రసిద్ధి కెక్కిన నా యవతారములను స్మరించుకొనుచు, ఆ యవతారము లలో నా మొగ మెట్లుండెనో, నా ప్రసన్నత ఎట్లు వ్యక్త మయ్యెనో, నేను కన్ను తెఱ జేసినప్పు డెట్లుండెనో, నేను భక్తులకు వరములు ప్రసాదించునపు డెట్లుంటినో రూపకల్పన జేసికొనుచు, యోగస్థితి చెంది, నా సాన్నిధ్య మనుభవించుచు, నొకరితో నొకరు

వర్ణించుకొని చెప్పుకొనుచు జీవితములు గడుపుదురు. కొందరు నా యవయవము లెట్లుండినవో, సౌందర్య మెట్టిదో, నా విలాసము, మందహాసము, మనోహర సంభాషణము నే విధముగా నుండెడివో చెప్పుకొనుచుండుటలో వారి మనస్సులను, ప్రాణములను నేను గ్రహించి యనుభవించు చుందును. ఇక వారికి మోక్షము కోరుట కవకాశ మేది ?

( వాల్మీకి మహర్షి రామావతారములోని విలాసములందు ఇట్టి యోగస్థితి చెంది, రామాయణమును లోకమున కిచ్చెను. వ్యాసుడు భారతమునను, పురాణముల యందును ఈ విధమైన సత్కర్మ నిర్వాహణము చేసెను. అవతారమూర్తులకు సమకాలికులు కాకపోయినను కాళిదాసు, భవభూతి యిట్టి సమాధి స్థితినే పొందిరి. కొందరు తమ సమకాలికములైన అవతార కథలను ప్రత్యక్షముగా ననుభవింపగా, కొందరు తమకు పూర్వము దేవుడెత్తిన యవతారముల స్మరణలో నిమగ్నులగుదురు. ఇరు తెగల వారును భాగవతోత్తములే గనుక మోక్షము కోరునట్టి దారిద్ర్యమునకు వారియందు తావులేదని భావము. )

878. అట్టి భాగవతోత్తములు మోక్షమునం దపేక్ష లేనివారై యుండుటవలన అణిమాదులైన అష్టసిద్ధులు వారి నాశ్రయించును. నిరంతరమైన యానందము వారికి సమకూరును. వారికి మోక్షమునందే లెక్కలేనందున లెక్కలకు, కొలతలకు అందనిదగు స్థితి వారి వశమై యుండును. కనుక సర్వశుభ లక్షణములు ఆ స్థితియం దిమిడియే యుండును. ఆ విధమైన మోక్ష స్థితిని వా రప్రయత్నముగా నలంకరించుచున్నారు.

( అణిమ, మహిమ, లఘిమ, గరిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశత్వము, వశిత్వము అనబడునవి అష్టసిద్ధులని కొందరును, అష్టవిభూతులని కొందరును కీర్తింతురు. వానిని ప్రయత్నించి సాధించుకొనువారు వానిని సిద్ధులని పిలుతురు. అట్టివారు ఈ సిద్ధుల వశమున నుండవలెనుగాని, వారి వశమున సిద్ధు లుండవు. భాగవతోత్తములయందు అవి నారాయణుని గుణములై వెలువడును. కనుక లోకమునకు వైభవముగా నొప్పారును. )

879, 880. పుణ్యాత్ములైన భాగవతోత్తములు ఈ విభూతులతో నొప్పారుదురు. వారిని కాలచక్రము గ్రసింగదు. వారు నిత్యులై సాటిలేని సుఖానుభవమున నుందురు.

881. సంసారులకు సుతులు, సహవాసులు, హితులు, గురువులు, దైవము అను నభిప్రాయములు బంధములై అడ్డుపడు చుండును. మోక్షమును లెక్కచేయని భాగవతోత్తములకు నారాయణుడే సుతుడై స్నేహము చూరగొనును. సఖుడై విశ్వాసము కలిగించును. హితుడై మిత్రత్వము స్థాపించును. మంత్ర ముపదేశించువాడుగా దిగివచ్చి గురుస్థాన మలంకరించును. ఇష్టదైవమై వారికి తన సాన్నిధ్య మిచ్చును. మిగిలిన వారికి ఏ సంబంధములు కాలచక్రముగా వర్తించి ఆయువును గ్రసింగునో, ఆ సంబంధముల రూపముననే నారాయణుడు భాగవతోత్తములకు కాలచక్రభయమును తొలగించును.

(సంసారమనగా భార్యా బిడ్డలు, చుట్టములు, ఇల్లు, వాకిలి అనుకొని బాధపడువారు సంసారజీవులు. అట్టివారు వాని నుండి త్రెంచుకొని, యెచ్చటకో మోక్షమను ఆరుబయలునకు పోయి విశ్రాంతి తీసుకొనవచ్చునని పొరపడి వ్యర్థముగా ప్రయత్న ములు చేయుచుందురు. ఆ ప్రయత్నములలో కర్మబంధములను పెంచుకొందురు. భాగవతోత్తములు మిగిలిన వ్యక్తులందు తమ సంబంధముల నారోపించుకొనక నారాయణుని అస్తిత్వము దర్శించి సేవింతురు గనుక, వారి యాయుర్దాయము దేవుని అస్తిత్వమగును. ఇందరి లోపములలో దేవుడు కాలచక్రప్రభావమును వారినుండి తొలగించును. ప్రతి కర్తవ్యమును భగవత్సేవగా వారు నిర్వర్తింతురు గనుక, వారిపై బరువు బాధ్యతలు పనిచేయవు.)

882, 883. ఇట్లు వివరించి, దాని నవగతము చేసికొనుటకు కొంచెము మౌనము ప్రసాదించి, మరల కపిలాచార్యు డిట్లనెను : "మరల వినుము. జీవుడుగా నాత్మయే పలుమారులు దివినుండి భువికి, భువినుండి దివికి పల్లటీలు కొట్టుచుండును. ఈ పిల్లిమొగ్గలే జనన మరణములు. ధనము, గొడ్డు, గోద, బిడ్డలు, మిత్రులు, భార్య అను వానిపై నారోపించుకొనిన ఆసక్తియే యిట్లు జనన

మరణములలో కొట్టుకొనుటకు కారణములు. వాని నారో పించుకొనుట మాని అన్నిరూపములవాడుగా నన్నే భజించినచో ఈ చక్రమునుండి విమోచనము చెందును. దీనిని సాధించునపుడు మనస్సున నాకన్న అన్యమైన దానిని స్మరింపరాదు. స్మరించుట యనగా అన్యమును పుట్టించుకొని ముడిపెట్టుకొనుటయే. నా స్మరణలో అన్యము లేనివానిని, నేనే ఈ జనన మరణ రూపమైన సముద్రము దాటింతును.

(ఆత్మ యనగా తానను ప్రజ్ఞ. అందు కోరికలు, సంబంధములు నిలువవు. నీటినుండి మంచు గడ్డ కట్టుకొనినట్లు, ఆత్మనుండి ప్రకృతి ధర్మములు పుట్టి మనస్సు వెలువడును. దానికొరకు ఇంద్రియములు, వాని యుపాధి కొరకు దేహము కట్టుకొనును. ఆత్మ ఆకాశరూపమున నుండును. దేహము పృథివీ తత్త్వముతో కట్టుకొనును. ఇట్లు జీవు డేర్పడును. దీని నేర్పరచుటకే బ్రహ్మకు పద్మమువలె జీవునకు తల్లిగర్భము పనిచేయును. దేహబద్ధుడైన వాడు సంబంధములు ఆరోపించుకొని పెంచుకొన్నచో అవి మనస్సున నుండును. వీనితో ముద్రితమైన మనస్సు మృత్యుకాలమున ఆత్మలోనికి మాయమగును. ఐనను సంబంధముల వి త్తనములు ఆత్మ కంటకపోయినను ఆత్మయందు నిలబడును. పొగతో నిండిన ఆకాశము మిగిలిన యాకాశము కన్న వేరుగా నున్నట్లు, మృతిపొందిన తరువాత వీరి యాత్మలు పూర్తిగా నాత్మత్వము నందక వేరుగా నిలబడును. క్రిందటి జన్మమున మృత్యువునకు ముందు వర్తించినఆరోపణలుక్రమముగాబరువెక్కి భూమివై పునకులాగును. అప్పుడు జీవుడు వాని ప్రభావమున బద్ధుడై మరల గర్భస్థుడై జన్మించును. ఇట్లు కర్మఫలరూపమై జనన మరణ చక్రము తిరుగుచుండును. దీనిని త్రిప్పుటకే భగవంతుడు సంవత్సర చక్రరూపమున తిరుగు చుండును. ఈ చక్రమున జీవుడు దిగివచ్చు మార్గమును పితృయాన మనియు, పైకిపోవు మార్గమును దేవయాన మనియు చెప్పుదురు. మనస్సుతో తనకన్న అన్యవస్తువు నారోపించుకొనుట వలన బరువు కట్టబడి జీవుడు క్రిందకు, మీదకు పల్లటీలు కొట్టుచుండును. నారాయణ స్మరణమే సర్వజీవులయందు నారోపణ చేయబడినపుడు, అది ఆరోపణ కన్న లోతైన ఒకే అస్తిత్వము

గనుక అన్యము తొలగిపోయి అనన్యస్థితి యేర్పడును. ఇట్లేర్పడిన వారిని అనన్యుడైన దేవుడే సంసారసాగరమునుండి యుద్ధరించును.)

884. నేను ప్రధాన పురుష నాయకుడను. (ప్రకృతి పురుషుడు అను భేదము మాయవలన పుట్టును. మాయ నారాయణుని నుండి వాని క్రీడ కొరకై పుట్టును. ప్రకృతి నుండియే సృష్టి విభాగము లన్నియు పుట్టును. ఈ విభాగమునకు మూలమైన మొదటి ప్రకృతిని ప్రధానమందురు. దానియందు పురుషుడు జీవుడై దిగి వర్తించును. ఈ రెండును నారాయణుని యందు వర్తించును గనుక నారాయణుడు ప్రధానమునకును, పురుషునకును నాయకుడు. వాని నాశ్రయించిన మనస్సు వాడుగా నుండును గనుక, ప్రకృతి పురుషుల కతీతుడుగా నుండును. వాని పేరు " నేను ". )

అట్టి నేను భగవంతుడను. ( భగవంతు డనగా ప్రకృతి పురుషగుణములు తన వైభవములుగా కలవాడు. ఈ వైభవములు వానియందు మహిమలుగా నుండును. వాడు వాని కతీతుడుగ నుండును ) నా మహిమల వలన నేను సృష్టికి ప్రభువై వర్తించు చున్నాను. నాకంటె నన్యుల నంగీకరించిన యాత్మలకు సంసార భయ మున్నది.

వాయువు, అగ్ని మొదలగునవి నా కృత్రిమ మహిమలు. వానియందు వానివాని ప్రవర్తన ధర్మములుగా నా యాజ్ఞ యున్నది. అట్టి నా యాజ్ఞను దాటు సామర్థ్యము వానికి లేదు. కనుక వాయువు వీచును. అగ్ని వెలుగును. సూర్యుడు వేడి పుట్టించును. ఇంద్రుడు వర్షించును. మృత్యువు పారిపోవును. ( నాకంటె అన్య మున్నవానిని మృత్యువు పట్టుకొనును. )

ఇట్లు తెలిసికొనుటయే విజ్ఞానము. తెలిసిన వెనుక నాకంటె అన్యమును మనస్సు విడిచిపెట్టుటయే వైరాగ్యము. నన్ను స్మరించుటయే భక్తియోగము. అట్లుండుటతో పరమము నాశ్రయించి నిర్భయులగుచున్నారు.

885. నిండిన భక్తితో చిత్తము నాయందు వెలుగొందు చున్నంతవరకు సజ్జనులకీ లోకముననే మోక్షము లభించును.

(మోక్షము రావలెనన్నచో శరీరము విడిచిపెట్టవలె నను దుర్భ్రాంతిని తొలగించు చున్నాడు.)

886. అని యిట్లు కపిలాచార్యుడు తల్లికి విష్ణుభక్తి యోగము చెందు విధానమును వినిపించి, దాని నాకళించు కొనుటకు కొంత మౌనము ప్రసాదించి, సంతోషముతో మరల నిట్లు ప్రవచనము చేసెను :

887. "తల్లీ! నీ వడిగిన భక్తియోగమును వివరించితిని. మరి తత్త్వశాస్త్రము యొక్క లక్షణమును కూడ తెలుపుమని కోరితివి గదా! దానిని విభజించి వినిపింతును. తత్త్వముయొక్క గుణములు విశదమగుట వలన నరులు ప్రకృతి గుణముల నుండి విమోచనము చెందుదురు. హృదయమున నున్న ముడి విడి పోవును. తన స్వరూపము తనకు తెలియును. అదియే ఆత్మ జ్ఞానము. ఈ జ్ఞానము మోక్షమున కుపకరించును. (తత్త్వమనగా యథార్థస్థితి తెలియుట. 'తత్' శబ్దమునకు "అది, వాడు" అని యర్థము. ఆ పేర్లతో పిలువబడు వస్తువు మన కన్న వేరుగా భావింపబడు చున్నది. అందులో మనమున్నట్లు తెలియుటయే తత్ + త్వం (thatness) హృదయము నందున్న ముడి యనగా, తెలిసికొనువాడు, తెలిసికొనబడునది అను కేటాయింపు. ఈ రెండును ఒకే త్రాటికి రెండు కొనలవలె నేర్పడి తెలిసికొనుట యను ప్రయత్నములు, ప్రశ్నలు కలుగుటగా ముడివడును. ఈ ముడి విప్పుకొన్నచో సర్వసంశయములు తీరును. సర్వ కర్మలు క్షీణించును" అని శాస్త్రము చెప్పును.)

సత్త్వము, రజస్సు, తమస్సు అనబడు గుణములు ప్రకృతి నుండి పుట్టును. ఈ గుణములు ప్రకృతి కంటవు. (ఉంగరములు, గాజులు మున్నగు లక్షణములు అందలి బంగారమున కంటవు.) కాని ఈ ప్రకృతికి కొన్ని ప్రత్యేక గుణములుండును. అవి పురుషున కంటవు. (బంగారము యొక్క రంగు, సాంద్రత, బరువు అందు పరమాణువుల కంటదు.) ఇట్లంటకుండు ప్రకృతిలో నున్న పరిశుద్ధుడైన పురుషుడే ఆత్మ. అతడు ప్రతి వ్యక్తి యందును "నేను" అని సూటిగా ప్రత్యక్షమగు చుండును. వాని నుండి

మిగిలినవన్నియు వెలుగుగా దిగివచ్చును గనుక వానిని వెలిగింప లేవు. అతడు తనకు తానే వెలుగు. (దీపము నుండి వెలుగు వెలువడును. ఈ వెలువడిన వెలుగు దీపము కాదు. ఈ వెలుగు సహాయముతో దాని కారణమును చూడలేము. అది తనకు తానే వెలుగు.) ఇదియే ఆత్మస్వరూపము.

ఐనచో ఆత్మస్వరూపుడైన పరమాత్మ ఈ సృష్టిగా దిగుట యెందులకు? ప్రకృతి యందు అంతర్యామిగా ప్రవేశించుట యెందులకు? ఎందులకును కాదు. దీనికి కారణము లేదు. తన యిష్టము. తన సరదా. ఈ క్రీడలో తాను ప్రకృతియందు ప్రవేశించుట యొక భాగము. మూడు గుణముల లోనికి దిగుట యొక భాగము. దానినే మోహ మందురు. అతడు ప్రకృతిచే మోహింపబడుట ఈ క్రీడలో నొక భాగము. (బిడ్డల నాడించుచు పెద్దవారు ఆ బిడ్డలు చెప్పినట్లాడుచుందురు. వారు భయపెట్టినపుడు భయపడినట్లు నటింతురు. ఇది ముద్దుముచ్చట. ఇట్లే ఆత్మస్వరూపుడు ప్రకృతిచే మోహింపబడును.) ఈ మోహమున తన విజ్ఞానము మాటుపడును.

ప్రకృతి యందలి మూడు గుణముల ప్రవర్తనల వలన ఇంద్రియములు, మనస్సు, దేహము పుట్టి పనులు జరుగు చుండును. అందు వర్తించి ఆడుకొనుచున్న పురుషుడు తానా పనులను చేయు చున్నానని ఆరోపణ చేసికొనుట యొక భాగము. జరుగుచున్న పనులను చేయుచున్నానని నమ్మి కర్తగా తన్ను స్థాపించుకొని సంసారమున బంధింపబడుట ఈ యాటలో నొక భాగము. దాని వలన మనస్సునకు, నింద్రియములకు సహకారమిచ్చి తాను స్వాతంత్ర్యమును కోల్పోయి మెలగుట యొక భాగము. (తండ్రి గుఱ్ఱమువలె వంగియుండగా కొడుకువాని వీపుపైనెక్కి స్వారీచేయుట, గుఱ్ఱము నోటికి కళ్ళెము పెట్టుట, 'అటుపో యిటుపో' అని యాజ్ఞాపించుట చూచుచున్నాము. ఈ యాజ్ఞలకు బద్ధుడై వర్తించు తండ్రి తన కొడుకుకన్న దుర్బలుడని యర్థము కాదు. ఇది ముద్దుముచ్చటల సంగతి. అట్లే దైవవిలాసమీ సృష్టి. క్రొత్తగా కాపురమునకు వచ్చిన భార్య అప్పుడప్పుడు భర్తపై కోపించుట, అలుగుట

చేయును. అప్పుడు విధేయుడై ప్రవర్తించు భర్త ఆమెను అదుపున పెట్టలేడని యర్థము కాదు. ఈ విధేయత అతని రసికతను తెలియ జేయును. భగవంతుడు రసస్వరూపుడని వేదములు చెప్పుచున్నవి. "రసమనగా నతడే. అతడు రసికుడై ఆనందము ననుభవించును." అని వేదవాక్యము. భగవంతుని ఈ రసికత వలననే భర్తగా, భార్యగా, తండ్రిగా, తల్లిగా, బిడ్డగా వర్తించు జీవుని చేష్టలయందు రసికత వ్యక్తమగు చున్నది. )

పురుషునకు కర్తృత్వము లేదు. కర్తృత్వము అంటని పురుషుడే ఈశ్వరుడు. అతడు ప్రకృతి రూపములైన దేహాదుల యందు సాక్షిగా నుండును. అతడు కర్తగా క్రీడించునపుడు పనులకు కార్యకారణ సంబంధ మేర్పడును. ( పురుషుడు భార్యగా, భర్తగా క్రీడించునపుడు బిడ్డ పుట్టుటకు వారు కారణములుగా కనిపించును ) ఏ పనికైనను కార్యము, కారణము, కర్త యను సంబంధములు ప్రకృతివిగాని పురుషునివి గావు. పురుషుడు ప్రకృతి కధీనుడుగా వర్తించునపుడు వాని కుండును. ( పేకాటలో చీట్ల పేక ఆడుకొనుచున్నప్పుడు తురుపులు, ముక్కల విలువలు ఆటకు సంబంధించినవి కాని ఆడుకొనువారికి సంబంధించినవి కావు. ఆడుకొనుట కిష్టపడినంత కాలము వారు ఈ విలువలకు విధేయులై యుందురు. డబ్బులతో చీట్లపేకాడుటలో ఈ పట్టున కింత చెల్లింపవలె నను నియమము ఆటకొరకు తాత్కాలికముగా నారోపించుకొనినది. అట్లే పురుషునకు కార్యము, కారణము, కర్తృత్వము అను సంబంధములును. )

ఈ సంబంధముల నంగీకరించుట వలన పురుషుని చే సుఖము, దుఃఖము అనుభవింపబడుట ఈ క్రీడలో మరియొక భాగము. ప్రకృతి గుణము లంటించుకొని ప్రత్యేకముగా వర్తించు పురుషునికి సుఖ దుఃఖములు వర్తించును. ( పేకాటలో డబ్బులు పోగొట్టుకొన్న వారిలో కొందరు దుఃఖపడుట, రోషపడుట జరుగును. తా మంగీకరించి ఆడిన యాటయే గదా యని జ్ఞప్తియున్న వారు దుఃఖపడరు. ఆటను ఎంత నిజమని నమ్మినచో అంత దుఃఖము తప్పదు. )

ఈ యుపదేశమును విని దేవహూతి మరల నిట్లు ప్రశ్నించెను : "ఈ ప్రపంచమునకు అస్తిత్వమున్నది, లేకున్నది. ఉండుట ప్రకృతి వలన. లేకుండుట పురుషుని వలన. దీనినిబట్టి ప్రకృతి, పురుషులను గూర్చి తెలియుట తత్త్వజ్ఞానమునకు చాల ముఖ్యమని తేలుచున్నది. ఇంకను స్పష్టపడునట్లు ప్రకృతి, పురుషుల లక్షణములను నిర్దేశింపుము. సృష్టిలో ఉండుట, లేకుండుట అను వానితో ప్రకృతి, పురుషులను చక్కగా సమన్వయించి చెప్పుము. నీవు ప్రకృతికిని, పురుషునకును వెనుకనున్న పురుషోత్తముడవు గనుక, దీనిని నీవే యుపదేశింపవలెను." దేవహూతి యిట్లు కోరగా భగవంతుడైన కపిలాచార్యు డిట్లనెను :

888. "తల్లీ! వినుము. ప్రకృతి ఐదు విధములుగా నున్నది :

1. త్రిగుణముల రూపమున నున్న ప్రకృతి.
2. త్రిగుణములకు వెనుక వ్యక్తముగాకుండ నున్న ప్రకృతి.
3. మారని ప్రకృతి.
4. ఉండుట, లేకుండుటగా వర్తించు ప్రకృతి.
5. ప్రధాన మనబడు మూల ప్రకృతి.

ఈ యైదును ప్రకృతియందలి విశేషములు (ప్రత్యేకతలు). ఈ విశేషములు కలది గనుక ప్రకృతిని విశిష్టమని కూడ నందురు.

889. ఈ యైదు విశిష్టములతో కూడిన ప్రకృతియందు యిరువది నాలుగు స్వరూపములున్నవి. వానినే యిరువది నాలుగు తత్త్వము లందురు. వాని పరిగణన మిట్లున్నది :

5 మహాభూతములు
(పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము)

5 తన్మాత్రలు
(శబ్దము, స్పర్శము, రూపము, రుచి, వాసన)

5 జ్ఞానేంద్రియములు
(చర్మము, కన్ను, చెవి, నాలుక, ముక్కు)

5 కర్మేంద్రియములు
(వాక్కు, చేతులు, కాళ్లు, మూత్రేంద్రియము, మలద్వారము)

4 అంతఃకరణములు
(మనసు, బుద్ధి, చిత్తము, అహంకారము)

24 మొత్తము తత్త్వముల సంఖ్య

ఈ ఇరువది నాలుగు తత్త్వములతో కూడినది ప్రకృతి. ఇదియే సగుణ బ్రహ్మమునకు నివాసము. ఈ ఇరువది నాలుగు తత్త్వములును దేనియందు పుట్టి, పెరిగి వర్తించునో అది ఇరువది యైదవ తత్త్వము. దాని పేరు కాలము. ఇది ఈశ్వరుడైన పురుషుని తత్త్వమని పెద్దలు చెప్పుదురు.

ఇందు వర్తించు పురుషుడు జీవుడు. వర్తింపని పురుషుడు దేవుడు. జీవుడు అహంకారముచే మోహింపబడి ప్రకృతిని పొంది భయము చెందును. ప్రకృతిగుణము లన్నింటియందును సమాన మైన అంతర్యామిగా వర్తించువాడు భగవంతుడు. అతడు నిర్విశేషుడు. అనగా ప్రకృతిలోని విశేష లక్షణము లంటని వాడు. అతని చేష్టలలోని విశేషములే ఈ ప్రకృతి విశేషములు.

ఈ చేష్టలు అతని కెందులకు పుట్టును? ఆటలకు పుట్టును. ఆడుకొను సంకల్ప మతనియం దున్నది. దానినే కాలమందురు. అది జీవరాసులలో నిమిడి యున్నపుడు పురుషు డనబడును. చేష్టలుగా వెలువడినపుడు కాల మనబడును. (పామునకు తోక ఎట్లనో పురుషునకు కాల మట్టిది.)

"నేను" పురుషుడు, "నాది" మాయ. తననుండి ఆటగా వెలువడిన మాయవలన ప్రకృతి తత్త్వములలో నిమిడియున్న పురుషుడు జీవుడుగా నున్నాడు. వానివలన మెలిపెట్టబడి ఈ ప్రకృతి తత్త్వములయందు జగత్తు పుట్టుచున్నది. (జగత్తు అనగా సృష్టిలోని గమనము లేక కదలిక. అది ఆరోపింపబడును. దానిపై నాధారపడి సృష్టి నడచును. నీటిధార జలయంత్రమునుండి ఎగిరు

చుండగా దాని వేగముపై నాధారపడి జలబిందువులు ప్రయాణము చేయును. )

ప్రకృతి యందు భగవంతు డెట్లు ప్రవేశించుచున్నాడు? స్వయముగా దుముకుచున్నాడా? అందులోనికి దిగిపోవుచున్నాడా? లేదు. సృష్టిలో తల్లిగర్భమున తండ్రి పుత్రునిగా నెట్లు ప్రవేశించుచున్నాడు? దుముకుచున్నాడా? పడిపోవుచున్నాడా? తండ్రి యుండగనే పుత్రుడు పుట్టును. తండ్రి తనయంశమును శుక్రముగా తల్లిగర్భమున నిలుపుచున్నాడు. భగవంతుడు తన వీర్యమును (సామర్థ్యమును) ప్రకృతియందు నిలుపుచున్నాడు. అపుడు ప్రకృతి హిరణ్మయమై (charged) వెలుగుచున్నది. (హిరణ్మయమనగా బంగారురంగు అని పామరమైన యర్థము. "కిరణమయము" అను పదమునకు ప్రాచీన రూపాంతరమే హిరణ్మయము) దీనితో ప్రకృతి వెలుగుముద్ద యగుచున్నది. దానినే మహత్తత్త్వ మందురు. (కోడిపిల్లకు కోడిగ్రుడ్డులోని సొన యెట్టిదో, సృష్టికి మహత్తత్త్వ మనబడు వెలుగుముద్ద యట్టిది.)

అట్లు నిలుపబడిన భగవంతుని వీర్యమే యతని విత్తనము. అందతడు సమస్తముతో సూక్ష్మ విశ్వరూపుడుగా నిలిచియుండును. (మఱ్ఱిగింజలో పుట్టబోవు మఱ్ఱిచెట్టు, కొమ్మలు, ఆకులు, ఊడలు, మ్రాను ఇమిడియుండును. అట్లే ప్రకృతిలో నిలుపబడిన ఈ భగవంతుని వీర్యము నందు తన విశ్వరూప ముండును.) విశ్వరూపమూర్తి చిన్నవాడుగా నున్నను, పెద్దవాడుగా విచ్చుకొన్నను తరుగుట పెరుగుట యుండదు. (కనుకనే సున్ననుండి సున్నతీసివేయబడినట్లు, "పూర్ణమునుండి పూర్ణము తీసివేయగా, శేషము పూర్ణమే యగును. మొదటి పూర్ణము తరుగక పూర్ణమే యైయుండును" అని వేదములు చెప్పుచున్నవి. )

"ఇట్లు తన సూక్ష్మవిగ్రహమునందు మహత్తు మొదలగు రాబోవు లోకముల సృష్టి మొత్తము కరగించుకొని వెలిగించును. అవి వాని కిరణములుగా నిమిడి యుండును. ఇట్లు దిగివచ్చుటలో తండ్రిశుక్రము రూపమున నున్నబిడ్డ దేహనిర్మాణము మొత్తము తల్లిగర్భమున నిమిడి యున్నట్లు, భగవంతుడు తన తేజస్సును

ఉపసంహరించుకొని తనయందు తాను నిద్రించును. ఇది చీకటి మింగుట వంటిది." (తన భగవత్తత్త్వము తన చీకటియందు నిద్రించి, తాను జీవుడుగా మాత్రము మేల్కొని యుండును.)

ఇట్లు చెప్పి కపిలాచార్యుడు దీని నవగతము చేసికొనుటకు కొంత మౌనమును ప్రసాదించి మరల నిట్లనెను:

890. "పై చెప్పబడిన యిరువది నాలుగు తత్త్వములతో నున్న ప్రకృతి సృష్టిగా మారుటకు వర్గీకరణము (classification) చెందవలెను. దానికి వ్యూహములు (models) కావలెను. ఆ వ్యూహములుగా పరమపురుషుడే హిరణ్మయమైన వీర్యమునుండి దిగివచ్చును. తల్లిగర్భమున పడిన శుక్రము నుండి శరీరాదులు నిర్మాణ మగుటకు కావలసిన నమూనాలు తండ్రి నుండియే శుక్రమున సంక్రమించును గదా! అట్లే దేవుని వ్యూహములు ప్రకృతి యందలి వీర్యమునుండి దిగివచ్చును. ఈ వ్యూహములు నాలుగు: 1. వాసుదేవుడు, 2. సంకర్షణుడు, 3. ప్రద్యుమ్నుడు, 4. అనిరుద్ధుడు. ఈ నాలుగును దివ్యములు. అనగా ప్రకృతికి లొంగవు. ప్రకృతి కతీతములై ప్రకృతిని మలచును. ఈ వ్యూహములను సేవించినను, కీర్తించినను నారాయణత్వము సిద్ధించును. వానిని వివరించెదను వినుము.

891, 892. మహత్తత్త్వమునందు మొదట వాసుదేవుడను వ్యూహము వ్యక్తమగును. అది సత్త్వగుణముతో నిండి యుండును. అస్తిత్వము దాని లక్షణము. అది ఆకలి, దప్పిక, లోభము, మోహము, ముసలితనము, మరణము అను ఆరింటిచే నంటక, ఈ యారింటిని తననుండి అలలుగా వెలువరించు సముద్రము వంటి స్వచ్ఛమైన, శాంతమైన వ్యూహము. వానియందు దానము, దయ, దమము, రక్షణము, ప్రేమ, సంతోషము అను ఆరు గుణము లిమిడి యుండును. దీనిని భగవంతుని నిత్యస్వరూపముగా, సుందరముగా గ్రహించి భక్తులు సేవించుచున్నారు. (ప్రతి జీవియు గర్భస్థుడైనప్పుడును ఈ వ్యూహము పనిచేయు చుండును గనుక నిత్యస్వరూపము.)

ఈ వాసుదేవుని నుండి క్రియాశక్తి పుట్టును. అదియే అహంకార మనబడును. అది మూడు వర్గములుగా విడిపోవును : 1. వైకారికము (వికారములు లేక మార్పులు గలది. Change of states, or succession of changes) 2. తైజసము (ప్రజ్ఞారూపమైన తేజస్సుగా మెరయునది. The brilliance or spark of consciousness) 3. తామసము (తమోగుణమునకు సంబంధించినది. ఆకారములు, లక్షణములు మారకుండ స్వభావములుగా పట్టి యుంచునది. Habit-forming nature, the Lord of form.)

ఈ మూడింటిలో వైకారికము నుండి మనస్సు, ఇంద్రియములు, పంచభూతములు అధిదేవతలై పుట్టును. తైజసాహంకారము నుండి బుద్ధి (will), ప్రాణము (pulsation) పుట్టును. తామసాహంకారమునుండి ద్రవ్యము, ఖనిజములు, సప్తధాతువులు, అవయవములు పుట్టును.

893. అందు వైకారికమైన యహంకారము నధిష్ఠించి రెండవది యగు సంకర్షణ వ్యూహము వెలుగొందు చుండును. దానియందు వేయిపడగలతో చుట్ట చుట్టుకొని సంకర్షణు డను మూర్తి యుండును. వానినే అనంతుడు, ఆదిశేషుడు అని కూడ పేర్కొందురు. అతడు పంచభూతములను, ఇంద్రియములను, మనస్సును తన పడగలయందు ధరించి యుండును. ఇంకను కర్తృత్వము, కారణత్వము అనునవి కూడ వానినుండి పడగలుగా వేరగుచుండును. శాంతగుణము, భయంకరత్వము, మూఢత్వము అను లక్షణములను గూడ భరించుచుండును. ఇది సంకర్షణ మనబడు రెండవ వ్యూహము. దీనినుండి మనస్సు అను తత్త్వము పుట్టును.

(ఒకే దేహమునుండి అనేక శిరస్సులు పుట్టినట్లు, ఈ వ్యూహము నుండియే పంచభూతములు, పది ఇంద్రియములు, మనస్సు, కార్యకారణ కర్తృత్వములు విడిపోవుచుండును. ఇందలి శాంతతత్త్వము సత్త్వగుణమునకును, ఘోరత్వము రజోగుణమునకును, మూఢత్వము తమోగుణమునకును వ్యక్త లక్షణములు.

శాంతగుణ మొక్కటే యున్నచో భగవత్తత్త్వముండునుగాని సృష్టి యుండదు. రక్షణకు యుద్ధాదులును, శిక్షణకు దండమును రజోగుణ లక్షణములు. మరి మూఢత్వ మేల యను ప్రశ్న వచ్చును. మూఢత్వ మనగా మోహము చెందుట. ఇది లేనిచో వస్త్రము వస్త్రముగా నంగీకరించి వాడుకొనుట తెలియదు. నూలుపోగులుగనో, దూదిగనో, అందలి పరమాణువులుగనో మాత్ర మన్వేషించుట జరుగును. కుండను చూచి మట్టిగా మాత్ర మంగీకరించినచో కుండ నుపయోగించుకొనుట యుండదు. భార్యను చూచి జీవుడుగానో, అస్థిపంజరముగానో దర్శించినచో ప్రజాసర్గ మే లేదు. చదువు చెప్పువాడు, నేర్చుకొనువాడు, భాషలు, విద్యలు కేవలము మన మారోపించుకొనునవిగదా యని మాత్రమే తెలిసినచో విద్యలేక, గురు శిష్య సంబంధము లేక అంధకారమయమగును. కనుక మూఢత్వము వేగముగా లారీవచ్చు చుండగా అదియు పరబ్రహ్మమే యని ఎదురుపోయి చావకుండుటకు, లారీని రహదారి నియమములను అంగీకరించుటకు మూఢత్వ మావశ్యకము. ఇట్టి విలక్షణత్వ మంతయు సంకర్షణ వ్యూహము నుండి మన కందుచుండును. తెనుగువారితో తెనుగున, ఇంగ్లీషు వానితో నింగ్లీషున సంభాషింపవలసిన సమయమున ఈ భాషా భేదములు మన మారోపించుకొన్నవే గదా యన్నచో చెల్లదు. పరదేశమున అన్నము పుట్టక చనిపోవలసి వచ్చును. )

894. వైకారికమగు నహంకారము వలన మనస్సను తత్త్వము పుట్టినది. అదిగూడ వికారములను పొందును. ( అనగా స్థితుల మార్పులు చెందును. ) మనస్సునకు ఆలోచించుట సహజము. ఆలోచన రెండు విధములు : 1. సామాన్యముగా నాలోచించుట 2. విశేషముగా నాలోచించుట. మొదటిది సంకల్ప మన బడును. రెండవది వికల్ప మనబడును. (కంటికి కనిపించుట జరుగగా కనిపించుట యను యాలోచన కలుగును. అందు మరికొన్ని యాలోచనలు కలుగును. మొదటి కనిపించుట నుండి రెండవ కనిపించుటను వేరుచేయుటకు మొదటి యాలోచనకన్న రెండవ యాలోచన వేరుగా నుండవలెను. అప్పుడు మొదటి కనిపించు టను వెలుగనియు, రెండవ కనిపించుటను వస్తువులనియు

తెలిసికొనవలసి యుండును. ఇందు మొదటిది సామాన్యమైన యాలోచన. రెండవది విశేషమైన యాలోచన. ఈ రెండు విధములైన ఆలోచనల వలననే మనుష్యులలో మనవారు తెలియుట, స్త్రీలకును భార్యకును భేదము తెలియుట మున్నగు లోకవ్యవహార మంతయు నేర్పడుచున్నది.

ఈ సంకల్ప వికల్పముల వలననే సృష్టిలో మనము కోరు కొను వస్తువులు వేరగుచున్నవి. కనుక సంకల్ప వికల్పములవలన **కామము పుట్టెను.**

తైజసాహంకారమువలన మూడవది యగు అనిరుద్ధ వ్యూహము పుట్టెను. అనిరుద్ధుడు ఇంద్రియముల దేవుడు. సకల యోగులు తమ హృదయములలో ధ్యానించునది వీనినే. ఈ వ్యూహము శరదృతువున విచ్చిన నల్లకలువవలె రంగుగలిగి యుండును. ఇందు బుద్ధియను తత్త్వము పుట్టును. దానినుండి ఈ దిగువ శక్తులు కిరణములై ప్రసరించుచుండును :

1. ద్రవ్యమును ప్రకాశింపజేయు జ్ఞానము. దీనివలన ఈ వస్తువుయొక్క స్వభావ మిట్టిది యని తెలియును.

( నిప్పును తాకకుండుట, నీటిలో దుముకకుండుట, పెద్ద లను గౌరవించుట, తేలు, పాము మున్నగు వానినుండి జాగ రూకత వహించుట, ఆకలికి అన్నము తినుట మొదలగు వృత్తులు దీనివలన కలుగుచున్నవి. )

2. ఇంద్రియ వృత్తులను హద్దులో నుంచి సద్వినియోగము చేయు జ్ఞానము. ( దీనివలన చేయదగినవి, చేయకూడనివి అగు ప్రవర్తనల భేదము తెలియును. ఆలు మగలు ఏకాంతమున ప్రవర్తించినట్లు బాటలో ప్రవర్తింపకుండుట మున్నగు సజ్జనుల వివేచనాశక్తి దీనివలన కలుగును. )

3. సంశయము. ( తెలియని విషయములజోలికి పోకుండుట **యలవడును.**)

4. మిథ్యాజ్ఞానము ( ఇది మన మారోపించుకొను జ్ఞానము, **దీనివలన** తర్కశాస్త్రము, రసాయనికశాస్త్రము, అర్థశాస్త్రము,

మున్నగునవి యొకదానికన్న నొకటి వేరుగా గ్రహింపబడు చున్నవి. వాణిజ్యముచేయువా రిద్దరు తమ ద్రవ్యములకు ఖరీదు లను నిర్ణయించుకొందురు. ఆ నిర్ణయము వా రిద్దరికిని మాత్రమే సత్యము గనుక మిథ్యాజ్ఞానము. ఇది లేనిచో వాణిజ్యము, అర్థార్జనము, వృత్తులు, అన్నోదకములు పుట్టవు.)

5. నిద్ర. (ఇది లేకున్నచో శరీర మను యంత్రము నెట్టి హద్దులలో పనిచేయించినచో నశింపకుండునో మనస్సునకు తెలి యదు. దానితో దేహము భిన్నమగును.)

6. నిశ్చయము. (ఇది లేనిచో పనిసాగదు.)

7. స్మృతి (అనగా నొకమారు తా నెరిగిన వస్తువును దాని పరోక్షమున మనస్సున కల్పించుకొనుట. ఇది లేనిచో యే విద్యయు లేదు. అనుభవము లేదు. సత్ప్రవర్తనకు తావు లేదు.)

8. జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు.

9. పనులు చేయుటకు పనిముట్లు తయారుచేసికొను జ్ఞానము. అట్లే జ్ఞానము నార్జించుకొను పరికరములను సమకూర్చుకొను జ్ఞానము.

శక్తికూడ తైజసాహంకారము వలననే పుట్టును. ఇది రెండు విధములు: 1. క్రియాశక్తి (Power of action) 2. జ్ఞానశక్తి (Power of perception). ఇందు మొదటిదాని వలన ప్రాణము పుట్టును. రెండవదాని వలన తెలియుట పుట్టును. ఈ రెండు లక్షణములును ఇంద్రియముల కున్నవి. (కర్మేంద్రియ ములను, పనిచేయించునది ప్రాణము. జ్ఞానేంద్రియములను పనిచేయించునది జ్ఞానము. కనుక ఇంద్రియములు కూడ తైజ సాహంకారము నుండియే పుట్టినవి.)

తామసాహంకారము వలన శబ్దతన్మాత్రము పుట్టెను. దానివలన ఆకాశము, దానివలన వినుట పుట్టెను. వినునట్టి ఇంద్రియము శబ్దగ్రహణముచేయుట పుట్టెను. అర్థమునకు శబ్ద మాధారమై శబ్దము వినువానికి అర్థము స్పష్టమగు చున్నది.

శబ్ద తన్మాత్రమునుండి యాకాశము పుట్టెను. అది మిగిలిన నాలుగు భూతములకు నివాస మయ్యెను. మరియు లోపల, వెలుపల యను తావులను సృష్టించెను. ఈ యాకాశమే ఆత్మకును, ప్రాణములకును, ఇంద్రియాదులకును గూడ నివాస మయ్యెను.

కాలమే కదలికను కలుగజేసెను. దానియందు పై జెప్పిన మార్పులన్నియు సంభవించెను. ఆకాశమునుండి కదలికవలన స్పర్శ పుట్టెను. దానినుండి వాయువు పుట్టెను. దానినుండి చర్మముపుట్టి స్పర్శజ్ఞానము కలిగెను. స్పర్శజ్ఞానమునకు లక్షణములు మెత్తదనము, గట్టిదనము, చల్లదనము, వెచ్చదనము అనునవి.

వాయువునకు కదలించు శక్తి పుట్టెను. దాని వలన ద్రవ్యమును విడదీయుట, కలుపుట పుట్టెను. దానివలన ద్రవ్యముయొక్క కణములు పుట్టినవి (Unit matter). ద్రవ్య కణములకు వాయువునందు లేచి చరించు లక్షణ మేర్పడి వాసన చూచుటయను గుణము పుట్టెను. దీనివలననే దూరమందున్న వస్తువులు వాసన వేయుటయు, చూడకయే అవి యున్నట్లు తెలియుటయు సంభవించుచున్నది.

శబ్దమునకు వినుటయు, వినబడుటయు అను లక్షణములు ప్రధానములు. విన్నశబ్దము నాశ్రయించి అర్థము గ్రహింపబడును గనుక అన్ని యింద్రియములకు సంబంధించిన జ్ఞానము గూడ శబ్దార్థము రూపమున శబ్దము నాశ్రయించి యుండగలదు.

వాయువువలన స్పర్శగుణము కలుగును. వాయువు ప్రభావమున స్పర్శకు రూపకల్పనము కలుగును. దానివలన తేజస్సు పుట్టెను. వెలుగు కంటిని స్పృశించుట వలన రూపము కంటిచే గ్రహింపబడుచున్నది. రూపమునకు ఈ దిగువ లక్షణము లున్నవి :

1. ఏది యెచ్చట నున్నదో తెలియుట. 2. ద్రవ్యము యొక్క ఆకారముతో సమమైన ఆకారము మనస్సున పడుట. దీనివలన అచ్చట నున్న ద్రవ్యము యొక్క స్వభావము తెలియుట. (ప్రతిబింబము వలన ద్రవ్యజ్ఞానము కలుగుట.)

తైజసము (తేజస్సు) నకు ఈ దిగువ ధర్మములు సాధారణములు :

1. ద్యోతము అనగా ప్రకాశించుట.

2. పచనము అనగా ద్రవ్యములకు పండుట, వండుట అనబడు మార్పులు తెచ్చుట (బియ్య మన్నమగుట మున్నగు మార్పులు, లోహములు కరగుట, ద్రవములు వాయురూపము ధరించుట మున్నగునవి కూడ.)

3. దప్పిక కలిగి నీరు త్రాగుట. (దేహమునకు ఎప్పటికప్పుడు నీరు కావలయునని తెలియుట దప్పిక.)

4. ఆకలి, భుజించుట. (దేహమునకు ఆహారము కావలెనని తెలియుటయే ఆకలి.)

5. నీరు మాయమగునట్లు ఆర్చుట, దీనివలన ఆ యా ప్రదేశములందు మంచు తొలగుట, చలి తొలగుట, నీరు అనావశ్యకమగు తావునుండి ఇంకిపోవుట జరుగుచున్నవి.

6. రూపము వెలుగుట వలన ద్రవ్యభేదములు తెలియుట. అట్టి తేజస్సునవలన రుచి పుట్టెను. (నీరుయొక్క యుష్ణోగ్రత మార్పుల వలన నీరు వేరువేరుగా రుచుల నందించును) ప్రకృతిలో తేజస్సు వలన రుచి పుట్టి దానినుండి జలములు పుట్టెను. నాలుక రుచిని గ్రహించుటకు యేర్పడెను. రుచి చూచు ప్రజ్ఞ యొక్కటే యైనను ద్రవ్యమునందలి పంచభూతముల వేర్వేరు రకము లైన కలయికలచేత వేర్వేరు రుచులు పుట్టినవి. అవి ముఖ్యముగా వగరు, చేదు, కారము, పులుపు, తీపి, ఉప్పదనము అను ఆరు విధములుగా నేర్పడెను. ఇం దొక్కొక్క దానిలో లేత, ముదు ళ్లేర్పడుటచేత లెక్కకు మిక్కిలియైన రుచులు పుట్టినవి.

ఇక జలము యొక్క లక్షణములను చెప్పెదను :

1. తన కలయికచే ద్రవ్యములలో మార్పు కలుగుట.

2. ద్రవ్యము తడిసిపోవుట.

3. ఘనపదార్థము ముద్దకట్టుట.

4. త్రాగినపుడు ప్రాణవృత్తికి తృప్తి కలుగుట. ఇది స్నాన ప్రక్షాళనాదుల వలన కూడ కలుగును.

5. దేహధారులు దేహమున జీవించి యుండుట కాధార మగుట.

6. జీవనప్రవృత్తిలోని ఎగుడు దిగుడులను సామ్యము చేయుట.

7. మెత్తపరచుట.

8. వేడియొక్క తాపమును పోగొట్టుట.

9. జలలుగా నేర్పడి, తీసినచో మరల నూరుచుండుట.

రుచివలన జలముల ధర్మము మార్పు కలుగుటవలన వాసన యను శక్తి పుట్టెను. దానినుండి పృథ్వీతత్త్వ మనబడు ఘన పదార్థము పుట్టెను. వాసన తెలియుటకై ఘ్రాణేంద్రియ మేర్పడెను. వాసన తెలియుట యొకే శక్తియైనను వ్యక్తమగు ద్రవ్యములోని పదార్థ నిర్మాణ భేదమును బట్టి వేర్వేరు గుణములుగా గంధము లేర్పడినవి.

1. ఇంగువ మొదలగు ఘాటు ద్రవ్యముల వాసనలు.

2. విషము తిని చచ్చిన జంతువుల మాంసము వాసన మొదలగు నీచు వాసనలు.

3. కస్తూరి మొదలగు ద్రవ్యముల సుగంధ గుణము.

4. పద్మము మున్నగు పుష్పముల శాంతగంధముల గుణము.

5. వెల్లుల్లి మొదలగు ద్రవ్యముల వాడియైన వాసనల గుంపు.

6. పాసిపోయిన పక్వభోజనపదార్థములు కలిగించు పులిసిన వాసన మున్నగు గుణములు.

ద్రవ్యముల యందలి అంతర్భాగములైన ద్రవ్యముల పాళ్ళను బట్టి ఈ వాసనలు అనేక విధములుగా హెచ్చింపబడును.

ఇక పృథ్వీతత్త్వముయొక్క లక్షణములను తెలిపెదను.

1. ఆకారము నిలుపుట కవకాశము. ఇది ప్రతిమలు మున్నగు వానిని కావలసిన యాకారములలో తయారుచేయుట కుపకరించును.

2. ద్రవపదార్థముగాని, ఘనపదార్థముగాని, వాయు పదార్థముగాని మరియొకటి యాధారముగా నక్కర లేకయే నిలబడియుండ గలుగుట. అనగా మరియొక పాంచభౌతిక ద్రవ్యాపేక్ష లేకయే యాకారము నిలబడుట.

3. జలము మున్నగు వానికి ఆధారముగా నుండగలుగుట.

4. ఇంకొక వస్తువును మోటించి నిలుపగలుగుట.

5. ఆకాశము, వాయువు, అగ్ని, జలము అనువానిని విడదీసి సందుజేసికొని తా నుండగలుగుట.

6. సకలజీవుల లోపలి పురుషుని వ్యక్తపరచు దేహముగా పనిచేయుట.

ఇట్లు చెప్పి వీని నవగతము చేసికొనుటకై కొంత మౌనమును ప్రసాదించి కపిలాచార్యుడు మరల యిట్లనెను. "తల్లీ! పైన వివరించినవి పంచభూతములకు గల సాధారణ ధర్మములు మాత్రమే. ఇవికాక యొక్కొక్కదాని కొక్కొక్క యసాధారణ ధర్మమున్నది.

1. ఆకాశమునకు అసాధారణ గుణము శబ్దము. దానిని గ్రహించునది చెవి.

2. వాయువున కసాధారణ గుణము స్పర్శము. దానిని గ్రహించునది చర్మము.

3. తేజస్సున కసాధారణ గుణము రూపము. దానిని గ్రహించునది కన్ను.

4. జలమున కసాధారణ గుణము రుచి. దానిని గ్రహించునది నాలుక.

5. పృథివి కసాధారణ గుణము గంధము. దానిని గ్రహించునది ముక్కు.

శబ్దము మాత్రమే ఆకాశ విశేష గుణము. వాయువునకు శబ్ద స్పర్శములు రెండును ఆ యా కారణములచే అన్వయించును. (ఆకాశము స్పర్శను కలిగింపలేదుగాని వాయువును, శబ్దమును కలిగించును) అగ్నికి శబ్ద స్పర్శ రూపము లుండవచ్చును. జలమునకు శబ్ద స్పర్శ రూపరసములు సాక్ష్యములు. పృథివి యందు శబ్ద స్పర్శ రూప రస గంధము లైదును వసించును. ఆకాశమునకన్న సూక్ష్మముగా అహంకారతత్త్వ మున్నది. దానికి పైన మహత్తత్త్వమున్నది. మహత్తు మొదలుకొని పృథివి వరకును యేర్పడిన ఈ యేడు తత్త్వములును పరస్పరము మిళితము లగును. దానికి ఫలితముగా పురుషుడు ప్రకృతిలో వ్యక్తమగును. కనుక నీ యేడు తత్త్వములును కలయికలు చెందుచు, తమ్మనుభవించు పురుషుని పుట్టించు సామర్థ్యము కలిగియున్నవి. అట్టి సామర్థ్యముగల తరుణము గమనించి పరమాత్మ వానియందు ప్రవేశించెను. అతడు కాలము రూపమున అంతుబట్టని అస్తిత్వము కలవాడు. ఈ తత్త్వముల నిర్మాణమున కంతటికిని కారకుడు. త్రిగుణముల కతీతుడు. తనకన్న మిగిలిన సృష్టిని తన యంతర్యామిత్వముతో నియమించుచుండును. కన్ను మొదలగు నింద్రియాదుల కందని రూపము కలవాడు. అతడు ప్రవేశించుటవలన ఈ తత్త్వము లన్నియు నొకదానిచే నొకటి ఘర్షణ పొందినవి. దానితో నుడికినట్లు కలిసినవి. ఒకదానిలో మిగిలిన వన్నియు నుండునట్లు ప్రవేశించినవి. ఈ ఘర్షణతో నొక గ్రుడ్డు పుట్టెను. అది అందలి అంతర్యామి యొక్క చేతనమును కోల్పోయి వేరుగా నేర్పడెను. (కోడిగ్రుడ్డు నందలి ద్రవమందలి కోడిపిల్ల ప్రజ్ఞకన్న వేరుగా నేర్పడినట్లు, లేదా మననుండి వెలువడిన జుట్టు, గోళ్లు మన ప్రజ్ఞ నుండి వేరైనట్లు)

895. ఆ గ్రుడ్డు పేరు విరాట్. అందున్నవాడు విరాట్పురుషుడు. వానిచుట్టునున్న యండము నన్నిటికన్న పై పొర పృథివీ తత్త్వము. తరువాతి పొర జలతత్త్వము, తరువాత అగ్ని తత్త్వము, వాయుతత్త్వము, ఆకాశతత్త్వము, అహంకార తత్త్వము, మహత్తత్త్వము అనబడు నేడు పొరలున్నవి. ఇందు పృథ్వీతత్త్వము మొదలుగా నొక పొరకన్న రెండవది పదింత

ఉండును. ఈ పొరలు లోకములకు పందిరులవంటి విభాగములు. ఈ యండము విరాట్పురుషుని రూపమై మహాజలములలో తేలుచుండెను. కిరణమయమైన ఈ యండమున నారాయణుడు ప్రవేశించి ఆకాశమును తానుగా కొంత వేరుచేసి పెరిగెను.

896. ఈ విధముగా హిరణ్యాగర్భాండమున విరాట్పురుషుడు ప్రకాశము చెందును. వాని ముఖమువలన వాక్కు పుట్టెను. వాక్కుతో అగ్నిపుట్టెను. ముక్కువలన ప్రాణము పుట్టెను. దానితో వాసన చూచు నింద్రియము పుట్టెను. దానినుండి వాయువులు పుట్టెను. దానితో ప్రాణవాయువులు పుట్టెను. ప్రాణములనుండి కన్నుపుట్టెను. వాని కంటినుండి సూర్యుడు పుట్టెను. దానితో చూచుట పుట్టెను. చూచుట నుండి దిక్కులు పుట్టెను. దిక్కులనుండి చెవులు పుట్టెను. వానియందు వినుట పుట్టెను. చర్మమునుండి మీసములు, రోమములు పుట్టెను. వానివలన ఓషధులు పుట్టెను.

897. అటుపైన పురుషాంగము పుట్టెను. అందుండి శుక్రము పుట్టెను. అందుండి జలములు పుట్టెను. అటుపైన మలావయవము పుట్టెను. దానివలన అపానము పుట్టెను. దాని వలన మృత్యువు పుట్టెను.

898. చేతులనుండి బలము పుట్టెను. ఆ రెండిటి నుండి యింద్రుడు పుట్టెను. పాదములనుండి గమనము పుట్టెను. ఆ రెండిటి నుండి హరియను రూపము పుట్టెను.

899. నాడుల నుండి రక్తము పుట్టెను. దాని నుండి నదులు పుట్టెను. జఠరమునందు ఆకలి, దప్పిక యేర్పడెను. వాని నుండి సముద్రములు పుట్టెను.

900. హృదయమునుండి మనస్సు పుట్టెను. మనస్సునను చంద్రుడు, బుద్ధియు, చిత్తము, బ్రహ్మయు, క్షేత్రజ్ఞుడును పుట్టిరి. విరాట్ అనబడు ఈ మొత్తమునందు తాను పురుషుడయ్యెను.

(విరాట్పురుషుని యందలి విశ్వదేహోత్పత్తి ద్వితీయ స్కంధమునను, తృతీయ స్కంధము పూర్వభాగమునను వివరింప

బడినది. దానికిని, కపిలాచార్యుని వివరణమునకును కొంత మతభేదము కనిపించుచున్నది. )

కపిలాచార్యుని మతము ననుసరించి యొక క్రమమున్నది. తల్లిగర్భమున పిండోత్పత్తిలో నెట్టి క్రమము కనిపించునో దాని ననుసరించి చెప్పబడిన దీ క్రమము. పిండమున శిశువునకు మొదట తల యేర్పడి దానినుండి తోకగా వెన్నెముక యేర్పడి అటుపైన తలయం దొక కన్న మేర్పడును. అది నోరగును. అటుపైన అవయవములు పెరుగుచున్నకొలది ఇంద్రియము లేర్పడును. వేదములకు మొదటి దర్శనములగు బ్రాహ్మణములయందు కూడ కపిలాచార్యుని క్రమముననే చెప్పబడినది. బ్రాహ్మణములలో నిట్లున్నది. శిశువునకు మొదట తల యేర్పడగా దానినుండి ప్రజాపతి తనచేతి అయిదువ్రేళ్లతో కొంతముద్ద నూడబెరికెను. అచ్చట కన్న మేర్పడెను. అయిదువ్రేళ్లవలన ఐదు జ్ఞానేంద్రియముల స్థానము లేర్పడెను. మొట్టమొదటగా ముఖము ( నోరు ) యేర్పడెను. దానియందు ప్రాణస్పందన మేర్పడెను. ఇదియే ముఖ్యప్రాణము.

కపిలుని క్రమమునకు వివరణము : జగదండములోని విరాట్పురుషునకు మొదట నోరేర్పడెను. దానినుండి వాక్కు, అగ్ని యేర్పడెను. నిప్పు ద్రవ్యములను విడదీసి దగ్ధము చేయును. ముఖము ఆహారము నట్లే చేయును. అగ్నికి మంట యెట్టిదో ముఖమునకు జిహ్వ యట్టిది. నోరు తరువాత ముక్కు కన్నము లేర్పడెను. వానినుండి ప్రాణములు, వాసనచూచు శక్తి పుట్టినవి. ప్రాణ మనగా స్పందనము. దానివలన జీవునకు గాలి పీల్చు కదలిక యేర్పడును. విరాట్పురుషునందు గాలి పుట్టెను. జీవులయందు గాలి పీల్చుట పుట్టెను. ముక్కు తిరువాత కన్నులేర్పడెను. అతని కనుగ్రుడ్ల నిర్మాణమే సూర్యగోళ నిర్మాణము. దానినుండి జీవులకు కనుగ్రుడ్లు పుట్టును. విరాట్పురుషుని చక్షువగు సూర్యునినుండి కిరణములు పుట్టెను. ఈ కిరణములవలన జీవునకు చూపు పుట్టును. అటుపైన చెవులు పుట్టెను. దానినుండి వినుట, దిక్కులు పుట్టెను. దిక్కుల జ్ఞానము జీవులకు కన్నులవలన, చెవులతో శబ్దగ్రహణమువలన కలుగును. జీవులకు కంటి యెదుట

సృష్టింపబడిన వస్తువులుండును గనుక వానినిబట్టి దిక్కులు తెలి యును. విరాట్పురుషునకు చుట్టును వస్తువు లుండవు గనుక శబ్దము వినవచ్చు తావునుండి దిక్కుల జ్ఞానము పుట్టును. గ్రుడ్డివానికి శబ్దములు వినుటవలననే వ్యక్తులు ఎటుప్రక్కనున్నారో తెలి యును. విరాట్పురుషుని దేహము విశ్వము గనుక వాని రోమ ములు మనకు భూమిపై మొక్కలు. అటుపైన పురుషాంగము పుట్టెను. అందు శుక్రము పుట్టెను. వాని నుండి జలములు పుట్టెను. కనుకనే మొక్కలు మొలచుటకు జలము లావశ్యకము. తల్లి గర్భమున జీవుడు పడుటకు గూడ శుక్రశోణితముల రూపమున జలము లావశ్యకములు. మిగిలినవి ద్వితీయ స్కంధమందు చెప్ప బడిన క్రమముతో సరిపోవుచున్నవి. క్షేత్రజ్ఞు డనగా జీవుడు. విరాట్పురుషుని మనస్సున చంద్రుడు, బుద్ధి, చిత్తము, బ్రహ్మ, జీవుడు పుట్టిరి. బ్రహ్మ పుట్టినది నాభికమలమునగదా! ఇచ్చట మనస్సున అని చెప్పబడుట యెట్లు? నారాయణుని నాభికమలము నుండి బ్రహ్మ పుట్టెను గాని విరాట్పురుషుని నాభికమలము నుండి గాదు. విరాట్పురుషుడు విశ్వరూపుడు. విశ్వమే వాని దేహము. నారాయణుడు సర్వకారణ కారణమైన అంతర్యామిమూర్తిగాని విశ్వరూపుడు గాదు. నారాయణుని నుండి మాయ పుట్టి, మహత్తు పుట్టి హిరణ్యగర్భాండము పుట్టి ఇరువదినాల్గు తత్త్వములు వేరై త్రిగుణములు, మూడహంకారములు వేరైన వెనుక అందు నారాయణుని వీర్యము నిహితమై అందుండి విరాట్పురుషుడు పుట్టును. విరాట్పురుషుడు ప్రకృతిలోని పురుషుడు. నారాయణుడు ప్రకృతియం దంతర్యామిగానుండి ప్రకృతి కతీతుడుగా, శాశ్వతముగా నున్న పురుషుడు. బ్రహ్మసృష్టికి చాల ముందు నారాయణుని నాభికమలము మేల్కొనును. అతడు సృష్టి నారంభించి అందలి విరాట్పురుషుని మనస్సునందు వ్యక్తమై సృష్టిలో బ్రహ్మజ్ఞాన ముగా అంతర్యామిత్వ మొందెను.)

901. విరాట్పురుషుని యందు పుట్టిన పంచభూతములును, తన్మాత్రలును, ఇంద్రియములును వాని యధిదేవతలును వేరు వేరుగా నుండును. అవి యన్నియు నేకత్వము చెందుటకు సమర్థ ములు కావు. కనుక జీవుని ప్రవర్తనమును తమయందు పుట్టింప

లేవు. ఇంద్రియములు తమ తమ అధిదేవతలతో కూడి విరాట్పురుషునియందు వ్యక్తమగును. అందేయొక్కటియు తమ యధిపతియైన జీవుని వ్యక్తము చేయజాలవు. తమ తమ నివాసముల యందు మాత్రముండును. (శవమైన దేహమున నున్న దేహ భాగములవలె తమయందు జీవుని వ్యక్తము చేయలేవు. కుండ పెంకులు కుండను పుట్టింపలేవు. మామిడిపండులో కొన్ని రసాయనిక ద్రవ్యముల సమన్వయ ముండుటవలన మామిడిపండు లక్షణములు వ్యక్తమగును. కాని, ఆ రసాయనిక ద్రవ్యములను వేరువేరుగా తెచ్చి, కలిపినచో మామిడిపండు పుట్టదు. దీనికి కారణ మేమనగా భగవంతుడు మొదట మామిడిపండు రూపమున ప్రకృతిలోనికి దిగును. అప్పుడు ప్రకృతిలోని ఆ యా రసాయనిక పదార్థములు తమ వేర్వేరు లక్షణములను కోల్పోయి మామిడి పండు లక్షణములుగా సర్దుకొనును. అట్లే విరాట్పురుషుని యందు పుట్టిన పంచభూతాదులు, జీవుని పుట్టింపలేక వేర్వేరుగా తమ ప్రత్యేకతలను స్థాపించుకొనును.) విరాట్పురుషుని ముఖమున అగ్నియు, వాక్కును వ్యక్తమై ప్రవర్తింపగా నోరు, అగ్ని, వాక్కు పుట్టినవిగాని, నోరుగలవాడు పుట్టలేదు. అతని ముక్కున వాసన, వాయువు పుట్టి అట్లే యుండెను, అనగా వ్యష్టిగా నుండెను. వాని కన్నున సూర్యుడు, చూపు పుట్టియు వ్యర్థముగా నుండిపోయెను. వాని చెవియందు వినుట, దిక్కుల జ్ఞానము పుట్టియు కార్యముల యందు ప్రేరణను పొందజాలక పోయెను. వాని చర్మమున రోమములు, ఓషధులు పుట్టి నిలిచి యున్నవి. అతని పురుషావయవము నందు రేతస్సు పుట్టి అట్లే యున్నది. వాని మలవిసర్జనావయవమున అపానము, మృత్యువు పుట్టి అట్లే నిలిచినవి. వాని పాదములయందు గమనము అధిదేవత యగు విష్ణువు పుట్టి అట్లే యున్నారు. (ఇచ్చట విష్ణువనునది అధిదేవత పేరేకాని, మహావిష్ణువు కాదు. పాదములు నడచి పోవుటకు తోడ్పడును గాన, వ్యాప్తిలక్షణము వాని యందుండి విష్ణుదేవత యనబడినది.) అతని చేతులయందు యింద్రదేవతయు, బలము పుట్టెనుగాని, వినియోగ సామర్థ్యము కలుగలేదు. వాని నాడులనుండి నదులు, రక్తము పుట్టియు

నిరర్థకము లయ్యెను. వాని ఉదరమునందు సముద్రములు, ఆకలి దప్పులు పుట్టి అట్లే యున్నవి. వాని హృదయమున మనస్సు, చంద్రుడు, బ్రహ్మ యను అధిదేవతలు పుట్టి అట్లే యున్నారు. వాని చిత్తమున అభిమానము, రుద్రుడు పుట్టి అట్లే యున్నారు.

అప్పుడు వాని నన్నిటిని ఏకత్వమున నిలుపునట్టి జీవుడుగా దేవుడు దిగి వచ్చి, హృదయము నందు ప్రవేశించి చిత్తమున నిండెను. అప్పుడు విరాట్పురుషుడు జలములలో వ్యక్తమైన బ్రహ్మాండమున నిలిచి, సృష్టికార్యమునకు తన ప్రవర్తన చూపెను. అంతకుముందు నిద్రించుచున్న వాని శరీరమునందలి భాగములవలె అవయవములు వ్యర్థములై యుండెను. మెలకువ వచ్చినట్లు క్షేత్రజ్ఞుడు ప్రవేశించిన క్షణమునుండి అన్ని దేహభాగములును పనిచేయుట నారంభించెను. ఈ మొత్తము శాస్త్రమును అవగతము చేసికొని వివేకము పొందినవారు వైరాగ్యసంపన్నులై విరాట్పురుషునియందు నిరంతర భక్తిగలిగి ధ్యానింతురు. దానితో ప్రకృతి పురుషుల వివేకము కలుగును. తమలోని పురుషుడు ప్రకృతి కతీతు డగును. మోక్షస్థితి సిద్ధించును. ఈ వివేకము లేనిచో పురుషునకు ప్రకృతితో సంబంధము కలిగి సంసారబంధము పుట్టును.

902. సత్త్వ రజస్తమస్సులతో కూడిన ప్రకృతి కారణముగా నేర్పడిన యీ దేహము కార్యరూపము. (దేహము కార్యరూప మనుట వలన ప్రకృతి ధర్మముల ఫలితమైన యొక స్థితియే గాని, శరీరము నొక వస్తువుగా పరిగణింప దగదు. అనేక వస్తువుల సముదాయమైన సామ్యరూప మొక వస్తువనుట యెట్లు సత్యమగును? (It is the state of equilibrium of forces and not an item) అట్టి శరీరమున నున్న పురుషుడు సుఖము, దుఃఖము, మోహము అనువానియందు ఆపేక్షగలవాడు కాడు. ఈ సుఖము మున్నగునవి ప్రకృతికి సంబంధించినవి. (పురుషునకు సంబంధించినది అస్తిత్వ ప్రజ్ఞ మాత్రమే.) ఈ పురుషుడు ఆ ప్రకృతియొక్క మార్పులు తనకు లేనివాడు. మూడు గుణములు కూడ తనకు లేవు. నిర్మలమైన నీటియందు ప్రతిబింబించుచున్న సూర్యునివలె ప్రకృతి

గుణముల యందు ప్రతిబింబించును. అతడు ప్రకృతి యందలి తానుగా, నతీతుడుగా నుండును.

అట్టి పురుషుడు ప్రకృతి గుణములతో సంబంధ మేర్పరచుకొనినపుడు వానితో కూడిన తా నను ప్రజ్ఞ కలిగియుండును. ఈ ప్రజ్ఞ అహంకార మనబడును. అహంకారము చేత పురుషుని ప్రజ్ఞ మరుగుపడి మోహము కలుగును. అట్టి స్థితిలో "ఈ పనులన్నిటిని నేనే చేయుచున్నాను" అని నమ్మును. దానితో ప్రకృతియొక్క దోషము లంటును.

903. ఈ దోషముల వలన చేయబడుచున్న కర్మల సంస్కారము లంటును. వీనినే వాసన లందురు. వీని ప్రభావమున ఆ యా కర్మలకు తగినట్లు దేవతగనో, మానవుడుగనో, జంతువుగనో గర్భమున పడును. ఏదో యొక రూపమున జన్మించి, సంసారమున చరించును.

904. ఇంద్రియములకు గోచరించిన విషయముల యందు ధ్యానము నిలుచును. స్వప్నమునందు తిరుగుచున్నవానివలె అస్తిత్వము లేని తన భావపరంపరల జగత్తునందు చంచల మనస్సుతో చరించును.

905, 906. ఇట్లు జరుగకుండ నివారింపగలుగు నుపాయము తీవ్రమైన భక్తియోగము మాత్రమే. మనస్సును మాటిమాటికి భగవంతుని యందు నిలుపుటచేత విషయములయందు వైరాగ్యము కలుగును. ఈ భక్తియోగము సుగమముగా, నిర్విఘ్నముగా కుదురుటకై యమము, నియమము మొదలగు క్రియల నాచరించుచు యోగము నభ్యసింపవలెను. మోక్షము కోరువాని కీ సాధన తప్పదు. (భగవద్భక్తి లేని యోగాభ్యాసము నిష్ఫలము. భగవద్భక్తి నభ్యసించు వారికి దాని యందు స్థిరత్వము కలిగించుటకై యోగాభ్యాస ముపకరించును.

పూర్వము చెప్పబడినట్లు మోక్షముపై కోరిక లేక, భగవంతుని సమస్త జీవరాశులలో దర్శించు వారికి మోక్షము మరింత సులభముగా లభించును. అట్లుకాక మోక్షముపై కోరిక గలిగి, భగవధ్యానము చేయు వారికి తీవ్రసాధనము కావలెను.

అదియునుగాక మోక్షముపై తీవ్రమైన కోరిక గలిగి, భక్తి యోగము కన్న అష్టాంగ యోగాభ్యాసమున కెక్కువ ప్రాధాన్య మిచ్చు వారికి చాల తీవ్రసాధన యున్నను పెక్కు జన్మలు పుట్టును. సాధనము గూడ కడు కష్టసాధ్యమై, అనేక విఘ్నముల నెదుర్కొన వలసి వచ్చును. సర్వాంతర్యామి భక్తిలేక కుండలినీ యోగ సాధనము, మణిమంత్రౌషధ రసాదులు వినియోగించి సాధన చేయువారు కూడ కలరు. వారిని బాహ్య విఘ్నములు కొన్ని జన్మలు బాధించును. అనగా డబ్బు యిబ్బందులు, సదుపాయమైన యిల్లు కుదరకుండుట, పరిసరముల వ్యక్తులతో శత్రుత్వాదులు, బదిలీలు, వృత్తి ఉద్యోగాదుల ఘర్షణ, పై అధికారుల బాధలు మున్నగున వన్నియు వారికి విఘ్నరూపములుగనే పరిణమించును. ఎట్టకేలకు వానిని జయింప కలిగినను, అంతర్విఘ్నములు మరికొన్ని జన్మలు బాధించును. అంతర్విఘ్నము లనగా మంచిపనులవలన కీర్తి కాంక్ష, గురువనిపించుకొనుట, శిష్యుల మొగమాటములు, అందు అత్యాదరముతో సేవజేయు శిష్యులపై, శిష్యురాండ్రపై మమకార బంధములు, ఒక తరగతికి జెందిన అంతర్విఘ్నములు. వీనిని జయింప గలిగినచో మరికొన్ని యెదురగును. అవి లోకమును ఉద్ధరింపవలెనను వ్యామోహము, ఉద్యమములు, ఆశ్రమములు, మఠములు నిర్వహించు బరువు బాధ్యతలు, మంచిపనులు చేయించుటకై జన వశీకరణము మున్నగు శక్తు లబ్బుట, వానితో తాను చెలగాట లాడుట, వాని తీవ్రపరిణామములు మొదలగునవి. వీనిని జయింపగలిగిననేగాని, మోక్షమునకు కావలసిన నిస్సంగ త్వము, జ్ఞానము అలవడదు. సర్వమునందును దైవమును చూచుటతో నభ్యాసము ప్రారంభించిన వానికి మొట్టమొదట వైరాగ్య మప్రయత్నముగా సిద్ధించును. కనుక సాధనలో అనేక జన్మములు వ్యర్థమగుట యుండదు. సారాంశ మేమనగా భక్తియోగముకన్న వేరుగా కేవల యోగసాధనము క్షేమమైన పద్ధతికాదు. )

907. సాధనకు మొట్టమొదట కావలసినది శ్రద్ధ. ( ఆరంభించినపుడు సాధన నెంత యాదరముతో చేయునో, అంతే యాదరముతో పది, ఇరువది, ముప్పది సంవత్సరముల

తరువాతగూడ చేయుచుండగలిగినచో దానిని శ్రద్ధ యందురు. ఇట్లు చేయుటవలన ఫలితములకై యెదురు చూడని వైరాగ్యము అప్రయత్నముగ సిద్ధించును. శ్రద్ధ తన స్వరూపమే అనియు, దాని నెంతగా జీవు డారాధించునో అంతగా నతడు తన స్థితి చెందు ననియు భగవద్గీతలో కృష్ణుడు చెప్పెను.) నా యందలి భావము సత్యస్వరూపము కావలెను. (భగవంతుడున్నాడని నమ్మువారు పలువురున్నారు. నమ్మట చాలదు. నమ్మినవారికి కష్టములు రావని నమ్మినచో కష్టములు వచ్చినపుడు నమ్మకము సడలును. కనుక నమ్మట కాక, నచ్చుట కావలెను. ఇతరులలో దేవు డంతర్యామిగా నున్నాడను నభిప్రాయము తన ప్రవర్తన లోనికి దినచర్యలో నితరులతో పెట్టుకొన్న సంబంధములలోనికి దిగినచో నచ్చుట యేర్పడును. ఇతరులు నచ్చనిచో దేవుడు నచ్చుట యుండదు. నచ్చినవారికి దేవుడున్నాడని నమ్మట కాక, తెలియుట జరుగును. అపుడు వాని భావము సత్యమగును.)

శ్రద్ధతో, సత్యమైన భావముతో నా పాదములను సేవింప వలెను. నా కథలను వర్ణించుకొనుట యందు సంతోషము చెంద వలెను. సర్వజీవులయందును నే నుంటినని సమబుద్ధి కలుగవలెను. (అప్పుడే మహానుభావుల ప్రవర్తనములు మనకు భగవంతుని సత్కథలగును.)

ఎవరితోను శత్రుత్వము పుట్టరాదు. (మనము మంచిగా నుండవచ్చునుగాని, ఇతరులు మనయెడల శత్రుత్వము వహించినచో నేమి చేయవలెను? తన సాధనము యితరుల యభిప్రాయములకు సంబంధించినది కాదు. తన మనస్సునకు సంబంధించినది. తనకు గిట్టనివారని తానెవ్వరినీ తలంపకుండుట కావలెను. అట్లున్నచో నితరులు బ్రతుకనిత్తురా యను ప్రశ్న తెలివితక్కువ. ఇతరుల భావములనుబట్టి తాను యుక్తిగా మెలగవచ్చునుగాని, తనకు వారి యెడ భావములు కలుగరాదు.)

సాధకునకు బ్రహ్మచర్య మావశ్యకము. (అనగా పెండ్లి చేసుకొనరాదని కాదు. ఋషుల మార్గమును బట్టి సాధనము చిన్నతనమున ప్రారంభింపవలెను. బ్రహ్మచర్యాశ్రమమున

సాధన పూర్తి కావలెను. ఆ కాలమున స్త్రీ కామమున కతీతుడుగా నుండవలెను. స్త్రీలు పురుషుని యందు కామమున కతీతులుగా నుండవలెను.

ఐనచో చిన్నప్పుడు సాధనచేయక మానినవారు నడి వయస్సున, వివాహమైన వెనుక సాధన చేయవలెనని బుద్ధి పుట్టినచో నిక ఈ జన్మకు లాభము లేదా? తప్పకయున్నది. తన హద్దులలో స్త్రీవాంఛయున్నవాడు గృహస్థాశ్రమ విధినిర్వహణకై భార్య కోరిక ప్రకారము సంతానము కలిగించి తీరవలెను. దానిని మించి కామము మనస్సున ప్రాధాన్యము వహింపకుండుట కూడ బ్రహ్మచర్యమే. అట్లే ఒక వయస్సు తరువాత భార్యా భర్తలు స్త్రీపురుష వాంఛ కతీతులై, సహచరులై, గృహస్థాశ్రమ విధులను నిర్వర్తించుట కూడ బ్రహ్మచర్యమే.

కొందరు రామకృష్ణపరమహంస మున్నగు మహనీయులు స్త్రీ వాంఛను పూర్తిగా పరిహరించి వర్తించిరి. అట్టి దందరకును తప్పనిసరియా? కాదు. స్త్రీ వాంఛ కలుగకుండుట వేరు, నియమించుకొనుట వేరు. జీవపరిణామమున కొన్ని జన్మలలో విశేష పరిణామము కలిగి, స్త్రీపురుష సంబంధమక్కర లేని జన్మలుండును. అట్టి జన్మ సిద్ధించినపుడు అప్రయత్నముగనే అతీతత్వము ఆజన్మముగా సిద్ధించును. దానిని చూచి మిగిలినవారు నోరు నొక్కుకుని దానిని బ్రహ్మచర్య మనరాదు. మనస్సు బ్రహ్మయందు చరించుట బ్రహ్మచర్యము. అది యలవడిన కొలదియు స్త్రీ పురుష వాంఛ తొలగిపోవుట సత్యము. అంతేకాని, అణచుకొనుట సత్యమార్గము కాదు. స్వచ్ఛందమైన పశుకామ ప్రవృత్తివలన నెంత నష్టమున్నదో, కామము నణచుకొనుటవలన కూడ నంత నష్టమున్నది. ప్రాణమయ కోశమునందు కల్లోలము పుట్టి ప్రాణ ప్రసారము యొక్క సామ్యము చెడిపోయి, దేహావయవములలో శక్తి స్తంభనము జరిగి, శక్తి గ్రంథులేర్పడి, ఆ యా ప్రదేశములు వ్యాధిగ్రస్తము లగును. తత్ఫలితముగా మానసిక వ్యాధిగాని, క్యాన్సరు వ్యాధిగాని కలుగును. సారాంశమేమనగా బ్రహ్మచర్యాశ్రమమునందు పూర్తిగా నిష్కామ జీవనము, గృహస్థాశ్రమము

నందు సంతతి కొఱకై సంయమముతో కూడిన కామప్రవృత్తి, అటు పైన కామమున కతీతమైన దాంపత్య సహజీవనము, ఋషుల మార్గమునకు సరిపడును. )

మౌన మభ్యసించుట చాల ఘనము. (మౌన మనగా మాట్లాడ కుండుట యని కొందరి యభిప్రాయము. అది సరికాదు. మాట్లాడ వలసిన ఆవశ్యకతను తగ్గించుట మౌనము. దీనివలన చేయవలసిన పనులు సకాలమున చేయుట అలవడును. వాదములలోనికి దిగునట్టి బుద్ధి భగవంతునిపై మరలవలెను. ఇద్దరు వాదించుకొనుచున్నను, వారిలో భగవంతుని చూచి, తాను మానసికముగా వాదనలో దిగకుండుట నేర్వవలెను. అపుడు నోటితో వాదించుట యుండదు. మనస్సు చెలరేగుచుండగా గొంతు బిగించుకొనుట మౌనము కాదు. దీనివలన ఉద్రేకము, రక్తపోటు, తలనొప్పి, నిద్ర లేకుండుట మున్నగు వ్యాధులు సంక్రమించును. తాను చేయు ప్రసంగము నందలి ప్రతివాక్యము అక్కఱలేనిచో మానవలెను. ఆవశ్యకమైనచో మాట్లాడవలెను. తనకో, ఎదుటివారికో జ్ఞానము విప్పారునట్టి సంభాషణములను మాత్రమే చేయుట, అడిగినదానికి సందేహములేని సమాధానమును అధిక ప్రసంగము లేకుండ నిచ్చుట అభ్యాసము కావలెను. ముఖ్యముగా మౌనము మానసికమే గాని, వాచికము కాదు.)

శ్రద్ధ, దైవభక్తి, దైవకథలయం దాసక్తి, జీవులయందు సమబుద్ధి, శత్రుత్వము లేకుండుట, బ్రహ్మచర్యము, మౌనము అను సద్గుణములను స్వధర్మములుగా నభ్యసించువాడు సాధకుడు. ఇంకను సంతుష్టుడు, మితాశనుడు, ఏకాంతధర్మము నభ్యసించువాడు, మననశీలుడు, మాత్సర్యములేనివాడు కావలెను. (సంతుష్టుడనగా సన్నివేశములను బట్టి సంతోషించువాడు కాదు. సంతోషము తన స్వభావముగా నభ్యసించువాడు కావలెను. మితాశను డనగా మితముగా భుజించువాడు. రుచిని బట్టి తినువాడు రోగి యగును. తినుటకు రుచిని సద్వినియోగము చేయువాడు యోగి యగును. మితముగా భుజించుట యనగా తక్కువ భుజించుట కాదు. కావలసినంత మాత్రము భుజించుట. భోజనము చేసినపుడు "ఆకలి దప్పులు తీరవలెను, డొక్క లుబ్బరాదు, పొట్ట బరువెక్క

రాదు. మాటాడుటకు, నవ్వుటకు, అరచుటకు, దగ్గుటకు బాధ కలుగకుండునట్లు భుజించవలెను" అని ఆయుర్వేదము చెప్పుచున్నది. "తిండిపోతునకుగాని, ఆకలిచే మాడువట్లు స్వల్ప భోజనము చేయువానికిగాని, నిద్రపోతునకుగాని, నిద్రమాని అభ్యాసము చేయువానికి గాని యోగ మబ్బదు" అని భగవద్గీత చెప్పుచున్నది. "కఠోరములైన యుపవాసాదులు చేసి, దేహ మందలి పంచభూతములను కృశింపచేయువారు వివేకము లేని వారు" అనియు భగవద్గీత చెప్పుచున్నది. హితమైన యాహారము నెన్నుకొని మితముగా భుజించుట సాధన.

ఏకాంతి అనగా నొంటరితనము ననుభవించువాడని యర్థము. తన్నాశ్రయించిన వారిని విడిచి, ఎప్పుడును తనగదిలో గాని, కొండగుహలలోగాని చేరి సాధన చేయుమని దీని యుద్దేశ్యము కాదు. ఏకాంత మనగా నందరిలో నొక్కనినే చూచుట నభ్యసించి, ఎందరిలో నున్నను తానొక్కడే యుండగలుగుట, లేనిచో భారత భాగవతాది గ్రంథములయందు నారదాది సత్పురుషులను ఏకాంతముఖ్యులుగా వర్ణించుట యెట్లు పొసగును?

మననశీలుడు అనగా ధ్యానము తన స్వభావముగా నేర్పడినవాడు. దేనిని చూచుచున్నను, ఎవరితో వ్యవహరించుచున్నను వారిలోని భగవంతునితో ధ్యానమున వ్యవహరించుట మనన శీలత.

మత్సర మనగా నొకరికున్న దానిని చూచి బాధపడుట. దీనివలన నిరంతర దుఃఖము కలుగును. విలువైన, అందమైన వ్యక్తులను, వస్తువులను, దుస్తులను, భూషణాలంకారములను చూచినపుడు వాని యందు దైవత్వము గమనించినచో మత్సరము పుట్టదు.)

ఎవరితోనైనను మిత్రభావము నభ్యసింపవలెను. (తన్ను ద్వేషించి నిందించువాని యెడల నిది యెట్లు సాధ్యమనరాదు. వాని హితము గోరి సంభాషించుట, పనిచేయుట మిత్రత్వమే యగును.)

దయా గుణము నభ్యసింపవలెను. ఆత్మజ్ఞానము నలవరచు కొనవలెను. (శరీర మాత్మ కాదనియు, అందంతర్యామి యాత్మ యనియు, అతడే పరమాత్మ యనియు తెలిసి చరించుట.)

తన శరీరమునందును, తనపై నాధారపడినవారి యందును ఆత్రబుద్ధి తగదు. అది బంధనమునకు కారణమగును. (తన శరీరము నలంకరించు కొనుటలో నెక్కువ కాలము వ్యర్థము చేయరాదు. శరీరమునకు వ్యాధి కలిగినచో నియమము పాటించి ఔషధ సేవనము చేయవలెనుగాని, వ్యాధిని గూర్చి దిగులు పడరాదు. ముసలితనము కలిగినపుడు దాని లక్షణములను కప్పిపుచ్చుకొనుటకు కంగారు పడరాదు. దేహము విడువవలసివచ్చినపుడు ఉత్కంఠ పడినచో తెలివి తప్పును గనుక మృత్యువు కలుగును. ప్రశాంతి లభించినచో తెలివి తప్పదు గనుక మృత్యువు కలుగక, దేహము తొలగును.)

కోపము తొలగించు కొనవలెను. మరియు నభిమానము తొలగించు కొనవలెను. (కోపము తొలగించు కొనుట యనగా కోపము నాపుట కాదు. సంతుష్టి నలవరచు కొనుట.)

908. జీవుని యొక్క, ఈశ్వరుని యొక్క యథార్థజ్ఞానము గ్రహింపవలెను. (జీవుడు తత్త్వము చేత నీశ్వరుడే యని తెలియవలెను. ఒక గృహము కట్టినపుడు గదులలో చోటుండును. ఆ చోటువంటివాడు జీవుడు. ఆరుబయలులాంటి వాడు దేవుడు. ఇల్లు కట్టక ముందు గదులలోనున్న చోటు గూడ ఆరుబయలులోని చోటే. కట్టిన తరువాత గూడ దాని యఖండత్వము, పవిత్రత్వము చెడలేదని యూహింపవచ్చును. గదిలో దుర్వాసన యున్నను, అది చోటున కంటదు. అట్లే జీవుడు కూడ నీశ్వరుడే యని తెలియవలెను.) ఈ తెలివివలన బుద్ధి ఇంద్రియముల వైపునకు మనస్సుగా ప్రసరించుట మాని, తనవైపునకు మరలి, తానుగా నుండును. బుద్ధియందలి సంకల్ప వికల్పములు మొదలగు స్థితులన్నియు కరగి, తానుగా నుండును. (కరుగకముందు సంకల్పములు ఘనీభవించి యుండును. అవియే తన నమ్మకములు. ఈ నమ్మకము లన్నియు కరగి యొకే నమ్మకముగా నుండవలెను.

అదియే భగవంతుడు. పాత్రలోని మంచుగడ్డలన్నియు కరగినచో ఒకే జలముగా నుండునుగదా!)

జీవుడు పరమాత్మయని తెలిసిన వెనుక పరమాత్మనే అన్నిటి యందును సూటిగా దర్శించును. కంటికి సూర్యు డెంత స్పష్టముగా ప్రత్యక్షమగుచున్నాడో అట్లే వానికి దేవుడును. ఈ సాధనతో ఆత్మలకు నాయకుడైన శ్రీమన్నారాయణుని దర్శించును. అపుడు తనయం దహంకారమునకు తావుండదు. అది అసత్య మగును. సత్యమైన దేవుని వెలుగుచే అసత్యము మాయమగును. ఈ దృష్టితో చూచినవానికి సృష్టి మొత్తమునకు కారణముండదు. అందలి సన్నివేశములకు గూడ కారణము లేదని తెలియును. కార్య కారణములవలె కనిపించుచున్న వన్నియు ఒకదానియందు భాగములై దర్శన మిచ్చును. (స్థూలదృష్టితో చూసినచో మన మన్నము తినుటకు కారణము బియ్యము మొదలగునవి. నిమిత్త కారణము బియ్యపు కొట్టువాడు, వండిపెట్టు భార్య మొదలగు వారు. ఇంకను విశదపరచుకొన్నచో ధాన్యము పండించు రైతు నిమిత్తకారణము. అంతకుముందు వరిమొక్కయున్నది. దానికి కారణము విత్తనము. దానికి కారణము వరిమొక్క. ఈ రెండిటి పరస్పరత్వమునకు కారణము బీజాంకుర పరిపాక ప్రకృతి. ప్రకృతికి కారణము యోగమాయ. దానికి కారణము భగవంతుడు. భగవంతుడు సర్వకారణ కారణము. వానియందు లోకములోని కార్య కారణములన్నియు నంతర్భాగములై ఒకే వెలుగుగా దర్శన మిచ్చును.) ఈ వివరము తెలియుటవలన జీవి పరిపూర్ణుడై, సర్వవ్యాపియై పరబ్రహ్మమును పొందును.

909. ఇట్లు ఆత్మను తెలిసినవానికి విష్ణుస్వరూపము దర్శన మిచ్చును. ఆకాశమున వెలుగుచున్న సూర్యుని కిరణము భూమికి, నీటియందు, ఇంటిగోడల యందు పడి, ప్రతిబింబించుచుండును. కిటికీలలోన నుండి ఇండ్లలో పడుచుండును. ఇట్లు ప్రతిబింబము చెందుచున్న సూర్యుని వెలుగును గమనించి, మనము గగనమున సూర్యుని అస్తిత్వమును తెలుసుకొనుచున్నాము. అట్లే మనస్సున, బుద్ధియందు, అహంకారమునందు, దేహమందలి నాడులయందు,

ప్రతికణమునందు, పరమాణువునందు, ప్రతిబింబముగా నున్న అంతర్యామిని సాధకుడు గుర్తించును. నారాయణుడు సర్వజీవ రాసులలో నంతరాత్మగా నుండి, ఆత్మదర్శనము చేసినవారికి దర్శన మిచ్చును.

910. జీవుడు పరమాత్మయందు ఆసక్తికలవాడైనపుడు పంచభూతములు, ప్రకృతియందు లీనమై వాసనా మాత్రముగా నుండును. ( వేగిన విత్తనము వలె నుండును ) కనుక కర్మములు మొలిపింపవు. నిద్రలో మనకు దేహాదు లెట్లుండునో అట్లుండును. పురుషుడు మాత్రము తనయందు తాను మేల్కాంచి యుండి, ఇతరము చేత కప్పబడినివాడై పరమాత్మ ననుభవించుచుండును ” అని కపిలాచార్యుడు చెప్పగా దేవహూతి మరల నిట్లు ప్రశ్నించెను.

911. “ ఓ నిర్మలమూర్తీ ! నా కొక్క సందేహము మిగిలి యున్నది. పృథివికి గంధ గుణము సహజము. జలమునకు రుచి పుట్టించు గుణము సహజము. ఈ జంటలకు అన్యోన్య సంబంధ మున్నది. అది అవినాభావము. ఒకదానిని విడిచి మరియొకటి ఉండదు. అట్లే జీవులయందు ప్రకృతికిని, ఆత్మకును అన్యోన్య సంబంధము దగ్గరై యున్నది గదా ! అట్టిచో ఆ ప్రకృతికిని, ఆత్మకును ఎడబా టెట్లు సంభవించును ? ఈ తత్త్వశాస్త్రము మనస్సునకు విశదమైనంతనే ఒక్కమాటుగా సంసారబంధములు తొలగుట యెట్లు సాధ్యము ? ఈ బంధములు తొలిగించుకొని నప్పుడు తొలగుచుండును. మరల మనస్సు ప్రవర్తించునపుడు వర్తించుచుండును. అట్లుగాక, యిక తిరిగి పుట్టని విధమున యవి చనిపోయినట్లు తొలగు మార్గమేది ? ( సంసారజీవులకు బంధువులు చనిపోయినపుడు యిక మనకు కనిపింపరని గుండెరాయి చేసు కొందుము. అదేవిధముగా సంసారబంధములు తొలగు మార్గమేది?) ఇన్నిటిని స్పష్టపడునట్లు వివరించి దయతో నన్ను రక్షింపుము. నీవు దేవగణములచేత గూడ సేవింపబడునంత గొప్పవాడవయ్యును, భక్తుల ననుసరించి నడచి వత్తువు. కనుక నాకు వివరింపుము.”

912. అపుడు భగవంతు డిట్లని బోధచేసెను. “ తల్లీ ! ఈ దిగువ చెప్పబడు క్రమము నవలంబించినచో పురుషు నాశ్రయించి

అంటుకొనియున్న ప్రకృతి నీవు కోరినట్లు దగ్ధమై మాయమై పోవును :

1. మనస్సున కారణము కల్పించు కొనకుండ తన పని తాను చేయుట.

2. హృదయము నిర్మలముగా నుండుటను నిరంతరముగా గుర్తించి చూచుకొనుట. ( నిర్మలత్వమునకు ప్రతిబంధకములైన భావము లెట్టివో గుర్తించుకొని తొలగించుటకు యత్నము చేయ రాదు. అట్లు గుర్తించుకొనుచున్నచో వానిని స్మరింతుము గనుక హృదయమునకు నిర్మలత్వము అసాధ్యము. నిర్మల హృదయుల చరిత్రములను స్మరించి, కీర్తించు కొనుటవలన హృదయము నిర్మలమగును. )

3. నిశ్చయముగా నేర్పడిన భక్తియోగము. ( నిశ్చయ మనగా భగవంతుని నమ్మవలెనని నిశ్చయించుకొనుటగాదు. ఉన్నదంతయు భగవంతుడని నిత్యజీవిత వ్యవహారమున వెదకు టారంభించినచో భక్తియోగము నిశ్చయమగును. )

4. మహానుభావుల కథలను విని, ఆనందించ గలుగుటవలన మిగిలినవానియందు పట్టు సడలవలెను. చూడబడిన ప్రతివస్తువు నందు ప్రకృతి పురుషులను గ్రహించుచు,అందున్నది ఆత్మ మాత్రమే అను సత్యము ఎట్లు పొసగునో చూచుకొనుచుండవలెను. ఈ చూపునే పెద్దలు జ్ఞానసముపార్జన మందురు.

5. తపస్సుతోగూడిన యోగాభ్యాసమును నిరంతరముగా ఆచరించుకొనుటవలన కోరికలయందు పట్టు సడలును. దీనినే పెద్దలు వైరాగ్యమందురు.

6. తన్ను తాను ఆత్మయను వెలుగుగా ధ్యానము చేసికొను చుండుటచేత చిత్తము నానాదిక్కులకు ప్రసరించుట మాని, వెనుకకు మరలి, తనయందు ప్రవేశించి మాయమగును. ( నదులు కాలువలుగా, చెరువులుగా చీలిపోయినపుడు నానాప్రదేశముల భూములయందలి రంగు, రుచి, వాసనలను పట్టించుకొనును. అప్పుడు నదికి, కాలువకు, చెరువునకు, దానిలోనుండి బిందెతో ముంచిన నీటికి వేరువేరుగా స్వతంత్రమైన అస్తిత్వముండును.

అట్లే వివిధ విషయములనుగూర్చి చేసిన ఆలోచనలలో నొక్కొక్క దానికి వేర్వేరుగా అస్తిత్వముండును. దానితో తల వాచిపోవు చుండును. అట్లుగాక, నది సముద్రమున్న వైపునకు మరలి, అందు ప్రవేశించినచో నది నీటికి గూడ సముద్రము యొక్క అస్తిత్వమే సిద్ధించి, నది యస్తిత్వము మాయమగును. అట్లే ఆత్మధ్యాన యత్నమున చిత్తము వెనుకకు మరలి ఆత్మలో లీనమగును.) ఈ స్థితిని పెద్దలు ఏకాగ్రత యందురు.

అరణిని మథించినచో అగ్ని పుట్టును. మథించుచునే యున్నచో పుట్టినయగ్ని అరణిని దహించును. అట్లే నిరంతరము తత్త్వదర్శనము చేయు యత్నమున జ్ఞానమును పుట్టించుకొను చున్నచో ప్రకృతి దగ్ధమగును. ఈ యభ్యాసమునకు మొదట ప్రకృతియందు గల దోషములు, తెలియుచుండుట జరుగును. వానిని గమనింపకుండ సాధన చేసినచో ప్రకృతి పురుషునిచే విడువ బడును. ఎంత మంచి పుష్పమాలను మనము ధరించి, ఎంత కాలము సంతోషించుచున్నను, అది వాడిపోయిన వెనుక మనకు తొలగించుకొను బుద్ధి పుట్టును కదా! అట్లే ప్రకృతి సుఖములతో అంతకు ముందెంత సాంగత్యమున్నను, దాని దోషములు తెలియుట మొదలైన వెనుక క్రమముగా దానిని విడచుట సంభవించును. ఇట్లు వివరించి కొంత విరామమును ప్రసాదించి, మరల నింకొక సత్యము నుపదేశించెను.

913. "ప్రకృతిని విడువవలెనని చెప్పినంత మాత్రమున ప్రకృతి చెడ్డది యనుకొనరాదు. (క్షయరోగికి ఆరోగ్యము లభింపవలెనన్నచో భార్యకు దూరముగా నుండవలెనని చెప్పి నపుడు భార్య దుష్టురాలని యర్థముకాదు.) ప్రకృతిగూడ భగ వంతునియందే లీలార్థము పుట్టినది గనుక అది సహజముగా గొప్ప పుట్టుకగలది. దానియందొక మహిమ గలదు. తనయందు బద్ధుడైన పురుషుడు జీవుడుగా అజ్ఞానియై ప్రవర్తించినను వాని కీడు కోరదు. అతడు పరమేశ్వరుడనియు, అది క్రీడ యనియు దానికి తెలియును. కనుక ప్రకృతి కలిగించు అజ్ఞానాది సంసార బంధములు కొంచెము గూడ అశుభములు కలిగింపవు. అది యెట్లు సంభవమని అనుకొంటివేని వినుము.

914. "మానవుడు నిద్రలో కలలు గనును. అందు మహా పదలు సంభవింపవచ్చును. కాని మెలకువ వచ్చు క్షణముననే ఆపదలన్నియు అసత్యము లగును. అటుపైన అవి వాని నేమియు చేయవు. అట్లే సర్వశరీరములలో నున్న పురుషుడు పరమాత్మ యనియు, తనకు నాథుడనియు ప్రకృతికి తెలియునుగదా! కనుక దేహబద్ధుడైన జీవునిలోని అంతర్యామి పురుషుడు తన ప్రకృతిలో జరుగుచున్న కర్మలకు సాక్షిగా మాత్రము నిలబడి చూచుచుండును. (సాక్షి యనగా సాక్ష్యము చెప్పువాడు కాదు. సాక్ష్య సంతకము పెట్టువాడును కాదు. స అక్షి అనగా కంటితో మాత్రము కూడిన వాడు, సంబంధము లేక చూచువాడు అని యర్థము) దీనినిబట్టి ఎవ డెన్ని దురాచారములు చేసినను భగవంతుని వైపునకు మేల్కొనిన క్షణమునుండి అవి వానివి కావని తెలియవలెను." ("ఎవ డెన్ని దురాచారములు చేసినను, పాపముల కన్న మించిన మహాపాపములు చేసినను నాయందనన్య భక్తికలిగినచో వాడు సాధువనియే తెలిసికొనుము. అతని పర్యవసానము నా రూప ముతో చక్కగా నుండును" అని గీతలో కృష్ణుడు చెప్పెను.)

915, 916. ఇట్లు చెప్పి కొంచెమాగి కపిలాచార్యుడు మరియొక విశేషమును వివరించెను. "జన్మము లెత్తుటవలన కలుగు ప్రయోజన మెట్టిదో వివరించెదను వినుము. జీవుడు అధ్యాత్మ నిష్ఠకలవాడగువరకు త్రిగుణాదుల తోడి ప్రకృతియు దేహము వాని కాధారములై పనిచేయును. ఇట్టి దేహపరంపరలను సాధించి పెట్టుటకే జన్మలు. ప్రకృతిసహజముగా జీవుని పరమేశ్వరుడని గౌరవించును గనుక కొన్ని జన్మలలో సన్నివేశములను కల్పించి ఆత్మమార్గాన్వేషణమునకు పాకము కలిగించును. ఒకమారు ఆత్మ యను వెలుగున్నట్లూహించి ఆ వైపునకు జీవుడు మ్రొగ్గ టారంభించును. అప్పటినుండి యతడు ప్రకృతిబంధము తొలగించుకొని తాను దేవుడుగా గుర్తించువరకును వానికి ప్రకృతి జన్మ లిచ్చుచునే యుండును. త్రిగుణాదులను పని చేయించుచునే యుండును. అటుపైన వాని యిష్టము. అట్టి యిష్టమునకు ప్రకృతి వేచి యుండును. ఈ మొత్తము దేవుని క్రీడ.

ప్రకృతియందు బద్ధుడై జన్మలెత్తుచున్న సంసారికి మొదట నా భక్తుల సాంగత్యము కలుగును. వారి యుపదేశము అతని చెవులలో పనిచేసి, తన బద్ధజీవితమను కలనుండి మెలకువ వచ్చును. అనేకపర్యాయము లిట్లు మెలకువ వచ్చి వచ్చి విజ్ఞాన మబ్బును. దానితో అన్నిటియందును వైరాగ్య ముదయించును. నా యనుగ్రహమునకు పాత్రు డగును. అట్టి మనస్సుతో కలిగిన పరిజ్ఞానమువలన సమస్త బంధములు తొలగును. తన్ను గూర్చి తనకేమి వివరములు గుర్తున్నవో అవి యన్నియు సడలును. నా దివ్యమైన వెలుగు పొందును. దానిచే వెలిగించబడి, తానది యగును. ఈ స్థితినే యోగీంద్రులు తమ హృదయములలో గానము చేయుచుందురు. (చిన్నదీపము వెలుగుచుండగా దానిని పెద్ద దీపము దగ్గరకు గొనివచ్చినచో చిన్న వెలుగుపై పెద్ద వెలుగు పడును. తాను గూడ పెద్ద వెలుగై వెలుగును. ఈ స్థితిని యోగులు హృదయమునందు గానము చేయుట యనగా శ్వాసము ప్రణవముగా, తానుగా నుచ్చరించుచు వినుట. ఇచ్చట ఉచ్చరించువాడు, గానము వినువాడు నొక్కటి యని తెలియును.)

917. దేనిని గూర్చియైన తనది అను భావము కరగిపోవలెను గనుక విలువైన వస్తువులపై దృష్టి గూడ మోక్షమునకు ప్రతిబంధకమే. గొప్పదనము కూడ విఘ్నమే. యోగసాధనలో లభించు అణిమ మొదలగు నైశ్వర్యములు గూడ మోక్షమునకంతరాయములే. కనుక వానిని లెక్కచేయక నా పాదములయందు నిపుణతతో మనస్సును నిలుపవలెను. అట్లు నిలుపగలిగినవాడు మృత్యుదేవత నపహసించి గూడ మోక్షము పొందును.” (అనగా దేహము విడచుటకు ముందే మోక్షస్థితి పొందును, అటుపైన దేహము తొలగినను తానుండును. మృత్యువుండదు. మార్కండేయాదుల కథలు దీని కర్థవాదములు) ఇట్లు పలికి కొంచెము విరామ మిచ్చి కపిలు డిట్లనెను: “తల్లీ, మనుపుత్రీ! ఇటుపైన యోగ లక్షణము యొక్క విధానమును వివరించెదను.

918. ఎంత బుద్ధిబలము కలిగిన వారైనను యోగాభ్యాసము చేయు చుండనిదే మనస్సు నిర్మలము కాదు. నా పాదములను ధ్యానించుచు యోగము నభ్యసింపవలెను.

919. అష్టాంగ యోగము నభ్యసించు క్రమమును తెలిపెదను వినుము :

1) ఈ మార్గ మవలంబింపదలచిన వాడు స్వధర్మము నాచరించు చుండవలెను. (వృత్తి, కుటుంబపోషణము, బిడ్డలను ప్రయోజకులను చేయుట మాని యోగాభ్యాస మారంభించు వారు యోగభ్రష్ఠులు.)

2) శాస్త్రముల యందు నిషేధింపబడిన పనులు మానవలెను. (మనకు మంచి విషయములు నచ్చు వరకును శాస్త్రమే కర్తవ్యము నిర్ణయించి పెట్టు సాధనము.)

3) దైవికముగా లభించిన ధనాది సంపదల వలన సంతుష్టి చెందవలెను. (యోగసాధకునకు వృత్తులు చేయుట లోకహితార్థమే గాని ఉదర పోషణార్థము గాదు. కనుక చేయుచున్న వృత్తి వలన లభించు జీతము మొదలగునవి తా నార్జించు కొన్నవి గాక దైవ మిచ్చినవని తెలియవలెను. "జీవరాసుల ప్రవర్తన లెచ్చట నుండి పుట్టుచున్నవి? ఎవ్వనితో సర్వము నిండియున్నది? నీ కర్తవ్యమే. నీ వృత్తియు నీ కచ్చటి నుండియే ప్రసాదింపబడు చున్నవి. నీ కర్తవ్యముచే దాని నర్చించి సిద్ధి పొందగలుగు చున్నావు" అని భగవద్గీత చెప్పుచున్నది. నీ వృత్తి యుద్యోగాదులు వాని నిచ్చువాడు అచ్చటి నుండియే పుట్టుచున్నారు. నీ జీవితము మున్నగునవి కూడ దైవదత్తములే గాని నీ వార్జించు కొనునవి కావు.)

4) మహాభాగవత జనుల పాదారవిందముల నర్చించు చుండవలెను.

5) మోటైనవి, వెకలియైనవి, ఏహ్యమైనవి, నీచమైనవి అగు పనులు మానవలెను. (మోటైనవి యనగా ఇతరులను లెక్క చేయకుండుట, ఇతరుల దేహాదులకు బాధ కలిగించుట, అతిథిగా నొకరి యింటికి పోయినపుడు వారి కసౌకర్యముగా తన

యోగాభ్యాసము దుకాణము పెట్టరాదు. నలుగురు తిరుగు చుండు చోట చిన్న గుడ్డ కట్టుకొని స్నానము చేయుట, తాను భుజించు వరకు స్త్రీ బాల వృద్ధులు సహితముగా మిగిలినవారు భుజింపరాదని శాసించుట మున్నగునవి.

వెకలితన మనగా అన్నము తినుచుండగా లొట్టలు వేయుట, చేతికి మూతికి పూసికొనుట, నలుగురిలో సగర్వముగా భార్యను కౌగిలించుకొనుట మున్నగునవి.

ఏహ్య మనగా బాటయందు జంతువులవలె పట్టపగలు మూత్రాదులను విడచుట, బూతులతో సంభాషణ, తిట్టుకొనుట, తన్నుకొనుట, ఒకరినిగూర్చి రహస్యముగా నింకొకరితో చెడ్డగా చెప్పుట.

నీచమైనపను లనగా ఆశ్రితులగు దాస దాసీ జనముల యెడ లోభిగా ప్రవర్తించుట, వ్యభిచారము, మద్యపానాదులు, రిక్షావానితో, జట్కావానితో బాడుగను గూర్చి కలహము పెట్టుకొనుట, మోసము, అసత్యభాషణము మొదలగునవి.

6. మోక్షధర్మములయం దాసక్తి. (మోక్షధర్మము లనగా పూజ, భజనము, సంకీర్తనము, పుణ్యక్షేత్ర, తీర్థయాత్రలు మొదలగునవి.)

7. పరిశుభ్రమైన యాహారమును మితముగా భుజించుట.

8. జనసమ్మర్దము లేనిది, ఇతరులకు బాధ కలిగింపనిది, ఇతరుల వలన బాధలు కలుగనిది యగు ప్రదేశమున నివసించుట. (దైవకార్యము లేమైనను మహోత్సవములు, తిరునాళ్లు, జాతరలు మున్నగు వానియందు పాల్గొనరాదు. ప్రశాంతిని భంగపరచు సమ్మర్దములలో దూరరాదు.)

9. హింసాబుద్ధి మానవలెను. అట్లే దొంగబుద్ధి మానవలెను. (ఇతరులు చూడకుండ చేయవలసిన దుష్కార్యములను మానవలెను. మరియు నితరుల వస్తువులపై మనస్సు పోవుటకూడ దొంగ బుద్ధియే.)

10. డబ్బుగాని, వస్తువులనుగాని తనకెంత యుపయోగించునో అంతే స్వీకరించుట నేర్చుకొనవలెను. (శిష్యుని పండ్లతోటలోనికి గురువు పోయినచో శిష్యు డిచ్చు ఫలములను తిని పంచిపెట్టగల సంఖ్యను మాత్రమే స్వీకరించుట యోగబుద్ధి. ఎక్కువ స్వీకరించి చేరవేసినచో కుళ్ళిపోవుటయే ఫలితము. తనమీది గౌరవముతో బంధు మిత్రాదులు భోజన పదార్థము లధికముగా వడ్డింతురు. వారి యాదరమును బట్టి భుజింపరాదు. తన యాకలిని బట్టి భుజింపవలెను.)

11. సత్యము పలుకుట, బ్రహ్మచర్యము, శుచిగా నుండుట, వేదాది గ్రంథములు పఠించుట, తపస్సు నభ్యసింపవలెను. (వాక్కును, మనస్సును, దేహమును, సక్రమముగా నుపయోగించుట నభ్యాసము చేయుటయే తపస్సని భగవద్గీత చెప్పుచున్నది.)

12. నిత్యము దేవతార్చనము చేయుట, మౌనము నభ్యసించుట.

13. ఆసన సిద్ధి. (ఇది పద్మాసనాదుల సిద్ధియని కొందరు వివరించిరి. కాని అష్టాంగ యోగములో ఆసన మనబడు పదమున కర్థము వేరు. "స్థిరముగా, సుఖముగా కూర్చుండుట యాసనము" అని పతంజలియు "ఆత్మకు సుఖమైనది ఆసనము" అని భగవద్గీతయు చెప్పుచున్నవి. స్థిరత్వము, సుఖము, దేహమునకు సంబంధించినవి కావు గనుక ఆసనమను పదమునకు శీర్షాసనము, హలాసనము, పద్మాసనము మున్నగునవి ముఖ్యమని యర్థము కాదు. హృదయమున మనస్సు నాశీనముచేయుట, యోగ సాధనయం దాసనము. మిలిగిన యాసనముల యభ్యాసము వలసినంత వరకు యమ మనబడు మొదటి యోగాంగమున అంతర్భూత మగును.) ఆసన సిద్ధి వలన స్థిరత్వము చిక్కును. మరియు శ్వాస తనకు వశ మగును.

14. ఇంద్రియములను నిగ్రహించుటకు ప్రత్యాహారము నభ్యసింపవలెను. (ఇంద్రియములు బాహ్య వస్తువులయందు ప్రసరించునపుడు ఇంద్రియ ప్రవృత్తులు ఆ వస్తువుల రూపము,

స్వభావము ధరించి యుండును. వానిని వెనుకకు మరల్చి వాని యందున్న యాకారములను మాయము చేయుటకై మనస్సు మనస్సులోనికి పిలచుట, ప్రత్యాహారము అనబడును. మనస్సన నేమి యని హృదయమున ప్రశ్నించుకొనుచున్నచో ప్రత్యాహారము సిద్ధించును.)

15. దేహమున వెన్నెముకలో మూలాధారము మొదలగు స్థానము లున్నవి. అందొక్కొక్క స్థానమునందు హృదయ మందలి మనస్సుతో సంబంధ మేర్పరచి ప్రాణ ప్రవృత్తులను ధారణ చేయవలెను. (మూలాధారము, స్వాధిష్ఠానము, మణిపూరము, అనాహతము, విశుద్ధి, ఆజ్ఞ అనబడు ఆరు కేంద్రములు వెన్నెముక యందుండును. ఏడవది సహస్రారము.

1. మూలాధారము మన దేహమందలి పృథివీ తత్త్వమునకు నిర్వహణ కేంద్రము.

2. స్వాధిష్ఠానము వేడి పుట్టించుటకు కేంద్రము.

3. మణిపూరము దేహమందలి జలమునకు సామ్యము నిలుపు కేంద్రము.

4. అనాహతము శ్వాసరూపమైన ప్రాణ స్పందనమునకు కేంద్రము.

5. విశుద్ధి ఆకాశమునకు, శబ్దమునకు, మన వాక్కునకు సంబంధ మేర్పరచు కేంద్రము.

6. ఆజ్ఞ మనస్సునకు కేంద్రము.

7. సహస్రారము పరబ్రహ్మ భావనకు కేంద్రము. సాధకుడు శ్వాసను గమనించుచు మనస్సును శ్వాస కేంద్రమైన హృదయమునకు పిలువవలెను. ఇట్లు పిలుచుట నేర్చిన వెనుక మూలాధారమును గూర్చి హృదయమున ధ్యానము చేయవలెను. అప్పుడు మూలాధారమున అంతర్లీనమై పనిచేయుచున్న శక్తులు, ప్రజ్ఞలు హృదయమునకు వశమగును. ఇట్లు ఒక్కొక్క కేంద్రమును ధ్యానముచేయగా దేహమందలి శక్తులును, ప్రజ్ఞలును హృదయమునకు వశమగును. దానితో దేహమందలి పంచ భూతములు, మనస్సు పురుషుని వశమున నుండును. ఇట్లు చేయుటను ధారణ లేక ప్రాణధారణ యందురు. దీనికొరకై

ప్రశాంతముగా, సుదీర్ఘముగా, సుకుమారముగా, నుచ్ఛ్వాస నిశ్వాసలు చేయుట నభ్యసింపవలెను. ఇదియే ప్రాణాయామము. )

16. నారాయణుని అవతారముల దివ్యలీలాచరిత్రములను హృదయమున చూచుకొనుచుండవలెను. ఇదియే ధ్యాన మన బడును. దానితో మనస్సు ఏకాగ్ర మగును.

17. నారాయణునితో సమానమైన యాకారము ధ్యానింప వలెను. ( తన దేహాకారము నారాయణునిదిగా ధ్యానింపవలెను. దానితో సమాధి యనబడు స్థితి లభించును. )

ఈ యభ్యాసముచేయుటకు శుచియైన ప్రదేశము నెన్నుకొన వలెను. ( హృదయమునగూడ శుచియైన ప్రదేశమును కల్పించు కొనవలెను. ) ఆ ప్రదేశమున దర్భాసనముపై చర్మము, దానిపై వస్త్రము పరచి దానిపై కూర్చుండి ఆసనమును సాధింపవలెను. ( చర్మ మనగా లేడి చర్మ మని కొందరి మతము. కాని తన యోగాభ్యాసమునకు నొక లేడి బలి కావలసిన ఆవశ్యకత లేదు. ఇందొక సంకేతమును పెద్దలు చెప్పుదురు. దర్భ లనగా తన రోమములు. చర్మమనగా తన చర్మము. వస్త్రమనగా తాను కట్టుకొన్నది. యోగసాధనకు కూర్చుండుట కివి చాలునని యభిప్రాయము. లేనిచో దర్భాసనము, లేడిచర్మము సంపాదించు టకు కొంత కాలము, అవి చిరిగిపోయినచో మరల సంపాదించుటకు మరికొంత కాలము వ్యర్థమగును. కౌపీన రక్షణకోసము పటా టోపము. ఇన్నిటివలన యోగాభ్యాసమునకు బదులు జడభరతుని కథ సిద్ధించును. )

శుచియైన ప్రదేశమున శుభ్ర వస్త్రము ధరించి కూర్చుండి దేహమును వంకర లేకుండునట్లు నిలిపి ప్రాణాయామము చేయ వలెను. ( ఉచ్ఛ్వాస నిశ్వాసములను మెల్లగా, దీర్ఘముగా, సుకుమారముగా చేయవలెను. శ్వాస పీల్చుట పూరక మనబడును. శ్వాస విడుచుట రేచక మనబడును. ఇట్లు చేయుచు శ్వాసను గూర్చి గమనించుచున్నచో మనస్సు శ్వాసయందు నిలచును. శ్వాస మనస్సునందు నిలచును. రెండు నొకటి యగును. అప్రయత్న ముగా శ్వాసక్రియ నిలిచిపోవును. ఇట్లు నిలుచుటను కుంభక మందురు. మొదట నిది సాధ్యమా యనిపించును. మనము

గమనింపముగాని దినచర్యలోఁగూడ నిది సిద్ధించుచునే యున్నది. ఆకస్మికముగా మిక్కిలి యాశ్చర్యము, లేక ఆనందము కలిగినపుడు శ్వాస సుఖముగా నిలిచిపోవును.

దీని నెరుగక కొందరు శ్వాసను పీల్చి బంధించుట కుంభక మని వ్రాసిరి. అట్లు చేసినచో ప్రాణములు కడపట్టును. మొగము తిరుగును. దిగచెమటలు పోయును. అయినను కొందరు మొండికి పడి యభ్యసింతురు. దీనివలన వ్యాధులు కలుగును.

"ఉచ్ఛ్వాస నిశ్వాసముల గమనము విడగొట్ట బడుటయే ప్రాణాయామము" అని పతంజలి చెప్పెను. గమనము నాప వలెనుగాని శ్వాస నాపరాదు. మనస్సుతో స్పందనమును సమానము చేయవలెను. "ప్రాణాపానములను సమానమున నిలుపవలెను" అని భగవద్గీత చెప్పుచున్నది. దాని కొరకు "మనస్సును హృదయమున నిలుపవలెను" అని కూడ చెప్పు చున్నది. శ్వాస పీల్చు శక్తిని ప్రాణ మందురు. శ్వాస విడచు శక్తిని అపాన మందురు. ప్రాణమునకు పట్టు నాసాగ్రమున నుండును. అపానమునకు పట్టు మలావయవము బిగింపునం దుండును. "అపానమున ప్రాణమును, ప్రాణమున అపానమును హోమము చేయవలెను" అని గీత చెప్పుచున్నది. అర్థ మేమనగా శ్వాస పీల్చు ప్రయత్నముతో విడచుట నాపవచ్చును. విడచు నట్టి ప్రయత్నముతో పీల్చుట నాపవచ్చును. దానితో శ్వాస సామ్యమైన కుంభకము అప్రయత్నముగా సిద్ధించును.

మరియొక రహస్య మున్నది. కాలము రూపమున జీవుని యందు దేవుడుండును. ఈ కాలము మనస్సున ప్రసరించి మన దినచర్యలోని పనుల నిర్ణయమునకు తోడ్పడును. దానితో మనము కాలము నెరిగి ప్రవర్తింతుము. ఈ కాలమే మరియొక వైపున శ్వాసగా దిగివచ్చి కాలవిభాగములను సృష్టించును. జీవిత సన్నివేశములలో భయము, శోకము, కోపము, ఈర్ష్య, అసూయ, ఆతురత మున్నగునవి పనిచేయుచుండగా శ్వాసయొక్క కాల విభాగమునందు సామ్యము చెడును. గుండె కొట్టు కొనుటలోనున్న తాళము, ఛందస్సు కూడ తప్పును. కొంత వయస్సు దాటుసరికి

లెక్కలేనన్ని మారులు భయశోకాదు లనుభవించుట వలన గతి తప్పుట అభ్యాసమగును. ఇదియే మృత్యువును సమీపించు దారి. దీనివలన మనస్సు నందలి కాలగ్రహణశక్తి కూడ లయ తప్పి వర్తించును. దినచర్యలో నెగుడు దిగుడు లేర్పడును. ఒక నాటి దినచర్య రెండవనా డుండక పోవును. అట్టి మనస్సుతో శ్వాసను ప్రాణాయామమను పేర బిగింప ప్రయత్నింపరాదు. తనకు గతిలేని మనస్సు శ్వాసను బిగించినచో శ్వాస యూరు కొనునా ? ఎదురు తిరుగును. ప్రాణాయామ మభ్యసించుటకు పూర్వమే దినచర్యను సక్రమము చేసికొనవలెను. దీనికొరకే యమ నియమముల యభ్యాసము. దినచర్యను కాలక్రమమున కార్యక్రమముగా నేర్పరుచుకొనుట సాధ్యపడిన కొలదియు మనస్సునకు కాలవిభాగములపై స్వామిత్వ మబ్బును. అట్టిపైన మాత్రమే మన మనస్సు మన శ్వాసచే ప్రాణాయామము చేయించ గలదు. అప్పుడే మనస్సు, ప్రాణము ఏకమగును. తాను కాల స్వరూపుడని అర్థమగును. దినచర్యనట్లే గాలికి వదలి శ్వాసను బిగించుటకు యత్నము చేయువాడు దెబ్బతినును. తనకు తెలియకయే త్వరగా మృత్యువులోనికి పరువెత్తును. ఆయుర్దాయము కాలస్వరూపుని అధీనమున నుండునుగాని జాతకమును గుణించు గణకుని దశాంతర్దశల లెక్కలపై నాధారపడి యుండదు. యోగికి జాతక ఫలితములు పని చేయవని వరాహమిహిరా చార్యుడు స్పష్టముగా వ్రాసెను.)

ప్రాణాయామ సాధనచే పూరకము, కుంభకము, రేచకము అను విభాగములను ప్రయోగించి అన్నమయము, ప్రాణమయము, మనోమయము, విజ్ఞానమయము అగు ప్రకృతి కోశములను పరిశుద్ధి చేయవలెను. నిజమైన ప్రాణాయామము సిద్ధించు సరికి పరిశుద్ధి పూర్తియగును. అప్పుడే కోశములు నాలుగును ఆనందమయము లగును. ప్రాణాయామముతో ప్రాణగతు లొక దాని నొకటి నిలిపి పట్టును గనుక చిత్తము స్థిర మగును. యమము వలన చిత్తమున దోషములు తొలగి కరగిన బంగారమువలె మలిన ములు బహిష్కరింపబడును.

ప్రయత్నమను అగ్నితో ప్రాణమను వాయువును కలుపుట వలన ప్రాణాయామమున నొక వెలుగు పుట్టును. దానివలన వాత పిత్త శ్లేష్మముల దోషములు భస్మమగును. ప్రత్యాహారము వలన అభ్యాసములు దగ్ధమగును. ధ్యానము వలన ఇచ్ఛా ద్వేషముల రూపమున పనిచేయు సత్త్వ రజస్తమస్సుల లీలలు మాయమగును. ఇటుపైన సమాధి స్థితి నభ్యసించుటకు నాసాగ్రము చూడవలెను. (నాసాగ్ర మనగా ముక్కుయొక్క కొన. ఇది ముక్కున కేటః ప్రక్కనున్న కొనయని కొందరు వితర్కపడిరి. భ్రూమధ్యమున ప్రాణము నావేశింపజేయుమని గీతలో కృష్ణుడు చెప్పెను గనుక నాసాగ్ర మనగా పై అగ్రము, భ్రూమధ్యము. దీనిని చూచుట యనగా కన్నులతో గాదు. అట్లు చేసినచో తలనొప్పి, తల తిరుగుట కలుగును. భ్రూమధ్యమును మనస్సుతో చూడవలెను. ఏకాగ్రత ఏర్పడును. "అక్కడ మనస్సు నేకాగ్రము చేయుము" అని గీత చెప్పుచున్నది.)

920. విచ్చుకొనిన కన్నులతో సుందరమైన ముఖము, పుట్టుమచ్చగల విశాల వక్షము, నల్ల కలువ రేకలవంటి మేని చాయ, మెడలో నవపుష్పమాలిక, దానిపై వ్రాలుచున్న తుమ్మెదలు, కౌస్తుభమణి, ముత్తెముల హారములు, ప్రసన్నమైన చిరునవ్వు, కోటి సూర్యుల వెలుగు, వెలలేని రత్నకుండలములు, కిరీటము, కంకణములు, కేయూరములు, రవ్వల యుంగరములు ధరించి నడుమ మువ్వల మొలనూలు దాల్చి భక్తజనులను పోషించుచున్న మూర్తిని నాసాగ్రమునందు దర్శనము చేయవలెను.

921, 922. పద్మకేసరముల రంగుగల వస్త్రము ధరించి చతుర్బాహువులతో శత్రు భయంకరముగా శంఖ చక్ర గదా పద్మములను తాల్చిన సకల సద్గుణ శోభితుని, క్రొత్త వయస్సుగల వాని రూపమును దర్శింపవలెను. అతనిని జగన్నివాసునిగా, మోహదృష్టి తొలగించు వానినిగా, భక్తితో గూడిన మనస్సును కంటికి గోచరించు వానినిగా, పవిత్ర మూర్తిగా, సత్కీర్తి స్వరూపునిగా, భక్తలోకముపై బాధ్యతను స్వీకరించుచున్న

వానినిగా,మనోరథములను ఫలింపచేయు వానినిగా ధ్యానింపవలెను. అతని చరణ కమలముల చుట్టును జీవకోటుల నమస్కారముద్రలు మూగియున్నట్లు ధ్యానింపవలెను.

923, 924. అతనిని పుణ్యస్వరూపునిగా, అనంతునిగా తలపవలెను. వాని సద్గుణములకు సాటిలేదని తెలియవలెను. వాని నొక అచేతన విగ్రహముగా ధ్యానింపరాదు. అతడు నిలుచుండినట్లు, నడచివచ్చుచున్నట్లు, వచ్చి యాసీనుడగుచున్నట్లు, సుఖముగా శయనించుచున్నట్లు, హృదయమను గుహలో నివసించుచున్నట్లు ధ్యానించుచుండవలెను. సత్ప్రవర్తనగల వారందరు వానిని గొంతెత్తి స్తుతించుచుండుట వినవలెను.

925. అతనిని పరికించుచున్నప్పుడు నిర్మలుడని, పరిశుద్ధుడని మనస్సును హెచ్చరించుచుండవలెను. దానితో మనస్సున విజ్ఞాన తత్త్వము మేల్కొను చుండును. ఆ మూర్తి మొత్తమును ధ్యానము చేయుచునే నడుమ నడుమ మనస్సున అతని శరీర విభాగములను వేర్వేరుగా పరిశీలన చేసి మెచ్చుకొనుచుండవలెను. ఒక్కొక్క అవయవము యొక్క కదలికలను, విలాసములను, అది సాధించు పనులను గూర్చి విడమరచి చెప్పుకొనుచుండవలెను. పరిశుద్ధమైన మనస్సుతో నొక్కొక్క యవయవమునే ధ్యానించుట గూడ చేయవలెను. ఆ అవయవము పూర్తిగా దర్శనమిచ్చి నిలుచుట అభ్యాసమైనపుడు మరియొక అవయవమును దర్శించుట నారంభింపవలెను.

926, 927. ఈ పరిశీలన మెట్లు నిర్వహింప వలెనో యొక యుదాహరణము చెప్పెదను. అతని పాదములను చూచుట ఆరంభించితి మనుకొనుము. పాదముల యడుగున హలరేఖ, వజ్ర రేఖ, అంకుశరేఖ, పద్మరేఖ, పతాకరేఖ, ఛత్రరేఖ మున్నగు శుభలక్షణములున్నవి. అతని పదనఖములు వేర్వేరు చంద్రకళలతో చంద్రవంకలవలె నున్నవి. వాని నుండి వెన్నెలల కాంతులు ప్రసరించుచున్నవి. ఈ ప్రసారమున భక్తుల మనస్సుల చీకటులు మాయమగుచున్నవి. అతని పాదముల బొటనవ్రేళ్ళనుండి గంగయను పుణ్యనది ఎగిరి దుముకుచున్నది. దుమికి దిగివచ్చి

పరమేశ్వరుని జటాజూట మలంకరించుచున్నది. ఆ పాదములను ధ్యానము చేయువారు, పదములుగా స్తుతిచేయువారు నిలబడియుండిరి. వారి కలుషము లను పర్వతములు ఆ పాదముల నుండి వెలువడు చున్న వజ్రకాంతుల స్పర్శకు బద్దలగుచున్నవి. చుట్టును నిలబడి దాస్యము చేయుచున్న వారి కోరికలు తీరుచున్నవి. యోగి జనముల మనస్సులు పద్మములై విచ్చుకొనుచున్నవి. అందు తుమ్మెదలై యతని పదములు వ్రాలుచున్నవి. ఈ విధముగా నొక్కొక్క యవయవమునే దర్శింపవలెను.

928. (కొంతకాలము ఈ విధమైన ధ్యానము చేసిన వెనుక అన్ని యవయవముల దర్శనము లొంగుట పూర్తియగును కదా! అటుపైన నెట్లు ధ్యానింపవలెను? పై క్రమమునే మరల మరల ఎక్కములవలె నప్పజెప్పుకొను చుండవలెనా? కాదు. నూత్నకల్పనలు చేసికొనవలెను. దాని కుదాహరణము.) నాభిపద్మమున బ్రహ్మదేవుడు దేవతలను సృష్టి చేయుచు వారితో నాడుకొనుచున్నాడు. అచ్చటికి వాని తల్లి వచ్చినది. దేవతలందరు లేచి నిలబడి నమస్కరించిరి. ఆమె పద్మదళములవంటి నేత్రములతో వారిని జూచుచు భక్తితో విష్ణుని పాదముల సన్నిధిని చేరినది. అతని పాదములు, పిక్కలు, మెల్లగా నొత్తుచున్నది. మిక్కిలి మక్కువతో ఆ పాదములను తన తొడలపై నిలిపి యుపచారము చేయుచున్నది. భక్తితో భజించుట యనగా నిట్లుండవలెను.

929. (ధ్యానము నందలి నూత్నకల్పనములకు మరికొన్ని యుదాహరణములు) అందమైన మందహాసములతో గరుత్మంతుడు దిగుచున్నాడు. వాని భుజములమీద స్వామి తొడలున్నవి. స్వామి దేహము అవిశె పువ్వు రంగులో నున్నది. అట్టి వైభవమును మనఃపద్మమున మునులు నిలుపవలెను.

930. మృదువైన పీతాంబరము, వాని జఘన భాగము నలంకరించి యున్నది. దానిపై మువ్వల మొల నూలున్నది. అతడు నడచుచుండగా దాని నినాదములు వినిపించుచున్నవి యని భజింపవలెను.

931. అతని నాభి లోతైె చక్కని చిన్న దొరువువలె నున్నది. అందు మొలచుకొని వచ్చు నొక పద్మము విచ్చుకొనుచున్నది.

అందు బ్రహ్మ పుట్టుచున్నాడు. వానియందు లోకము లన్నియు పుట్టుచు పేర్పున నిలబడి యున్నవి అని దర్శింపవలెను.

932. విశాలమైన వక్షస్థల మొక చక్కని ఏకాంతసదనమై యున్నది. అందు నీలమణులతో, వజ్రములతో, రత్నములతో, ముత్తెములతో కూడిన హారములు తళుక్కుమనుచుండగా వానిని కదిలించుచు లక్ష్మీదేవి తన యెత్తైన కుచముల పైన నలంకరించు కొనుచున్నది.

933. ఆ కౌస్తుభమణి దివ్యకాంతులు కన్నులు మిరుమిట్లు గొలుపుచున్నవి. అవి అతని కంఠముపై పడుచున్నవి. ఆ శోభను దర్శించి సజ్జనులు కన్నులుపండువుగా చూచుచున్నారు. యోగీశ్వరులు నమస్కరించుచున్నారు. లక్ష్మి విహరించుచున్నది అని ధ్యానింపవలెను.

934. మందరగిరి నెవ్వరో యెత్తి తలక్రిందులుగా తిప్పిరి. ఆ లోపలి బంగారుశిలల నడుమ సానపట్టిన మణిముక్కలవలె రత్నము లచ్చటచ్చట మెరయుచున్నవి. వానితో సలంకరింపబడిన లోకపాలకులు అతనికి నలుదిక్కుల నిలిచి యున్నారు. వారే యతని చతుర్భుజములు.

935. ఒక బాహువు నందు సుదర్శనము తిరుగుచున్నది. గిట్టని వారు దానిని సహింపలేరు. గిట్టని వారి నది సహించదు. దాని పేరు సహస్రారమూర్తి. అనగా వేయి యంచులుగల రూపము. ఇంకొక కరమున రాజహంస కూర్చుండినట్లు శంఖమున్నది. దాని పేరు పాంచజన్యము. ఇంకొక కరమున స్వామికి ప్రియమైన కౌమోదకి యను గద యున్నది. కౌమోదకి యనగా భూమికి సంతోషము కలుగజేయునది. దానిపై నచ్చటచ్చట రాక్షస వీరుల నెత్తుటి బురద యంటి యున్నది. మెడలో వైజయంతి యను మాలికయున్నది. వైజయంతి యనగా విజయము చేకూర్చుచున్నది, విజయ చిహ్నము యని యర్థము. దాని నుండి వెలువడుచున్న చిక్కని సుగంధమున దిగబడి నడువలేక వాయువు మందగమనము చేయుచున్నాడు. తుమ్మెదలు మూగి ఝుంకార నాదము చేయుచున్నవి. వక్షమున నున్న కౌస్తుభమణి సజీవముగా కదలుచున్నది.

అదియే వాని హృదయము నుండి జీవుడుగా దిగివచ్చు తత్త్వము. కౌస్తుభ మనగా భూజనుల స్తోత్ర సముదాయ రూపమని యర్థము. ఇట్లొక్కొక్క యంశమునే ప్రత్యేకముగా రూపకల్పనము చేసికొనవలెను. అట్లే అతని ముఖకమలమును దర్శింపవలెను. అది యతని దివ్యమంగళ విగ్రహమున కనురూపమై యున్నది. మకర కుండలముల యందలి మణుల కాంతుల నద్దమువలె ప్రతిబింబించు బుగ్గ లున్నవి. అతని చూపులలో నుండి సిరి తొంగి చూచుచున్నది. కనుబొమ్మలు లతల వలె వంపులు తిరిగి యున్నవి. తుమ్మెదలు గుంపులు కట్టినట్లు ముంగురులు మెగురుచున్నవి. ఇట్లు ముఖపద్మమును కల్పించుకొనవలెను. హస్తములు శరణాగతుల కభయ మిచ్చుచున్నవి.

936. సంసార జీవులకు భయంకరములై బాధలు పెట్టు మూడు తాపములును శ్రీహరి కరుణామయ దృష్టులు ప్రసరించినంతనే మాయమగునని ధ్యానింపవలెను.

937. నారాయణుని ముఖము నందు చిరునవ్వు చిందుచుండుట భావింపవలెను. అది యతని ప్రసాద గుణమునకు చిహ్నమని ధ్యానింపవలెను. ఈ ధ్యానమున తన మనస్సు ప్రసన్నమగును.

938. సంసార బాధలలో కలుగు శోకమున, కన్నీరు గార్చుచున్న భూజనులు తనకు శిరస్సులు వంచి మ్రొక్కుచున్నారు. వారిని చూచి నారాయణుడు మిక్కిలి యుదారమైన పరిహాసము చేయుచున్నాడు. దానితో వారి యశ్రువులు మాయమగుచున్నవి అని ధ్యానింపవలెను. (దిగులు పడియున్న వానిని సున్నితమైన పరిహాసముతో నోదార్చుట నిపుణమైన పద్ధతి. "ఈ మాత్రపు సంసారపు బాధకే కన్నీరు కార్చవలెనా? అది యంతయు నీవు కల్పించు కొన్నదే గదా! అయినను అది యసత్యమని తెలియునట్లు నీ స్వప్నమునుండి నేను మేల్కొల్పుచున్నాను గదా!" మొదలగు భావములు పరిహాస శబ్దశక్తి మూలక వ్యంజనములు. ఐనను బాధలో నున్నవారిని పరిహసించినచో అవమాన దుఃఖముగూడ కలుగవచ్చును. పరిహాసము

చేయువాడు అల్పుడైనచో యట్లు జరుగును. అట్లుగాక యుదారుడైనచో, వాని ఔదార్యము పరిహాసముతో పాటు ప్రసరించి కన్నీటిని తొలగించునని, ఉదార శబ్దప్రయోగము వలన సిద్ధించు శబ్దశక్తి మూలక వ్యంజనము.

939. నారాయణుని కనుబొమలు కదలు చుండగా గమనించుచున్న మునులకును, మన్మథునకును గూడ మనస్సు పని చేయదు. మాయ క్రమ్మును. (సంసారజీవులకు క్రమ్ము మాయ మన్మథుని ద్వారముననే స్వామి ప్రసరింపజేయును. అనగా మనస్సునందలి కోరికల రూపముగా మాయక్రమ్మును. మునులకు కోరికలుండవు గనుక నారాయణుని కనుబొమల కదలికలనుండి మాయ ప్రసరించును. అనగా భగవదాజ్ఞల ననుసరించి జీవించు యత్నమున అప్పుడప్పుడు తమ కర్తవ్యము నెరుగుట కష్ట మగును. సంకల్పములు మనస్సునుండి వచ్చుచున్నవో, నారాయణుని నుండి వచ్చుచున్నవో తెలిసికొనుట కడు సూక్ష్మము. ఋషులు కూడ కర్తవ్యకర్మ యెడల మోహము చెందుచున్నారని గీతలో కృష్ణుడు చెప్పెను. మును లిట్లు మోహపడగా మన్మథుడు ఇంకొక విధముగా మోహపడుచున్నాడు. సంసారమును తరించి నారాయణుని సన్నిధి చేరిన ఈ మునుల యెడల తన కర్తవ్య మేమో తనకు బోధపడకుండును. దీని యర్థ మేమనగా మునుల యందు మనస్సునకు గల ప్రయోజన మెట్టిదో తెలియుట కష్టము) నారాయణుని మందహాసము మునుల మనస్సున కానందము కలిగించును. (కనుబొమ్మల కదలిక కర్తవ్యము తెలుపుటకును, మందహాసము తృప్తినిచ్చుటకును చిహ్నములు) మందహాసము చేయుచుండగా యెఱ్ఱని పెదవుల కాంతి మల్లెమొగ్గల వంటి పలు వరసపై ప్రకాశించుచున్నది. ఈ విధముగా నొక్కొక్క కళను వేరు వేరుగా మనస్సున కూర్చుకొని ధ్యానము చేయుచుండుమని దేవహూతితో కపిలుడు చెప్పి కొంత మౌనము ప్రసాదించి మరల నిట్లనెను :

940. ఈ విధమైన సాధన చేయుచుండగా సాధకుడు కొంత కాలమునకు భగవంతుని నుండి తిరిగి తనకు లభించిన భావసంపద గల వాడగును. (ధ్యానమునకు ముందు దేవునిపై తాను

కల్పించుకొన్న భావము లుండును. ధ్యాన సమయమున అవి దేవుని యందుండును. అభ్యాసము వంటబట్టిన వెనుక తన భావములు భగవంతుని నుండి తనకు ప్రసాదింపబడి మనస్సునకు తట్టుచుండును.

సాధనకు ముందు సంసారికి లోకములోని సౌందర్యాది సంపదలనుగూర్చిన తన యభిప్రాయము లుండును. సాధన పూర్ణ మైన వెనుక భగవంతుడు తన కిచ్చిన యభిప్రాయములతో లోక మును చూచును. ఈ స్థితి అఖండానుభవము కలిగించును.)

ఆనందానుభవమున దేహము పులకించుచుండును. ఆనంద బాష్పములు కలుగును. సంతోష సముద్రమున మునిగి తేలును. భగవంతుని స్వరూపుడుగా మారును. భగవంతుని గుణములు సంక్రమించును. ఇదియే మోక్షమువలన గలుగు ననుభవము. అట్టి సాధకుడు మనస్సును దేవుని జ్యోతియందు నిలిపి ధ్యాన నిమగ్నుడై యుండును.

941. మోక్షముకొరకు సాధనచేయు మహాత్ముని మనస్సున భగవంతుడు కాని భావమునకు తావు లేదు. మరియొక విషయ మన్నది యుండదు. వైరాగ్యము పరిపూర్ణ మగును. తన శరీర మును గూర్చిన భావములుగూడ దేవుని అంతర్యామిత్వముతో నిండును. అదియే అనన్యస్థితి. దీనిని నిర్వాణమనికూడ నందురు. చిన్న వెలుగు పెద్ద వెలుగును కలిసినపుడు దానితో సమానమైన వెలుగగును. అట్లే దేహము మొదలగు భావములను దేవునియం దంగీకరించును.

(ఇన్ని స్థితుల నారోహించుట యోగికి మోక్షము కోరి సాధనము చేయునపుడే యుండును. మోక్షము కోరక భగవంతుని యందు భక్తితో యోగసాధన చేయువానికి సోపానారోహణక్రమ ముండదు. అన్ని సోపానములు నొక్కటిగా సత్యమగును.)

942. ఇట్లు అన్యవిషయములు స్థితి తొలగినట్లు చిట్టచివరి సాధన చేయగా, పురుషు డాత్మజ్ఞానమునందు స్థిరపడును. చిత్త వృత్తు లుండవు. (పంచేంద్రియములు, మనస్సు పనిచేయును గాని పరిసరముల ననుసరించి పనిచేయవు.) మనస్సునకు సుఖ

దుఃఖము లుండవు. సుఖము, దుఃఖము అనబడు నభిప్రాయములు మాత్రము అహంకార ధర్మములని తెలియబడుచు వేగిన విత్తన ములవలె మొలవక యుండును. (కుర్చీలో కూర్చుండి కోపించుచు చనిపోయినవాని శవము కూర్చుని కోపించుచున్నట్లే యుండును. అందు కోపమున కవకాశము లేదు. అట్లే యోగియందు సుఖ దుఃఖములును.) అతనికి సాక్షాత్కరించునది యంతయు ఆత్మ తత్త్వమే. అట్టి వానిని జీవన్ముక్తు డందురు. అతడెట్లుండునో చెప్పెదను వినుము. తన శరీరము నిలుచుండును, కూర్చుండును, నడచుచుండును. తాను నిలుచుండడు, కూర్చుండడు, నడువడు. శరీర ధర్మము లన్నియు తనయందు జరిగిపోవుచునే యుండును. తనకు తెలియదు. (కారు నడుపుచు తనప్రక్కనున్న స్నేహితునితో భాగవతమునుగూర్చి యొకడు చర్చించుచుండును. అతడు చర్చించు చున్నాడు గాని కారు నడుపుట లేదు. ఐనను వాని మనస్సు, నింద్రియములు కారు భద్రముగా నడపుకొని మలపు లన్నియు తిరిగి యింటికి చేరుకొందురు.)

943. మద్యము త్రాగి ఒడలు తెలియని వానికి దేహముపై వస్త్ర మున్నదో లేదో తెలియదు. అట్లే తన శరీరము దైవాధీన మని, నశించునట్టిది యని తలచి ఆత్మ నిష్ఠుడై దానిని లక్ష్య పెట్టడు. (ఈ వాక్యములు, వీనికి మూలమైన సంస్కృత భాగవత శ్లోకముపై జెప్పిన మిగిలిన శాస్త్రముతో పొత్తు లేకున్నవి. కనుక ప్రక్షిప్తములని తెలియవలెను. దైవమునందు నిష్ఠ కుదిరినవాడు దేహమునకు ప్రత్యేకమైన అస్తిత్వ మంగీకరింపడు కనుక నిర్లక్ష్యము చేయవలసిన పనికూడ లేదు. "ప్రకృతిచే చేయబడుచున్న పనులను ఉదాసీనునివలె చూచుచుండి అపేక్షించుట గాని, ద్వేషించుటగాని అతడు చేయకుండును." అని భగవద్గీత చెప్పుచున్నది.

సమాధి యనబడు స్థితి వలన ఆత్మతత్త్వము సాక్షాత్కరించును. అప్పుడు ఆత్మ స్వరూపుడై విహరించు చుండును. పూర్వ మాచరించిన కర్మల వాసనలు తన నంటవు. వాని ఫలితములు కూడ తనపై పనిచేయవు కాని స్వప్న మందలి శరీరము నందు వలె పూర్వ కర్మల ఫలములు అనుభవమునకు వచ్చి వ్యయమై

పోవుచుండును. అంతవరకు భార్యా పుత్రులు మున్నగు వానితో గూడిన ప్రపంచము ననుభవించి అటుపైన సంబంధములు తొలగి ప్రవర్తించును. ( ఈ యంశముకూడ సందర్భశుద్ధి లేకుండుటవలన ప్రక్షిప్తమని తెలియుచున్నది. స్వప్నమునుండి మెలుకువ వచ్చుట వంటిదే మోక్షమని పూర్వము ప్రతిపాదింపబడినది. ఇచ్చట సమాధిస్థితి పొందినవాడు ఆత్మతత్త్వమును సాక్షాత్కరించు కొనుననియు, అంతకు ముందు చేసిన కర్మల ఫలితములను స్వప్నమునందువలె భార్యా పుత్రాది సంబంధముల రూపమున అనుభవించుననియు చెప్పబడినది. ఈ రెండును పరస్పర విరుద్ధములు. ఈ వచనములనుబట్టి మోక్షము చెందినవాని స్థితి వేరు, ఆత్మ సాక్షాత్కారము చెందినవాని స్థితి వేరని ప్రతిపాదింప బడుచున్నది. అది సరిగాదు. వెలుగుతో కలసిన చిన్న వెలుగు తానుగూడ పెద్ద వెలుగై వెలుగునని చెప్పబడినమాట సత్యము. పరబ్రహ్మమైన యాత్మను తెలిసినవాడు పరబ్రహ్మమే యగు చున్నాడు. కనుక ప్రతిపాదింపబడిన విషయమునననుసరించి యిది ప్రక్షిప్తమని తెలియుచున్నది. పోనీ గ్రంథకర్తయైన వ్యాసుని యభిప్రాయమునందో, ప్రవక్తయైన కపిలాచార్యుని యభి ప్రాయమునందో, ఈ విప్రతిపత్తి యుండవచ్చును గదా! అను కొన్నచో మిగిలిన గ్రంథము నందెచ్చటను పరస్పరవిరోధము లేని క్రాంతదర్శనము స్పష్టమగుచున్నపుడు విప్రతిపత్తికి సంభావ్యత లేదు. )

944. బిడ్డలు, భార్య, మిత్రులు, సోదరులు మున్నగువారి కన్న మానవుడు తానువేరుగా వ్యవహరించుచున్నాడు. నిప్పు రవ్వలు, మండుచున్న కొరవి, పొగ యను వానికన్న నగ్ని వేరని తెలియుచున్నది. అట్లే దేహమునందలి భాగములన్నిటి కన్న జీవుడు వేరుగా వర్తించుచుండును. పంచభూతములు, నింద్రియ ములు, అంతఃకరణముల రూపమున మెలగుచున్న ఈ ప్రకృతి రూపము గూడ పరబ్రహ్మములోని భాగమే. అయినను దాని కన్నవేరై యాత్మ ప్రకాశించుచున్నది. అది బ్రహ్మము అను పేరుతో ద్రష్టగా మెలగుచున్నది. దానియందే ఈ సకల సృష్టియు కలదు. ఈ సకల సృష్టి యందు బ్రహ్మమే కలదు.

( ప్రకృతియందు, జీవులయందు, పరబ్రహ్మమునందు అంతర్యామిగా నున్నది పరబ్రహ్మమేయైనను మూడుగా వెలగుచున్నది. అందు రెండవవాడగు జీవుడు ప్రకృతితో కూడియున్నప్పుడు బద్ధుడనియు, పరబ్రహ్మముతో కూడియున్నప్పుడు పరబ్రహ్మమనియు తెలియవలెను. నీటిపై మంచుగడ్డ తేలుచున్నప్పుడు రెండుగానున్నను నొకే ద్రవ్యముయొక్క రెండు స్థితులను తెలియుచున్నది గదా! అట్లే ప్రకృతి, జీవుడు, పరబ్రహ్మము అని మూడుగా వర్తించుచున్నది అంతర్యామియగు పరబ్రహ్మమే. )

945, 946. ఈ మూడును వేరుగాదనియు, ఆత్మతత్త్వము కన్న అన్యము మరిలేదనియు తెలిసి జీవుల యందు ఆత్మను చూడవలెను. ఆధారములుగా నేర్పడిన దేహములందు వెలుగుచున్న దివ్యజ్యోతి యొకడేయయ్యును అనేక భావములతో తోచును. ఇట్లు ప్రకృతిగతుడైన ఆత్మయే దేవతలుగా, నరులుగా, జంతువులుగా, స్థావరాదులుగా నగుచు వివిధములైన యుత్పత్తి కారణములను కల్పించుకొని గుణముల హెచ్చు తగ్గులచే భిన్నరూపుడుగా వెలగుచున్నాడు.

947. ప్రకృతి సత్, అసత్ అను రెండు విధములైన ఆత్మతత్త్వము గలది. జగత్తుగా దాని కస్తిత్వము లేకుండుట వలన అసద్రూపము, బ్రహ్మముగా తన కస్తిత్వముండుట వలన సద్రూపము. అంతరాత్మ ఎప్పుడును సద్రూపమే గనుక సాధకుడు అసద్రూపమైన సంసారమును అస్తిత్వము లేని దానినిగా తెలిసికొని శుభమును పొందును.

( కుండ, మట్టి యను రెండు విభాగములు కుండ కున్నవి. అందు కుండయను పేరు, ఆకారము మనము కల్పించుకొనినవి గాని మట్టికి లేవు. కనుక కుండగా కుండ అసత్యము. అది మట్టిగా సత్యము. ఇట్లు తెలుసుకొని కుండను వాడుకొనుచున్నాము. కనుక కుండ పగిలినచో పనులాగుట లేదు. మట్టి యున్నంతవరకు మరియొక కుండకు లభ్యత యున్నదని మనకు తెలియును. అట్లుగాక మనము కుండకే అస్తిత్వ మంగీకరించి యున్నచో మనము వాడుకొనుచున్న కుండ పగిలిన వెనుక మరి

గతి యుండెడిదిగాదు. లోక వ్యవహారమున విని యోగించుటకు సత్యముగాని కుండను మన మంగీకరించినట్లే ముక్తుడు కూడ దేహాదులను అంగీకరించును.)

948. ఈ విధముగా 'యోగసిద్ధుడైనవాడు ఆత్మయొక్క నిజస్వరూపముగా వర్తించును', అని కపిలుడు తెలుపగా దేవహూతి యిట్లనెను: మహాత్మా! ఇప్పుడు నీవు మహత్తత్త్వమును మొదలుకొని, పంచభూతముల వరకును గల తత్త్వములకును ప్రకృతికిని, పురుషునకును గల పరస్పర లక్షణములను, వాని స్వరూపములను తెలియపరచితివి. దీనిని తెలియుటలో నొక క్రమ మున్నదని నిరూపించితివి. ఈ క్రమమే సాంఖ్యమని కూడ చెప్పితివి. సాంఖ్యముయొక్క గొప్పతనమును, భక్తితో నభ్యసింప వలసిన యోగముయొక్క గొప్పతనమును వివరించితివి. భక్తి యోగము వలన పురుషుడు వైరాగ్య స్థితి పొందగలడు.

ఒక్కొక్క జీవికి సంసారబంధ మొక్కొక్క విధమున నుండును. ఇందరిలోను నీవు కాలస్వరూపివై ఈశ్వరుడవై యున్నావు. ఇట్టి నీవలన భయభక్తులు కలిగి జనులు పుణ్యకర్మ లాచరించుచున్నారు. లేకున్నను ఉన్నట్లు ప్రకాశించుచున్న దేహము సత్యమని నమ్మి అభిమానించు మూఢు లున్నారు. వారి బుద్ధి వివిధ కర్మలయందు ఆసక్తి గలిగి విభ్రాంతి జెందుచుండును. వారు సంసార మనబడు చీకటియందు చిరకాలము నిద్రించు చున్నారు. వారిని మేల్కొలుపుటకు నీవు యోగవిద్య భాస్కరుడవై ఆవిర్భవించితివి. నీ యందు భక్తిపుట్టుట సర్వశ్రేయస్సులకు మొదటి మెట్టు. కనుక భక్తియోగము యొక్క నిజస్వరూపమును వివరింపుము. అని ప్రశ్నించిన దేవహూతితో కపిలు డిట్లనెను.

949. తల్లీ! ఫలితమును సంకల్పించుకొనుటను బట్టి తామస భక్తి, రాజసభక్తి, సాత్త్వికభక్తి యని మూడు విధము లుగా నుండును. అందు తామసభక్తి యెట్లుండుననగా—

950, 951. నన్నర్చించుటకు తామసుడు హింసలుచేయును. దంభము, మాత్సర్యము, రోషము కలిగి యుండును, భేదములను

బలముగా చూడగలడు. దేవుని తృప్తిపరచుటకై జంతువులను నరులను బలియిచ్చుట, ఇతరులను శ్రమపెట్టి, అధికారము చూపి, భయపెట్టి, ధనవస్తు సంపదలను తెమ్మని, పూజలు, నుత్సవములు చేయుటయందు పట్టుదల కలిగి యుటందు హింస. దంభమనగా తాను పూజా జపాది మహోత్సవములు చేయుచున్నట్లు పదిమందికి తెలియవలెనని తహతహపడుట. తగినంతగా తన భక్తి నితరులు అర్థముచేసి కొనుట లేదని బాధపడుట మున్నగు ప్రవర్తనములు. మాత్సర్యమనగా నొక గ్రామమున నొక మతమువాడు ఉత్సవములు చేయుచుండగా పోటీగా మరియొక మతమువాడు ప్రారంభించుట మున్నగునవి. ఇంకొకడుకూడ భక్తుడని విన్న చో కోపించుట రోషము. భేద దర్శన మనగా వైష్ణవులు, శైవులు, క్రైస్తవులు, మహమ్మదీయులు, ప్రాత దేవుని భక్తులుగా వేరుపడి మిగిలిన మార్గములకన్న తమ మార్గము గొప్పదియని భావించుట. అట్లే ఆస్తికులు, నాస్తికులు తమ తమ మార్గములు సత్యములని స్థాపింప జూచుట. ఇట్లే అద్వైతులు, విశిష్టాద్వైతులు, ద్వైతులు తమ తమ మార్గములను సమర్థించుకొనుట. బ్రాహ్మణ హిందువులు, బ్రాహ్మణేతర హిందువులు, కమ్మ క్రైస్తవులు, రెడ్డి క్రైస్తవులు, మాల మాదిగ క్రైస్తవులు ఒకరి నొకరు వేరుగా చూచుకొనుచు, దేవుని పేరు కీర్తించుట మొదలగునవి. దేవుని తలచుటలో సుగుణ పరబ్రహ్మముకన్న, నిర్గుణ పరబ్రహ్మము ఎక్కువ యధికారముగల దేవుడని పక్షము వహించుట మొదలగునవి.)

952. ఇంద్రియార్థములయందు ప్రావీణ్యము సంపాదించుటకు, ఐశ్వర్యములకు, కీర్తికి నన్ను పూజార్హునిగాచేసి, అర్చించుట రాజస భక్తి.

(విషయ ప్రావీణ్యము అనగా ఇంద్రియములకు సంబంధించిన సామర్థ్యము ఆశ్చర్యకరముగా పెరుగుటకై చేయు నుపవాసనాదులు. ముసలితనము రాకుండుటకు బాలకృష్ణు నర్చించుట, స్త్రీల నాకర్షించుటకు యక్షిణీ పూజలు, జనవశీకరణమునకు తిలకము, సుగంధద్రవ్యములు అభిమంత్రించి ధరించుట, బహు స్త్రీసౌఖ్యము కొరకును, అహోరాత్రములు సుఖించు సామర్థ్యము కొరకును మన్మధ తంత్రములు, పూజలు చేయుట, మూలికలు,

తాయెత్తులు మొదలగువానితో తంటాలుపడుట, మున్నగు మార్గములు. రాత్రియందు చీకటిలో పుస్తకము చదివి చూపించి పేరు పొందుటకై గ్రుడ్లగూబను చంపి దాని కన్నులతో అంజనము చేసి రాత్రీదేవి నర్చించి ధరించుట మొదలగునవి.

ఐశ్వర్యములు అనగా అణిమ మొదలగు సిద్ధులకై సాధన చేయుట. ఆదాయము పెరుగుటకు లక్ష్మీ పూజ చేయుట, డబ్బు తరగకుండుటకు ఖజానా పెట్టెలో నొక పురుగును తెచ్చి దాచుట మున్నగునవి. కీర్తికోరకనగా తాను మహిమాన్వితుడని తెలియుటకు వ్రతములు, పూజలు, మంత్రోపాసనాదులు చేయుట, అధికారులను, ధనవంతులను, మధ్యపెట్టి ప్రాధాన్యము వహించుటకు కర్మకాండ లాచరించుట.)

953. తన పాపకర్మలు నశించుటకై భగవంతుని భక్తితో పూజించుట, యోగ్యతను వృద్ధిచేసికొనుట, ప్రజాహితములైన సత్కార్యములను భగవదర్పణముగా భావించిచేయుట సాత్త్విక భక్తి యనబడును.

954. తల్లీ! సాత్త్విక స్వభావముగల వారికి నా గుణ శ్రవణము వలననే నాపై భక్తి యారంభించును. వారు నన్నర్చించిన విధానముననే వారి మనస్సులు ఉత్తమాశమము లను పొందును. నాయందు వా రారోపించిన సద్గుణములన్నియు వారియందు ఫలించును. వారి మనస్సంకల్పము లన్నియు నదులవలె ప్రవహించి సముద్రమున కలిసినట్లు నాయందు సమర్పితము లగును.

955. తొలగించుకొనవలసిన గుణములు నాయందుండవు. కనుక నన్ను భక్తితో నర్చించినవారు దుర్గుణములను బాసి, సమస్త సద్గుణ సంపన్ను లగుదురు. వారు కారణము లేకయే నాయందు భక్తి గలిగి జీవితమును మహావ్రతముగా సమర్పింతురు.

956. నిష్కాములయిన నా భక్తులకు భక్తియోగము వలన సమకూరని ప్రయోజనము లేదు. వారికి సాలోక్యము, సార్షిత్వము, సామీప్యము, సారూప్యము, సాయుజ్యము అను

స్థితులను కలిగింతును. (సాలోక్యమనగా దేవుని దృష్టిలో పడుట, సార్ష్టిత్వమనగా సకల సంపదలు, ఐశ్వర్యములు సమకూరుట. సామీప్యమనగా దేవునికి సమీపమున నుండ గల్గుట. సారూప్యమనగా దేవుని రూపముతో సమానమైన రూపము సంక్రమించుట. సాయుజ్యమనగా దేవునితో నొకటిగా నుండుట. కొందరు సాలోక్య మనగా దేవుని చూచుచుండుట యని చెప్పుదురు. ఇవికాక ఈ పదములకు చక్కని సంకేతార్థము లున్నవి. 1. దేవుని చూపుతో సమానమైన చూపుగలిగి లోకమును చూచుట సాలోక్యము. 2. లోకములోని సకల సంపదలును భగవంతునివి గనుక తన లోకహితకార్యములందు సద్వినియోగము చేయగలుగు సామర్థ్యము సంక్రమించుట సార్ష్టిత్వము 3. ప్రకృతి పురుషుల మొత్తమునం దంతర్యామియే యున్నాడని తెలిసి తన దేహాదుల యందును, పరివారము నందును దేవుడే భాసించుట సామీప్యము. 4. ధ్యానమున తన రూపము దేవుని రూపముగా నర్పిత మగుట, ఆ రూపమున దేవుడే చరించు చుండెనని తెలియుట సారూప్యము. 5. నీటితో నిండిన చెంబును నీటిలో నిండిన బిందెలో ముంచి విడిచినచో బిందెలో నీటికిని, చెంబులో నీటికిని, భేదము తొలగి పోవును. ఆ విధముగా తాను దేవునియందు జీవించుట సాయుజ్యము.)

మహాత్ము లీ విధమైన భక్తియోగము నాశ్రయింతురు కనుక తమ కోరికలు తీర్చుకొనుటకు పనులు చేయరు. నా సేవ కాని యితర పనులను మానుదురు. (సత్కర్మలను నా కర్పణముగా లోకహితార్థమై చేయుదురు. మిగిలిన పనులను మానుదురు.) భక్తియోగ మార్గములలో ఈ సాధనను మించినది లేదు. ఈ సాధన వలన రజస్తమస్సులే కాక, సత్త్వగుణము కూడ తొలగును. (జీవుని దైవమున కున్ముఖుని చేయు లక్షణము లలవరచు వరకే సత్త్వగుణ ప్రయోజనము. సంకల్పమందు తీవ్రత కలిగించుట వరకే రజోగుణ ప్రయోజనము. దేహాదులైన యుపాధులను, అన్నపానీయాదులను, రుచులను ధర్మసాధనములైన అభ్యాసములుగా మలచుట వరకే తమోగుణ ప్రయోజనము. సర్వసమర్పణ బుద్ధి నిండారిన వెనుక త్రిగుణముల ప్రయోజనములు

తొలగును గనుక త్రిగుణములు తొలగును) త్రిగుణములు తొలగిన జనుడు నాతో సమానమైన యాకారమును పొందును.

957. భక్తియోగము సక్రమము కావలెనన్నచో ఈ దిగువ మార్గ మవలంబింపవలెను.

1) నిత్యము, నైమిత్తికము అనబడు స్వధర్మమున మిక్కిలి శ్రద్ధ పెంపొందవలెను. (నిత్యకర్మలనగా స్నాన సంధ్యా పూజార్చనాదులు, యజ్ఞదానతపస్సులు. నైమిత్తిక కర్మలనగా ఆయా ప్రత్యేక సందర్భముల యందు చేయవలసిన కర్మలు. స్వధర్మమనగా తా నాచరింపవలసిన పని. ఇది యెట్లు తెలియును? భగవదర్పితము చేసినచో నెప్పటికప్పుడు భగవంతు డాదేశించుచుండును. ఉదాహరణమునకు వెంకయ్యకు ముగ్గురు తమ్ములు. తండ్రికి చాల యాస్తి కలదు. నలుగురు కొడుకులను సమర్థులను చేసి, వారు పెద్దవారైన వెనుక తండ్రి చనిపోయెను. సుబ్బయ్యకు గూడ ముగ్గురు తమ్ములు. తండ్రి ఋణములు చేసి బిడ్డల చిన్న తనముననే చనిపోయెను. వెంకయ్యను చూచి సుబ్బయ్య తమ్ములతో సమానముగా ఆస్తి పంచుకొనరాదు. వెంకయ్య తమ్ములకు తండ్రియే వివాహములు చేసి, ఖర్చులు భరించుకొనెను గనుక సుబ్బయ్య తన ఖర్చుతో తమ్ములకు వివాహము చేయననరాదు. ఋణములు తీర్పనన రాదు. ఈ విధముగా నెప్పటికప్పుడు పరిస్థితుల రూపమున భగవంతుడు స్వధర్మము నుపదేశించును. దానిని భగవదర్పణ బుద్ధితో నాచరించినవాడు వృద్ధిలోనికి వచ్చును. పరిస్థితులను సంతోషముతో యుక్తిగా తట్టుకొనుట నభ్యసించుట వలన శమదమాది సద్గుణ సంపన్నుడగును. కామక్రోధాదులు అప్రయత్నముగా దమింపబడును. మరియొక ఉదాహరణము. బడిపంతు లొకనికి కోమటిశెట్టి యొకడు ప్రాణమిత్రుడు. శెట్టికి వాణిజ్యమున నెలకు పదివేల రూపాయల లాభము వచ్చును. బడిపంతులు జీతము నెలకు ఐదువందల రూపాయలు. శెట్టి ఆదాయ మెక్కువ గదా యని పంతులు తన వృత్తి ఎగగొట్టి వాణిజ్యము నారంభించుటకు యత్నింపరాదు. ఉభయభ్రష్టత్వము సిద్ధించును. ఈ విధముగా నొక్కొక్కని స్వభావ సామర్థ్యముల

రూపమున, పరిసరముల, దేశకాల పరిస్థితుల రూపమున భగవంతుడు స్వధర్మము నుపదేశించుచుండును.

(2) పాంచరాత్ర సంహితలో చెప్పబడిన ప్రకారము విష్ణుదేవు నర్చించవలెను. (శివు నర్చింపరాదా? అర్చింప వచ్చును. భాగవత గ్రంథము విష్ణు శబ్దము నాధారముగా గొని భక్తి నుపదేశించుచున్నది. గనుక నిట్లు చెప్పబడినది. ఈ వ్యాసుడే రచించిన శివపురాణమున శివు నర్చింపుమని యుపదేశించెను. పాంచరాత్ర సంహిత యనగా విష్ణువు నర్చించు విధానము తెలుపు నొక గ్రంథము. ఇది స్థూలార్థము. నారాయణుడు బ్రహ్మకు సృష్టి రహస్యమును ఐదు రాత్రులుగా నుపదేశించెను. అవియే పంచ భూతములు, తన్మాత్రలు, పంచ జ్ఞానేంద్రియములు, పంచకర్మేంద్రియములు అనబడు ప్రణాళికలు. వాని ననుసరించి బ్రహ్మ యెట్లు సృష్టించెనో, సృష్టించి అందును నారాయణునే యెట్లు చూచెనో, ఆ విధానమున భక్తియోగము చేయుట పాంచరాత్ర విధానము.)

(3) నా విగ్రహములను దర్శించినప్పుడు స్తోత్రము, పూజ, వందనము, ధ్యానము చేయవలెను. ఎవరైన చేయుచున్నచో వినవలెను. (విగ్రహము లనగా గుడిలోని విగ్రహములని సామాన్యార్థము. జీవుల దేహములు విగ్రహములని పరమార్థము. ఇతరుల సద్గుణములను ప్రశంసింపవలెను. పూజ్యభావ మూహింప వలెను. వారికి చేయవలసిన పనులను దేవతార్చనముగా చేయవలెను. ఇతరులు మరియొకని సద్గుణములు ప్రశంసించు చున్నప్పుడు సంతోషముతో విని యానందించుట కభ్యంతరము లుండరాదు.)

(4) చేయుచున్న పనుల ఫలితములపైకి మనస్సు పోరాదు.

(5) సజ్జనుల సమూహముల యందు ఆదరము కలిగి వారి నభిమానింపవలెను.

(6) దుర్బుద్ధిగల నీచులను జూచి, జాలి పడవలెనుగాని, ద్వేషింపరాదు. (వారు ఇతరుల దుర్గుణములు ప్రశంసించుచుండగా చిరునవ్వుతో మౌనము వహించి, యుక్తిగా తొలగిపోవలెను.)

(7) తనతో సమానమైన హోదాగల వారితోనే సన్నిహిత మిత్రత్వము పొందవలెను. (మన కన్న నెక్కువ ధనము, అధికారము కలవారితో మైత్రి చేసినచో నెందుకైన పనికి వత్తురని తలపరాదు. వారికి గూడ తాను మిత్రుడు కావచ్చును గాని, వారిని మిత్రులుగా తాను స్వీకరింపరాదని శుక్రాచార్యుని నీతిమార్గము)

(8) యమము నియమము మొదలగు క్రియలతో యోగాభ్యాసము చేయవలెను.

(9) ఆధ్యాత్మము, ఆధిభౌతికము, అధిదైవము, అధియజ్ఞము అనబడు శాస్త్రమార్గములలో సృష్టిరహస్యములను గ్రహింపవలెను.

(10) తనకు తెలిసిన ఈ సమస్తమును శ్రద్ధగల వారికి వివరింపవలెను. (ఇది ఋషి ఋణము తీర్చుకొనుటయగును.)

958, 959. తాను హరిభక్తి కలిగియుండుటయే గాక హరిభక్తులను అనురాగముతో, అహంకారము విడిచి ఆరాధింపవలెను. (ఆరాధించుట యనగా ఆపదలలో తోడ్పడుట, పనులలో సహకరించుట మొదలగునవి. దైవభక్తులను దైవభక్తులు గౌరవింపనిచో సత్సాంగత్యము లేదు. నీచుల సంఘమునకు లోకువ యగుదురు. కనుక దైవ భక్తులను గౌరవించుట యజ్ఞార్థము.)

960. ఈ చెప్పబడినవి భగవంతుని యాదేశములుగా స్వీకరించి స్వధర్మానుష్ఠానమున జోడించుకొన్నచో పరిశుద్ధికలిగి, మనస్సు నిర్మలమై పుణ్యాత్ముడగును.

961. ఇతరములైన యాధారములను నమ్ముకొనక ఈ మార్గమున నన్నే ఆశ్రయించినచో, నా యందు సకల కళ్యాణ గుణములున్నవి గనుక, గాలికి పువ్వుల వాసన ముక్కు దగ్గరకు ప్రసరించినట్లు, భక్తి మహిమచే నా కళ్యాణ గుణములు భక్తులకు సంక్రమించును.

962. ఎన్ని యర్చనలు చేసినను నేను సర్వ జీవుల హృదయములలో నీశ్వరుడనై యున్నానని మరువరాదు. నా రూపు

లైన జీవులకు సేవ చేయుట మాని నా విగ్రహములను మాత్ర మర్చించుచు, భక్తుడనని మోసముచేయుటకు యత్నించెనేని అట్టివాడు మూఢుడై నిష్ఫల జీవితము కలవాడగును. వాని భక్తి బూడిదతో నిండిన దాలెగుంటలో హోమము చేయుట వంటిది. (సమిధలతో రగుల్కొల్పబడిన మంటపై హోమముచేయవలెను గాని, బూడిదపై హవిస్సును పారబోసినచో నేమగును ? ఇట్టి పూజ చేయుట నన్నవమానించుటయే యగును. ( ఇతరుల పై జయము సాధించుటకును, పోటీలలో నెగ్గి పదవు లలంకరించుటకును, తిరుపతి పోయి వేంకటేశ్వర స్వామి కళ్యాణ మహోత్సవము చేయించు వారు కలరు. బాధలలో నున్న ప్రజలరూపమున కనుపించు నారాయణు నర్చింపక ఇట్లు చేయువారు నిష్ఫలారంభులు. వారి యజ్ఞమునకు, అర్చనమునకు ఫలమెట్లుండునో తెలియుటకు సంకేతముగనే కళ్యాణ కట్ట స్థాపింపబడినది. )

963. సర్వజీవులలో అంతరాత్మగా నున్న నాకును, నా యందున్న జీవులకును భేదము పాటించు వారు దొంగలు. వారికి మిగిలిన వారితో నిజమైన పొత్తు కుదరదు. మమకారములు, విరోధములు కలగలుపుగా వారి మనస్సులలో నిండి యుండును. ఇక వారికి శాంతి ననుభవించుటకు తా వెక్కడిది ? అట్టి వక్రబుద్ధులు గూడ మానక నా పూజలు చేయుచునే యుందురు. సామాన్యమైన పనులు సాధించు కొనవలసి వచ్చినపుడు సామాన్యమైన పూజలు చేయుదురు. పెద్ద పనులకు నాతో నవసరము పట్టినపుడు అపారమైన ధనమును ఖర్చుపెట్టి నా పాదములను పూజింతురు. వారెన్ని పూజలు చేసినను నా మనస్సు కరుగదు. అని ఈ విధముగా కరుణామయ మూర్తియైన కపిలుడు సద్గుణమూర్తియై, అట్టి సద్గుణములే కలిగియున్న తన తల్లికి వివరించెను. (ఎంత డబ్బు ఖర్చుపెట్టిన అంత పెద్ద పూజాఫలము దక్కునని నమ్మువారు కలరు. ఎక్కువ సేపు పూజించినచో నెక్కువ ఫలమని కొందరు, దేవుని యెదుట క్రిందపడిలేచి, లెంపలు వాయించుకొన్నచో తమ తప్పులను దేవుడు క్షమించునని కొందరి నమ్మకము. జీవులలో దేవుని చూడని వారికి యెన్ని పూజలైనను మోసములే యగును గాని భక్తి యనిపించుకొనవు.

ఎదుటివానిలో దేవు డున్నాడని తెలియని వానికి నిజమైన మైత్రీభావ ముండదు. ప్రయోజనమును బట్టి, భయలోభములను బట్టి, అట్టివారు పరస్పరము శత్రు మిత్రత్వములను మార్చుకొను చుందురు. వారు సన్నిహిత మిత్రులని గుంపుగూడియు, ఇద్ద రిద్దరు మరల పరోక్షమున మిగిలిన వారిని గూర్చి పన్నాగములు పన్నుకొనుచుందురు. వారిలో నొక్కొక్కడే యున్నపుడు గూడ మిగిలిన వారి ప్రయోజనములతో మనస్సున చతురంగమాడు చుండును. వీరికి నిజమైన మిత్రులుండరు గనుక నిజమైన శాంతి యుండదు.)

964. కపిలుడు కొంచెమాగి మరల నిట్లు బోధించెను: (నిర్జీవ విగ్రహములకన్న జీవులు భక్తి సాధనకు నెట్లు శ్రేష్ఠులో చెప్పుచున్నాడు.) తల్లీ! రాళ్లు, ఖనిజములు, లోహములు మొదలగు నచేతనముల కన్న చేతనము గలుగు వృక్షములు శ్రేష్ఠములు. వానికి స్పర్శజ్ఞాన మున్నది. అచేతనములకు లేదు. (వృక్షమునకు నీళ్ళు పోసినచో ఫల పుష్పము లిచ్చును. అచేతనములకు పోసినచో నేమి యిచ్చును?) ఒక్క స్పర్శజ్ఞానమే గల వృక్షముల కన్న రుచి కూడ తెలిసిన జంతువులు శ్రేష్ఠములు. (వృక్షమునకు నీరు పోసినచో పువ్వులు పండ్లు వచ్చునుగాని, నీళ్ళెవరు పోసిరియను నాదరము తెలియదు. జంతువులకు ఆహార పానీయము లిచ్చినచో రుచి తెలియునుగాన సంతోషించును. ఇచ్చిన వారితో మైత్రి వహింపగలవు.) రుచి మాత్రము తెలిసిన క్షుద్రక్రిమికీటకాది జంతువులకన్న వాసన గూడ చూడ గలిగిన జంతువులు శ్రేష్ఠములు. (పందికొక్కునకు అహారము పెట్టుట కన్న ఆవులకు, నెడ్లకు పెట్టుట శ్రేష్ఠము.) వాని కన్న శబ్దము గూడ గ్రహింపగల కుక్కలు మున్నగు జంతువుల కెక్కువ చైతన్యమున్నది. (శబ్దమును విని, చోరాదులనుండి రక్షణము చేయును.) వానికన్న రూపము తెలిసిన కాకులు మొదలగు వాని కెక్కువ చైతన్య ముండును. రెండు పాదములుగల కాకులు కన్న నాలుగు పాదములు గల జంతువులకు ఈ రెండు విధములైన చైతన్యముండును.

965. ఈ విధముగా నాలుగు కాళ్ళ జంతువు లెక్కువ చైతన్యవంతములు. వాని కన్న రెండు కాళ్ళున్నను మానవులు శబ్ద స్పర్శ రూప రస గంధముల గ్రహణమున పరిపూర్ణులు గనుక వారు శ్రేష్ఠులు (నర దేహముల రూపములలో దేవు నర్చించుట శ్రేష్ఠమని భావము.) అందు నాలుగు వర్ణముల వారున్నారు.

966, 967. వారిలో బ్రాహ్మణు లుత్తములు. వారి కన్న వేదము చదివిన వా రుత్తములు. వేదము చదివిన వారి కన్న దాని యర్థము తెలిసిన వా రుత్తములు. వారికన్న వేదమందలి సందేహములను తీర్చునట్టి శాస్త్రములు తెలిసినవారు శ్రేష్ఠులు. వారినే మీమాంసకు లందురు. వారి కన్న స్వధర్మ మాచరించుట తెలిసిన వా రుత్తములు. వారి కన్న కర్మలంటని వా రుత్తములు. వారి కన్న చక్కని ధర్మకార్యములు చేయువా రుత్తములు. వారి కన్న, అందరికన్న, ఎవరి కన్న నుత్తమోత్తములే నాపాదము లర్చించువారు. తా మెరిగిన సకల ధర్మములను, మంచి చేష్టలను నాయందు సమర్పించిన వారు నా భక్తులు. వారు పై జెప్పిన జీవరాసు లందరి యెడలను సమబుద్ధితో వర్తింతురు.

968, 969. అట్టి మద్భక్తుని జూచి, ఏ జీవులైనను అనందమున మునిగి తేలుదురు. వారిని గౌరవించి, స్తుతించి సర్వము సమకూర్చి పెట్టుచుందురు.

970. జీవుని స్వరూపమునందు ఈశ్వరుడే ప్రవేశము నొంది ఆవరించి యుండును కనుక తనలోగాని, మరియొక జీవిలో గాని ఈశ్వరుని దర్శించుటకు చేయు ప్రయత్నము నిశ్చయముగా నాత్మజ్ఞానమునకు దారితీయును. (నాటకమున రాక్షసుని వేషము ధరించి ఆహార్యము పూర్తిగా చేసికొని అద్దములో చూచుకొన్న చో సంపూర్ణమైన రాక్షసస్వరూపము కనిపించును. దానిని చూచి హఠాత్తుగా నులిక్కిపడవచ్చును. తరువాత నిదానముగా నవ్వుకొనును. ఉలిక్కిపడునపుడు తనయందు రాక్షసుని చూచుచున్నాడు. మరల తనకు తాను జ్ఞప్తి వచ్చినపుడు నవ్వుకొనుచున్నాడు. ఈ రెండిటిలో ఏ స్థితి తాత్కాలికము, ఏ స్థితి స్థిరము? ఏ ప్రజ్ఞ తాత్కాలికము? ఏ ప్రజ్ఞ స్థిరము? రాక్షసుని వేషము ఎంత

భయంకరముగా నున్నను తనకు తాను గుర్తున్నాడు. కనుక ఉలిక్కిపాటు తాత్కాలికము. నవ్వుకొనుట సహజము. అద్దములో రాక్షసుని వంక చూచునది, అల్పకాలము రాక్షసుని రూపమున నున్న తనవంక చూచుకొనినది స్థిరమైన భావము. అట్లే జీవుడు తనలోగాని, ఎదుటివారిలోగాని వ్యక్తులనుచూచుట తాత్కాలికము. దైవమును చూచుట నిత్యము. ఇట్టి సదవకాశముగల జీవుడు సాటివారిని దైవ విగ్రహములుగా పూజించుట నిశ్చయమైన శీఘ్రమైన ఆత్మజ్ఞానము కలిగించును.) ఈ ప్రయత్నము భక్తి యోగమున చేసినను లేక యోగాభ్యాస మార్గమున చేసినను పురుషుడు పరమాత్మను పొందును. భగవంతుని రూపము ప్రకృతి పురుష రూపముగను, వాని కతీతమైన తన రూపముగను రెండు విధములుగా నుండును. ఇందు ప్రకృతి పురుష రూపమున దైవమును చూచినచో కర్మలు చేష్టితములు కాకుండును. (రాక్షసుని రూపము ధరించినవాడు నాటకమున ప్రేక్షకులచే ప్రశంసింపబడినపుడు ఆ ప్రశంసలను రాక్షసుడుగా విని యానందించడు. నటుడుగానే విని యానందించును. అట్లే ఇతరులలోని సద్గుణములను ప్రశంసించినపుడు వారిలోని దైవము ప్రసన్నుడగును.

మరియు రాక్షస వేషధారిని ప్రశంసించినవారు నాటకమాపి పిలిచి సంభాషించినచో రాక్షసుని సంభాషణలు చేయక తన సంభాషణలే చేయును. అప్పుడు నాటక మాగిపోయి, రాక్షసుని చేష్టలు, పనులు విచేష్టితము లగును. అట్లే ముక్తిపొందిన వాని శరీరము, త్రిగుణములు, సంసార సంబంధములు కూడ నామ మాత్రముగా నున్నను విచేష్టితము లగును.) ఇట్లు జీవులుగా వర్తించుచున్న భగవంతుని రూపము భేదములతో కూడి కనుపించును. అట్టి స్థితిలో భగవంతుడు జీవులలో కాల స్వరూపుడై యుండును. అట్టి కాలము మహత్తు మొదలగు తత్త్వములకు ఆద్యంతములు చూచునదిగా నుండును. అట్లే ప్రకృతి తత్త్వములను నమ్మిన జీవులకు గూడ కాలము వాని ఆద్యంతములు చూచునదై భయము గొల్పును. (నాటకమున రాక్షసునకు నొక ముని కనుపించి "నీ వింక పది

నిమిషములలో చనిపోవుదువు." అని శపించినను రాక్షసుని వేషము వేసినవాడు మద్యము తప్పత్రాగి యుండి, ఆ శాపమును నిజమనుకొనును. తాను నిజముగా పది నిమిషములలో చనిపోవుదునని భయపడును. మద్యమువలన తాను చనిపోడను సత్యము జ్ఞప్తికి రాలేదు. అట్లే ప్రకృతి తత్త్వములలో చిక్కుకుని మోహితుడై సంసారబద్ధుడైనవాడు తన ఆయుర్ధాయమును గూర్చియు, జనన మరణములను గూర్చియు భయపడును. ఈ విధముగా కాలస్వరూపుడైన భగవంతుడు జీవులకు భయమును కలిగించుచున్నాడు.) ఈశ్వరుడే సకల భూతములకు ఆశ్రయమై యుండి, వాని లోపలనుండి కాలగతులుగా పనిచేయుచు, జీవులను మ్రింగుచున్నాడు. ఈ కాల స్వరూపుడే ఒక జీవి రూపము నింకొక జీవిచే చంపి తినిపించుచున్నాడు. (కుక్కలో, పిల్లిలో, కుక్క ప్రకృతి, పిల్లి ప్రకృతియున్నది. ఈ ప్రకృతి నంటియున్న జీవుడు తా నంతర్యామియని మరచి, ప్రకృతి ననుసరించి పిల్లిని కుక్క తినుచున్నది.) అట్లు జరుగుట సృష్టి మొత్తమునందు తన యజ్ఞస్వరూపములోని భాగము కనుక, భగవంతుడు యజ్ఞఫలముల నిచ్చుటకు జీవులను వశమం దుంచుకొని ప్రభుత్వము నెరపుచు ప్రకాశించుచున్నాడు. అతనికి మిత్రుడు, శత్రువు, బంధువు లేడు. తాను సకలమునందు ఆవేశించియుండి, మేల్కాంచి యుండును. ఏమరుపాటులో నున్న జీవులను సంహరించుచుండును. (నాటకము రచించిన కవి కథాఘట్టముల రూపమున పాత్రలలో ప్రవేశించి, వారి వారి ప్రకృతులతో ప్రవర్తించుచున్నాడు. నాటకము రచించిన కవిగా ఆ పాత్రలను తన యిచ్ఛవచ్చిన చొప్పున నడిపించుచున్నాడు. పాత్రలలో ప్రవేశించిన కవి పాత్రల ప్రకృతికి బద్ధుడు. ఈ పాత్రలు నాటకము రచించిన కవికి బద్ధులు. అట్లే జీవులు భగవంతుని రూపములే యైనను భగవంతుని ఆజ్ఞకు బద్ధులై నడుచుచున్నారు) జీవులే కాదు. పంచ భూతములు, దేవతలుగూడ వాని యాజ్ఞకు బద్ధులే. వాని భయముననే వాయువు వీచును. సూర్యుడు వేడి పుట్టించును. ఇంద్రుడు వర్షించును. తారాగణములు వెలుగును. చంద్రుడు వెన్నెల కాయును. ఆయా ఋతువులయందు చెట్లు, పొదలు,

లతలు, సస్యములు, పుష్పఫల భరితము లగుచుండును. నదులు ప్రవహించును. సముద్రములు హద్దులు తప్పకుండును. నిప్పు మండును. భూమి పర్వతములతో గూడ బరువుతో క్రుంగక నిలిచియుండును. ఆకాశము అందరికిని చోటిచ్చును.

మహత్తత్త్వము సృష్టికి మొలక వంటిది. అది ఏడు ఆవరణలతో నావరింపబడిన సృష్టియందు తన దేహము విస్తరింప జేయును. (మహత్తు, అహంకారము, పంచభూతములు కలిసి బ్రహ్మాండమునకు సప్తావరణములు). బ్రహ్మ మొదలగువారు త్రిగుణములపై నాధారపడిన దేవతలు. వారు దేవునిచే జగత్సృష్టి యందు నియమింపబడి, ప్రతిదినము ఆయా సృష్టులు చేయుటలో పొరపాటు లేకుండ జాగరూకులై యున్నారు. విష్ణుని ఆజ్ఞాబలము ననే పితృదేవతలు మొదలగువారు జీవులకు గర్భోత్పత్తి కలిగించు చున్నారు. యముడు మృత్యువు సహాయము పొందినవాడై చంపుచున్నాడు. చరాచరములతో కూడిన ప్రపంచమంతయు భగవంతుని అధీనమై యున్నది, అని చెప్పి కపిలుడు కొంచెము విరామము ప్రసాదించి మరల నిట్లనెను :

971. అట్టి సర్వలోకేశ్వరుని పరాక్రమము తెలియగలుగు సామర్థ్య మెవరికి గలుగును? మబ్బునకు గాలి సామర్థ్య మెట్లు తెలియును ? (సృష్టిలో నొక ముక్కయైన జీవుడు, సృష్టి మొత్తమున నున్న దేవునిగూర్చి ఎట్లు తెలియగలడు ? చెంబులోని గంగా జలమునకు గంగవిస్తృతి యెట్లు తెలియును ?)

972. జీవులు సుఖమును గోరి యొక వస్తువును పొంద గోరుదురు. అది లభింపనిచో దుఃఖపడుదురు. అంతయు భగవంతుని విలాసము (ఒక వస్తువు తన్ను సుఖపెట్టునని యభిప్రాయము పొందుటలోనే దుఃఖ కారణ మున్నది. అంతర్యామియైన భగవంతుడు తనలో సుఖస్వరూపుడై యుండగా తానింకొక వస్తువును సుఖముకై ఎన్నుకొనుట దుఃఖ కారణము. తన చేయి తనకు సుఖమును సమకూర్చుటకై సిద్ధపడి యుండగా పొరపాటున కంటిలో వ్రేలు గుచ్చుకొనుటవలన దుఃఖము కలుగుచున్నది. తనపై నాధారపడిన వస్తువులను, సంపదలను కొనుట మోహము.

అవి తనకు సుఖమునిచ్చు ననుకొనుట మరియు మోహము. అవి లభింపనిచో నేడ్చుట యనగా సుఖపడగోరి యేడ్చుటయేగదా! ఇదే అజ్ఞానము.

973. తనచే కల్పింపబడి, తనపై నాధారపడియున్న గృహములు, పొలములు, పశువులు, ధనము, బిడ్డలు, భార్య, చుట్టములు మొదలగు వివిధ వస్తువులు అసత్యములు. (తా నారోపించుకొన్నవి) అవి నిత్యములని నమ్మి, వర్తించు వాడు దుర్మతి. అతడు జంతు తత్త్వము గల పశురూపమైన దేహమను బంధమున నిలిచి, తన ఆశల ననుసరించి వివిధ గర్భములలో పుట్టును. కోరికలను తీర్చుకొనుటకై దుఃఖపడుచు కూడ వైరాగ్యము పొందడు. ఇదియే దేహరూపమైన నరకము. ఆ దేహము మీద తీపి వదలలేక, తన కది సర్వ సౌఖ్యముల నిచ్చునని నమ్మి త్రిప్పలు పడుచుండును.

974. ఇంకను దేవుని మాయచే మోహితుడై బిడ్డలను, భార్యను, పశువులను, ధనమును గృహములను రక్షించుకొనుటకై త్రిప్పలు పడుచు, "ఇట్లు చేయవలెను. ఇట్లు చేసిన లాభము కలుగును" అని తన కార్యక్రమములను గూర్చి ప్రణాళికలు పన్నుచుండును. ప్రతి దినము మేల్కొన్న కాలమంతయు నిట్లే శ్రమతో దహింపబడుచుండును. (ఇది యంతయు సుఖముకొరకే గదా! ఎంత యవివేకము ?)

975. మోహము చెందిన హృదయము కలవాడై సుఖమును గోరి అనేక పాపకార్యములు చేయుచుండును. స్త్రీలతో రహస్యార్థముల నిచ్చు సంభాషణములను చేయుచు అది సుఖమను కొని పొంగిపోవును. అట్లే బిడ్డలను బుజ్జగించుచు వారితో పాటు ముద్దుమాటలు మాటాడుచు పరవశు డగుచుండును. (భార్యకు, బిడ్డలకు సంతోషము కలిగించుటకై పాపకార్యములు చేయుట, యనగా దొంగతనము, అన్నదమ్ముల, అప్పచెల్లెండ్ర ఆస్తికై న్యాయ స్థానమునకు పోవుట, లంచములు పట్టుట మొదలగు పనులు.

976. ఇంద్రియ పరవశుడై కపట ధర్మమున ప్రవర్తించుచు **దుఃఖపడుచుండును. ఆ దుఃఖములోనే సుఖము రాబోవు చున్నదని**

తలచి, అభిమానపడుచుండును. (ఆ నెలజీతము పండుగలు వచ్చుటచే కుటుంబమునకు సరిపోదని తెలిసిన వాడొకడు దానిని సరిపోవునట్లు చేయుటకై గుఱ్ఱపు పందెములకు పోవును. అందు కొంత ధనము నష్టము కాగా రెండవ పందెమున తిన్నగా కాయుటకై మరింత ఆలోచించును. ఏ గుఱ్ఱము గెలుచునో జ్యోతిష్కుని యొద్దకు పోయి తెలిసికొనగోరి దానికి కొంత దక్షిణ ఇచ్చును. ఈ త్రిప్పలన్నియు పండుగ చేసికొను ప్రయత్నమే. ఫలితము త్రిప్పలు నిజమగుట, పండుగ లేకపోవుట.)

977, 978. ఒక్కొక్కడు తాను సంపాదించిన డబ్బుచే నధికారము వహించి, దుర్మార్గుడై ఇతరులను హింసించుచుండును. తన వారిని ప్రయత్నము చేత పోషించుచుండును. సంపాదించిన దానిని తనవారికి కట్టబెట్టి మిగిలిన దానినే తా ననుభవించును. దానితో తన జీవితము గడువకుండును. దానికై మరల పాపకార్యములు చేయును. (ఒకడు దొంగ వ్యాపారము చేసి లక్షలార్జించి, తన ఏకపుత్రునికి వాణిజ్య మప్పజెప్పి, ఆ స్త్రిపై నధికార మిచ్చును. కుమారుడు భార్య మాటకులొంగి తండ్రిని వెడల గొట్టును. తండ్రి దరిద్రుడై పొట్ట పోసికొనుటకై మరల ప్రజలను మోసము చేయును. పట్టుబడి అవమానముల పాలగును.)

979. సత్తువగల వయస్సున కామాది వ్యామోహములతో తనవారిని సంతోషింపజేయుటకై ఇతరులను మోసగించి యొక్కొక్కడు విశేష ధన మార్జించి, దుర్వ్యయము చేయును. వయస్సు మళ్ళినపుడు స్థితి చెడును. మరల కుటుంబ పోషణకై ప్రయత్నింపగా దేహమున సత్తువ చాలక బాధపడును. అపుడు దుర్బుద్ధియై ప్రజలను మోసముచేయ యత్నించుచు ఏమియు చేయలేనివాడై వ్యర్థముగా తిరుగుచుండును. దీనుడై దిగులు పడును. వాని భార్యయు బిడ్డలును 'వీ డసమర్థుడు, కుటుంబమునే పోషింపలేనివాడు" అని నీచముగా పలుకుదురు. పొలము దున్నువాడు ముసలి ఎద్దును నాగలికి కట్టి పొడుచుచు, అది నడవలేనిచో అసహ్యించుకొనునట్లు, భార్యాబిడ్డలు తన యెడల క్రూరముగా ప్రవర్తింతురు. అపుడతడు యే దిక్కునను సుఖము

లేక తనచే పోషింపబడినవారు తన్ను పోషించుచుండగా బ్రతుకు దుర్భరమగును. దానికితోడు ముసలితనము మరికొన్ని బాధలు కలిగించును.

980. మొగము కళ తప్పి వికృతాకారము వచ్చును. కుటుంబములోని వారు సమీపించుటకు భయపడుదురు. అత డట్లు చావును సమీపించుచుండును. అవమానములు, తప్పించుకొనుటకు ఇల్లు వదలిపోవునంతటి సత్తువ లేక వాడు పెట్టిన యన్నమును కుక్కవలె తినుచుండును. దేహమున వణకు పుట్టును.

981. రోగము లొక్కొక్కటే పైబడి పీడింపగా ఆకలి చచ్చిపోవును. అన్నహితవు తగ్గును. తిండి పడిపోవును. తినదలచిన కొంచెముగూడ వాత వ్యాధిచే ఎక్కిళ్ళు పుట్టి వెనుకకు వచ్చును. కఫము క్రమ్మి గురక పుట్టును. గ్రుడ్లు మీదికి పోవును. బంధువులు వానిని పరుండబెట్టి చుట్టును చేరి పలుకరించు చుండగా బదులు పలుక లేక మిన్నకుండును. ఇంతలో యమభటులు త్రాళ్ళచే బిగింతురు. తెలివి తప్పును. తప్పుచున్న క్షణమున భార్య బిడ్డలు వారి గతి ఏమోయను చింత మనస్సున నిలిచి యుండును.

982. ఇంతలో మృత్యువు ఘడియలు వచ్చును. అతి భయంకరాకారులు, బెదిరించు కన్నులవారగు యమదూత లిద్దరు తనముందు నిలబడుదురు. వారిని చూచి హడలుకొని మల మూత్రములు విడచును. యమదూతలు త్రాళ్ళతో గొంతు బిగించి లాగుదురు. అతడు శరీరము విడిచి వచ్చును. యాతనా శరీరము ధరించి బలవంతముగా ఈడ్చుకొనిపోబడును. చాల దూరము నడుచును. రాజభటులు దండము విధించు తావునకు అపరాధిని కొనిపోయినట్లు ఈడ్చుకొని పోవుదురు.

983. దీర్ఘమైన మూర్ఛను పొందును. దారిలో కుక్కలు మొదలగునవి పీకికొని తినుచుండును. యమకింకరులు నడుమ భయంకరముగా గర్జించుచు బెదిరించుచుందురు. మనస్సు కలగి పోవును. దేహము మొత్తము కంపించును. క్రిందటి జన్మలో చేసిన పాపకర్మములు తన మనస్సు ముందు వరుసగా మెదలును,

984. అపరిమితమైన ఆకలి, దప్పిక పీడించును. పెను గాలులు సుడులై చెలరేగుచు వేసవి మండుటెండలు కాయుచున్న యిసుక యెడారిలో నడచి వెళ్ళుచుండును. దేహము మండిపోవు చుండును. వీపుపై యమదూతల కొరడా దెబ్బలు పడుచుండును. దారిలో అక్కడక్కడ మూర్ఛిల్లుచు మరల లేచి నడచుచుండును. నిలువ నీడలేక ఆ స్థితిలో మునిగి లేచుచు నడచును. తాను చేసిన పాపముల వలన కన్నులు చీకట్లు కమ్మును. అట్టి ప్రయాణమున తొంబది తొమ్మిది వేల యోజనముల దూరమున గల యమ నగరమునకు వానిని యమభటులు కొనిపోవుదురు.

985. ఈ మొత్తము ప్రయాణమునకు మహాపాపములు చేసిన వానికి మూడు ముహూర్తములు పట్టును. సామాన్య దోషములు గలవానికి రెండు ముహూర్తముల కాలము పట్టును. అంతకాలము యాతన పడును.

986. యమ లోకమున గట్టిగా పట్టుకొని కొరవులు అంటింతురు. సన్నని చాకులపై నిలబెట్టెదరు. మంటలలోనికి నెట్టెదరు. దేహము నలిగిపోవునట్లుగా త్రొక్కి నేలకు రాయుదురు. మదించి, పాపము చేసినవానిని యిట్లు బాధింతురు.

987. మరియు వారు చేసిన పాపములను బట్టి కొందరిని క్రాగుచున్న నూనెలో ముంచుదురు. భయంకరమైన గదలతో గ్రుద్దుదురు. కత్తులతో నరుకుదురు. పొట్టలో పొడిచి ప్రేగులు తోడుదురు. పరుండబెట్టి మీదనుండి ఏనుగులను తోలెదరు. పాములను తెచ్చి భయంకరముగా కరిపింతురు. పెద్ద గుండ్లు మీదికి నెట్టుదురు. వాని దేహము కోసి ఆ కండలను వానిచేతనే తినిపింతురు.

988. కుటుంబ పోషణమునకును, పొట్ట నింపుకొనుటకును అధర్మముచేసి, జీవులను ద్రోహముచేసి, ఇతరుల కొంపలు తీసినవారీ విధముగా నరకమున త్రోయబడుదురు. తన కున్న ధనములు, ఆస్తిపాస్తులు కోల్పోయి, ఆపదవచ్చి మొత్తుకొను

చున్న వానివలె యమలోకమున బాధలలో నుడికిపోవును. ఆ లోకమున చీకటిలో నడిపించుట, కన్నులు గట్టి నడిపించుట కూడ నుండును. క్రిమి కీటకాదులను దేహమున నెక్కించుట కూడ నుండును. ఇట్టి బాధ లనుభవించుటవలన, చేసిన పాపములు క్షీణించి క్షాళనము చేయబడి మరల పువ్వువలె బయటికి వచ్చును.

( ఇందు వర్ణింపబడిన నరకయాతనలు పురాణములయందు పెక్కుతావులలో కనుపించును. ఇట్టి నరకాది లోకములు నిజముగా లేవనియు, పామరులను భయపెట్టి పాపము చేయకుండ హద్దులలో నుంచుటకై యిట్లు వర్ణించిరనియును కొందరు హేతువాదులైన భౌతిక వాదులు నమ్ముచున్నారు. పామరులను భయపెట్టుటకే ఐనచో పాపములు చేయు పండితులను, ధనికులను, అధికారులను యెట్లు భయపెట్టవచ్చును? అధికారము, బలము, పలుకుబడి, ఆస్తి నాధారముగా జేసికొని అమాయక ప్రజలను దోచుకొని తినువారికి ఈ భయపెట్టుటలు పని చేయవుకదా! ఈ మాత్రము తెలియని అమాయకులు కాదు ఈ గ్రంథములు రచించినవారు. ఈ కథలలో సత్యము లేదని నమ్మువారు పిరికివారు. ఏనాడైన తామీ నరకమున చిక్కుకొందుమేమోయను పిరికికండ తమ గుండెలలో పీడించుచుండగా నరకము లేదని హుంకరింతురు. జ్యోతిషమును నిందించి, పత్రికలలో పరిహసించువారు దొంగతనముగా జాతకములు చూపించుకొని భవిష్యత్తు తెలుసుకొనుటకు ప్రాకులాడుచుండుట లేదా? నరకములను నమ్మమని చెప్పుటకూడ నట్లే. ఈ వర్ణింపబడిన నరకబాధలన్నియు సత్యములే యనుట శిలాశాసనము. ఐనచో ఇట్లున్నవని మనకెట్లు తెలియును? ఈ గ్రంథకర్తల కెట్లు తెలిసినవి అన్నవే ప్రశ్నలు. ప్రత్యేకదృష్టి యున్నచో తెలియును. సామాన్యుని కంటికి కనుపింపని రోగాదులు రోగిని చూడగనే వైద్యునికి గోచరించుచున్నవికదా! అట్లే దుష్కర్మల ఫలితములైన నరకాదులు.

(1) ఒకరినొకరు మోసము చేసికొనుట భయమువలననే కదా! పొట్టగడవదేమో, కుటుంబమును పోషింపలేనేమో అను

భయమువలన పాపబుద్ధి పుట్టును. దానితో మానవుల పరస్పర సంబంధములు చెడును. బాధలు జీవులను ముంచెత్తును.

(2) కొందరిని తనవా రనుకొని అభిమానపడుట భ్రాంతి. బిడ్డలు తనకు పుట్టినవారు గనుక తనమాట వినవలెనని, తాను పెండ్లి చేసుకొనుటవలన భార్యపై తన కధికారమున్నదని తలచుట మరియొక భ్రాంతి. ఇద్దరి మధ్య సంబంధములు పరస్పర ప్రవర్తనము నందలి నిర్భీతివలన బలీయమగును. ఒకరినొకరు సందేహించుట వలన భయపడుటవలన చెడ్డసంబంధము లేర్పడును. అపకారము చేసికొనుచుందురు. కనుక సంబంధములకును, మన మనుకొన్న చుట్టరికములకును సంబంధము లేదు. ఇది తెలియక మమకార పడుటవలన మిగిలినవారి కపకారము చేయుదుము.

(3) మనల నాశ్రయించిన వారిని పోషించునది, మన మను కొనుటవలన భయము పుట్టును. దానితో లోకులను మోస గించుట జరుగును. వారితో విరోధము లేర్పడును. పనులు అక్రమ ముగా చేయుదురు. దానితో జీవనోపాధి చెడును. మమకారము చేత కొందరికి ఆస్తిపాస్తులను కట్టబెట్టుట వలన వారు ద్రోహము చేయుదురు. ఇందలి ప్రతి ప్రవర్తనమునకును దుష్పరిణామ మున్నది. దాని ననుభవించుటయే నరకము.

4) వయస్సున్న శరీరము చురుకుగా అన్ని పనులను చేయు చుండును. ముసలితనము వచ్చు కొలదిని మన సామర్థ్యము తగ్గునని యూహింప లేనివారు చాలమంది కలరు. వారు ముసలి వారగు సరికి స్థితిగతులు చెడిపోవును. ఇంకను వయస్సున ఆహార విహారముల యందు క్రమము పాటింపనివారికి వ్యాధులు కలుగును. ఇట్టి కర్మఫలితములను సమగ్రముగా పర్యవేక్షణము చేయగలిగిన వో నరకము యొక్క సత్యత్వము తెలియును.

ఋణబాధ, అవమానము, అసమర్థత, వ్యాధి, ముసలి తనము మొదలగు వాని నిజస్వరూపమే నరకము. ఆహార విహార దోషముల వలన శరీరమున పుట్టునట్టి వ్యాధులు వివిధబాధలు కలిగించును. నొప్పి, మంట, పోటు మొదలగునవి దుర్భరముగా నున్నపుడు జీవునకు కలుగు అనుభూతియే యమదూతలు పెట్టు

బాధలు. కేన్సరు, గేంగ్రిను మొదలగు వ్యాధుల వలన కలుగు బాధలు ప్రాగుచున్న నూనెలో యమదూతలు ముంచినకన్న తక్కువగా నుండవు. చాకలపై నిలబెట్టుటకన్న పోట్లు మంటలు చురుకులు తక్కువ బాధలు కావు. కొరవు లంటించుట కన్న వ్రణముల, బొబ్బల, మేహవ్రణముల బాధలు తక్కువ కాదు. కత్తులతో కండలు కోయుట యనగా శస్త్ర చికిత్స లావశ్యక మగుట, వైద్యముపేర కాల్చుట, గుచ్చుట, పొడచుట, దేహ భాగములు కోయుట, వాని పరిణామముల వలన జీవితాంతము వరకు కలుగు బాధలును, పాములచే కరిపించుట, క్రిమికీట కాదుల నెక్కించుట యనగా దేహభాగములలో పురుగులు చేరుట, పుండులలో పురుగులు పుట్టుట, అవి మన మాంసమును తినుట మున్నగునవి. యమదూతలు మన యాకలి దప్పులను తీర్చకుండ మండుచున్న యిసుకలో నడిపించుట యనగా ఆహార దోషము వలన, మద్యపానాదుల వలన కలిగిన జీర్ణకోశ బాధలు పైత్యపు మంట, వెర్రి ఆకలి, దుర్దాహము, దేహము మండి పోవుట మొదలగునవి. మరియు దారిద్ర్య స్థితిలో ఎవడైన పది రూపాయలిచ్చునేమో యను నాశతో ఎండకు లెక్కచేయక, కాలికి చెప్పులేక దూరప్రదేశములకు నడచి పోవుచుండుట యూహింప వలెను. ఇచ్చట పరిస్థితులే యమదూతలు. ప్రయాణమున యమదూతలు తిట్టి, భయ పెట్టుదు రనగా తప్పు చేసిన వానిపై అధికారులు, పోలీసులు, న్యాయస్థాన శాఖవారు, మన కప్పిచ్చిన వారు, అద్దెకున్న ఇంటి యజమానులు మున్నగు నంశముల నూహింపవలెను. వీనికి నుపమానప్రాయములైన కవిసమయములే యమలోక మందలి విశేషములు. తాను చనిపోవు ముందు బంధువులు చుట్టును జేరుట, వారు తన్ను చూచుట, తను వారిని చూచుట, సంభాషించు ప్రయత్నములు నిష్ఫలములగుట వాస్తవ ములే కాని యుపమానములు కావు. ముసలితనమున వ్యాధుల వలన ఆకలి చచ్చుట, ఆశపడి రుచి కోసము తినబోయినచో ఎక్కిళ్లు వచ్చుట, వాంతులు పుట్టుట, ప్రత్యక్ష నరకములే గాని యుపమానములు కావు. దుష్ప్రవర్తన చేసినవాని మరణము వ్యాధుల వలన భయంకరముగ నుండును. సక్రమమైన జీవితము

ఆహారాది నియమములు, ప్రశాంతమైన మనస్సు, తగుమాత్రము వ్యాయామము, నిద్ర, విశ్రాంతి, శరీరమునకు పని కల్పించుకొను చుండుట, మున్నగు లక్షణములతో జీవించువారు ఏ బాధలు లేక, పని చేయుచునే సున్నితముగా క్షణములలో దేహమును విడుతురు. అట్లుకాక దుష్ప్రవర్తనము కలవారికి వాతము వలన వణకు, పక్షవాతము వలన తాను జీవించియుండగనే దేహ భాగములు చనిపోవుట, పిత్తము వలన మంటలు, ఆకలిదప్పులు, నొప్పులు, పోట్లు, తిమ్మెరలు, కఫము వలన ఉక్కిరి బిక్కిరి మున్నగునవి క్రమముగా ముంచుకొనివచ్చి మృత్యు సమయము నకు చాలకాలము ముందు నుండియు బంధించును. అట్టి బాధలను చిట్టచివరి క్షణములలో అనుభవించుటయే యమదూతలు వచ్చి కట్టుట, కొట్టుట, లాగుట మున్నగునవి.

ఇన్నిటికన్న ముఖ్యమైన మరియొక సత్యమున్నది. మనము మేలుకొని యున్నప్పుడు పనిచేయు మనస్సునకును, కలలో పనిచేయు మనస్సునకును గల భేదము గమనింపుము. రెండిటి యందును విషయాదులు, అనుభవములు సమానమే కాని, మేల్కొనియున్న మనస్సుకు పరిసరములతో సంబంధముండును. దానిని బట్టి జరుగుచున్నది భౌతికముగా వాస్తవమో కాదో తెలియును. అప్పులవాడు వచ్చి తిట్టిపోవుచున్నపుడు గల మనస్సునకును, అది జ్ఞప్తికి వచ్చినపుడు గల మనస్సునకును భేద మున్నది. జ్ఞప్తికి వచ్చినపుడు అప్పులవా డెదుట లేడని మనస్సు తెలుసుకొనును. స్వప్నమునం దీ భేదము నశించును. అప్పుడు అప్పులవాడు నిజముగా తిట్టుటకును, జ్ఞప్తివచ్చుటకును భేదము లేదు. అంతయు వాస్తవముగనే అనుభవింపబడును. స్వప్న మందలి మనస్సు వంటిదే దేహము విడిచిన తరువాత పనిచేయు మనస్సు కూడ. ఈ మనస్సు తన పూర్వస్మృతులను దారములచే అల్లిక చేయబడిన వస్త్రము వలె నుండును. ఇదే యాతనా శరీరము. ఇందు తన స్మృతులన్నియు సత్యములుగా ననుభూత మగును. అప్పులవాడు జ్ఞప్తికి వచ్చినచో ఎదుట నిలబడును. అట్లే వ్యాధుల బాధలు, మంటలు, నొప్పులు, పోట్లు మున్నగునవి. అట్లే శస్త్రచికిత్సలును. బ్రతికి యున్నపుడు సిగ్గీతిని ఆనందమును

అనుభవించినచో చనిపోయిన తరువాత గల మనస్సునకు అది సత్యమగును. దీనినే స్వర్గసుఖ మందురు. తనకన్న ముందు చనిపోయిన బంధువులు తన మరణము తరువాత జ్ఞప్తికివచ్చి నపుడెల్ల వాస్తవముగా కనిపించి, కలసి మెలసి తిరుగుదురు. జీవితమంతయు ఈర్ష్యా భయ దుఃఖాదులచే నడచినచో చనిపోయిన తరువాత యాతనాశరీరమున వాని కారణము లన్నియు ఆ యా వ్యక్తులతో కూడిన వాస్తవిక పరిస్థితులుగా అనుభవింపబడి, నిరంతర దుఃఖము నిలువనీడ లేకుండుట జరుగును.

యాతనా శరీరమున అనుభవించు బాధ లెంతకాల ముండును ? జీవించి యున్నప్పుడు అవి తన మనస్సుపై నెంత లోతుగా పనిచేసినవో దానినిబట్టి యెంతకాలము బాధించు నను విషయ మాధారపడి యుండును. దుష్కర్మ తీవ్రమై తాను తీవ్ర భయము ననుభవించి యున్నచో దాని ప్రభావము యాతనా శరీరమున సుదీర్ఘకాల ముండును. చిన్న దోషముల స్మృతులకు స్వల్పకాలము, మహాపాపముల స్మృతులకు సుదీర్ఘకాలము నరక బాధ యుండును. కాలక్రమమున ఈ స్మృతి వ్యయమైపోవు వరకు యాతనాశరీర బాధ లుండును. ఆ జన్మమున గల స్మృతులైపోవు వరకు, ఆ మరణము తరువాత నరకముండును. దానితో యాతనా శరీరము తొలగిపోవును. అటుపైన పరిశుద్ధమైన ప్రజ్ఞతో జీవుడు నిలబడును. అంతటితో మోక్షము రాదు. యాతనా శరీరమున భయదుఃఖాదుల అనుభవము భస్మమగును గాని కారణములు భస్మములు కావు. చెట్టు చచ్చిన వెనుక విత్తనముల వలె మిగిలియుండును. అవి జీవుని ప్రకృతిలో నుండును. వాని కారణమున మరల పాంచభౌతిక తత్త్వమునకు జీవుడు దిగివచ్చి పుట్టును.

దేహము విడుచుటకు పట్టు కాలము పాపికి సుదీర్ఘముగను సద్బుద్ధిగలవానికి స్వల్పముగను నుండును. మరియు జీవి చనిపోవు టకును యమలోకమును చేరుటకును నడుమ తొంబదితొమ్మిదివేల యోజనముల దూరమని చెప్పబడినది. ఈ దూరము భౌతికము కాదు. ఇచ్చట యోజనము లనగా అడుగులు లేక పొరలని యర్థము. దేహమున నున్నప్పటి ప్రజ్ఞకును విడిచిన వెనుక గల

ప్రజ్ఞకును నడుమ తొంబది తొమ్మిది వేల పొరలుండును. వీనిని ప్రజ్ఞతో దాటుటయే నరకమునకు నడచుట.

989. (నరకము ననుభవించిన తరువాత పరిశుద్ధుడైన జీవుడు మరల గతియెట్లు కల్పించుకొనునో వివరింపబడుచున్నది.) పూర్వజన్మయందలి కర్మల ననుసరించి తన వాసనలకు నొక క్రమ మేర్పడును. ఆ క్రమమును సమకూర్చువా డీశ్వరుడు. కనుక ఈశ్వరుని ఘటన వలన జీవుడు తన పూర్వ సంస్కారముల ననుసరించి మరల దేహము నపేక్షించును. (ఈ లోపున జీవు డెక్కడ నుండును? మనవలెనే తిరుగుచుండును. దేహము లేదు కనుక కామగమన ముండును. మన వాతావరణము వలెనే భూమి చుట్టును గల చోటులో చరించుచుండును. భూమధ్యరేఖ చుట్టును గుండ్రముగా సూర్యచంద్రాదుల గోళముల మార్గము లున్నవి గనుక జీవుడు ఆ మార్గము వెంట భూమి చుట్టును చరించును. తనలోని విత్తనములైన పూర్వ వాసనలు క్రమ ముగా బరువెక్కుచుండగా దేహము కోరి భూమికి దిగును. తన విత్తనములకు తగిన క్షేత్రము రూపమున అనుకూలమైన జీవితము నడుపుచున్న భార్యాభర్తల వైపున కాకర్షింపబడును) అందు పురుషుని శుక్రబిందువున దిగును. (ఆ పురుషుని శ్వాసతోగాని, అన్నపానీయాదులతోగాని, ఆలోచనలతో గాని ఆకర్షింపబడి దేహమున దిగి అచ్చట పిండోత్పత్తికి పితృదేవతలు పనిచేయు చున్న దాంపత్యావయవ ధాతువుల దగ్గర కాహ్వానింపబడును. పూర్వము దేహము వదలిన వెనుక మరల నిట్లు దిగివచ్చుటకు నడుమగల కాలమెంత? అది వాని సంస్కారముల తీవ్రతను బట్టి యుండును. బలమైన కోరికలతో, తీరని యాదర్శములతో, పట్టుదలతో సగము చేసిన పనులతో, ఆసక్తితో నిండిన మనస్సుతో చనిపోయిన వాడు వాని సంస్కారముల తీవ్రతచే నరకమైన వెంటనే దిగివచ్చును. నిష్కాముడు చనిపోయినచో దిగకుండ నెంత కాలమైన నుండవచ్చును. మోక్షస్థితి చెందిన వాడైనచో దిగిరావలసిన ఆవశ్యకతయే లేదు. మోక్షమును తీవ్రముగా కోరి, చనిపోయిన వాడైనచో మరల మోక్ష ప్రయ త్నము కొరకై త్వరగా దిగివచ్చును. మోక్షము పొందనివాడు

దిగి రానక్కరలేదు గాని, దిగిరాడని సిద్ధాంతము కాదు. లోక హితార్థమై దిగివచ్చును. వానికి దిగివచ్చుట బంధముకాదు గనుక జనన భయము లేదు. దిగివచ్చుట అతని సంకల్పమును బట్టి యుండును. మిగిలిన వారికి తమ సంస్కారములను బట్టి దిగిరాక తప్పదు కనుక, వారికి జన్మము సంసారబంధము.)

పురుషుని శుక్రముతో స్త్రీ గర్భమున ప్రవేశించును. అప్పటి నుండి యొకరాత్రి శుక్రశోణితముల ద్రవముగా నుండును. ఐదు దినములకు బుడగవలె నేర్పడును. పది దినములకు పిండమై రేగు పండంత నుండును. అటుపైన మాంసపు ముద్ద యేర్పడును. అటుపైన గ్రుడ్డువలె పొరలేర్పడును. నెలపూర్తి యగుసరికి తల యేర్పడును. రెండు మాసములకు కాళ్ళు చేతులు మొలుచును.

990. మూడు మాసము లగుసరికి గోళ్ళు, రోమములు, ఎముకలు, చర్మము యేర్పడి, నవరంధ్రము లేర్పడును. నాలుగవ మాసమున సప్తధాతువులు కలుగును. ఐదవ మాసమున ఆకలి దప్పులు పుట్టును. ఆరవ మాసమున మావియందు పొదుగబడును. తల్లి గర్భమున కుడిపక్కగా మెదలుచు, తల్లిచే స్వీకరింపబడిన అన్నపానీయములతో ఆకలి దప్పులు తీర్చుకొనుచుండును.

ధాతువులు పెరిగి దేహ ప్రమాణము పెరుగుచుండగా క్రమముగా స్పర్శాది జ్ఞానములు పూర్వ వాసనా బలముచే వ్యక్తమగును. తానున్నచోట అనేక జీవులు పరిసరములలో తిరుగు చుండును. మలమూత్రాదులకు దగ్గరగా నుండును గనుక తల్లి శరీరమున రోగాదు లున్నచో క్రిములు తిరుగుచుండును. తల్లి దండ్రులు ఆచారము, శుచిత్వము నెరుగని పశు ప్రవృత్తిగల ఎడ్డె మనుష్యులైనచో గర్భస్థుడైన జీవునకు రోగాదులును, క్రిములును కూడ సంక్రమించును. మూర్ఛాదులు కూడ కలుగవచ్చును. అనగా వచ్చిన తెలివి తప్పుచుండును. తల్లి ఆహారాది నియమ ముల నెరుగని పశువైనచో రుచులను బట్టి ఉప్పు, కారము, చేదు, పులుపు మున్నగు ద్రవ్యముల నెక్కువగా మసాళా చేసిన యాహారము తిన్నపుడెల్ల గర్భస్థునికి ఒడలు మంట లెత్తుచుండును. ఇంకను క్షార పదార్థములను ( Alcalies ), పులిసి బుడగలు తేరిన,

నురగలు వచ్చిన పులిసిన పదార్థములను తినుచున్నపుడెల్ల శిశువు దేహము తీవ్రబాధలకు గురియగుచుండును. (క్షారము లనగా ఆవపిండి మున్నగు పదార్థములు. ఉల్బణములు లేక బుడగలు తేరినవనగా- పుల్లపెరుగు, పులిసిన అట్లపిండి మున్నగునవి.) మావిచే కప్పబడి రక్షింపబడుచున్నను, ఒక్కొక్కప్పుడు తల్లి వికృత చేష్టలచే ప్రేగులలో చిక్కుకొనును. గర్భమున శిరస్సు మోపి యుండును. ముడుచుకొని పండుకొనును. అవయవము లను కదలించుటకు తావుండదు. స్వేచ్ఛగా విహరించు మనస్సు పుట్టినను పంజరమున చిలుకవలె అవకాశము లేకుండును.

అప్పుడతనికి దైవదత్తమైన జ్ఞానము కలుగును. అందు పూర్వజన్మ యందు తాను చేసిన దుష్కర్మలు తలపునకు వచ్చును. (అప్పటి మనస్సునకు కాలవిభాగము, దేశవిభాగము, లేదు గనుక పూర్వ జన్మమునకును, ఈ జన్మమునకును భేదము తెలియదు. ఈ జన్మలో నింకను కర్మలు లేవు గనుక పూర్వ జన్మమున చేసినవి స్మరణ మాత్రముగా జ్ఞప్తికి వచ్చుచుండును. మనకు స్వప్నములలో వేరు వేరు కాలములలోగాని దేశములలో గాని జీవించిన వ్యక్తులు కలసి మాటాడుచున్నట్లు సన్నివేశములు కనుపించును. ఎప్పుడో చనిపోయిన మన తాతయు, మొన్న మొన్న పుట్టిన మన పిల్లలును కలసి ఆడుకొనుచున్నట్లు, మనతో కలసి అందరూ సినిమాకి వచ్చినట్లును స్వప్నములు సంభవించు చున్నవి కదా! అట్లే గర్భస్థునకు పూర్వజన్మజ్ఞానము కలుగును.) తాను పూర్వము చేసిన పాపములకు ఉలికిపడుచుండును. పెద్దగా నిట్టూర్చుచుండును. (వానికి శ్వాస లేదు కనుక ఈ నిట్టూర్పు స్పందనముగా వ్యక్తమగును. దీనిని బట్టియే గర్భపిండము అప్పుడప్పుడు స్పందనములు చేయుట గమనింపనగును.) సుఖ మన్నది యుండదు.

ఏడవ నెలయందు జ్ఞానము, చేష్టలు కలుగును. తన మనస్సునకు అపరిశుద్ధ ప్రదేశమున నుంటి నను బాధ కలుగును. మలముతోను క్రిములతోను సోదరుడై యొక దిక్కున నుండక అటు నిటు సంచరించు చుండును. అప్పటినుండి అప్పుడప్పుడు తల్లికి నొప్పులు కలుగుచుండును. (ఆహార విహారాది ప్రవర్తనలో

క్రమ మున్నచో కలుగవు. ఇష్టము వచ్చినట్లు ప్రవర్తించు వారికి మాసములు రాకుండగనే నొప్పులు బయలుదేరును.) అప్పటి స్పందనలతో గాలి కూగినట్లు వణకింపబడు చుండును. వానికి దేహము వేరుగా, ఆత్మ వేరుగా ప్రజ్ఞ దర్శనమగును. దీనినుండి బయటపడవలె నని మనస్సున కోరుకొనుట తెలియును. మరల గర్భమున పడినందులకు భయపడుచుండును. దేహమందలి సప్తధాతువులును బంధనములవలె తోచును. చేతులు ముడుచు కొని యుండుట వలన దేవునకు నమస్కారము మాత్రము చేయును. (పూర్వ పుణ్య కర్మల వాసనలచే దైవము, భక్తి, నమస్కారము మున్నగునవి తెలియును. దిగులు పడిన మొగముతో "నే నిం దెట్లుంటిని? ఎవరి వలన నుంటిని?" అను ప్రశ్న పుట్టి దైవ ఘటన మనస్సునకు సోకును. అతడు భగవంతు నిట్లని ప్రార్థించును. (ప్రార్థించుట భాషా పదములతో కాదు. భావము లతో మాత్రమే.)

991. లోకములను రక్షించుటకై తన ఇచ్ఛ ప్రకారము దేవుడు ఎల్లప్పుడును యిట్లు దేహాది రూపములలో పుట్టుచునే యుండును. అట్టి సర్వవ్యాపియొక్క పాదములను పూజింతును. ఇక భయముండదు.

992. నాకు పంచభూతములని లేవు. నే నాత్మ స్వరూపుడను. ఐనను పంచభూతములతో చేయబడిన శరీరము నన్ను కప్పినది. నా జ్ఞానమునందు ఇంద్రియములు, త్రిగుణములు, ప్రయోజనములు అనబడునవి లేనివి ఉన్నట్లుగా నిలుచు చున్నవి.

993. పంచభూతములతో, ఇంద్రియములతో గల మాయ వలన కర్మబద్ధుడై జీవుని రూపమున దుఃఖముచేత దహింప బడుచున్న నా రూపమున నున్నవాడు పరిశుద్ధుడు, అఖండ జ్ఞాన స్వరూపుడు, అతని అస్తిత్వమే సత్యము. (నా యస్తిత్వ మసత్యము) అతడు కుంటుపడని శౌర్యము గలవాడు. అన్నియు తెలిసిన యుత్తమజ్యోతి, దయామూర్తి, శాంతమూర్తి. అతడు ప్రకృతి పురుషులకన్న వేరుగా నున్నవాడు. అట్టివానికి నమస్క-

రించుచున్నాను. భయంకరమైన గర్భనరక బాధలనుండి నాకు శాంతి కలిగించుగాక!

994. ఇట్లు కపిలాచార్యుడు వివరించుచుండగా దేవహూతి మరల ప్రశ్నించెను. కొందరు మోహము క్రమ్మినవారై గుణములతో కర్మలతో నడిపింపబడి జీవించుచున్నారు. అట్టి సంసార బద్ధులు తాము కల్పించుకొన్న కారణములచే ధైర్యమును గోల్పోయి, అనేక భయములతో శంకలతో బ్రతుకుచున్నారు. అలసటపడి మార్గము తెలియక, తడవుకొనుచున్నారు. వారి మనస్సులకు భగవంతుడున్నాడనియు, వానిని ధ్యానింపవలెననియు తట్టదు. ఆత్మదర్శనము లేక తమ స్వభావమే జీవితముగా కొట్టుకొనిపోవుచుందురు. ఇది అంతయు భగవంతుని సంకల్పమే కదా! ఇట్లు జీవించు పామరులకు భగవంతుని ధ్యానింపవలెనను బుద్ధిపుట్టవలెనన్నచో మరల వాని యనుగ్రహ ముండవలెనుగదా! మొట్టమొదటగా దైవభక్తి, వాని గుణధ్యానము వాని మూర్తులను దర్శించుట యెట్లబ్బును? (అంతవరకు దేవుడు తెలియని వానికి మొట్టమొదట దేవునిపై నమ్మక మెట్లారంభించును?) ఇట్లు ప్రశ్నింపగా కపిలుడు తల్లితో ప్రబోధపూర్వకముగా నిట్లనెను :

995. భగవంతుడు మూడుకాలములయందును గల స్థావర జంగమములలో నిండియే యున్నాడు. జీవులందరును వానితో నిండియే యున్నారు. వారు తమ కర్మలయందు ప్రవర్తించుచుండగా బాధలు కలుగుచుండును. అట్టి తాపత్రయములు కలిగినపుడు నివారణకొరకై మొట్టమొదటగా దేవుని స్మరించుట ప్రారంభమగును.

(ఆహారదోషము వలన కడుపునొప్పి వచ్చును. వైద్యునకై వెదకెదరు. వాని వలన తగ్గదు. ఇంకొక పెద్ద వైద్యునకై వెదకెదరు. అప్పుడును తగ్గదు, తగ్గించువాడింకెవడు? అను ప్రశ్న పుట్టును. ఇదియే దైవమును గూర్చిన మొదటి ధ్యానము. కడుపునొప్పి తగ్గినను తగ్గకున్నను ధ్యాన మారంభమగును. ఇంకను తగ్గకున్నపుడు ఈ ప్రశ్న రూపమున ధ్యానము హెచ్చువగును. ఇతం

మార్గము లన్వేషించును. ఎవరో పూజచేసి తీర్థమిచ్చి తగ్గింతురని తెలిసినది. అచ్చటికి పోవును. ఈ విధముగా జీవు డార్తుడై దైవ ధ్యానము నారంభించును. జిజ్ఞాసువై ప్రశ్నించుకొనును. ప్రయోజనము కోరి వెదకును. కాలక్రమమున జ్ఞానియగును. ఇందు మార్గ మారంభమగుట ముఖ్యము గాని తలచినపని నెరవేరుట ముఖ్యము కాదు. కనుకనే తాము దేవునకు మ్రొక్కుబడులు చెల్లించిన పనులు నెరవేరకున్నను సంసార జీవులు మరల మ్రొక్కుకొనుచునే యుందురు. ఒక భక్తుడు తిరుపతికి బోయి "నా పుత్రుడు I. A. S. పరీక్షలో నెగ్గవలెను" అని మ్రొక్కుకొనును. పుత్రుడు పరీక్ష తప్పినను ఇంకొక మారు తన కుద్యోగమున వృద్ధి కావలె ననిపించినపుడు మరల పోయి మ్రొక్కుకొనును. దేవుడు నీ కోరిక తీర్చలేదేమి యని ఎవరైనను ప్రశ్నించినను 'కర్మపరిపాకము కాలేదు' అని తనకు తెలియని సత్యమునే పలుకును కాని మరల మ్రొక్కుట మానడు. ఈ లోకరీతులను బట్టి మ్రొక్కుబడులు జీవుడు దైవమును సమీపించుటకే గాని మ్రొక్కుకొన్న కోరికలు తీరుటకు కాదని తెలియుచున్నది. )

996. కపిలుడు కొంచెమాగి మరల యిట్లనెను : గర్భస్థుడగు శిశువు మలమూత్రాదుల, క్రిముల నడిమి కన్నమున మునిగియుండునని చెప్పియుంటిని. అతని కాకలికూడ నెక్కువై తాపము కలుగును.

997. దీనవదనుడై అతడు దేహము నుండి వెలువడుటకు సంకల్పించి ఎన్నిమాసములు జరిగెనో లెక్కించుకొనును. "నన్ని గర్భము నుండి వెలువరించు వారు గలరా?" యని ప్రశ్నించుకొనును. దీనరక్షకుడైన దేవుని తన్ను విముక్తుని చేయుమని అర్థించును. దానికి తిరిగి తా నేమి యుపకారము చేయగలడు? "ప్రస్తుతము నమస్కారము మాత్రము చేయగలిగి యున్నాను. శమదమాది గుణముల నలవరచుకొని శుద్ధమైన శరీరమున విజ్ఞానమను దీపమును వెలిగించుకొని నిన్ను దర్శింతును. ఈ విధముగా నా ఋణము తీర్చుకొందును" అనుకొనును.

998. ఇంకను యిట్లు మ్రొక్కుకొనును : బహుదుఃఖములకు నిలయమైన యీ గర్భనరకము నుండి నేను వెలువడలేను.

వెలువడినను, వెలుపల జీవితమున దేవునిమాయచే మోహము చెంది ఘోరమైన సంసార చక్రమున తిరుగుచుండవలెను. అట్లేల తలపవలెను ? భగవంతుడే నన్నీ గర్భమునుండి విమోచనము చేసినచో మిగిలిన జీవితమును మాత్రము అతడే యొక్క మార్గమున నడిపింపడా ? అతనిని సారథిగా నంగీకరించి అతడు ప్రసాదించిన జ్ఞానమను వెలుగున ఈ సంసారమను చీకటి సముద్రము నుండి నన్ను నేను కాపాడుకొందును. ఆత్మలో భగవంతుని దర్శించి, దీనిని సహింపగలను.

999, 1000, 1001. "ఈ గర్భనరకము బాధలకు మూలము. దుఃఖములకు మూలము. కన్నములు గల దేహమున నివసించుటకై క్రిములతో కూడిన బహుజన్మ లెత్తుటకు బహు గర్భములతో వసించుట దుర్భరము. ఇట్టి జన్మముల నుండి విమోచనము గోరి భగవంతుని ప్రార్థింతును. వాని పాదపద్మములు సంసారసాగరమును తరింపజేయును."

(దేహములలో నున్నను జీవికి మోక్షము కలుగునని పలుతావులందు యీ భాగవతమునచే ప్రతిపాదింపబడియున్నది. దాని కీ పద్యము విరుద్ధముగా నున్నది. కనుక దీనికి మూలమైన భాగవత శ్లోకము కూడ ప్రక్షిప్తమని తెలియుచున్నది.)

1002. అని నిశ్చయించుకొని నిర్మల జ్ఞానము కలవాడై జీవుడు గర్భమున నుండలేక వెలువడలేక నవమాసములు నిండును.

1003. పదియవ మాసమున గర్భస్థుడు తలక్రిందుగా చేయబడి, శ్వాస ఇంకను ప్రారంభము కాక, దుఃఖ మనుభవించుచు, తనకున్న జ్ఞానమును కోల్పోయి, రక్తమంటిన దేహము గలవాడై, మలము నందలి క్రిమివలె భూమిపై పడును. గర్భస్థమైన జ్ఞానమును కోల్పోయి ఏడ్చుచుండును. అప్పటినుండి తన్ను పెంచి పోషించువారు తన భావము లర్థము చేసికొనలేరు. తనకేమి కావలెనో చెప్పలేక, నల్లులు మొదలగు కీటకములతో నిండిన శయ్యపై పండుకొనును. దురద పుట్టినకూడ గోకికొనలేడు. కూర్చుండలేడు, లేవలేడు, దోమలు, నల్లులు, కుట్టినపుడు పురుగులచే తినబడుచున్న పురుగులవలె దుఃఖించునేగాని వారింప

లేదు. శిశువుగా పెరుగుచు అప్పటి చేష్టల ననుభవించును. బాల్యమున చదువు మున్నగు ప్రయత్నములలో కష్టపడును. యవ్వనమున సాహసవంతుడై తాను కోరిన ఫలితములను సాధించుటకు కాలము వ్యర్థము చేసికొనును. పంచభూతమయమైన శరీరమున మెలగుచుండుటచే పలుమారులు అహంకారము, మమకారము పొందుచుండును. పట్టుదలకై మాట నిలబెట్టు కొనుటకై ఏవో పనులు చేయుచుండును. వాని ఫలితములలో చిక్కుకొను చుండును. చెడ్డవారి సహవాసములు పొంది, కామమునకు, తిండి రుచులకు మరగి, తుచ్ఛముగా ప్రవర్తించును. దానితో దోష మెక్కువగును. తత్ఫలితముగా కోప తాపములు, విరోధములు పుట్టి దుఃఖ మనుభవించును. తీవ్రమైన కోరికల వలన తాను నశించు పనులయందు ప్రవర్తించును.

(ఒకొక్కడు కామముచే బహుస్త్రీ సాంగత్యము, నిరంతరస్త్రీ సుఖమునందు మునిగి, దేహమును పాడుచేసికొనును. మద్యపానాదుల వలన కొందరు దుర్బలులై వ్యాధిగ్రస్థు లగుదురు. మాట పట్టింపులతో నిద్రాహారములు మాని కొందరు, రజోగుణ దోషమున పోటీలుపడి కొందరు, దేహమును నశింపజేసికొందురు.)

1004. మానవునకు చెడు స్నేహము లభ్భినచో సత్య వాక్కు, శుచిత్వము, దయ, ధైర్యము, మితభాషణము, లజ్జ, ఓర్పు, పేరు ప్రతిష్ఠలు, శాంతి, ఇంద్రియ నిగ్రహము మొదలగు సద్గుణములు నశించును. మోహము చెందినవారు, శాంతిలేని వారు, దేహమే తా ననుకొనువారు స్త్రీలను విడచి యుండలేని వారు, స్నేహము చేయదగిన వారు కారు. కాలక్షేపమునకై పంజరములలో చిలుకలు, గొలుసులతో కుక్కలు బంధింపబడినట్లు స్త్రీలచే కొందరు కామముతో బంధింపబడుదురు. వారి సాంగత్యము మొదలే పనికిరాదు. పై జెప్పిన దోషము లన్నిటిలో స్త్రీసాంగత్య దోషము చాల బలీయము.

1005. పూర్వ మొకనాడు సరస్వతి ఆడులేడి రూపమును ధరించి తిరుగుచుండగా, ఆమెకు తండ్రియైన చతుర్ముఖుడు దాని యందమునకు మనస్సుపడి, మనస్సునకు లొంగిపోయెను. సిగ్గు

విడిచి తానును లేడిరూపమును ధరించి నీచమని భావింపక దాని వెంట పరుగెత్తెను. కనుక స్త్రీ సాంగత్యమునకు లోనుకవ కాని వాడు లేడు. నా నాభినుండి పుట్టిన చతుర్ముఖుడే ఇట్లు చేయగా వానిచే సృష్టింపబడిన మరీచి మొదలగువారు, కశ్యపుడు మొదలగువారు, వారిచే సృష్టింపబడిన దేవతలు, మనుష్యులును, స్త్రీ నిమిత్తముగా మాయకు బద్ధులు కాని వారు లేరు. మనస్సు దెబ్బతినని వారు లేరు. స్వయముగా భగవంతుని స్వరూపమైన నారాయణ ఋషి యొక్కడే స్త్రీ సంగమునకు లొంగనివాడు.

1006. స్త్రీ రూపమున పురుషులకు మోహము గలుగుట నా మాయవలన జరుగుచున్నది. కనుక పురుషులు స్త్రీల సంగము మాని యోగాభ్యాసపరులై యుండవలెను.

1007, 1008. ధీరులై నా పాదపద్మములను సేవించు నభిలాష చెందినవారు స్త్రీ సాంగత్యము నరక ద్వారమని భావింతురు. విష్ణువు మాయచే నిర్మింపబడిన స్త్రీ యొక్క రూపము పురుషునకు గడ్డితో కప్పబడిన బావివంటిది. అది మృత్యువును కలిగించును.

1009. ధనము, పశుసంపద, మిత్రులు, పుత్రులు, భార్య, ఇల్లు మొదలగున వన్నియు తనకోసము తా నేర్పచుకొనునవియే. ఇన్నిటికి కారణమైన ఈ శరీరమున గల జీవుడు అనేక కర్మ లాచరించును. కనుక చనిపోయి మరల శరీరమెత్తినపుడు పూర్వము చేసిన కర్మలఫల మనుభవింపక తప్పదు. ఆకాశమున కెగిరినను, భూమిలో దూరినను, దిక్కులకు పరుగెత్తినను, ఎచ్చట దాగినను, కర్మఫల మనుభవింపక తప్పదు.

1010. మగవాని దేహమును ధరించిన జీవుడు నిరంతరముగా స్త్రీ సాంగత్యము ననుభవించినచో స్త్రీయై పుట్టును. స్త్రీని వివాహ మాడి పురుషుడు ఆమె కొరకు డబ్బు సంపాదించును. కుటుంబ వస్తువులు సమకూర్చుకొనును. స్త్రీ వలన సంతతి కలుగును. వీరందరుండుటకు గృహ మావశ్యకము. ఇన్నిటికిని కారణము కాంతయే. స్త్రీ దేహము ధరించిన జీవుడు మరల నా మాయచే పురుషుడుగా పుట్టి ధనసంపాదనాదులను చేయును.

స్త్రీ గూడ భర్తకొరకే అన్నిటిని సమకూర్చుకొనవలెను. కనుక పురుషరూపధారియైనవాడు భర్త యనబడి స్త్రీకి సంసారబంధ కారణమగును. సంసారబంధమే మృత్యువు.

లింగదేహము జీవునకు నాధారముగా నిలిచి యున్నది. (లింగదేహమనగా తన నామము, రూపము, బంధుత్వము, ఆస్తి మొదలగు వాని స్మరణరూపమైన దేహము Identities consciousness. ఇచ్చట లింగమనగా చిహ్నమని యర్థము. తన్ను గూర్చి తా నెరిగిన స్మృతులన్నియు నొక ముడివలె ఏర్పడినదే లింగ దేహము) దాని వలన పాంచ భౌతిక శరీరమున నుండి ప్రజ్ఞ అనేక లోకములలో విహరించును. కూడబెట్టుకొనిన కర్మలఫలము అనుభవించు చుండును. ఈ యనుభవముల వలన మరల కర్మల యందాసక్తి పుట్టుచుండును. జీవునకు మనస్సు, ఇంద్రియములు, పంచభూతములతో నిండిన దేహము సుఖము లనుభవించుటకు సాధనమైనను ఆ సుఖాసక్తి వలననే మృత్యువును కలిగించును. ఏ దేహము సుఖముల నిచ్చునో ఆ సుఖముల వలన ఆ దేహమే శుష్కించుటయు నశించుటయు జరుగును. అడవిలో వేటకాడు జంతువులకు సదుపాయములైన యాకర్షణలను సమకూర్చి ఆ జంతువులను చంపుచున్నాడు కదా! ఇట్టి దేహము తొలగుటయే మరణము. పుట్టుటయే జననము. (అంతకన్న జీవికి జనన మరణములు లేవు.)

కన్నుయొక్క పరిమితిని బట్టియే చూడగల్గుట యుండును. (కొందరు చూచినదానిని చూచినంత వరకే గ్రహింప గలరు. మరికొందరు చూచి యనేక విషయములను గ్రహింప గలరు.) చూడగలిగిన యోగ్యత ననుసరించి జీవునకు మరణము లేదని తెలియును. (దేహము వరకే చూడ గలిగినచో జననమరణము లున్నవని తెలియును. దేహము యొక్క వృత్తాంతమును దర్శింప గలిగినచో జననమరణములు లేవని తెలియును.) కనుక భయము, లోభము, దీనత అనావశ్యకములు. కంగారు పడ నక్కర లేదు. జీవుని వృత్తాంతమును సమగ్రముగా తెలిసి, జీవుడు ధీరుడై సంగమును విడుచును. యోగాభ్యాసములో వైరాగ్య మార్జించి, సక్రమమైన సంపూర్ణ జ్ఞానమును పొంది

వర్తింపవలెను. మాయచే నేర్పడిన లోకమున పుట్టి పోవుచుండు దేహాదులయందు ఆసక్తి మాని జీవింపవలెను.

( ఈ మొత్తము ఘట్టమునందు జీవుని జననమరణములతో కూడిన సంసారము యొక్క అనుభవము సంగ్రహమైన వృత్తాంతముగా చిత్రించబడినది. గర్భనరకము, జరామరణ దుఃఖ దోషాదుల బాధలు, బాలయవ్వనాది స్థితులలోని బాధలు, దుస్సాంగత్యము వలన గలుగు బాధలు, ఇహలోక నిర్వాహణము నందలి బాధలు చెప్పబడినవి. దీనిని బట్టి జీవితము దుఃఖమయ మని అర్థము కాదు. ఎట్లు ప్రవర్తించిన యీ జీవితమంతయు దుఃఖమయమగునో, ఎట్లు ప్రవర్తించిన ఆనందమయమగునో వేరువేరుగా తెలుపబడినది. సాంఖ్యము, యోగము, భక్తి సమన్వయించి జీవు డానందమయుడని, కేవల పరబ్రహ్మమని స్థాపింపబడినది. ఆ మార్గ మవలంబింపనిచో సంసారికి నిరంతర దుఃఖము తప్పదని తెలుపబడినది.

ఇందు వైరాగ్యము కొరకై స్త్రీనింద చేసినట్లు కనుపించును. కాని యిచ్చట చేయబడినది స్త్రీసంగమును గూర్చిన నిందయే కాని, స్త్రీనిందకాదు. సంగమనగా మన స్సాకచోట అంటు కొనుట. సంగములలో స్త్రీ సంగము మిక్కిలి హానికరమని నిరూపింపబడినది. అట్లే స్త్రీకి పురుష సంగము కూడను. దీనినిబట్టి స్త్రీపురుష సంబంధమైన యాకర్షణము (Sex attraction) నాధార ముగా జేసికొని జీవితముతో చెలగాట లాడరాదని తెలియవలెను. స్త్రీపురుష సంబంధములోని సుఖము ప్రజాసర్గమునకేగాని, మరి యొక ప్రయోజనమునకు కాదని తెలియవలెను. ఈ విలువలు తెలియనంతవరకు సంగమును గూర్చి జన్మాంతము జాగరూకత వహింపవలెను.

చతుర్ముఖుడు సరస్వతి వెంటపడి ఆమెతో క్రీడించెనన్న ఇతిహాసము కేవలము సంకేతము. ఇది వేదవాఙ్మయమునందును కలదు. దీని ప్రయోజనము వేరు. జ్ఞానమునుండి వాక్కును సృష్టించుకొనగా జ్ఞానము ఆ వాక్కు వెంటపడి యందలి శబ్దార్థము

లుగా క్రీడించెనని దీని పరమార్థము. దీని నవగతము చేయుటకు కవిసమయముగా నీ ఇతిహాసము చెప్పబడినది. ప్రస్తుత కథలో దాని ప్రయోజనము స్త్రీ సాంగత్యము తగదని మాత్రమే. చతుర్ముఖుడంతటివాడు కూడ స్త్రీ సంగమున పడుటకు వీలున్నదని చెప్పుట మాత్రమే ఇందలి పరమార్థము. అర్థవాద కథలలో చారిత్రకసత్యముతో సంబంధ మక్కరలేదు. విషయము సుబోధకము చేయుట మాత్రమే వీని ప్రయోజనము. అసత్యమాడినచో నష్టము కలుగునని చెప్పుట కుదాహరణముగా నొక బ్రాహ్మణుడు అడవికి పోయెననియు, వానితో పోయిన వాని కుమారుడు "నాన్నా! పులి" అని అరచెననియు, తత్ఫలితముగా నిజముగా పులివచ్చినపుడు రక్షణలేక చచ్చెననియు కథ చెప్పుదురు. ఇచ్చట ఈ బ్రాహ్మణుడు ఏ దేశము వాడు? క్రీస్తుకు పూర్వమువాడా? తరువాతవాడా? ఈ కథ జరిగినట్లు ఆధారములు చూపగలవా? అని అడిగినవాడు మూర్ఖుడు.)

1011. కొందరు గృహస్థాశ్రమము నిర్వర్తించుకొనుటకై ధర్మార్థకామములను చక్కగా సాధించుకొని, ధర్మమార్గమున తమ కర్తవ్య మాచరించి, దానివలన అర్థసంపద లార్జించి, కామములను నెరవేర్చుకొందురు. ప్రయత్నమున లభించిన స్థితిగతులకు సంప్రీతి చెందుచు, వేదములయందు నిర్ణయింపబడిన మార్గమున భగవంతునిపై భక్తి నభ్యసింపక కేవలము వేదము నందలి దేవగణములను పూజించుచు, యజ్ఞ యాగాది క్రతువులు చేయుచు, భక్తితో పితృకర్మలాచరించుచు సజ్జనులై ప్రవర్తింతురు. ఇట్లు దేవ పితృ కర్మలయందు గొప్పవారై సత్కర్మపరులై కోరికలు తీర్చుకొనువారు మోక్షమును పొందరు. ధూమగతి యనబడు చంద్రలోకమును పొందుదురు. తాము చేసిన సత్కర్మల పుణ్యము లనుభవించుచు, ఆ లోకములలో నుందురు. అనుభవముతో పుణ్యము తరిగిపోవును. అప్పుడు మరల భూలోకముననే తిరిగివచ్చి జన్మింతురు.

( సజ్జనులు, ధర్మపరులు, శమదమాది గుణ సంపన్నులు, వేదోక్తములైన యజ్ఞయాగాది క్రతువు లాచరించువారు, యోగాభ్యాసము చేయువారు, తత్త్వ జ్ఞాన మభ్యసించువారు,

అనబడు విశిష్టులలో అందరును మోక్షమును పొందలేరు. సకామముగా వీని నాచరించువారు అపారమైన పుణ్యమును మాత్రము పొందుదురు. సత్కర్మలచే సత్ప్రవర్తనచే నార్జించబడిన పుణ్య మెంతటిదైనను, కూడబెట్టుటకేగాని, అనుభవించుటకు పనికిరాదు. అనుభవించినచో తరిగిపోవును. ఇట్లుకాక, భగవదర్పణముగా వీని నాచరించినవారు, మోక్షాపేక్షకూడ లేనివారు మోక్షమును పొందుదురు. ఇది తరిగిపోవునది కాదు. శాశ్వత సుఖముపై సత్కర్మలతో భక్తియోగము కూడ జతపరచి, సమర్పణబుద్ధి కలిగినచో మాత్రమే మోక్షము వచ్చును. అది లేనిచో సత్కర్మలన్నియు సుఖము నిచ్చును. ఆ సుఖము చంద్రలోకమునకు సంబంధించినది. అనగా పెరుగుట, తరుగుట యను కళలు గలది. చంద్రుడు మనస్సున కధిపతి కనుక వారు పొందునవి మానసిక సుఖములు.

మోక్షమార్గమును అర్చిర్ మార్గమనియు, పుణ్యలోకముల మార్గమును ధూమ్ర మార్గమనియు శాస్త్రములు చెప్పుచున్నవి. అర్చి అనగా వెలుగు. ధూమ మనగా పొగ. మోక్షమార్గము వెలుగుదారి. భోగమార్గము పొగ దారి. కాష్ఠము కాలుచున్నపుడు భస్మము, పొగ, మంట వ్యక్తమగును. భస్మము వంటిది భౌతిక సృష్టి. పొగవంటిది మానసిక సృష్టి. మంట వంటిది ఆత్మ. దాని కేదియు నంటదు. అది యంటినది భస్మమగును. జీవులలో గూడ ఈ మూడు తత్త్వములున్నవి కదా! సృష్టిలో కూడ నున్నవి. దీనిని బట్టియే ఈ మార్గములకు ఈ పేర్లు పెట్టబడినవి.

ఏ వస్తువైన తగులబడుట యనగా స్థూలము నుండి సూక్ష్మమునకు ప్రయాణము. పరమాత్మయందు మాయావశమున సూక్ష్ముడైన తాను స్థూల స్థూలముగా దిగివచ్చి, భౌతిక సృష్టి యగుట, స్థూల తత్త్వములు జీవుని మార్గమున సూక్ష్మసూక్ష్మముగా ఆత్మమయము లగుట, నిరంతరము జరుగుచుండును. ఆత్మయే దిగివచ్చి సృష్టి యగుచున్నది. సృష్టియే ఆరోహణ చేసి పరమాత్మయందు లయమగుచున్నది. ఇట్లు సృష్టిలో దిగి వచ్చు దారి యొకటి, ఎక్కిపోవు దారి యొకటి కలవు. మొదటి దానిని

కృష్ణగతి యనియు, రెండవ దానిని శుక్లగతి యనియు చెప్పుదురు. ఇవియే ధూమ్రమార్గము, అర్చిర్ మార్గము. మన మెరిగిన సృష్టిలో "నిప్పుమంట, వెలుతురు, పగలు, శుక్లపక్షము, ఉత్తరాయణము ఊర్ధ్వగతులు ; పొగ, చీకటి, రాత్రి, కృష్ణపక్షము దక్షిణాయణము, అధోగతులు" అని గీతలో చెప్పబడియున్నది. కృష్ణగతి వలన జీవుడు గర్భస్థు డగుచున్నాడు. శుక్లగతి వలన విమోచనము చెందుచున్నాడు. వీని నెరిగి జీవితమున సమన్వయము చేసికొను వారు గర్భములకు తిరిగి వచ్చుటగాని, రాకుండ మోక్షమార్గము చెందుట గాని జరుగుచున్నది.

చంద్రుడు పితృలోకముల కధిపతి. పితృదేవతలు మనలో చంద్రలోకమున పనిచేయుదురు. అనగా మనస్సునందును, స్త్రీ పురుష సంబంధము నందును, గర్భధారణము, పిండోత్పత్తి, దేహ కల్పనముల యందును పని చేయుదురు. పితృకర్మల నాచరించి వేదోక్తముగా పితృదేవతల నారాధించుట యనగా సక్రమమైన గృహస్థాశ్రమమున సత్సంతతిని పొందుట. ఇట్టి సుఖములకై వేదోక్త కర్మ లాచరించువారు చంద్రలోకమున నుందురు. నిష్కాములై భగవదర్పణముగా అవే వేదోక్త కర్మలను ఆచరించిన వారు గృహస్థులైనను, సంతతిని పొందినను, సూర్య మార్గము పట్టి సూర్యమండల భేదనము చేయుదురు. అనగా మోక్షమును పొందుదురు. చంద్రలోకము వారికి సంపదలనగా వారు కోరినవి. సూర్యలోకము వారికి సంపదలనగా వారు కోరనివి, వారి నర్చించునవి.

(ఒక యుదాహరణము : మహాధనవంతుడైన యొక వైశ్యునకు ఇద్దరు పుత్రులు. తండ్రి ఆ యిద్దరకును చెరియొక పదిలక్షల రూపాయ లిచ్చెను. సంవత్సరము తర్వాత ఆ ధనము వినియోగముచేసి, మరల తన దగ్గరకు రమ్మనెను. అందు పెద్ద కొడుకు ముత్యాలు బొంబాయి పోయి, యొక బంగళా అద్దెకు తీసుకొని, కారుకొని, భార్యతో విహరించుచు, సకల సుఖము లనుభవించెను. సంవత్సరము తిరిగి వచ్చుసరికి సొమ్ము ఖర్చై పోయెను. రెండవ కొడుకు సత్యాలు తన పదిలక్షలలో పండ్రెండు వేలు వేరుగా తీసికొని తనపేర నుంచుకొనెను. దానిని సంవత్సరము

పొడుగునా తనకును భార్యకును కావలసిన కుటుంబ వినియోగము చేసెను. మిగిలిన ధనము పెట్టి తెలివిగా వాణిజ్యము చేసెను. మరి పదిలక్షలు సంపాదించెను. సంవత్సర మగుసరికి ముత్యాలు తండ్రికి వట్టిచేతులు చూపించెను. సత్యాలు తాను సంపాదించిన పదిలక్షలతో కలిపి తండ్రి యిచ్చిన సొమ్ములో పండ్రెండు వేలు పోను మిగిలిన దానిని కలిపి లెక్కల పుస్తకము లను, ఉన్న రొక్కమును తండ్రి పాదముల దగ్గర నుంచెను. ముత్యాలు అవలంబించిన మార్గము వంటిది పుణ్యఫలము. సత్యాలు అవలంబించిన మార్గము వంటిది మోక్షపదము. ఈ రెండవదానికి కావలసినది నిస్సంగత్వము. అనగా తన డబ్బు కాదనుకొన్న దానిని వాడుకొనకుండుట, సద్వినియోగము చేయుట. మిగిలిన సద్గుణము లిద్దరకును సమానమే)

1012, 1013. ఆదిశేషుని శయ్యగా గొని, నారాయణుడు యోగనిద్రలో నున్నపుడు లోకము లన్నియు వానియందు లయ మగును. అట్టి నారాయణుని కొల్చువారు కొందరు. (నివృత్తి ధర్మము దేవుని స్వరూపముగా నారాధించువారని యర్థము. లోకములను తన యోగనిద్రలోనికి ఉపసంహరించుకొనుచున్న నారాయణు నర్చించువారు అనగా ఇంద్రియార్థముల నుండి ఇంద్రియములను మనస్సులోనికి, మనస్సు నాత్మలోనికి, నుప సంహరించుకొనువా రని యర్థము. వీరు ప్రకృతి కతీతులై నిష్కామమూర్తులై మోక్షమునందు కూడ కోరికలేని భగవత్ స్వరూపులు. వీరి మార్గము భక్తియోగము.

1014. తమ భక్తి మహిమతో తమ సమస్త ధర్మములను నారాయణుని యందు సమర్పణముచేసి, దేనియందును సంగము లేక శాంతమూర్తులై వర్తింతురు. వారి మనస్సులు పరిశుద్ధ ములు. వా రితర ధర్మములను పాటింపరు. అన్నిటియందును నారాయణునే ధ్యానింతురు.

1015. వారి కహంకార మమకారములు లేవు. అయినను వారి కుతూహలము నారాయణునిపై వర్తించును. వారి దేవుడు అర్చనాది మార్గమున గోచరించువాడు. లోకమందలి మహనీయ

చరిత్రము లన్నియు వానివే. అందరి ముఖములు వాని ముఖములే. కీర్తిమంతుల కీర్తి యతడే. సృష్టి స్థితి లయము లతనియందే తోచుచున్నవి. అత డున్నాడు కాని పుట్టడు. అతడు ప్రకృతి యందును పురుషుని యందును ఉన్నాడు. వాని కతీతుడుగా కూడ నున్నాడు. ఈ అతీతుడే పురుషోత్తము డనబడును. ఇట్టి లక్షణములతో నారాయణు నర్చించి, ఇక తిరిగిరాని మార్గమున దివ్యతేజస్సుతో వెలుగొందు చుందురు. వారికి జన్మములు లేవు. వారే నిత్యశూరులు.

1016. కొందరు దేవుడను పేరుతో హిరణ్యాగర్భుని గొలుచు చున్నారు. ( దేవుని యీ సృష్టియం దంతర్యామిగా మాత్రమే కొలుచుచు దీని కతీతుడగు పురుషోత్తముని ఆశ్రయింపనివారు. ) వారు సత్యలోకమున నుండి చతుర్ముఖుని పరమాత్మగా ధ్యానించు చున్నారు. వారు చతుర్ముఖుడు బ్రతికియున్నంత వరకు వాని యందు సత్యలోకమున నుందురు. రెండు పరార్థములు పూర్తి యైన వెంటనే బ్రహ్మకు ప్రళయము వచ్చును. అంతవరకు వారు బ్రహ్మయం దుందురు. ఇంతలో బ్రహ్మ లయమగుటతో పంచభూతములు, మనస్సు, ఇంద్రియములు, తన్మాత్రలు, వాని లోకములుకూడ సర్వేశ్వరునియందు లీనమగును. అపుడు వారు బ్రహ్మలోకముపై నభిమానము వదలి బ్రహ్మతోగూడి, పురాణ పురుషునిలో ప్రవేశించి లీనమగుచున్నారు. ( సృష్టిలో నంత ర్యామిగానున్న దేవుని మాత్రము పూజింపగలవారు సృష్టియు, సృష్టికర్తయు లీనమగు వరకు ప్రజ్ఞామయులై యుందురు. అటు పైన సృష్టితోపాటు నారాయణుని యందు లీనమగుదురు. )

( దీనికొక యుదాహరణము. మన భూమిపైనొక మహాను భావుని దేహమున నెముకలలో నున్న సున్నము గూడ మహాను భావునితో పాటు గౌరవింపబడును. అతడు దేహమును వదలిన వెనుక అది భూమిలోని ఖనిజముల యందలి సున్నముతో కలియును. ఖనిజములలోని సున్నమట్లు గాక ఎందరో మహాను భావుల యెముకలుగా నైనను సేవ చేయగలదు. భూమిలోని సున్నమువంటివారు పరబ్రహ్మము నారాధించువారు. మహాను భావుని యెముకలలోని సున్నమువంటి వారు హిరణ్య గర్భ

నారాధించువారు. ఈ భేదము తెలియుటకే భగవద్గీతలో పురుషోత్తమప్రాప్తి యోగము ప్రసాదింపబడినది )

కనుక నీవు సర్వజీవుల హృదయ పద్మము లందున్న పరబ్రహ్మమునే సర్వ భావములతో శరణాగతి చేయుము. అతని అనుభవము ఎల్లయెడల వినబడుచుండును. ( వాక్కు నుచ్చరించి విన్నచో అతడే వాక్స్వరూపుడై వినబడును. అందరి కంఠ ధ్వనులలో శబ్ద బ్రహ్మ స్వరూపుడై తన్నుచ్చరించుచున్న మూర్తిగా దర్శన మిచ్చును. ) అతనిని గూర్చి యొక లోపము చెప్పుటకు వీలులేదు. కంటికి ఏ సాధనములు అక్కరలేక యే సూటిగా పొరలుదాటి అతడు సర్వ జీవులుగా దర్శన మిచ్చుచుండును. అతనికి సుఖదుఃఖములుగాని, జనన మరణములుగాని, వ్యక్తావ్యక్త స్థితులు గాని లేవు. అతనిని పురుషుడని భావించి శరణాగతి పొందుము. ( దేవహూతికి పురుషుడు తన భర్త. కనుక కర్దమ ప్రజాపతిని ధ్యానించి నారాయణుని మోక్ష స్థితి పొందుమని యభిప్రాయము. కపిలాచార్యుడు గురువై సర్వము నుపదేశించినను, జీవునకు నారాయణునకు గల సంబంధము భార్యాభర్తల సంబంధము వంటిది. కనుక దేహహూతి కర్దమ ప్రజాపతినే ధ్యానించి మోక్షము పొందవలెను. కపిలాచార్యుని తన కిచ్చినది గూడ కర్దముడే కదా! దైవము నందించువాడే గురువు. )

1017. స్థావరములకు, జంగమములకు కూడ నంతర్యామియై శబ్దబ్రహ్మ మూర్తిగా వినబడు వేద స్వరూపుడై, అన్నిటి కతీతుడై యున్న పరబ్రహ్మమునే సేవింపుము. యోగీంద్రులు, సనకసనందనాది కుమారులు, సిద్ధులు, మునులు, దేవతలు వానినే పూజింతురు. యోగాభ్యాసమును వాని పరముగనే ప్రవర్తింపజేయవలెను. తాను సగుణమూర్తియై యిన్నికోట్ల రూపములతో దర్శన మిచ్చుటలో నర్థ మేమి? తనను దర్శింపుమని యర్థము.

1018. అతడే కాలకాలముల యందును తన మహనీయ గుణముల కలయికలచే యిన్ని రూపములుగా దిగివచ్చుచుండును. అతడే యీ ఋషులుగా, దేవతలుగా రూపములు ధరింపగా అందు సముచితములైన కర్మలను నిర్మింపగా అం దేర్పడిన ఋషు

లును, దేవతలును ఆ కర్మలనే ఆచరించి, అతని మహిమలనే పొంది, ఆ మహిమల వలననే తమతమ పదవు లలంకరించి, సృష్టి కధికారము వహించి, తమ పనులు నిర్వర్తించి, తిరిగి వానిలోనికి వచ్చుచున్నారు.

మరికొందరు తమ కర్మ లాచరించుటలో వానియందు మనస్సు నిలిపి, శ్రద్ధతో ఆ కర్మలు తమవిగా నాచరించి, నిషిద్ధములైన కర్మలు మాని, వర్తించుచున్నారు. వారికి తమ తమ నిత్యనైమిత్తి కాచారములందు మిక్కిలి శ్రద్ధ యుండును.

1019. దానితో పరబ్రహ్మమును మరచి తమ పుణ్య కర్మలయందు ఆదరమును పెంచుకొందురు. వారికి కోరికలు కలుగును. ఇంద్రియములను జయింపలేరు. అట్టివారు పితృ దేవతలను పూజించుచు, గృహములయందు వర్తింతురు. వారి దృష్టిలో వర్ణాశ్రమ ధర్మములు పుణ్యకర్మలేగాని, అంతర్యామియు, వానికి సమర్పణ బుద్ధియు నుండదు. వీరిని త్రివర్గ పురుషు లందురు.

(త్రివర్గ జీవు లనగా ధర్మార్థకామముల సమన్వయమేగాని, మోక్ష మెరుగనివారు. పితృగణములను పూజించుట యనగా కామ్య యజ్ఞములచేతను, పుష్టియైన యాహారము చేతను, ఔషధాదుల చేతను, పుంస్త్వమును కాపాడుకొని, స్త్రీ సుఖమున నెక్కువ సంతోష మనుభవించి, బలిష్ఠమగు సంతతిని పొందుట.)

1020. అట్లుగాక సర్వాంతర్యామియైన నారాయణునకు శరణాగతి చేయవలెను. అతనిని, భజించి, ధ్యానించి, వాని కథలు వినుట మాని, వివేకము లేనివారు దుష్కథ లనేకములను విని సంతోషించుచుందురు. ఎవరి రుచి వారిది. ఊరపంది నేతితో చేసిన తీపి వస్తువులు భక్షించునా? దాని బుద్ధి మలము వైపునకే లాగుచుండును. నారాయణుని కథలనగా అవతారముల దివ్య వృత్తాంతములు, మహనీయుల జీవిత చరిత్రలును. దుష్కథ లనగా చెడ్డవారి కథలు. వీని నెవరు చెప్పుకొందురని సందేహ పడరాదు. "వాడీ చెడ్డపనులు చేసెను. చూచితివా? ఆమె ఎట్టి పరిస్థితులలో భర్తను విడిచి మరి యొకని వెంట పోవలసి

వచ్చెను. ఆ ఇంటిలో అత్తా కోడండ్రకు పడదుట" అని చెప్పుకొనుటలో సంతోషము పొందువారు కలరు.)

1021. ధూమ మార్గమున సాధన చేసినవారు పితృలోకమైన చంద్రలోకమును పొంది నివసింతురు. అచ్చట తమ పుణ్యములు ఖర్చయిపోగా మరల తమ బిడ్డలకు పుట్టి గర్భనరకము మొదలు యమనరకము వరకును అనుభవించి, మరల కర్మఫలము ననుభవింతురు.

1022. కనుక యీ మార్గములు మాని సర్వభావములతో పురుషోత్తముని మనస్సున ధ్యానింపుము. జనన మరణములు లేని మోక్షస్థితి లభించును. (సర్వభావములనగా తల్లిదండ్రులుగా అన్నదమ్ములుగా, ఆలు బిడ్డలుగా, అధికారులుగా, సేవకులుగా అన్ని సంబంధముల యందును వానిని ధ్యానింపవలెనని యర్థము)

1023. వాసుదేవునియందు అభ్యసింపబడిన భక్తియోగము వైరాగ్యమును, జ్ఞానమును కలుగజేయును. వైరాగ్య జ్ఞానముల కన్న పరబ్రహ్మ సాక్షాత్కారమునకు వేరు సాధనములు లేవు. భక్తితో భగవంతునికి సమర్పింపబడిన చిత్తము యింద్రియ వృత్తుల యందు భగవంతుడుగనే వర్తించును. బాహ్య ప్రపంచ మందలి యింద్రియార్థముల యందు వర్తించుటలో సమపాళ ముండును. ఎక్కువగా గాని, తక్కువగా గాని వర్తింపదు. (ఎక్కువగా వర్తించుట యనగా స్నేహములు, స్త్రీ సుఖాదుల యందు వర్తించి దేవుని అస్తిత్వమును తన యస్తిత్వమును గూడ మరచుట. తక్కువగా వర్తించుట యనగా మౌనమని మాటాడ కుండుట, మితభాషిత్వమని మూతి బిగించుట, జ్ఞానమని మొగము ముడుచుకొనుట, ఆచారమని కటిక నేలపై పరుండుట, శరీర శిక్షణమని రుచిలేని పదార్థములు తినుట, వినయమని తన్ను నిందించుకొని పలుకుట, తన సమ్మకములని నాలుక పీకికొనుట, మొదలగునవి.) ఈ మనస్సునకు ప్రియమైనది, అప్రియమైనది యుండదు. మనస్సున కంటునది యుండదు. అందరి యందును వాసుదేవుడే కనుపించును గనుక సమదర్శన ముండును. అసహ్యించు కొనునది అభిమానింప బడునది యుండదు. తనలో నిండియున్న

ఆత్మచే అన్నిటిని దర్శించు చుండును గనుక ఆత్మనే దర్శించును. అట్టివానిలో దేవుడే తన జ్ఞానరూపమున, తన రూపమున యుండును. ఆ దేవుడే యొక్కడై యున్నను చూడబడువాడు, చూచువాడు, చూచుట కేర్పడిన నింద్రియములుగా మూడు రూపములలో దర్శన మిచ్చుచుండును. సమగ్రమైన యోగాభ్యాసము చేసిన వానికి కలుగు దర్శన మిది.

విషయముల నుండి మరలిన ఇంద్రియములకు నీచ గుణము లుండవు. వాని మనస్సే జ్ఞానము. దర్శింపబడునది నీచ గుణములకు తావులేని పరబ్రహ్మము. కంఠము నందుండి వెలువడు శబ్దమే భాషలుగా, అర్థములుగా వినబడుట మనస్సు చీలుట వలన కలుగును. శబ్దమే అర్థముల యాకారము ధరించును. అహంకారము త్రిగుణముల వలన మూడహంకారములుగా పనిచేయును. పంచ భూతములవలన అయిదహంకారములుగా పనిచేయును. (చర్మమున పుండు పుట్టినచో నాకు పుండు పుట్టినదని చెప్పుట, పృథ్వీతత్త్వమైన అహంకారము. మూత్రమున వ్యాధి యున్నచో నాకు వ్యాధి యున్నదనుట జలాహంకారము. జీర్ణవ్యాధి కలిగినపుడు నాకు జబ్బున్నదనుట అగ్ని తత్త్వాహంకారము. శ్వాసకు దోషము కలిగినపుడు నాకు జబ్బున్న దనుట వాయుతత్త్వాహంకారము. కంఠ ధ్వనికిని, వినుటకును వ్యాధి కలిగినపుడు నేను మాటాడ లేననియు, నాకు చెవుడు వచ్చినదనియు పలుకుట ఆకాశాహంకారము ) ఇంద్రియముల రూపమున పదునొకండు విధములైన యహంకార ముండును. ( కన్ను సరిగా పనిచేయనిచో నేను చూడలేకున్నాను యనుట, చేతికి పక్షవాతము వచ్చినపుడు నాకు పక్షవాతము వచ్చెననుట, మనస్సు భ్రమించుచున్నప్పుడు నేను భ్రమపడితిననుట, మొదలగునవి యూహ్యములు ) విరాట్పురుషుడు జీవులరూపుడై మెలగుచుండును. ఈ జగత్తే అతడు యిమిడి యున్న గ్రుడ్డు. ఈ సత్యమును దర్శించుటకు శ్రద్ధతో, భగవద్భక్తితో యోగాభ్యాసము చేయవలెను. మనస్సును తానుగా కూర్చుకొనవలెను. నిస్సంగముగా వర్తించి వైరాగ్యము పొందవలెను. నీవు ఈ లక్షణము లన్నియు కలిగియుండి, జ్ఞానులచే పూజింపబడదగు జీవితము కలదానవు గనుక నీకు చెప్పితిని

(అట్లు జీవితము నిర్వహించుకొనని వారికి చెప్పి లాభము లేదు.) అన్ని విధములైన యోగాభ్యాసముల వలన లభించువాడు నిర్గుణ పరబ్రహ్మమని జెప్పితిని. నాయందు భక్తితో సర్వము సమర్పణము చేయుమని కూడ చెప్పితిని. అందు మొదటిది జ్ఞాన యోగము. రెండవది భక్తియోగము. పరిణామమున రెండు నొక్కటే. ఒకే భగవంతుడు సృష్టిగా కన్నుల కొక రూపము నను, చెవుల కొక రూపమునను గోచరించుచున్నాడు గదా! అట్లే జ్ఞానయోగ భక్తియోగాదులును.

1024. అన్ని శాస్త్రములను చదివినను, అన్ని యజ్ఞములు చేసినను, అన్ని తీర్థములను గ్రుంకినను, అన్నివిధములైన జపము లవలంబించినను తపస్సులు చేసినను, అన్ని దర్శన గ్రంథములను చదివినను, యోగాభ్యాసముల నవలంబించినను, దానముల చేసినను నారాయణుడు కనబడడు. వెలుపలికి పోవుచున్న ఇంద్రియములను మలచి మనస్సు జయించి సకల కర్మలను సమర్పణచేసి, ఆత్మ తత్త్వము నెరిగి, వైరాగ్య మభ్యసించి ఫలితముల నపేక్షింపక స్వధర్మ మాచరించునట్టి వాడు మాత్రమే దుర్గుణములను విడచి హరిని దర్శించును.

1025. కనుక నీకు నాలుగు విధములైన భక్తియోగము లను వేరువేరుగా వివరించితిని (ఆర్తితో బాధలనుండి విముక్తికై యభ్యసించు భక్తి, కారణములను తెలిసికొనగోరిన భక్తి, ప్రయోజనముల కొరకేర్పడిన భక్తి, జ్ఞానభక్తి అనునవి నాలుగు విధములైన భక్తులు. "జ్ఞానమనగా నేను" అని గీతలో కృష్ణుడు చెప్పెను. "నాది" అనబడు సమస్తమును సమర్పణ చేసినపుడే నేను లభింతును.) నా సంకల్పము జీవుల యందు సృష్టి స్థితి లయముల రూపముగా నుండును. ఆ విద్యలో పుట్టిన కర్మలచే నిర్మించుకొనిన జీవుని మార్గము లనేకవిధములుగా నుండును. జీవాత్మ అవిద్యయందు, కర్మయందు ప్రవర్తించి, తా నిట్టివాడ నని తెలియక మెలగుచుండును. ఇది సాంఖ్య యోగ ప్రకారము. ఇది మిక్కిలి రహస్యమైన విషయము (వివరించి చెప్పినను రహస్యముగనె దాగి యుండునని యర్థము)

దీనిని దుష్టునకు, నీతిలేని వానికి, అర్థము చేసికొనలేని వానికి, దురాచారునకు, డాంబికునకు ఇంద్రియ లోలునకు చెప్పవలదు. భార్యా బిడ్డలు, ఇల్లు, ఆస్తి మొదలగు వానికై ఆసక్తితో త్రిప్పలు పడుచున్న వానికి చెప్పి లాభము లేదు. భగవద్భక్తి లేని వానికి, భక్తులను ద్వేషించువానికి చెప్పవలదు.

శ్రద్ధ, భక్తి, వినయము, సర్వభూత దయ, శాంత చిత్తము గల వారికి చెప్పుము. అసూయలేనివారికి, శుశ్రూషయందు ఉత్సాహపడువారికి, బాహ్యప్రపంచమున గల విలువగల విషయములపై వైరాగ్యము పుట్టిన వానికి, మాత్సర్యము లేని వానికి తెలుపుము. ఇతర స్త్రీలకై ఆశపడని వానికి, ప్రేమగల వానికి వివరింపుము. నా భక్తుల యందు ప్రేమగల వానికి తప్పక వివరింపుము. అట్టివారు ఈ విద్య కధికారులు.

శీలవంతుడైన పురుషుడుగాని, పతివ్రతయైన యుత్తమస్త్రీ గాని, శ్రద్ధాభక్తులు గలిగి మనస్సు నాయందు సన్న్యసించి దీనిని విన్నను, చదివినను నా దివ్య స్వరూపమును పొందుదురు. (దీనిని బట్టి స్త్రీలు బ్రహ్మవిద్యకు యోగాభ్యాసమునకు, వేదము చదువుటకు అర్హులు కారను కలిదోషవాదము అసత్యమని నిరూపింపబడినది. ఈ కథలో స్త్రీల కుపదేశింప వచ్చునని చెప్పుటయే కాక స్త్రీకే బ్రహ్మవిద్య యుపదేశింపబడినది.) ఈ వృత్తాంతము చెప్పి మైత్రేయుడు విదురునితో నిట్లనెను: ఇట్లు కర్దముని భార్య దేవహూతి మోహమునుండి విమోచనముపొంది, కపిలునకు సాష్టాంగ దండప్రణామము చేసెను. అతడు నేర్పిన తత్త్వమును, సాంఖ్యమును ప్రయోగించి అతని నిట్లు స్తుతించెను:

1026. నారాయణుడను పేరుగల దివ్యమంగళమూర్తియగు నీ రూపమునందు ఇంద్రియార్థములు, ఇంద్రియములు, మనస్సు, పంచభూతములు, సృష్టికి విత్తనములైన త్రిగుణములు, వాని ప్రవాహ కారణమైన కాలము భాగములై యున్నవి. ఇట్టి నీ రూపమును సాక్షాత్కరింప జేసికొనలేక నీ గర్భమున పుట్టిన చతుర్ముఖుడే ఎట్టకేలకు మనస్సున దర్శించెను. ఈ విశ్వమును భరించుటలో అనేక శక్తుల వర్గములను తన మనస్సున సృష్టించు

కొని, కొన్ని వేల శక్తులతో కూడియున్నవాఁడై అతడు సర్వసృష్టి కార్యములను నెరవేర్చుకొనుచున్నాడు. (నీలో ఈ శక్తులన్నియు నిమిడియున్న నీ రూపమును దర్శింపలేక, తన మనస్సుతో వివిధములైన శక్తులను పుట్టించుకొనెననియు, అయినను నీ యనుగ్రహమున సృష్టి నిర్వాహణమును చేయుచున్నాడనియును భావము. ఒకమారు నిన్ను చూచుచు, నొకమారు సృష్టి శక్తులను చూచుచున్నాడని మరియొక భావము.)

1027, 1028. మహాకల్పమనబడు పెద్దయుగము చివర నీవు కపట రూపమున శిశువై గర్భమున సమస్త జగముల నిముడ్చు కొని, మహాసముద్రము నడుమ చక్కని వటపత్రమను శయ్యపై నిలిచియుంటివి. (దీని ననుసరించియే సృష్టి కాద్యంతము లేర్పడు చున్నవి. దీని ననుసరించియే జీవుడుగూడ నొక జన్మ తీరిన వెనుక తన దేహాది సృష్టి లయము కాగా జలమయమైన తల్లి గర్భమున పవళించి యుండును.)

1029. అట్లు వటపత్రముపై పవళించి నీవు నీకాలి బొటన వ్రేలినుండి వెలువడిన యమృతమును గ్రోలితివి. నా పూర్వ పుణ్యము వలన నా గర్భమున పుట్టితివి. (అమృత మనగా ఆద్యంతములు లేనిది. సృష్టికి నారాయణుడు ఆదియు, నంతముగా ప్రళయమున శిశువై యున్నాడు. వాని యునికి ఆద్యంత ములు లేకుండ చేయుచున్నది. అంతమగు కాలివ్రేలిని, ఆది యను నోటియం దుంచుట అమృతత్వమునకు సంకేతము.

పాదాంగుష్టమున వెలువడిన యమృతమనగా నాకాశ గంగ. అది మేఘ రూపమున భూమికి వర్షించి, ఆవిరి రూపమున మేఘమున కెక్కుచున్నది. ఇది యతని నారాయణత్వ మనబడు అనాద్యంత తత్త్వమునకు చిహ్నము. నార మనగా జలము. అయన మనగా మార్గము. నారాయణ మనగా జలముల దిగివచ్చు మార్గము, ఆరోహణ చేయు మార్గము.)

1030, 1031. అట్టి నీవు వింతవింతల నీ విగ్రహములను నిర్మించి, మా కొసగుటకు పరవశపడుచుందువు. రఘురాముడు, కృష్ణుడు, వరాహమూర్తి, నారసింహుడు మొదలగు విచిత్రములైన

నీ యవతారమూర్తులను మా ధ్యానము కొరకై ప్రసాదించితివి. ఆ మూర్తులతోనే నీవు దుష్ట శిక్షణము, శిష్ట రక్షణము గలిగి వర్తించుచున్నావు. చక్కని ధర్మమునందు నిష్ఠగలవారికి వర్ణనీయములైన నీ నాలుగు తత్త్వముల విజ్ఞానమును ప్రసాదింతువు. నీ మహత్త్వము వర్ణించుటకు బ్రహ్మకైన నలవికాదు. వేదములు కూడ వర్ణింపలేవు. నే నెంతదానను? (చతురాత్మ తత్త్వములనగా వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ వ్యూహములు.)

1032, 1033. నీ మంగళ నామ స్మరణమునను, కీర్తనమునను హీనులు గూడ శ్రీమంతు లగుదురు. అగ్నిష్టోమము మొదలగు యజ్ఞములు చేసినవారికన్న గొప్పవా రగుదురు.

1034, 1035. కుక్కమాంసమును తినువాడైనను, నీనామ స్తుతి తన జిహ్వాగ్రమున అనుసంధానము చేసినవాడైనచో వానికి బ్రాహ్మణుడు కూడ సాటిరాడు. ఇది చిత్రము.

1036. లోకమందలి ఆత్మలలో నిన్ను తెలిసి సజ్జనులు జగత్పావనములైన నీ గుణ కథామృతములను గ్రోలినచో సర్వ తీర్థముల యందు స్నానము చేసిన ఫలితమును పొందుదురు. వారి నోట సమస్త వేదములు పలుకును. వారు ధన్యులు, పూజ్యులు, ఉత్తములు.

1037. నీవు పరబ్రహ్మవు. అంతర్ముఖమైన మనస్సున గోచరించువాడవు. సమస్త జనుల పాపములను నివారించుటకై వారిలో స్వయంప్రకాశ మూర్తిగా నున్నావు. వేద స్వరూపుడవు. అట్టి నీకు నమస్కరించెదను. అని దేవహూతి స్తుతింపగా కపిలుడు కరుణార్ద్రహృదయుడై తల్లితో నిట్లనెను.

1038. సుఖరూపము, మోక్షదాయకమునగు నీ యోగ మార్గమును నీకు వివరించితిని. దృఢమైన భక్తితో దీని ననుష్ఠింపుము. (ఇచ్చట యోగమార్గ మనగా నొక్కటిగా సమన్వయించు మార్గమని యర్థము.)

1039. నీకు జీవించియుండగనే ముక్తి కలుగును. ఇష్టము లేని వారికి దీనిని బోధింపజూచినచో మృత్యుభయము కలుగును, దుఃఖము దూరమగును.

1040. అని యిట్లు దేవహూతికి కపిలుడు వినిపించెనని విదురునకు మైత్రేయుడు చెప్పెను.

1041. మరియు నిట్లు చెప్పెను. కపిలు డుపదేశించి వెడలి పోయెను. అతని యోగమార్గమున జ్ఞానము పొందియు దేవహూతి కపిలుని యెడబాటు సహింపలేకపోయెను. ఇట్టి పుత్రుని ప్రసాదించిన కర్దముని స్మరించెను. కాని మనస్సు నిలువలేదు. దూడ కనుపింపని గోవువలె తల్లడిల్లుచు కపిలుని తలచుకొను చుండెను. ఆ స్మరణలో తన భర్త సాధించి పెట్టిన ప్రదేశము లను పరిత్యజించెను.

1042. పరిమళ పుష్పములతో పండిన తియ్యని ఫలము లతో చిగుళ్ళతో నిండిన వనములను, కాపునకు వచ్చిన మామిడి తోటలను, ఆ వృక్షములపై విహరించుచున్న చిలుకల యాలాపము లను కలిగిన కర్దముని యుద్యానములను, తపోవనమును, పద్మము లతో గూడిన కొలనులను, వాని తీరములయందు పెంచబడిన పొదరిండ్లను పరిత్యజించెను.

1043, 1044. కర్దముడు భార్య సుఖమునకై సాధించిపెట్టిన చక్కని భవనమున్నది. అందు స్ఫటికముల స్తంభములు, మరకతముల గోడలు, జాతి వజ్రముల గవాక్షములు, నీలమణుల మెట్లు, చంద్రకాంత శిలల వేదికలు, పగడాల మండిగములు, రత్నములు తాపిన బంగారు తలుపులు, విశాలమైన శాలలు గలిగి ఆ భవన మొప్పారు చున్నది. పాలనురుగుల వంటి యేనుగు దంతముల కోళ్లతో చేయించిన మంచము లున్నవి. తళుకు గల పట్టుపాన్పు లున్నవి. నట్టిండ్లలో బంగారు పీటలున్నవి. దేవ హూతి ఇన్నిటితో గూడిన సౌధమును పరిత్యజించెను.

1045. ఆవరణలో దొరువు లున్నవి. అందు విచ్చిన కలువల, తామరపూల వాసనలతో మందమారుతుడు విహరించు చుండును. తమ్మిపూలలోని తేనె త్రాగి మదించిన తుమ్మెదల ఝంకారములు వినిపించుచున్నవి. ఒకనాడు ఇంద్రలోకము నందలి సుందరీ జనము అచ్చటకు దిగివచ్చి యామెకు పరిచర్యలు చేసిరి. ఇట్టి సమస్త వైభవములను సన్యసించి దేవహూతి తన

వంపులు తిరిగిన ముంగురులను జడలు కట్టించుకొని సరస్వతీనది యందును, బిందుసరము నందును మూడు వేళల స్నానము చేసి యుగ్రతపస్సులు చేయుచుండెను. దేహము శుష్కించెను. కుమారుని ప్రసన్న వదనముపై దిగులు చెందినదై కపిల నామముచే నారాయణ ధ్యానము చేయుచు భక్తి యేరులై ప్రవహింపగా వైరాగ్యము కలిగెను. అనుష్ఠానమున మనస్సు నిర్మలమై బ్రహ్మజ్ఞానము సిద్ధించెను. (ఎంతగా విని యుపదేశ మందినను జీవిత సన్నివేశములను సన్యసించి యభ్యసించిననేగాని బ్రహ్మవిద్య యబ్బదనియు, జ్ఞానవైరాగ్యములు లభ్యముకావనియు దీనివలన నిరూపింపబడినది.)

1046. ఆత్మలకు నాయకుడు, అన్ని దిక్కుల ముఖములు గలవాడు, మాయాంధకారమును పోగొట్టువాడు నగు పరబ్రహ్మము నందు నిష్ఠ కుదిరెను. తత్త్వజ్ఞానము ప్రకాశించెను. జీవత్వము తొలిగిపోయి నిర్మల పరబ్రహ్మ సమాధి సిద్ధించెను. పునరావృత్తి లేని స్థితి కలిగినది.

1047. కలలో కనుపించిన వస్తువులను మెలకువ చెంది చూడలేని మనుజునివలె దేవహూతి తన యస్తిత్వము మరచెను. పొగలేని అగ్నివలె వెలిగెను.

1048. యోగశక్తిచేత దేహమునుండి ఆకాశములోని కెగిరి దయామయుడైన వాసుదేవుని పదములయందు హృదయము నిలిపెను.

1049. కపిలుడు చెప్పిన మార్గమున దేవహూతి నారాయణుని యందు గలిసెను. ఆమె ముక్తి పొందిన పుణ్య భూమికి సిద్ధిపద మని పేరు కలిగెను.

తల్లిదగ్గర సెలవు తీసుకొని బయలుదేరిన కపిలుడు సమస్త దేవ, గంధర్వ, సిద్ధ, చారణ మునివరులచే స్తుతింపబడుచు, సముద్రునిచే పూజలంది గౌరవింపబడి నివాస గృహమును పొందెను. సాంఖ్యాచార్యులచే స్తుతింపబడిన యోగ మవలంబించి లోకత్రయ శాంతికొరకు తండ్రి యాశ్రమము విడచి నుత్తర దిక్కుగా నడచిపోయెను.

ఈ వృత్తాంతము చెప్పి మైత్రేయుడు విదురునితో నిట్లనెను: ఈ కపిల-దేవహూతి సంవాదము మిక్కిలి పవిత్రము. ఇతని యోగ మార్గమును భక్తితో నధ్యయనము చేసినవారు పుణ్యాత్ములై నారాయణుని పాదపద్మములను పొందుదురు. ఇట్లు మైత్రేయుడు కీర్తించెనని పరీక్షిత్తునకు శుకయోగి చెప్పెను. సూతుడు శౌనకాదుల కీ కథ చెప్పగా వారు సంతుష్టహృదయులై నిట్లనిరి : "మహర్షీ! నీనోట భగవత్కథామృతము నెంత గ్రోలినను మా మనస్సులకు తృప్తి లేదు. ఇంకను తరువాత వృత్తాంతము తెలుపు" మని కోరిరి.

1050. సీతాదేవి మనస్సను నిర్మల పద్మమునకు తుమ్మెద వంటి వాడా! మంచి గంధము, శరచ్చంద్రుడు, మల్లెపువ్వు, శంకరుడు, తారకలు, రాజహంసలు, కర్పూరము వెన్నెల వలె ప్రశస్తినందిన విశాలమైన కీర్తిగలవాడా! చిరునవ్వు చిందుచున్న పద్మలోచనములు గలవాడా! నుదుట సంహారాస్త్రమున్న వాని విల్లు విరచినవాడా! వంశమునకు భూషణమైన శ్రీరామా!

1051. పరమ పవిత్రమూర్తీ! లోకములను కల్పించిన వాడా! బంధుగణములను రక్షించి, సముద్రమును శోషింపజేసి దుష్టులను చీల్చి, భూమిని ధర్మ శీలమున పరిపాలించిన వాడా! రాక్షస సంహారము నీ కొక క్రీడ. సత్యభాషణము, దయామయత్వము నీకు భూషణములు. నీ నామ మహిమచే పాపములను దాటింతువు.

1052. దేవగణములకు దిక్కైన వాడా! అనంతముగా పుణ్యములు ప్రకాశింపజేసిన వాడా! నిర్మల గుణగణములు మూర్తీభవించిన వాడా! భక్తలోకమును పాలించు ఘోర రాక్షసులను కొట్టి భూమికి హితము చేసితివి. సంసార మను చీకటికి సూర్యుడవు. కోటిసూర్యుల వెలుగుగలవాడవు.

*

# తృతీయ స్కంధము

## దేవహూతి పుత్రుండైన కపిలునిచేఁ దత్త్వజ్ఞానంబు వడయుట

అని చెప్పి వెండియు మైత్రేయుండు విదురునిం గనుంగొని కర్దముండు వనంబునకుం జనిన యనంతరంబ మాతృవత్సలుండయిన కపిలుండు బిందుసరంబున వసియించి యుండ దేవహూతి తత్త్వమార్గ ప్రదర్శకుండైన సుతునిం గనుంగొని బ్రహ్మవచనంబులు దలంచుచు నిట్లనియె. 864

క. అసదింద్రియఘర్షణమున
వసుమతి నిర్విణ్ణ నగుచు వనరెడి నా కీ
యసదృశ మోహ తమో విని
రసనం బనఘాత్మ! యే వెరవున ఘటించున్? 865

క. పటుఘననీరంధ్రతమః
పటలపరీవృత జగత్ప్రపంచమునకు నె
క్కటిలోచనమై మహితో
త్కటరుచి నెలుఁగుదువు భాను కైవడి ననఘా! 866

ఉ. భూరి మదీయ మోహతమముం బెడఁబాప సమర్థు లన్యులె
వ్వారలు? నీవకాక, నిరవద్య! నిరంజన! నిర్వికార! సం
సారలతాలవిత్ర! బుధసత్తమ! సర్వశరణ్య! ధర్మవి
స్తారక! సర్వలోకశుభదాయక! నిత్యవిభూతినాయకా! 867

చ. నిను శరణంబు జొచ్చెద న నింద్యతపోనిధి! నన్నుఁ గావవే
యని తను దేవహూతి వినయంబున సన్నుతి సేసి వేడఁగా,
ననుపమ సత్కృపాకలితుఁ డై కపిలుం డనురాగ మొప్ప స
జ్జననిచయాపవర్గ ఫలసాధనమై తగు తల్లి వాక్యమున్. 868

క. విని మందస్మిత లలితా
ననకమలుండగుచు నెమ్మనమునఁ బ్రమోదం
బనయంబు గడలుకొన నిజ
జననికి నిట్లనియెఁ బరమశాంతుండగుచున్. 869

క. విను జీవునిచిత్తము దా
ఘన భవబంధాపవర్గకారణ, మది యే
చిన త్రిగుణాసక్తంబయి
నను సంసృతిబంధకారణం బగు మఱియున్. 870

తే. అదియు నారాయణాసక్త మయ్యెనేని
మోక్షకారణ మగు, నని మునికులాబ్ధి
చంద్రుఁడన నొప్పు కపిలుండు జననితోడ
నర్థి వినఁజెప్పి మఱియు నిట్లనియెఁ బ్రీతి. 871

వ. మఱియుఁ జిత్తం బహంకార మమకార రూపాభిమాన జాతంబు లగు గామ లోభాది కలుషవ్రాతంబులచేత నెప్పుడు విముక్తంబై పరిశుద్ధంబగు, నప్పుడు సుఖ దుఃఖ వివర్జితంబు నేకరూపంబునై ప్రకృతి కంటెఁ బరుండును బరమపురుషుండును నిర్భేదనుండును స్వయంజ్యోతియు సూక్ష్మస్వరూపుండును ఇతర వస్త్వంతరాపరిచ్ఛిన్నుండును నుదాసీనుండునునైన పరమాత్ముని, హతౌజస్కంబయిన ప్రపంచంబును జ్ఞాన వైరాగ్య భక్తియుక్తంబగు మనంబుచేఁ బొడగాంచి, యోగిజనులు పరతత్త్వసిద్ధికొఱకు నిఖిలాత్మకుండైన నారాయణునందు నియుజ్యమానంబయిన భక్తిభావంబువలన నుదయించిన మార్గంబునకు నితరమార్గంబులు సరిగా వంద్రు. విద్వాంసులు సంగంబింద్రియార్థాద్యసద్విషయంబుగ నొనరింపఁబడి జీవునకు నశిథిలంబగు బంధంబునకుఁ గారణంబగు ననియు, నదియె సద్విషయంబైన నంతఃకరణసంయమన హేతుభూతంబగుచు సాధుజనులకు ననర్గళమోక్షద్వారంబగు ననియుఁ దెలియుదురు. సహనశీలురును సమస్తశరీరధారులకు సుహృత్తులును బరమశాంతులును గారుణికులును నైమదర్థంబుగ బరిత్యక్తకర్మఫలస్వభావులును విసృష్టస్వజనబంధుజనులునై మత్పదాశ్రయులును మద్గుణధ్యానపారీణులును మత్కథాప్రసంగ సంభరిత శ్రవణానందులును నగుచు మదీయకథల నొడువుచు వినుచుండు పరమ భాగవతోత్తముల నాధ్యాత్మికాది తాపత్రయంబు దపింపఁ జేయం జాలదు. అట్టి సర్వసంగవివర్జితులగు పరమభాగవతజనుల సంగం బపేక్షణీయంబు. అది సకలదోష నివారకం బగు. అట్టి సత్సంగంబున సర్వప్రాణి హృత్కర్ణ రసాయ

నంబు లగు మదీయ కథా ప్రసంగంబులు గలుగు. మద్గుణాకర్ణ నంబునఁ జేసి శీఘ్రంబుగఁ గ్రమంబునం గైవల్యమార్గదంబులగు శ్రద్ధాభక్తు లుదయించు. అదియునుంగాక యేపురుషుండైన నేమి మద్విరచిత జగత్కల్పనాది విహారచింతచే నుదయించిన భక్తిం జేసి యింద్రియ సుఖంబులవలనను దృష్ట శ్రుతంబులైన యైహికాముష్మికంబుల వలనను విముక్తుండగుచుఁ జిత్తగ్రహణార్థంబు బుజువులైన యోగమార్గములచే సంయుక్తుండగు, నట్టి యోగి ప్రకృతిగుణ సేవనంబుచేతను వైరాగ్యగుణ విజృంభితంబైన జ్ఞానయోగంబు చేతను మదర్పిత భక్తియోగంబుచేతను బ్రత్యగాత్మకుండ వైన నన్ను నంతఃకరణని యుక్తునిం గావించునని చెప్పిన విని దేవహూతి కపిలున కిట్లనియె. 872

క. ఏ భక్తి భగవద్గుణపర
మై భవపాపప్రణాశమై ముక్తిశ్రీ
లాభము రయమునఁ జేయునో
యా భక్తివిధంబుఁ దెలియ నానతి యీవే! 873

వ. అదియునుంగాక భవదుదీరితంబయిన యోగంబును దదంగంబులును దద్గతతత్త్వావబోధంబులును ససాకల్యంబుగ మందబుద్ధినైన నాకు స్ఫుటంబుగాఁ దెలియ నానతిమ్మనినఁ గపిలుం డిట్లనియె.

సీ. జనయిత్రి! విను మఱి సకలపదార్థ ప
రిజ్ఞాన తత్త్వపారీణమైన
యామ్నాయ విహిత కర్మాచారములు గల్గి
తివుటమై వర్తించు దేవగణము;
పూని నైసర్గికం బైన నిర్హేతుక
మగు భగవత్సేవ మిగుల ముక్తి
కంటె గరిష్ఠంబు గావున నదియు భు
క్తాన్నంబు జీర్ణంబు నందఁ జేయు

తే. దీప్తజఠరాగ్నిగతి లింగదేహనాశ
కంబు గావించు; నదియును గాక విష్ణు
భక్తివైభవములఁ దేటపఱతు వినుము
సద్గుణవ్రాత! యోగలక్షణసమేత! 875

చ. అమలినభక్తిఁ గొందఱు మహాత్ములు మచ్చరణారవిందయు
గ్మము హృదయంబునన్ నిలిపి కౌతుకులై యితరేతరానులా
పముల మదీయదివ్యతను పౌరుషముల్ గొనియాడుచుండి మో
క్షము మదిఁ గోర నొల్ల రనిశంబు మదర్పిత సర్వకర్ములై. 876

సీ. పరికింపఁ గొందఱు భాగవతోత్తముల్
ఘనత కెక్కిన పురాతనములైన
చారుప్రసన్న వక్త్రారుణలోచన
ములుగల్గి వరదాన కలితములుగఁ
దనరు మద్దివ్యావతార వైభవములు
మది నొప్పఁ దమ యోగమహిమఁ జేసి
యనుభవించుచుఁ దదీ యాలాపములు సన్ను
తించుచుఁ దివుటఁ ద ద్దివ్యవిలస

తే. దవయవోదార సుందర నవవిలాస
మందహాస మనోహర మధుర వచన
రచనచే నపహృతమనఃప్రాణు లగుచు
నెలమి నుందురు నిశ్శ్రేయసేచ్ఛ లేక. 877

మ. కణఁకన్ వారలు వెండి మోక్షనిరపేక్షస్వాంతులై యుండి, తా
మణిమాద్యష్ట విభూతిసేవితము నిత్యానంద సంధాయియున్
గణనాతీతము నప్రమేయము సమగ్రశ్రీకమున్ సర్వల
క్షణసంయుక్త వికుంఠలోకపదవిం గైకొందు రత్యున్నతిన్.

వ. ఇట్లు వొంది, 879

క. తనరుదు రప్పుణ్యాత్ములు
జనయిత్రి! మదీయకాలచక్రగ్రసనం
బును నొందక నిత్యంబగు
ననుపమ సుఖవృత్తి నుందు రది యెట్లన్నన్. 880

మ. సమ్ముఁడై స్నేహముచే సుతత్వమును, విశ్వాసంబుచేతన్ సఖి
త్వముఁ, జాలన్ హితవృత్తిచేతను సుహృత్త్వంబున్, సుమంత్రోపదే
శముచేతన్ నిజదేశికుండనఁగ నిచ్చల్ పూజ్యుఁడౌ నిష్టదై
వమనై వారికిఁ గాలచక్రభయముల్ వారింపుదుం గావునన్. 881

వ. అని యిట్లు దెలుపుచు మఱియు నిట్లనియె. 882

చ. విను మదిగాక యీ భువి దివిం బలుమాఱుః జరించునాత్ముఁ, దా
ధన పశు పుత్ర మిత్ర వనితా తతిపైఁ దగులంబు మాని, న
న్నునఘుని విశ్వతోముఖు ననన్యగతిన్ భజియించెనేని వా
నిని ఘనమృత్యురూప భవనీరధి నేఁ దరియింపఁ జేయుదున్. 883

సీ. రూఢిఁ బ్రధానపూరుష నాయకుండను
భగవంతుఁడను జగత్ప్రభుఁడనైన
నాకంటె నన్యులఁ గైకొని తగిలిన
యాత్మలు భవభయం బందుదు, రది
గావున నాయాజ్ఞఁ గడవంగ నోడుటఁ
జేసి వాయువు వీచు, శిఖి వెలుంగు,
నినుఁడు దపించుఁ, దా నింద్రుఁడు వర్షించు,
భయమంది మృత్యువు పరువువెట్టుఁ,

తే. గాన విజ్ఞాన వైరాగ్య కలితమైన
భక్తియోగంబునం జేసి పరమపదము
కొఱకు నయ్యోగివరులు మచ్చరణభజను
లగుచుఁ జరియింపుదురు నిర్భయాత్ములగుచు. 884

క. గురుభక్తిం జిత్తము మ
త్పరమై విలసిల్లునంతపర్యంతము స
త్పురుషుల కిహలోకంబునఁ
జిరతర మోక్షోదయంబు సేకుఱు చుండున్. 885

క. అని యిట్లు సన్మునీంద్రుఁడు
జననికి హరిభక్తియోగ సంగతి నెల్లన్
వినిపించుచు వెండియు ని
ట్లనియెన్ సమ్మోదచిత్తుఁ డగుచుఁ గడంకన్. 886

## అధ్యాయము - ౨౬

వ. అవ్వా! యివ్విధంబున భక్తియోగ ప్రకారంబు సెప్పితి. ఇంకఁ దత్త్వలక్షణంబు వేఱువేఱ యెఱింగింతు. నేతత్తత్త్వగుణంబుల నెఱింగి నరులు ప్రకృతి గుణంబులవలన విముక్తు లగుదురు. హృదయ

గ్రంథి విచ్ఛేదకంబు నాత్మదర్శనరూపంబు నగు నా జ్ఞానం బాత్మ నిశ్శ్రేయసకారణంబు. కావున దాని నెఱింగింతు. అందు నాత్మ స్వరూపం బెట్టి దనిన, ననాదియుఁ బురుషుండును సత్త్వాదిగుణ శూన్యుండును బ్రకృతిగుణవిలక్షణుండును బ్రత్యక్స్వరూపుండును స్వయంప్రకాశుండును నెవ్వండు, మఱియు నెవ్వనితోడ నీ విశ్వంబు సమన్వితంబగు నతండు గుణత్రయాత్మకంబు నవ్యక్తంబును భగవత్సంబంధియు నగు ప్రకృతియందు యదృచ్ఛచే లీలావశంబునం బ్రవేశించిన నా ప్రకృతి గుణత్రయమయంబై సరూపంబయిన ప్రజాసర్గంబుఁ జేయం గనుంగొని, యప్పుడు మోహితుండయి విజ్ఞాన తిరోధానంబునం జేసి గుణత్రయాత్మకంబయిన ప్రకృత్యధ్యాసంబున నన్యోన్యమేళనం బగుటయు, నంతం బ్రకృతిగుణంబుఁ దనయందు నారోపించుకొని క్రియమాణంబులగు కార్యంబులవలనం గర్తృత్వంబు గలిగి సంసారబద్ధుండై పారతంత్ర్యంబు గలిగియుండు. కర్తృత్వశూన్యుండగు నీశ్వరుండు సాక్షి యగుటం జేసి యాత్మకుం గార్యకారణ కర్తృత్వంబులు ప్రకృత్యధీనంబు లనియు సుఖ దుఃఖ భోక్తృత్వంబులు ప్రకృతివిలక్షణుండయిన పురుషుని వనియు నెఱుంగుదురు. అని చెప్పిన విని దేవహూతి కపిలున కిట్లనియె. పురుషోత్తమా! ప్రకృతిపురుషులు సదసదాత్మక ప్రపంచంబునకుఁ గారణభూతులు గావున వాని లక్షణంబు సదసద్వివేకపూర్వకంబుగా నానతిమ్ము. అనిన, భగవంతుం డిట్లనియె.

క. క్రమమునఁ ద్రిగుణము నవ్య
క్తము నిత్యము సదసదాత్మకము మఱియుఁ బ్రధా
నము ననఁగాఁ బ్రకృతి విశే
షము, లదియు విశిష్ట మనిరి సద్విదు లెలమిన్. 888

వ. అందుఁ బ్రకృతి చతుర్వింశతి తత్త్వాత్మకంబై యుండు. అది యెట్లనినం బంచమహాభూతంబులును బంచతన్మాత్రలును జ్ఞానకర్మాత్మకంబులయిన త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణంబులు వాక్పాణి పాద పాయూపస్థంబులు నను దశేంద్రియంబులును మనో బుద్ధి చిత్తాహంకారంబు లను నంతఃకరణ చతుష్టయంబును నను చతుర్వింశతి తత్త్వాత్మకంబైన సగుణబ్రహ్మసంస్థానంబు సెప్పితి.

ఇటమీఁదఁ గాలంబను పంచవింశక తత్త్వంబు సెప్పెద. అది గొందఱు పురుషశబ్దవాచ్యుండైన యీశ్వరుని పౌరుషంబు గాల శబ్దంబునఁ జెప్పంబడు నందురు. అందు నహంకార మోహితుండై ప్రకృతి నొంది జీవుండు భయంబుఁ జెందు. ప్రకృతిగుణ సామ్యంబునం జేసి వర్తించి నిర్విశేషుండగు భగవంతుని చేష్టా విశేషంబు దేనివలన నుత్పన్నంబగు నదియు కాలంబని చెప్పంబడు. అదియు జీవరాశ్యంతర్గతం బగుటం జేసి పురుషుం డనియు, వాని బహిర్భాగ వ్యాప్తిం జేసి కాలం బనియుఁ జెప్పంబడు. ఆత్మ మాయం జేసి తత్త్వాంతర్గతుండయిన జీవుని వలన క్షుభితంబయి జగత్కారణంబగు ప్రకృతియందుఁ బరమపురుషుండు దనవీర్యంబు వెట్టిన నా ప్రకృతిహిరణ్మయంబైన మహత్తత్త్వంబు బుట్టించె. అంత సకలప్రపంచబీజభూతుండును, లయవిక్షేపశూన్యుండును నగు నీశ్వరుండు దన సూక్ష్మవిగ్రహంబున నాత్మగతంబైన మహదాది ప్రపంచంబుల వెలిగించుచు, స్వతేజోవిపత్తిం జేసి యాత్మప్రస్వాప నంబుసేయు నట్టి తమంబును గ్రసించెనని చెప్పి వెండియు నిట్లనియె.

క. దివ్యమగు వాసుదేవా
ది వ్యూహచతుష్టయంబు త్రిజగములందున్
సేవ్యం బనిచెప్పంబడు
భవ్యగుణా! దాని నెఱుఁగ బలికెద నీకున్. 890

సీ. సత్త్వప్రధానమై స్వచ్ఛమై శాంతమై
యూర్మిషట్కంబుల నోసరించి
సురుచిరషాడ్గుణ్య పరిపూర్ణమై నిత్య
మై భక్తజనసేవ్య మై తనర్చి
వలనొప్పుచుండు నవ్వాసుదేవవ్యూహ
మంత మహత్తత్త్వ; మందు నోలి
రూఢిఁ గ్రియాశక్తి రూపంబు గల్గు న
హంకార ముత్పన్న మయ్యె; నదియు

తే. సరవి వైకారికంబుఁ, దైజసముఁ, దామ
సంబు నామూఁడు దెఱఁగుల జరగు; నందుఁ
దనరు వైకారికము మనస్సునకు నింద్రి
యములకును గగన ముఖభూతముల కరయ. 891

వ. ఉత్పత్తిస్థానంబై యుండు. అదియు దేవతారూపంబుల నుండు. తైజసాహంకారంబు బుద్ధిప్రాణంబులం గలిగి యుండు. తామసాహంకారం బింద్రియ మేళనంబున నర్థమాత్రంబై యుండు. మఱియును, 892

సీ. అట్టి యహంకార మం దధిష్ఠించి సా
హస్రఫణామండ లాభిరాముఁ
డై తనరారు ననంతుఁడు సంకర్ష
ణుం డనఁదగు పురుషుండు ఘనుఁడు
మహిత భూతేంద్రియ మానసమయుఁడు నై
కర్తృత్వ కార్యత్వ కారణత్వ
ప్రకటశాంతత్వ ఘోరత్వ మూఢత్వాది
లక్షణలక్షితోల్లాసి యగుచు

తే. నుండు నమ్మేటి రెండవ వ్యూహ మనఁగ;
ఘనవికారంబుఁ బొందు వైకారికంబు
వలన వినుము మనస్తత్త్వ మెలమిఁ బుట్టె;
మఱియు వైకారికంబును మాత! వినుము. 893

వ. అది యెట్టులంటేని సామాన్యచింతయు విశేషచింతయు ననందగు సంకల్ప వికల్పంబులం జేసి కామసంభవం బనంబడు. ఎద్ది యని రుద్రాఖ్యంబయిన వ్యూహం బదియ హృషీకంబులకు నధీశ్వరంబయి సకలయోగీంద్ర సేవ్యంబగుచు శరదిందీవరశ్యామంబయి యుండు. వెండియుం దైజసంబువలన బుద్ధితత్త్వంబు పుట్టె. దాని లక్షణంబులు ద్రవ్యప్రకాశకంబై నజ్ఞానంబును నింద్రియానుగ్రహంబును సంశయంబును మిథ్యాజ్ఞానంబును నిద్రయు నిశ్చయంబును స్మృతియు ననందగి యుండు. మఱియుఁ దైజసాహంకారంబు వలన జ్ఞానేంద్రియ కర్మేంద్రియంబులును గ్రియా జ్ఞాన సాధనంబులును గలిగియుండు. ప్రాణంబునకుం గ్రియాశక్తియు బుద్ధికి జ్ఞానశక్తియు నగుటంజేసి యింద్రియంబులకుఁ దైజసత్వంబు గలిగియుండు. భగవద్భక్తి ప్రేరితం బయిన తామసాహంకారంబు వలన శబ్దతన్మాత్రంబు పుట్టె. దానివలన నాకాశంబును నాకాశంబువలన శ్రోత్రేంద్రియంబును బుట్టె. శ్రోత్రంబు శబ్దగ్రాహి యయ్యె. శబ్దం

ర్థంబునకు నాశ్రయంబై శ్రోతకు జ్ఞాన జనకంబయ్యె. మఱియు శబ్దతన్మాత్రంబు వలన నాకాశం బయి యా యాకాశంబు భూతంబులకు బాహ్యాభ్యంతరంబుల నవకాశం బిచ్చుటయు నాత్మ ప్రాణేంద్రియాదులకు నాశ్రయం బగుటయు నను లక్షణంబులు గలిగియుండు. కాలగతిచే వికారంబు నొందు శబ్దతన్మాత్ర లక్షణంబగు నభంబువలన స్పర్శంబును స్పర్శంబువలన వాయువును వాయువుచే స్పర్శగ్రాహియై త్వగింద్రియంబును బుట్టె. మృదుత్వంబును గఠినత్వంబును శైత్యంబును నుష్ణత్వంబును నను నివి స్పర్శంబునకు స్పర్శత్వంబని చెప్పంబడు. మఱియు వాయువునకుఁ జాలనంబును పరస్పరవిభాగకరణంబును దస్మేళనంబును ద్రవ్యశబ్ద నేతృత్వంబును (అందు గంధవంతంబగు ద్రవ్యంబును ఘ్రాణేంద్రియంబు నొందించుట ద్రవ్యనేతృత్వంబు దూరస్థంబగు శబ్దంబును శ్రోత్రేంద్రియగ్రాహ్య మగున ట్లొనరించుట శబ్ద నేతృత్వంబు) సర్వేంద్రియాత్మకత్వంబు నునవి లక్షణంబులై యుండు. దైవ ప్రేరితంబై స్పర్శతన్మాత్రగుణకంబగు వాయువువలన రూపంబును దానివలన దేజంబును బుట్టె. రూపంబు నేత్రేంద్రియ గ్రాహ్యంబయ్యె. ద్రవ్యాకారసమత్వంబును ద్రవ్యంబునకు నుపసర్జనంబగుటయు ద్రవ్యపరిణామ ప్రతీతియు నివి రూపవృత్తు లనంబడు. తైజసంబునకు సాధారణంబు లగు ధర్మంబులు ద్యోతంబనం బ్రకాశంబు, పచనంబనఁ దండులాదుల పాకంబు, పిపాసానిమిత్తంబైన పానంబు, క్షున్నిమిత్తకంబైన యదనంబు, హిమమర్దనంబగు శోషణంబు నను నివి వృత్తులై యుండు. రూపతన్మాత్రము వలన దైవచోదితంబై వికారంబు నొందు తేజస్సు వలన రసతన్మాత్రంబు పుట్టె. రస తన్మాత్రంబువలన జలంబు పుట్టె. జిహ్వయును రసనేంద్రియంబు రసగ్రాహకంబయ్యె. ఆ రసం బేకంబై యుండియు భూతవికారంబునం జేసి కషాయ తిక్త కట్వామ్ల మధురాది భేదంబుల ననేక విధంబయ్యె. వెండియు సాంసర్గిక ద్రవ్యవికారంబునం జేసి యార్ద్రం బగుటయు ముద్దగట్టుటయుఁ దృప్తి దాతృత్వంబును జీవనంబును దద్వైక్లబ్య నివర్తనంబును మృదూకరణంబును దాప నివారణంబును గూపగతం బయిన జలంబు దివియ మఱియు

నుద్గమించుటయు నను నివి జలవృత్తు లనంబడు. రసతన్మాత్రంబు వలన దైవచోదితంబై వికారంబునం బొందిన జలంబువలన గంధ తన్మాత్రంబు పుట్టె. దానివలనం బృథ్వియు గలిగె. ఘ్రాణంబు గంధగ్రాహకం బయ్యె. అందు గంధం బేకంబయ్యు వ్యంజనాదిగతంబయి హింగ్వాది నిమిత్తంబున మిశ్రమగంధం బను కరంభంబును గృంజనాదిగతం బయిన పూతిగంధంబును, ఘనసారాది నిమిత్తం బైన సుగంధంబును, శతపత్త్రాదిగతంబగు శాంతగంధంబును, లశునాదిగతం బైన యుగ్రగంధంబును, బర్యుషిత చిత్రాన్నాదిగతం బయిన యామ్లగంధంబును, ద్రవ్యావయవ వైషమ్యంబునం జేసి యనేకవిధంబై యుండు. అదియునుం గాక ప్రతిమాది రూపంబులం జేసి సాకారతాపాదనం బగు భావనంబును, జలాదివిలక్షణత్రయాంతరనిరపేక్షంబయిన స్థితియు, జలాద్యాధారతయను ధారణంబును, నాకాశాద్యవచ్ఛేదకత్వంబును సకలప్రాణిపుంస్త్వాభివ్యక్తీకరణంబును నను నివి పృథ్వీవృత్తు లనంబడు అని చెప్పి వెండియు నిట్లనియె. నభోఽసాధారణగుణ శబ్దవిశేషగ్రాహకంబు శ్రోత్రంబును, వాయ్వసాధారణగుణ విశేషగ్రాహకంబు స్పర్శంబును, తేజోఽసాధారణవిశేషగ్రాహకంబు చక్షురింద్రియంబును, నంభోఽసాధారణగుణవిశేషగ్రాహకంబు రసనేంద్రియంబును, భూమ్యసాధారణగుణవిశేషగ్రాహకంబు ఘ్రాణేంద్రియంబును నగు. ఆకాశాదిగుణంబు లగు శబ్దాదులు కార్యంబు లగు వాయ్వాదులందుఁ గారణాన్వయంబునఁ జూపట్ట నన్నిఁటికిం బృథ్వీసంబంధము గలుగుటం జేసి భూమియందు శబ్ద స్పర్శ రూప రస గంధంబులు గలుగు. మహదాదిపృథివ్యంతంబు లగు నీ యేడు తత్త్వంబులు పరస్పరమిళితంబులై భోగాయతనంబగు పురుషునిం గల్పింప నసమర్థంబులై యున్నం జూచి కాలాదృష్ట సత్త్వాదులంగూడి జగత్కారణుండును, త్రైగుణ్యావిశిష్టుండును నశేష నియామకుండును, నిరంజనాకారుండును నగు సర్వేశ్వరుం డందు బ్రవేశించె. అంత నన్యోన్యక్షుభితంబులై మిళితంబులైన మహదాదుల వలన నధిష్ఠాతృచేతనరహితంబగు నొకయండంబు పుట్టె. అందు,

సీ. గురుశ క్తియా విరాట్పురుషుండు ప్రభవించె
నట్టి విశేషాండ మర్థిఁబొదివి
యంబుముఖావరణంబు లొక్కొకటికి
దశగుణితంబులై తవిలి యావ
రణములై యుండును గ్రమమున లోకంబు
లకు మేలుకట్లపోలికఁ దనర్చి
పంకజోదరుని రూపము విలసించును;
లోలత జలములోఁ దేలుచున్న
తే. హేమమయమైన యండంబులో మహాను
భావుఁ డభవుండు హరి దేవదేవుఁ డఖిల
జేత నారాయణుఁడు ప్రవేశించి యపుడు
విష్ణుపదభేదనంబు గావించి యందు. 895

సీ. కరమొప్పఁగా విరాట్పురుషుండు వెలుఁగొందు;
నా విరాట్పురుషుని యాననంబు
వలనను వాణియు, వాణితో వహ్నియు
నాసంబువలనఁ బ్రాణములఁగూడి
ఘ్రాణేంద్రియంబయ్యె, ఘ్రాణంబువలనను
వాయువులును బ్రాణవాయువులును,
నందు నక్షులు, చక్షు వందు సూర్యుండును,
నం దభిధ్యానంబు నర్థిఁజేయఁ
తే. గర్ణములు జాతమయ్యెఁ, దత్కర్ణసమితి
వలన శ్రోత్రేంద్రియంబు దిక్కులును గలిగెఁ,
ద్వక్కుచే శ్మశ్రురోమవితానకములు
నోషధివ్రాతమును భవమొందె మఱియు. 896

తే. దానివలనను మేఢ్రంబు గానఁబడియెఁ
బరఁగ రేతంబువలన నాపంబు పుట్టె
గుదమువలన నపానంబు నుదయమయ్యె
దానివలనను మృత్యువు దగ జనించె. 897

క. కరములవలనను బలమును,
నిరవుగ నా రెంటివలన నింద్రుండుఁ, బాదాం
బురుహంబులవలన గతియు,
నరుదుగ నా రెంటివలన హరియును గలిగెన్. 898

క. ఘననాడీపుంజమువల
నను రక్తము, దానివలన నదులును, జఠరం
బున నాఁకలియును దప్పియు
ననయము నా రెంటివలన నబ్ధులు వుట్టెన్. 899

క. విను హృదయమువలనను మన
మును, మనమునఁ దుహినకరుఁడు బుద్ధియుఁ, జిత్తం
బున బ్రహ్మయు క్షేత్రజ్ఞుం
డును గలిగిరి, యవ్విరాజుఁడుం బూరుషతన్. 900

వ. మఱియు విరాట్పురుషునం దుదయించిన వ్యష్టిరూపంబు లగు నాకాశాది భూతంబులును శబ్దంబు మొదలగు భూతతన్మాత్రంబులును వాగాదీంద్రియజాతంబును దదధిదేవతలును దమంతన సమష్టిరూపుండగు క్షేత్రజ్ఞుఁ బ్రవృత్తిప్రవర్తకుం జేయ నసమర్థంబు లయ్యె. ఎట్లనిన, దేవాధిష్ఠితంబు లగు నింద్రియంబులు దాము వేర్వేఱ యయ్యీశ్వరుం బ్రవృత్త్యున్ముఖుం జేయనోపక క్రమంబునం దత్తదధిష్ఠానాదుల నొందె. అందు నగ్ని వాగింద్రియంబుతోడ ముఖంబు నొంది ప్రవర్తించిన విరాట్కార్యంబగు వ్యష్టిశరీరజాతం బనుత్పన్నంబయ్యె. అంత నాసయు ఘ్రాణేంద్రియంబుతోడ వాయువుంగూడిన నట్టిద యయ్యె. ఆదిత్యుఁడు చక్షురింద్రియంబుతోడ నేత్రంబుల నొందిన వృథాభూతంబయ్యె. దిగ్దేవతాకం బగు కర్ణంబు శ్రోత్రేంద్రియంబుతోఁ గూడిన విరాట్కార్యప్రేరణాయోగ్యంబయ్యె. ఓషధులు రోమంబులం ద్వగింద్రియంబు జెంది విఫలంబయ్యె. అబ్దైవంబగు మేఢ్రంబు రేతంబు నొందినఁ దత్కార్యకరణాదక్షంబయ్యె. పదంపడి గుదంబు మృత్యువుతోడ నపానేంద్రియంబుఁ జేరిన నదిహైన్యంబు నొందె. విష్ణుదేవతాకంబులగు చరణంబులు గతితోఁ గూడిన ననీశ్వరంబు లయ్యె. పాణీంద్రియంబు లింద్రదైవతంబు

లగుచు బలంబు నొందిన శక్తిహీనంబులయ్యె. మఱియు నాడులు సనదీకంబులై లోహితంబు నొందిన నిరర్థకంబులయ్యె. ఉదరంబు సింధువులతోడఁ జేరి క్షుత్పిపాసలం బొందిన వ్యర్థంబయ్యె. హృదయంబు మనంబుతోడం జంద్రు నొందిన నూరకయుండె. బుద్ధి బ్రహ్మాది దైవతంబై హృదయంబు నొందిన నిష్ఫలంబయ్యె. చిత్తం బభిమానంబుతో రుద్రునిం జెందిన విరాట్కార్యజాతం బనుద్భూతం బయ్యె, నంతఁ జైత్త్యుండగు క్షేత్రజ్ఞుండు హృదయాధిష్ఠానంబు నొంది చిత్తంబుతోడం బ్రవేశించిన విరాట్పురుషుండు సలిలకార్య భూత బ్రహ్మాండంబు నొంది ప్రవృత్త్యున్ముఖుండయ్యె. సుప్తుండగు పురుషునిం బ్రాణాదులు దమ బలంబుచే భగవత్ప్రేరితంబు లగుచు నుత్థాపనాసమర్థంబు లగు చందంబున, నగ్న్యాదులు స్వాధిష్ఠాన భూతంబులగు నింద్రియంబులతోడ దేవాదిశరీరంబుల నొందియు నశక్తంబులయ్యె. అని మఱియు నవ్విరాట్పురుషుని ననవరత భక్తిం జేసి విరక్తులై యాత్మలయందు వివేకంబుగల మహాత్ములు చింతింపుదురనియుఁ బ్రకృతిపురుష వివేకంబున మోక్షంబును, బ్రకృతి సంబంధంబున సంసారంబును గలుగు ననియుఁ జెప్పి మఱియు నిట్లనియె. 901

## అధ్యాయము - ౨౭

సీ. జననుత ! సత్త్వ రజ స్తమోగుణ మయ
మైన ప్రాకృతకార్య మగు శరీర
గతుఁడయ్యుఁ బురుషుండు, గడఁగి ప్రాకృతములు
నగు సుఖ దుఃఖ మోహములవలనఁ
గర మనురక్తుండు గాఁడు, వికారవి
హీనుఁడు ద్రిగుణరహితుఁడు నగుచు
బలసి నిర్మలజల ప్రతిబింబితుం డైన
దినకరుభంగి వర్తించు; నట్టి
తే. యాత్మ ప్రకృతిగుణంబుల యందుఁ దగులు
వడి యహంకారమూఢుఁ డై తొడరి యేను
గడఁగి నిఖిలంబునకు నెల్లఁ గర్త నని ప్ర
సంగవశతను బ్రకృతిదోషములఁ బొంది. 902

క. సుర తిర్య జ్మనుజ స్థా
వర రూపము లగుచుఁ గర్మ వాసనచేతం
బరపై నమిశ్రయోనులఁ
దిరముగ జనియించి సంసృతిం గైకొని తాన్. 903

క. పూని చరించుచు విషయ
ధ్యానంబునఁ జేసి స్వాప్ని కార్థాగమ సం
ధానము రీతి నసత్పథ
మానసుఁ డగుచున్ భ్రమించు మతి లోలుండై. 904

వ. అట్లు గావున, 905

తే. పూని మోక్షార్థి యగువాఁడు దీనిఁ దీవ్ర
భక్తియోగంబుచేత విరక్తిబొంది
మనము వశముగఁ జేసి యమనియమాది
యోగమార్గక్రియాభ్యాస యుక్తిఁ జేసి. 906

సీ. శ్రద్ధాగరిష్ఠుఁడై సత్యమైనట్టి మ
ద్భావంబు మత్పాద సేవనంబు
వర్ణితమత్కథాకర్ణనంబును సర్వ
భూత సమత్వ మజాతవైర
మును బ్రహ్మచర్యంబు ఘన మౌనమాదిగా
గల నిజధర్మసంగతులఁ జేసి
సంతుష్టుఁడును మితాశనుఁడు నేకాంతియు
మననశీలుఁడు వీతమత్సరుండు

తే నగుచు మిత్రత్వమున గృపఁదగిలి యాత్మ
కలితవిజ్ఞానియై బంధకంబులైన
ఘనశరీర పరిగ్రహోత్కంఠయందు
నాగ్రహము వాసి వర్తింప నగును మఱియు. 907

వ. జీవేశ్వరతత్త్వజ్ఞానంబునం జేసి నివృత్తంబయిన బుద్ధి తదవస్థా
నంబునుం గలిగి దూరీభూతేతరదర్శనుండై జీవాత్మజ్ఞానంబునం
జేసి చక్షురింద్రియంబున సూర్యుని దర్శించుచందంబున, నాత్మ
నాయకుండయిన శ్రీమన్నారాయణుని దర్శించి, నిరుపాధికండై

మిథ్యాభూతం బగు నహంకారంబున స్వరూపంబుచేఁ బ్రకాశ మానంబగుచుఁ బ్రధానకారణంబునకు నధిష్ఠానంబును, గార్యంబు నకుఁ జక్షువుంబోలెఁ బ్రకాశకంబును, సమస్తకార్యకారణాను స్యూతంబును బరిపూర్ణంబును సర్వవ్యాపకంబును నగు బ్రహ్మంబును బొందు నని చెప్పి వెండియు నిట్లనియె. 908

సీ. విను మాత్మవేత్తకు విష్ణుస్వరూపంబు
నెఱుఁగంగఁబడు, నది య ట్లటన్న
గగనస్థుఁ డగు దినకరు కిరణచ్ఛాయ
జలముల గృహకుడ్యజాలకముల
వలనఁ దోఁచిన ప్రతిఫలితంబుచేత నూ
హింపంగఁబడిన య య్యినునిపగిది
నర్థి మనో బుద్ధ్యహంకరణత్రయ
నాడీప్రకాశమునను నెఱుంగ
తే. వచ్చు నాత్మస్వరూపంబు వలఁతి గాఁగఁ
జిత్తమునఁ దోఁచు నంచితశ్రీఁ దనర్చి
యమ్మహామూర్తి సర్వభూతాంతరాత్మఁ
డగుట నాత్మజ్ఞులకుఁ గాన నగును మఱియు. 909

వ. జీవుండు పరమాత్మానుషక్తుండై భూతాదితత్త్వంబులు లీనంబులై ప్రకృతియందు వాసనామాత్రంబు గలిగి యకార్యకరణంబులై యున్న సుషుప్తిసమయంబునం దాను నిస్తంద్రుండగుచు నితరంబు చేతఁ గప్పంబడనివాఁడై పరమాత్మానుభవంబు సేయుచుండును అని చెప్పిన విని దేవహూతి యిట్లనియె. 910

సీ. విమలాత్మ! యీ పృథివికిని గంధమునకు
సలిలంబునకును రసంబునకును
నన్యోన్యమగు నవినాభావసంబంధ
మైన సంగతిఁ బ్రకృత్యాత్మలకును
సతతంబు నన్యోన్య సంబంధమై యుండు ;
ప్రకృతిఁ దా నయ్యాత్మఁ బాయు టెట్లు ?
దలపోయ నొకమాటు తత్త్వబోధముచేత
భవభయంబులనెల్లఁ బాయు టెట్లు ?

తే. చచ్చి క్రమ్మఱఁ బుట్టని జాడ యేది?
యిన్నియుఁ దెలియ నానతి యిచ్చి నన్నుఁ
గరుణ రక్షింపవే! దేవగణసుసేవ్య!
భక్తలోకానుగంతవ్య! పరమపురుష! 911

వ. అనిన భగవంతుం డిట్లనియె. అనిమిత్తంబయిన స్వధర్మంబునను
నిర్మలాంతఃకరణంబునను సునిశితంబైన మద్భక్తియోగంబునను
సత్కథాశ్రవణ సంపాదితంబైన వైరాగ్యంబునను దృష్ట ప్రకృతి
పురుష యాథాత్మ్యంబగు జ్ఞానంబునను బలిష్ఠంబయి కామాన
భిష్వంగంబగు విరక్తి వలనను దపోయుక్తంబయిన యోగంబునను
దీవ్రంబయిన చిత్తైకాగ్రతంజేసి పురుషునిదగు ప్రకృతి దందహ్య
మానంబై తిరోధానంబును బొందు. అదియునుంగాక యరణి
గతంబయిన వహ్నిచే నరణి దహింపఁబడు చందంబున జ్ఞానంబు
నను దత్త్వదర్శనంబుననుంజేసి నిరంతరంబు బలవంతంబును
దృష్టదోషంబును నగు ప్రకృతి జీవునిచేత భుక్తభోగయై విడు
వంబడు. అని చెప్పి, 912

క. విను ప్రకృతి నైజమహిమం
బునఁ దనలోనున్న యట్టి పురుషునకు మహే
శునకు నశుభవిస్ఫురణం
బనయముఁగావింపజాల దది యెట్లనినన్. 913

చ. పురుషుఁడు నిద్రవోఁ గలలఁ బొందు ననర్థకముల్ ప్రబోధమం
దరయఁగ మిథ్యలై పురుషునందు ఘటింపనికైవడిం, బరే
శ్వరునకు నాత్మనాథునకు సర్వశరీరికిఁ గర్మసాక్షికిం
బరువడిఁ బొంద వెన్నఁటికి బ్రాకృతదోషము లంగనామణీ! 914

వ. అని వెండియు నిట్లనియె. 915

సీ. అధ్యాత్మతత్పరుం డగువాఁడు పెక్కు జ
న్మంబులఁ బెక్కుకాలంబులందు
బ్రహ్మపదప్రాప్తి పర్యంతమును బుట్టు
సర్వార్థవైరాగ్యశాలి యగుచుఁ

బూని నా భక్తులచే నుపదేశింపఁ
బడిన విజ్ఞానసంపత్తిచేతఁ
బరఁగఁ బ్రబుద్ధుఁడై బహువారములు భూరి
మత్ప్రసాదప్రాప్తిమతిఁ దనర్చు

తే. నిజపరిజ్ఞాన విచ్ఛిన్న నిఖిలసంశ
యుండు నిర్ముక్త లింగ దేహుండు నగుచు
ననఘ యోగీంద్రహృద్గేయ మగు మదీయ
దివ్యధామంబు నొందు సందీప్తుఁ డగుచు. 916

వ. మఱియు నణిమాద్యష్టైశ్వర్యంబులు మోక్షంబున కంతరాయం
బులు గావున వానియందు విగతసంగుండును, మదీయచరణ
సరోజస్థిత లలితాంతరంగుండును నగువాఁడు మృత్యుదేవత
నపహసించి మోక్షంబు నొందు అని చెప్పి వెండియు యోగ
లక్షణప్రకారంబు వినిపింతు వినుమని భగవంతుండైన కపిలుండు
నృపాత్మజ కిట్లనియె. 917

## అధ్యాయము - ౨౮

క. ధీనిధు లయ్యును యోగ వి
ధానంబునఁ జేసి మనము దగ విమలంబై
మానిత మగు మత్పదముం
బూనుదు రా యోగధర్మముల నెఱిఁగింతున్. 918

వ. అది యెట్లనిన, శక్తికొలఁది స్వధర్మాచరణంబును శాస్త్రవినిషిద్ధ
ధర్మ కర్మంబులు మానుటయు, దైవికంబై వచ్చిన యర్థంబువలన
సంతోషించుటయు, మహాభాగవత శ్రీపాదారవిందార్చనంబును,
గ్రామ్యధర్మ నివృత్తియు మోక్షధర్మంబులయందు రతియు,
మితంబై శుద్ధంబయిన యాహారసేవయు, విజనంబయి నిర్బాధకం
బయిన స్థానంబున నుండుటయు, హింసారాహిత్యంబును,
సత్యంబును నస్తేయంబును, దనకెంత యర్థం బుపయోగించు నంత
యర్థంబ స్వీకరించుటయు, బ్రహ్మచర్యంబును తపశ్శౌచంబులును
స్వాధ్యాయపఠనంబును బరమపురుషుండైన సర్వేశ్వరుని యర్చ

నంబును, మౌనంబును, నాసనజయంబును, దానంజేసి స్థైర్యంబును, ప్రాణవాయుస్వవశీకరణంబును, నింద్రియ నిగ్రహరూపంబైన ప్రత్యాహారంబును, మనంబుచే నింద్రియంబుల విషయంబులవలన మరలించి హృదయమందు నిలుపుటయు, దేహగతంబైన మూలాధారాది స్థానంబులలో నొక్కస్థానంబునందు హృదయగతంబయిన మనస్సుతోడంగూడఁ బ్రాణధారణంబును, వైకుంఠుండైన సర్వేశ్వరుండు ప్రవర్తించిన దివ్యలీలాచరిత్రధ్యానంబును, మానసైకాగ్రీకరణంబును, బరమాత్మయగు పద్మనాభుని సమానాకారతయును, నివియునుంగాక తక్కిన వ్రతదానాదులంజేసి మనోదుష్టంబయిన యసన్మార్గంబును బరిహరించి జితప్రాణుండై మెల్లన యోజించి శుచియైన దేశంబునం బ్రతిష్ఠించి విజితాసనుండై యభ్యస్త కుశాజిన చేలోత్తరాసనంబైన యాసనంబు సేసి ఋజుకాయుండై ప్రాణమార్గంబును గుంభక రేచక పూరకంబులం గోశశోధనంబు సేసి కుంభక పూరకంబులచేతం బ్రతికూలంబు గావించి చంచలంబయిన చిత్తంబు సుస్థిరంబు గావించి తీవ్రంబయిన యమంబునం బ్రతప్తంబయి విగత సమస్త దోషంబగు చామీకరంబుకరణి విరజంబు సేసి, జితమారుతుండగు యోగికిం గ్రమ్మఱం బ్రాణాయామం బను పావకునిచేత వాత పిత్త శ్లేష్మంబు లను దోషంబుల భస్మీకరణంబుసేసి, ధారణంబుచేతఁ గిల్బిషంబులను బ్రత్యాహారంబుచేత సంసర్గంబులను దహనంబుసేసి, ధ్యానంబుచేత రాగంబుల సత్త్వాదిగుణంబులను నివారించి స్వనాసాగ్రావలోకనంబు సేయుచు,

సీ. దళదరవింద సుందరపత్త్రి రుచిరాక్షు
    సలలిత శ్రీవత్సకలితవక్షు
నీలనీరద నీల నీలోత్పలశ్యాము
    సలికులాలక మాలికాభిరాముఁ
గౌస్తుభకలిత ముక్తాహారయుతకంఠు
    యోగిమానస పంకజోపకంఠు
సతతప్రసన్న సస్మితవదనాంభోజు
    దినకరకోటి సందీప్తతేజు

తే. సలలితానర్ఘ్య రత్నకుండల కిరీట
హార కంకణ కటక కేయూర ముద్రి
కా తులాకోటిభూషు భక్తప్రపోషుఁ
గింకిణీయుత మేఖలాకీర్ణ జఘను. 920

వ. మఱియు, 921

సీ. కంజాత కింజల్క పుంజరంజితపీత
కౌశేయవాసు జగన్నివాసు
శత్రుభీకరచక్ర శంఖ గదా పద్మ
విహిత చతుర్బాహు విగతమోహు
నుతభక్త లోకమనోనేత్ర వర్ధిష్ణు
లాలిత సద్గుణాలంకరిష్ణు
వరకుమారక వయః పరిపాకు సుశ్లోకు
సుందరాకారు యశోవిహారు

తే. సకలలోక నమస్కృత చరణకమలు
భక్తలోకపరిగ్రహ ప్రకటశీలు
దర్శనీయ మనోరథదాయిఁ గీర్త
నీయ తీర్థ యశో మహనీయమూర్తి. 922

వ. వెండియు, 923

క. అనుపమ గుణసంపూర్ణుని
ననఘుని సుస్థితుని గతుని నాసీను శయా
నుని భక్తహృద్గుహాశయ
నుని సర్వేశ్వరు ననంతు నుతసచ్చరితున్. 924

మ. విమలంబై పరిశుద్ధమై తగు మనో విజ్ఞానతత్త్వ ప్రబో
ధమతిన్ నిల్పి తదీయమూర్తి విభవ ధ్యానంబు గావించి, చి
త్తము సర్వాంగవిమర్శనక్రియలకుం దార్కొల్పి, ప్రత్యంగమున్
సుమహాధ్యానము సేయఁగావలయుఁబో శుద్ధాంతరంగంబునన్. 925

వ. అది యెట్టిదనిన, 926

సీ. హల కులిశాంకుశ జలజధ్వజచ్ఛత్ర
లాలితలక్షణ లక్షితములు
సలలిత నఖచంద్ర చంద్రికా నిర్ధూత
భక్తమానస తమఃపటలములును
సురుచిరాంగుష్ఠ నిష్ఠ్యూత గంగాతీర్థ
మండిత హరజటామండలములు
నంచిత ధ్యానపారాయణజన భూరి
కలుష పర్వతదీప్త కులిశములును
తే. దాసలోక మనోరథ దాయకములుఁ
జారు యోగిమనఃపద్మ షట్పదములు
ననఁగఁ దనరిన హరిచరణాబ్జములను
నిరుపమధ్యానమున మది నిలుపవలయు. 927

చ. కమలజుమాతయై సురనికాయసమంచిత సేవ్యమానయై
కమలదళాభనేత్రములు గల్గి హృదీశ్వరభక్తినొప్పు న
క్కమల నిజాంకపీఠమునఁ గైకొని యొత్తు పదేశు జానుయు
గ్మము హృదయారవిందమున మక్కువఁ జేర్చి భజింపఁగాఁదగున్. 928

ఉ. చారువిహంగవల్లభు భుజంబులమీఁద విరాజమానసు
శ్రీరుచి నుల్లసిల్లి యతసీకుసుమద్యుతిఁ జాల నొప్పు పం
కేరుహనాభునూరువు లకిల్బిషభక్తి భజించి మానసాం
భోరుహమందు నిల్పఁదగుఁబో మునికోటికి నంగనామణీ! 929

క. పరిలంబిత మృదుపీతాం
బర కాంచీగుణనినాద భరితంబగు న
ప్పురుషోత్తముని నితంబముఁ
దరుణీ! భజియింపవలయుఁ దద్దయుఁ బ్రీతిన్. 930

క. విను భువనాధారత్వం
బునఁ దగి విధిజననహేతు భూతంబగు న
వ్వనజాతముచేఁ గడు మిం
చిన హరినాభీసరస్సుఁ జింతింపఁదగున్. 931

తే. దివ్యమరకతరత్న సందీప్త లలిత
కుచములను మౌక్తికావళి రుచులఁ దనరి
యిందిరాదేవిసదనమై యెసక మెసఁగు
వక్షు మాత్మను దలపోయవలయుఁ జుమ్ము. 932

మ. నిరతంబున్ భజియించు సజ్జనమనోనేత్రాభిరామైక సు
స్థిరదివ్యప్రభగల్గు కౌస్తుభరుచి శ్లిష్టంబు నై యొప్పు నా
వరయోగీశ్వరవంద్యమానుఁ డగు సర్వస్వామి లక్ష్మీశు కం
ధర మాత్మం గదియించి తద్గుణగణధ్యానంబు సేయం దగున్. 933

క. ఘనమందరగిరి పరివ
ర్తన నికషోజ్జ్వలిత కనకరత్నాంగముల్
దనరార లోకపాలకు
లను గలిగిన బాహుశాఖలను దలఁపఁదగున్. 934

వ. మఱియు విమతజనాసహ్యంబులైన సహస్రారంబులు గలుగు సుదర్శనంబును, సరసిజోదరకరసరోరుహంబందు రాజహంసరుచిరం బయిన పాంచజన్యంబును, నరాతిభటశోణితకర్దమలిప్తాంగంబై భగవత్ప్రీతికారిణి యగు కౌమోదకియును, బంధుర సుగంధానుబంధ మంథర గంధవహాహూయమాన పుష్పంధయ ఝుంకారనినద విరాజితంబైన వైజయంతీవనమాలికయును, జీవతత్త్వంబైన కౌస్తుభమణియును, ప్రత్యేకంబ ధ్యానంబు సేయందగు. వెండియు భక్తసంరక్షణార్థం బంగీకరించు దివ్యమంగళవిగ్రహంబున కనురూపం బైనవాసంబును, మకరకుండలమణినిచయమండిత ముకురోపమాన నిర్మలగండమండలంబును, సంతత శ్రీనివాస లోచనపంకజ కలితంబును, లాలితభ్రూలతాజుష్టంబును, మధుకర సమానరుచి చికురవిరాజితంబును నైన ముఖకమలంబు ధ్యానంబు గావింప వలయు. మఱియు శరణాగతుల కభయప్రదంబులగుచు నెగడు పాణి పంకేరుహంబుల మనంబునఁ దలంపవలయు. 935

క. గురుఘోరరూపకంబై
పరఁగెడు తాపత్రయం బుపశమింపఁగ శ్రీ
హరిచేత నిస్సృష్టములగు
కరుణాలోకములఁ దలఁపఁగాఁ దగు బుద్ధిన్. 936

క. ఘనరుచి గల మందస్మిత
మున కనుగుణమగు ప్రసాదమును జిత్తమునన్
మునుకొని ధ్యానము సేయం
జను యోగినాళి కెపుడు సౌజన్యనిధీ ! 937

తే. పూని నతశిరులై నట్టి భూజనముల
శోకబాష్పాంబుజలధి సంశోషకంబు
నత్యుదారతమము హరిహాస మెపుడుఁ
దలఁపగావలె నాత్మలోఁ దవిలి వినుము. 938

సీ. మునులకు మకరకేతనునకు మోహనం
బైన స్వకీయమాయావిలాస
మున రచితం బైన భూమండలంబును
మునిమనఃకుహర సమ్మోదమానుఁ
డగు నీశ్వరుని మందహాసంబు నవపల్ల
వాధరకాంతిచే నరుణ మైన
మొల్లమొగ్గలకాంతి నుల్లసం బాడెడు
దంతపంక్తిని మదిఁ దలఁపవలయు

తే. వెలయ నీ రీతి నన్నియు వేఱు వేఱ
సంచిత ధ్యాన నిర్మలస్థానములుగ
మనములోఁ గను మని చెప్పి మఱియుఁబలికె
దేవహూతికిఁ గపిలుండు దేటపడఁగ. 939

సీ. ఈ ప్రకారమున సర్వేశ్వరునందును
బ్రతిలబ్ధభావసంపన్నుఁ డగుచుఁ
జిరతర సద్భక్తిచేఁ బ్రవృద్ధం బైన
యతిమోదమునఁ బులకితశరీరుఁ
డగుచు మహోత్కంఠ నానంద బాష్పముల్
జడిగొనఁ బరితోష జలధిఁ గ్రుంకి
భగవత్స్వరూపమై భవగుణగ్రాహక
మగుచు మత్సంబంధ మనుకరించి

తే. సుమహితధ్యానమునఁ బరంజ్యోతియందు
మనముఁ జాల నియోజించి మహిమఁ దనరు
మోక్షపద మాత్మలోన నపేక్ష సేయు
ననఘవర్తనుఁ డైన మహాత్ముఁడెపుడు. 940

వ. అది గావున ముక్తి నపేక్షించు మహాత్ముండగువాని చిత్తంబు విముక్తంబైన భగవద్వ్యతిరిక్తాశ్రయంబు గలిగి, విషయాంతర శూన్యంబై విరక్తిం బొందుటం జేసి, పురుషుండు శరీరభావంబుల ననన్యభావం బగు నిర్వాణపదంబు, సూక్ష్మంబగు తేజంబు దనకంటె నధికంబగు తేజంబుతోడి సమానాకారంబు నగు చందంబు నిచ్ఛగించు. వెండియు, 941

సీ. పురుషుఁడు చరమమై భువి ననన్యవిషయ ని
వృత్తమై తగ నివర్తించు చిత్త
వృత్త్యాదులను గల్గి వెలయంగ నాత్మీయ
మగు మహిమ సునిష్ఠుఁడై, లభించు
సుఖ దుఃఖముల మనస్సునఁ దలంపక యహం
కార ధర్మంబులుగాఁ దలంచి,
యనయంబు సాక్షాత్కృతాత్మతత్త్వము గల్గు
నతఁడు జీవన్ముక్తుఁ డండ్రు ధీరు;

తే. లతఁడు నేచందమున నుండు ననిన వినుము,
తనశరీరంబు నిలుచుటయును జరించు
టయును గూర్చుండుటయు నిఁ కేమియు నెఱుంగ
కర్థి వర్తించు విను తల్లి! యతఁడు మఱియు. 942

వ. మదిరాపానంబునం జేసి మత్తుం డగువాఁడు దనకు బరిధానం బగు నంబరంబు మఱచి వర్తించుచందంబునఁ, దన శరీరంబు దైవాధీనం బని నశ్వరంబని తలంచి యాత్మతత్త్వ నిష్ఠుండై యుపేక్షించు. అదియునుంగాక సమాధియోగంబునఁ జేసిసాక్షాత్కృతాత్మతత్త్వంబు గలవాఁడయి స్వాప్నికశరీరంబు చందంబున యావత్కర్మఫలాను భవ పర్యంతంబు పుత్ర దార సమేతంబగు ప్రపంచంబు ననుభవించి యటమీఁదఁ బుత్రదారాది సంబంధంబు వలనం బాసి వర్తించు. 943

సీ. సుత దార మిత్రానుజులకంటె మర్త్యుండు
భిన్నుఁడై వర్తించుచున్నరీతి,
విస్ఫులింగోల్మ్కక విపులధూమములచే
హవ్యవాహనుఁడు వేఱయినరీతి,
వలనొప్ప దేహంబు వలన నీ జీవాత్మ
పరికింప భిన్నరూపమున నుండుఁ
దవిలి భూతేంద్రియాంతఃకరణంబుల
భాసిల్లుచున్న యీ ప్రకృతిరూప

తే. బ్రహ్మమున కాత్మ దాఁ బృథగ్భావ మగుచు
ద్రష్టయయి బ్రహ్మసంజ్ఞచేఁ దనరుచుండు
నఖిలభూతప్రపంచంబు లందుఁ దన్నుఁ
దవిలి తనయందు నఖిలభూతములఁ గనుచు. 944

వ. వెండియు, 945

సీ. వరుస ననన్యభావంబునఁ జేసి భూ
తావళియందుఁ దదాత్మకత్వ
ముసు జూచు; నాత్మీయ ఘనతరోపాదాన
ములయందుఁ దవిలి యిమ్ముల వెలుంగు
నిద్ధదివ్యజ్యోతి యేకమయ్యును బహు
భావంబులను దోఁచు ప్రకృతిగతుఁడు
నగుచున్న యాత్మయుఁ బొగడొందు దేవ తి
ర్య ఙ్మనుష్య స్థావరాది వివిధ

తే. యోనులను భిన్నభావంబు నొందుటయును
జాలఁగల్గు నిజగుణ వైషమ్యముసను
భిన్నుఁడై వెల్గుగావునఁ బేర్చి యదియు
దేహసంబంధి యగుచు వర్తించుచుండు. 946

క. భావింప సదసదాత్మక
మై వెలయుచు దుర్విభావ్య మగుచు స్వకీయం
బై వర్తించుచుఁ బ్రకృతిని
భావమునఁ దిరస్కరించు భవ్యస్ఫూర్తిన్ 947

# అధ్యాయము - ౨౯

వ. ఈ యాత్మ నిజస్వరూపంబునం జేసి వర్తించునని కపిలుండెఱింగించిన విని దేవహూతి వెండియు నిట్లనియె. మహాత్మా! మహదాది భూతంబులకుం బ్రకృతి పురుషులకుం గల్గిన పరస్పర లక్షణంబులను దత్స్వరూపంబులను నెఱింగించితివి. ఇఁక నీ ప్రకారంబున సాంఖ్యంబునందు నిరూపింపఁబడునట్టి ప్రకారంబును భక్తియోగ మాహాత్మ్యంబును, బురుషుండు భక్తియోగంబునం జేసి సర్వలోక విరక్తుండగు నట్టి యోగంబును, బ్రాణిలోకంబునకు సంసారం బనేకవిధం బయి యుండుఁ గావున, బరాపరుండవై కాలస్వరూపివై యీశ్వరుండవైన యే నీవలని భయంబునం జేసి జనులు పుణ్యకర్మంబులు సేయుచుండుదు రవ్విధంబును, మిథ్యాభూతంబైన దేహంబునందు నాత్మాభిమానంబు చేయుచు మూఢుండై కర్మంబులందు నాసక్తంబైన బుద్ధిం జేసి విభ్రాంతుండగుచు సంసార స్వరూపం బగు మహాంధకారంబునందుఁ జిరకాల ప్రసుప్తుండైన జనునిఁ బ్రబోధించుకొఱకు యోగభాస్కరుండవై యావిర్భవించిన యాపుణ్యాత్ముండవు నీవు గావున నాకు నిన్నియుం దెలియ సవిస్తరంబుగా నానతియ్యవలయు ననిన దేవహూతికి గపిలుం డిట్లనియె. 948

కపిలుండు దేవహూతికి భక్తియోగమును దెలియఁజేయుట

క. నలినాయతాక్షి! విను జన
ముల ఫలసంకల్పభేదమునఁ జేసి మదిం
గల భక్తియోగమహిమం
బలవడఁగ ననేకవిధము లనఁదగు నవియున్. 949

వ. వివరించెదఁ దామస రాజస సాత్త్విక భేదంబులం ద్రివిధంబై యుండు. అందుఁ దామసభక్తిప్రకారం బెట్టిదనిన, 950

తే. సతత హింసాతి దంభ మాత్సర్య రోష
తమములను జేయుచును భేదదర్శి యగుచుఁ
బరఁగ నాయందుఁ గావించు భక్తి దలఁప
దామసం బనఁదగు, వాఁడు తామసుండు. 951

క. ఘనవిషయప్రావణ్యము
లను సుమహైశ్వర్యయశములకుఁ బూజాద్య
ర్థ్యాని నను నర్థి భజించుట
చను రాజసయోగ మనఁగ సౌజన్యనిధీ! 952

చ. అనుపమ పాపకర్మపరిహారముకై భజనీయుఁడైన శో
భనచరితుం డితం డనుచు భావమునం దలపోసి భక్తిచే
ననితరయోగ్యతన్ భగవదర్పణబుద్ధి నొనర్చి కర్మముల్
జనహితకారియై నెగడ సాత్త్వికయోగ మనంగఁ జొప్పడున్. 953

చ. మనుసుత! మద్గుణశ్రవణమాత్ర లభించినయట్టి భక్తిచే
ననఘుఁడ సర్వశోభన గుణాశ్రయుఁడన్ బరమేశ్వరుండనై
తనరిన నన్నుఁ జెందిన యుదాత్తమనోగతు లవ్యయంబులై
వననిధిగామి యైన సురవాహినిఁ బోలె ఫలించు నిమ్మలన్. 954

క. హేయగుణరహితుఁ డనఁగల
నాయందుల భక్తిలక్షణముఁ దెలిపితి నన్
బాయక నిర్హేతుకముగఁ
జేయు మదీయ వ్రతైక చిరతరభక్తిన్. 955

వ. (నిష్కాములయిన మదీయభక్తులకు నట్టి భక్తియోగంబు) సాలోక్య సార్ష్టి సామీప్య సారూప్య సాయుజ్యంబులకు సాధనంబు గావున మహాత్ములగువారు నిజమనోరథ ఫలదాయకంబు లయినను మదీయ సేవావిరహితంబు లయిన యితరకర్మంబు లాచరింప నొల్లరు. దీని నాత్యంతికభక్తియోగం బని చెప్పుదురు. సత్త్వ రజ స్తమోగుణ విహీనుం డయిన జనుండు మత్సమానాకారంబుఁ బొందునని చెప్పి మరియు నిట్లనియె. 956

సీ. నిత్య నైమిత్తిక నిజధర్మమున గురు
శ్రద్ధాగరిష్ఠతఁ జతుర పాంచ
రాత్రోక్త హరిసమారాధన క్రియలను
నిష్కామనంబున నెఱి మదీయ

విగ్రహదర్శన వినుతి పూజా వంద
న ధ్యాన సంశ్రవణములఁ గర్మ
సంగి గాకుండుట సజ్జనప్రకరాభి
మానంబు నొందుట హీనులందు

తే. జాల ననుకంప సేయుట సములయందు
మైత్రి నెఱపుట యమనియమక్రియాది
యైన యోగంబుచేత నాధ్యాత్మికాది
భౌతికాదులఁ దెలియుట పలుకుటయును. 957

వ. మఱియును, 958

క. హరిగుణమంగళకీర్తన
పరుఁడై తగ నార్జవమున భగవత్పరులం
గరమనురక్తి భజించుట
నిరహంకారమున నుంట నిశ్చలుఁ డగుటన్. 959

క. ఇవి మొదలుగాఁగఁ గలుగు భ
గవదుద్దేశ స్వధర్మ కలితుండై వీ
నివలనఁ బరిశుద్ధగతిం
దవిలిన మది గలుగు పుణ్యతముఁ డెయ్యెడలన్. 960

తే. గురుతరానేక కల్యాణ గుణవిశిష్టుఁ
డనఁగ నొప్పిన నన్నుఁ బొందు నండ గొనక
పవనవశమునఁ బువ్వుల పరిమళంబు
ఘ్రాణమున నావరించిన కరణి మెఱసి. 961

చ. అనిశము సర్వభూతహృదయాంబుజవర్తి యనం దనర్చు నీ
శు నను నవజ్ఞ సేసి మనుజుం డొగి మత్ప్రతిమార్చనావిడం
బనమున మూఢుఁడై యుచిత భక్తిని నన్ను భజింపఁడేని న
మ్మనుజుఁడు భస్మకుండమున మానక వేల్చినయట్టివాఁ డగున్. 962

సీ. అబ్జాక్షి! నిఖిలభూతాంతరాత్ముఁడ నైన
నాయందు భూతగణంబునందు
నతిభేదదృష్టి మాయావృతై సతతంబుఁ
బాయక వైరానుబంధనిరతు

లగువారి మనములఁ దగులదు శాంతి యె
న్నఁటికైన, నేను నా కుటిలజనులు
మానక యెప్డు సామాన్యాధిక ద్రవ్య
సమితిచే మత్పదార్చన మొనర్ప

తే. నర్థి నాచిత్తమున ముదం బందకుందు
ననుచు నెఱిఁగించి మఱియు నిట్లనియెఁ గరుణఁ
గలితసద్గుణజటిలుఁ డ క్కపిలుఁ డెలమిఁ
దల్లితోడ గుణవతీమతల్లితోడ. 963

సీ. తరళాక్షి! విను మచేతన దేహములకంటెఁ
జేతన దేహముల్ శ్రేష్ఠ మందుఁ
బ్రాణవంతంబులై స్పర్శనజ్ఞానంబు
గలుగు చైతన్యవృక్షములకంటె
ఘనరసజ్ఞానసంకలితచేతను లుత్త
ములు, రసజ్ఞానంబు గలుగువాని
కంటె గంధజ్ఞానకలితబృందంబులు
గడు శ్రేష్ఠములు వాని కంటె శబ్ద

తే. వేదు లగుదురు శ్రేష్ఠులు వెలయు శబ్ద
విదులకంటెను సద్రూపవేదులైన
వాయసాదులు శ్రేష్ఠముల్ వానికంటె
వరుస బహుపాదు లుత్తముల్ వానికంటె. 964

క. తలఁపఁ జతుష్పదు లధికులు,
బలకొని మఱి వారికంటెఁ బాదద్వయముం
గల మనుజు లలఘుతము, లి
మ్ముల వారలయందు వర్ణములు నాల్గరయన్. 965

వ. అందు, 966

సీ. తలఁప బ్రాహ్మణు లుత్తములు, వారికంటెను
వేదవేత్తలు, వేదవిదులకంటె
విలసిత వేదార్థ విదులు, వారలకంటె
సమధిక శాస్త్రసంశయము మాన్పు

మీమాంసకులు, మఱి మీమాంసకులకంటె
నిజధర్మవిజ్ఞాననిపుణు, లరయ
వారికంటెను సంగవర్జితచిత్తులు,
దగ వారికంటె సద్ధర్మపరులు,
తే. ధార్మికులకంటె నుత్తమోత్తముఁడు వినుము
మత్సమర్పిత సకలధర్మస్వభావ
మహిమములు గల్గి యితరధర్మములు విడిచి
సమత వర్తించు నప్పుణ్యాతముఁడు ఘనుఁడు. 967

వ. అట్టివాని, 968

క. కని సకలభూతగణములు
మనమున నానందజలధిమగ్నము లగుచున్
ఘనబహుమానపురస్సర
మనయముఁ బాటిల్ల వినుతు లర్థిం జేయున్. 969

వ. అంత నీశ్వరుండు జీవస్వరూపానుప్రవిష్టుండై యుండు, నట్టి భగవంతుం జూచి భక్తియోగంబుననేని యోగంబుననేనిఁ బురుషుండు పరమాత్మంబొందు. ప్రకృతిపురుషాత్మకంబును దద్వ్యతిరిక్తంబును నైన దైవంబునై కర్మవిచేష్టితం బగుచు నుండు. అదియ భగవద్రూపంబు. ఇట్టి భగవద్రూపంబు భేదాస్పదంబగుచు నద్భుతప్రభావంబుగలకాలం బనియుఁ జెప్పంబడు. అట్టికాలంబు మహదాది తత్త్వంబులకును, మహత్తత్త్వాభిమానులగు జీవులకును భయావహంబగుటంజేసి సకలభూతంబులకు నాశ్రయంబగుచు నంతర్గతంబై భూతంబులచేత భూతంబుల గ్రసించుచు యజ్ఞఫలప్రదాత గావున వశీకృతభూతుండై ప్రభుత్వంబు భజియించి విష్ణుండు ప్రకాశించుచుండు. అతనికి మిత్రుండు శత్రుండును బంధుండును లేఁడు. అట్టి విష్ణుండు సకలజనంబులయం దావేశించి యప్రమత్తుఁడై ప్రమత్తులయిన జనంబులకు సంహారకుండై యుండు. అతనివలని భయంబునంజేసి వాయువు వీచు, సూర్యుండు దపియించు, నింద్రుండు వర్షించు, నక్షత్రగణంబు వెలుంగుఁ, జంద్రుండు బ్రకాశించు, దత్తత్కాలంబుల వృక్ష లతాదు లోష

ధులతోడంగూడి పుష్పఫలభరితంబు లగు, సరిత్తులు ప్రవహించు, సముద్రంబులు మేరలు దప్పకయుండు, నగ్ని ప్రజ్వలించు, భూమి గిరులతోఁగూడ బరువునఁ గ్రుంగ వెఱచు, ఆకాశంబు సకలజనంబు లకు నవకాశంబిచ్చు, మహత్తత్త్వంబు జగత్తునకు నంకుర స్వరూపంబుగావున సప్తావరణావృతంబగులోకం బను స్వదేహంబు విస్తరింపఁజేయు, గుణాభిమానులగు బ్రహ్మాదులు సర్వేశ్వరునిచేత జగత్సర్గంబునందు నియోగింపఁబడి ప్రతిదినంబు నయ్యాయి సర్గంబుసేయ నప్రమత్తులై యుండుదురు, పితరాదులు పుత్రోత్పత్తిఁ జేయుదురు, కాలుండు మృత్యుసహాయుండై మారకుండై యుండు, చరాచరాత్మకంబగు సకలప్రపంచంబు భగవదధీనంబై యుండు. అని చెప్పి కపిలుండు వెండియు నిట్లనియె. 970

## అధ్యాయము - 30

క. నెఱి నిట్టి నిఖిలలోకే
శ్వరుని పరాక్రమముఁ దెలియ సామర్థ్యం బె
వ్వరికినిఁ గలుగదు మేఘము
గరువలివిక్రమము దెలియఁగా లేని గతిన్. 971

క. మగువా! విను సుఖహేతుక
మగునర్థము దొరకమికి మహాదుఃఖమునం
దగులుదు రది యంతయు నా
భగవంతుని యాజ్ఞఁజేసి ప్రాణులు మఱియున్. 972

సీ. పూని యనిత్యంబు లైన గృహక్షేత్ర
పశు ధన సుత వధూ బాంధవాది
వివిధవస్తువులను ధ్రువముగా మది నమ్మి
వఱలు దుర్మతియగు వాఁడు జంతు
సంఘాతమగు దేహసంబంధమున నిల్చి
యర్థి నెయ్యే యోను లందుఁ జొరఁగ
ననుగమించును వానియందు విరక్తుండు
గాకయుండును నరకస్థుఁడైన

## మూలము

తే. దేహి యాత్మీయదేహంబు దివిరి వదల
లేక తన కది పరమసౌఖ్యాకరంబు
గాఁగ వర్తించు, నదియునుగాక యతఁడు
దేవమాయావిమోహితభావుఁ డగుచు.

క. ఘనముగఁ బుత్ర వధూ పశు
ధన గృహ రక్షణమునందుఁ దత్తత్క్రియలన్
మనమునఁ దలపోయుచు దిన
దినమున్ దందహ్యమాన దేహుం డగుచున్.

క. అతి మూఢహృదయుఁ డగుచు దు
రితకర్మారంభమునఁ జరించుచుఁ దరుణీ
కృత గోప్యభాషణములను
సుతకలసంభాషణములఁ జొక్కుచు మఱియున్.

క. విను మింద్రియపరవశుఁడై
మునుకొని తత్కూటధర్మములుగల దుఃఖం
బనయము సుఖరూపంబుగ
మనమునఁ దలపోసి తదభిమానుం డగుచున్.

క. సతతముఁ దమతమ సంపా
దిత మగు నర్థములచేత ధృతిఁ బరులకుఁ గు
త్సితమతి హింసలు చేయుచు
రతిమూఢమనస్కు లగుచు నాత్మజనములన్.

తే. పూని రక్షించుచును, వారి భుక్తశేష
మనుభవించుచు, నంత జీవనము వోకఁ
గడఁకతో నపుడు పదార్థకాముఁ డగుచు
సత్త్వ మెడలి కుటుంబపోషణమునందు.

సీ. బలిమిసాలక మందభాగ్యుఁడై కుమతియై
పూని యప్పుడు క్రియాహీనుఁ డగుచు
దవిలి వృథా ప్రయత్నంబులు సేయుచు
మూఢుఁడై కార్పణ్యమునఁ జరించు

వ. మఱియుఁ గుటుంబపోషణంబునఁ గుక్షింభరుం డగుచు నధర్మ పరుండై భూతద్రోహంబున నతిపాపుండై నిరయంబునుం బొంది నిజధనంబులు గోలుపడి మొఱవెట్టు నాపన్నుని చందంబునం బర స్పరసంబంధంబునఁ గల్పింపఁబడిన తమిస్రాంధతామిస్ర రౌర వాదులగు నరకంబులంబడి తీవ్రంబులయిన బహుయాతనల ననుభ వించి క్షీణపాపుండై పునర్నరత్వంబునుం బొందు నని చెప్పి వెండియు నిట్లనియె. 988

## అధ్యాయము - ౩౧

కపిలుఁడు దేవహూతికిఁ బిండోత్పత్తిక్రమంబు దెలుపుట

సీ. కైకొని మఱి పూర్వకర్మానుగుణమున
శశ్వత్ప్రకాశకుం డీశ్వరుండు
ఘటకుండు గావునఁ గ్రమ్మఱ జీవుండు
దేహసంబంధంబుఁ దివిరి తాల్ప
దారఁగొని పురుష రేతోబిందు సంబంధి
యై వధూగర్భంబునందుఁ జొచ్చి
కైకొని యొకరాత్రి గలిలంబు పంచరా
త్రముల బుద్బుదమును దశమదివస

తే. మందుఁ గర్కంధు వంతయూ నంతమీఁదఁ
బేశియగు నంతమీఁదటఁ బేర్చి యండ
కల్పమగు నొక్క నెల మస్తకమును మాస
యుమళ మైనను గరచరణములుఁ బొడము. 989

వ. మఱియు మాసత్రయంబున నఖరోమాస్థిచర్మంబులు లింగచ్ఛి ద్రంబులును గలిగి, నాలవమాసంబున సప్తధాతువులును, బంచమ మాసంబున క్షుత్తృష్ణలును గలిగి, షష్ఠమాసంబున మావిచేతం బొదువంబడి తల్లికుక్షిని దక్షిణభాగమునం దిరుగుచు మాతృ భుక్తాన్న పానంబులవలనఁ దృప్తిబొందుచు, నేధమానధాతువులు గలిగి జంతుసంకీర్ణంబగు విణ్మూత్రగర్తంబందుఁ దిరుగుచుఁ గ్రిమి భక్షితశరీరుండై మూర్ఛలం బొందుచుఁ, దల్లి భక్షించిన కటు

తిక్తోష్ణ లవణ క్షారామ్లా ద్యుల్బణంబులైన రసంబులచేత బరితప్తాంగుండగుచు, జరాయువునఁ గప్పబడి బహిఃప్రదేశంబు నందు నాంత్రంబులచేత బద్ధుండై, కుక్షియందు శిరంబు మోపికొని. భుగ్న పృష్ఠగ్రీవోదరుండై స్వాంగచలనంబునందు నసమర్థుండగుచుఁ, బంజరంబునం దుండు శకుంతంబు చందంబున నుండి దైవ కృతంబైన జ్ఞానంబునం బూర్వజన్మదుష్కృతంబుల దలంచుచు దీర్ఘోచ్ఛ్వాసంబులు సేయుచు నే సుఖలేశంబునుం బొందక వర్తించు. అంత నేడవ నెలయందు లబ్ధజ్ఞానుండై చేష్టలు గలిగి విట్క్రిమి సోదరుండై యొక్క దిక్కున నుండక సంచరించుచుం బ్రసూతి మారుతంబులచేత నతివేపితుండగుచు, యాచమానుండును దేహాత్మ దర్శియుఁ బునర్గర్భ వాసంబునకు భీతుండునగుచు బంధనభూతంబులగు సప్తధాతువులచే బద్ధుండై కృతాంజలిపుటుండు దీనవదనుండు నై జీవుండు దా నెవ్వనిచే నుదరంబున వసియింపఁ నియమింపబడె నట్టి సర్వేశ్వరుని నిట్లని స్తుతియించు. 990

గర్భస్థుండగు జీవుండు భగవంతుని స్తుతించుట

క. అనయమును భువనరక్షణ
మునకై స్వేచ్ఛానురూపమునఁ బుట్టెడి వి
ష్ణుని భయవిరహితమగు పద
వనజయుగం బర్థిఁ గొల్తు వారనిభక్తిన్. 991

వ. అదియునుంగాక పంచభూతవిరహితుం డయ్యుం బంచభూత విరచితంబైన శరీరంబునందుఁ గప్పంబడి యింద్రియగుణార్థ చిదాభాసజ్ఞానుండనైన నేను, 992

సీ. ఎవ్వఁడు నిఖిలభూతేంద్రియమయ మగు
మాయావలంబన మహితకర్మ
బద్ధుఁడై వర్తించు పగిది దందహ్యమా
నం బగు జీవచింతనమునందు
సవికారమై శుద్ధమై యఖండజ్ఞాన
మున నుండువానికి ముఖ్యచరితు
నకు నకుంఠితశౌర్యునకుఁ బరంజ్యోతికి
సర్వజ్ఞునకుఁ గృపాశాంతమతికిఁ

తే. గడఁగియు బ్రకృతిపురుషులకంటెఁ బరముఁ
డయినవానికి మ్రొక్కెద నస్మదీయ
దుర్భరోదగ్ర భీకర గర్భ నరక
వేదనల మాన్చి శాంతిఁ గావించుకొఱకు. 993

సీ. అనవుడు సుతునకు జనని యిట్లనుఁ దగ ;
మహితాత్మ! యెవ్వని మహిమచేత
ఘనమోహులై గుణకర్మనిమిత్త సాం
సారికమార్గ సంచారములను
ధృతి సెడి యలసి యేదిక్కు నెఱుంగక
హరిపదధ్యానంబు నాత్మ మఱచి
యుండువారలకు నే యుక్తియు నమ్మహా
పురుషు ననుగ్రహబుద్ధి లేక

తే. తద్గుణధ్యాన తన్మూర్తి దర్శనములు
గోచరించుట యెట్లు? నాకును బ్రబోధ
కలితముగఁ బల్కు మనవుడుఁ గపిలుఁ డనియె
నంబతోడను సుగుణకదంబతోడ. 994

వ. అట్టి యీశ్వరుండు గాలత్రయంబునందును జంగమస్థావరాంత
ర్యామి యగుటం జేసి జీవకర్మమార్గంబులం బ్రవర్తించువారు
తాపత్రయనివారణంబుకొఱకు భజియింతురు. అని చెప్పి మఱియు
నిట్లనియె. 995

క. జనయిత్రిగర్భమందును
ఘనక్రిమివిణ్మూత్రరక్తగర్తములోనన్
మునుఁగుచు, జఠరాగ్ని నిదిన
దినమును సంతప్యమానదేహుం డగుచున్. 996

ఆ. దీనవదనుఁ డగుచు దేహి యీ దేహంబు
వలన నిర్గమింపఁ దలఁచి, చనిన
నెలల నెన్నికొనుచు నెలకొని గర్భంబు
వలన వెడలఁ ద్రోయు వార గలరె? 997

వ. అని తలంచుచు, దీనరక్షకుం డయిన పుండరీకాక్షుండు దన్ను గర్భనరకంబువలన విముక్తునింజేయ సమ్మహాత్మునికిఁ బ్రత్యుపకారంబు సేయలేమికి నంజలి మాత్రంబు సేయందగు నట్టి జీవుండనైన నేను శమదమాది యుక్తంబైన శరీరంబునందు విజ్ఞానదీపాంకురంబునం బురాణపురుషు నిరీక్షింతును. అని మఱియు, 998

సీ. నెలకొని బహుదుఃఖములకు నాలయమైన
యీ గర్భనరకము నేను వెడలఁ
జాల, బహిఃప్రదేశమునకు వచ్చిన
ననుపమ దేవమాయావిమోహి
తాత్ముండనై ఘోరమైనట్టి సంసార
చక్రమందును బరిశ్రమణశీలి
నై యుండవలయుఁ దా నదిగాక గర్భంబు
నం దుండు శోకంబు నపనయించి

తే. యాత్మ కనయంబు సారథియైన యట్టి
రుచిరవిజ్ఞానమునఁ దమోరూపమైన
భూరి సంసారసాగరోత్తారణంబు
సేసి యీ యాత్మ నరసి రక్షించుకొందు. 999

వ. మఱియును, 1000

చ. పరఁగుచు నున్న దుర్వ్యసన భాజనమై ఘనదుఃఖమూలమై
యరయఁగఁ బెక్కుతూంట్లుగలదై క్రిమిసంభవమైన యట్టి దు
స్తరబహుగర్భవాసముల సంగతి మాన్పుటకై భజించెదన్
సరసిజనాథ! భూరిభవసాగరతారక పాదపద్మముల్. 1001

క. అని కృతనిశ్చయుఁడయి, యే
చిన విమలజ్ఞాని యగుచు జీవుఁడు గర్భం
బున వెడల నొల్లకుండం
జనియెడు నవమాసములును జననీ! యంతన్. 1002

వ. దశమమాసంబున వాని నధోముఖుం గావించిన, నుచ్ఛ్వాసనిశ్శ్వాసంబులు లేక ఘనదుఃఖభాజనుండు విగతజ్ఞానుండు రక్తదిగ్ధాంగుండునై విష్ఠాస్థక్రిమియుంబోలె నేలంబడి యేడ్చుచు,

జ్ఞానహీనుండై జడుండునుంబోలె నుండి యంత నిజభావానభిజ్ఞు
లగు నితరులవలన వృద్ధిం బొందుచు, నభిమతార్థంబులం జెప్ప
నేరక యనేకకీటసంకులం బయిన పర్యంకంబునందు శయానుండై
యవయవంబులు గండూయమానంబులైనఁ గోఁక నేరక,
యాసనోత్థానగమనంబుల నశక్తుండై తన శరీరచర్మంబు మశక
మత్కుణమక్షికాదులు పొడువ గ్రిములచే వ్యథంబడు క్రిమియుం
బోలె దోదూయమానుండై రోదనంబు సేయుచు, విగత
జ్ఞానుండై మెలంగుచు శైశవంబునం దత్తత్క్రియానుభవంబుఁ
గావించి పౌగండవయస్సునఁ దదనురూపంబు లగు నధ్యయనాది
దుఃఖంబు లనుభవించి, తదనంతరంబ యౌవనంబు ప్రాప్తంబైన
నభిమతార్థఫలప్రాప్తికి సాహసపూర్వంబు లగు వృథాగ్రహంబులు
సేయుచుఁ, గాముకుండై పంచమహాభూతారబ్ధంబగు దేహం
బందుఁ బెక్కుమాఱు లహంకార మమకారంబులం జేయుచుఁ,
దదర్థంబులైన కర్మంబు లాచరించుచు, సంసార బద్ధుం డగుచు,
దుష్పురుషసంగమంబున శిశ్నోదరపరాయణుండై వర్తించుచు
నజ్ఞానంబునం జేసి వర్ధిష్యమాణరోషుం డగుచుఁ దత్ఫలంబులగు
దుఃఖంబు లనుభవించుచుఁ గాముకుండై నిజనాశంబునకు హేతువు
లగు కర్మంబులం బ్రవర్తించుచుండు. మఱియును, 1003

సీ. జనయిత్రి! సత్యంబు శౌచంబు దయయును
ధృతియు మౌనంబు బుద్ధియును సిగ్గు
క్షమయును యశమును శమదమభగములు
మొదలుగాఁగల గుణంబులు నశించు
జనుల కసత్సంగమున, నని యెఱిఁగించి
వెండియు నిట్లను వినుము, మూఢ
హృదయులు శాంతివిహీనులు దేహాత్మ
బుద్ధులు నంగనామోహపాశ

తే. బద్ధకేళీ మృగంబుల పగిదిఁ దగిలి
పరవశస్వాంతముల శోచ్యభావులైన
వారిసంగతి విడువంగవలయు, నందు
నంగనాసంగమము దోష మండ్రు గాన. 1004

వ. దీని కొక్క యితిహాసంబు గలదు. తొల్లి యొక్కనాఁడు ప్రజాపతి దనకూఁతురయిన భారతి మృగీరూపధారిణియైయుండం జూచి తదీయ రూపరేఖావిలాసంబులకు నోటువడి వివశీకృతాంతరంగుం డును విగతత్రపుండునునై తానును మృగరూపంబునొంది తదను ధావనంబు హేయంబని తలంపక ప్రవర్తించెం గావున నంగనా సంగమంబు వలవదు. అస్మదీయ నాభీకమలసంజాత చతుర్ముఖ నిర్మిత మరీచ్యాద్యుద్భూత కశ్యపాదికల్పిత దేవ మనుష్యాదు లందు మాయా బలంబునం గామినీజనమధ్యంబున విఖండిత మన స్కుండు గాకుండఁ బుండరీకాక్షుండైన నారాయణ ఋషికిం దక్క నన్యులకు నెవ్వరికిం దీరదు. అని వెండియు నిట్లనియె. 1005

తే. రూఢి నా మాయ గామినీరూపమునకు
బురుషులకు నెల్ల మోహంబుఁ బొందజేయుఁ
గాన పురుషులు సతులసంగంబు మాని
యోగవృత్తిఁ జరించుచు నుండవలయు. 1006

క. ధీరతతో మత్పదసర
సీరుహ సేవానురక్తిఁ జెందినవారల్
నారీసంగము నిరయ
ద్వారముగా మనములందుఁ దలఁపుదు రెందున్. 1007

క. హరిమాయావిరచితమై
తరుణీరూపంబుఁ దాల్చి ధరఁ బర్విన బం
ధుర తృణపరివృతకూపము
కరణి నదియు మృత్యురూపకంబగు మఱియున్. 1008

చ. ధన పశు పుత్ర మిత్ర వనితాగృహకారణభూతమైన యీ
తనువున నున్న జీవుఁడు పదంపడి యెట్టిశరీర మెత్తినన్
అనుగతమైన కర్మఫల మందక పోవఁగరాదు, మింటఁబో
యిన భువి దూఱినన్ దిశల కేగిన నెచ్చటనైన డాఁగినన్. 1009

వ. అట్టి పురుషరూపంబు నొందిన జీవుండు నిరంతరస్త్రీసంగంబుచే విత్తాపత్యగృహాదిప్రదం బగు స్త్రీత్వంబు నొందు. ఈ క్రమంబున నంగనారూపుండగు జీవుండు మన్మాయచేఁ బురుషరూపంబు

నొంది ధనాదిప్రదుండగు భర్తను నాత్మబంధకారణం బగు మృత్యువునుగ నెఱుంగవలయు. మఱియు జీవోపాధిభూతంబగు లింగదేహంబుచే స్వావాసభూతలోకంబుననుండి లోకాంతరంబు నొందుచుం బ్రారబ్ధకర్మఫలంబుల ననుభవించుచు మరలం గర్మాదులం దాసక్తుండగుచు మృగయుండు గానంబున ననుకూలసుఖప్రదుండైనను మృగంబునకు మృత్యువగు చందంబున జీవుండు భూతేంద్రియ మనోమయంబైన దేహంబు గలిగియుండు. అట్టి దేహనిరోధంబె మరణంబు, నావిర్భావంబె జన్మంబునుం గాన సకల వస్తు విషయజ్ఞానంబు గలుగుటకు జీవునకు సాధనంబు చక్షురింద్రియంబగు. ద్రష్టృ దర్శనీయ యోగ్యతాప్రకారంబున జీవునకు జన్మమరణంబులు లేవుగావున భయకార్పణ్యంబులు విడిచి సంభ్రమంబు మాని జీవప్రకారంబు జ్ఞానంబునం దెలిసి ధీరుండై ముక్తసంగుం డగుచు, యోగవైరాగ్యయుక్తంబైన సమ్యగ్జ్ఞానంబున మాయావిరచితంబైన లోకంబున దేహాదులం దాసక్తి మాని వర్తింపవలయునని చెప్పి వెండియు నిట్లనియె. 1010

## అధ్యాయము - ౩౨

సీ. గృహమందు వర్తించు గృహమేధు లగువారు
మహిత ధర్మార్థ కామములకొఱకు
సంప్రీతులగుచుఁ దత్సాధనానుష్ఠాన
నిరతులై వేదనిర్ణీతభూరి
భగవత్స్వధర్మతద్భక్తిపరాఙ్ముఖు
లై దేవగణముల ననుదినంబు
భజియించుచును భక్తిఁ బైతృకకర్మముల్
సేయుచు నెప్పుడు శిష్టచరితు

తే. లగుచుఁ దగ దేవ పితృ సువ్రతాఢ్యులయిన
కామ్యచిత్తులు ధూమాదిగతులఁ జంద్ర
లోకమును జెంది, పుణ్యంబు లుడ్తమయిన
మరలివత్తురు భువికి జన్మంబునొంద, 1011

వ. అదియునుం గాక, 1012

తే. ప్రవిమలానంతభోగితల్పంబునందు
యోగనిద్రాళువై హరి యున్నవేళ
నఖిలలోకంబులును విలయంబు నొందు
నట్టి సర్వేశ్వరునిఁగూర్చి యలఘుమతులు. 1013

మ. పరికింపన్ నిజభక్తియుక్తిగరిమం బాటిల్లు పంకేరుహో
దర విన్యస్త సమస్తధర్మముల శాంతస్వాంతులై సంగముం
బరివర్జించి విశుద్ధచిత్తు లగుచుం బంకేజపత్రేక్షణే
తరధర్మైకనివృత్తులై సతతమున్ దైత్యారిఁ జింతించుచున్. 1014

సీ. మఱియు నహంకార మమకార శూన్యులై
యర్థి వర్తించుచు నర్చిరాది
మార్గగతుండును మహనీయచరితుండు
విశ్వతోముఖుఁడును విమలయశుఁడు
జగదుద్భవస్థాన సంహారకారణుం
డవ్యయుం డజుఁడు బరాపరుండుఁ
బురుషోత్తముఁడు నవపుండరీకాక్షుండు
నైన సర్వేశ్వరునందుఁ బొంది

తే. మానితాపునరావృత్తి మార్గమయిన
ప్రవిమలానంద తేజోవిరాజమాన
దివ్యపదమున సుఖయించు ధీరమతులు
మరలి రా రెన్నఁటికిని జన్మములఁ బొంద. 1015

వ. మఱియుఁ బరమేశ్వరదృష్టిచే హిరణ్యగర్భు నుపాసించువారు సత్యలోకంబున "ద్విపరార్ధావసానం బగు ప్రళయంబుదనుకఁ బరుండగు చతురాననుం బరమాత్మరూపంబున ధ్యానంబుసేయుచు నుండి, పృథివ్యప్తేజో వాయ్వాకాశ మానసేంద్రియ శబ్దాది భూతాదులతోడంగూడ లోకంబును బ్రకృతియందు లీనంబుసేయు సర్వేశ్వరుండు సకలసంహర్తయగు సమయంబున గతాభిమానంబులుగలిగి బ్రహ్మలోకవాసులగు నాత్మలు బ్రహ్మతోడం గూడి పరమానందరూపుండును సర్వోత్కృష్టుండును నగు పురాణపురుషుం బొందుదురు. కావున నీవు సర్వభూతహృదయపద్మనివాసుండును శ్రుతానుభావుండును నిష్కళంకుండును నిరంజ

నుండును నిర్ద్వంద్వుండును నగు పురుషుని భావంబుచే శరణంబు
నొందుమని చెప్పి మఱియు నిట్లనియె. 1016

మ. సకలస్థావర జంగమప్రతతికిం జర్చింపఁ దా నాద్యుఁడై
యకలంకశ్రుతిగర్భుఁడుం బరముఁడు నైనట్టి యీశుండు సే
వక యోగీంద్రకుమారసిద్ధమునిదేవశ్రేణి యోగప్రవ
ర్తకమై తన్ను భజింపఁ జూపు సగుణబ్రహ్మంబు లీలాగతిన్. 1017

సీ. అట్టి సర్వేశ్వరుం డయ్యాయికాలంబు
లందును దద్గుణ వ్యతికరమున
జనియించుచుండు, నీ చాడ్పున ఋషి దేవ
గణములు దమతమ కర్మనిర్మి
తైశ్వర్యపారమేష్ఠ్యములందుఁ బురుషత్వ
మునఁ బొంది యధికారములు వహించి
వర్తించి క్రమ్మఱ వత్తురు ; మఱి కొంద
ఱారూఢకర్మానుసారమైన

తే. మనములను జాల గలిగి ధర్మములయందు
శ్రద్ధతోఁగూడి యప్రతిసిద్ధమైన
నిత్యనైమిత్తికాచార నిపుణు లగుచుఁ
దగి రజోగుణకలితచిత్తములు గలిగి. 1018

వ. సకాములై యింద్రియజయంబులేక పితృగణంబుల నెల్లప్పుడుఁ
బూజించుచు గృహంబులయందు వర్తించి హరిపరాఙ్ముఖులగు
వారు త్రైవర్గికపురుషులని చెప్పంబడుదురు. 1019

చ. వినుతగుణోత్తరుండు నురువిక్రముఁడైన హరిన్ భజించి త
న్మనన లసత్కథామృతము మానుగఁ గ్రోలుట మాని దుష్కథల్
విని ముదమందుచుందురు వివేకవిహీనత నూఱఁబంది యా
త్మను మధురాజ్యభక్ష్యములు మాని పురీషము కేగుచాడ్పునన్. 1020

చ. అలవడ ధూమమార్గగతులై పితృలోకముఁ బొంది పుణ్యముం
బొలసినవారు దొంటి తమ పుత్త్రులకుం దగఁ దాము పుట్టి వి
హ్వలమతి గర్భగోళపతనాది పరేతధరాక్రియాంతమై
వెలసిన కర్మ మిం దనుభవింతురు గావున నీవు భామినీ ! 1021

క. విను సర్వభావములం బర
మునివ ననఘు ననంతు నీశుం బురుషోత్తము స
న్మనమున భజియింపుము ముద
మున బునరావృత్తిలేని ముక్తి లభించున్. 1022

వ. అని చెప్పి వెండియు నిట్లనియె. భగవంతుండగు వాసుదేవుని యందుం బ్రయుక్తంబగు భక్తియోగంబు బ్రహ్మసాక్షాత్కార సాధనంబులగు వైరాగ్యజ్ఞానంబులం జేయు. అట్టి భగవద్భక్తి యుక్తంబైన చిత్తం బింద్రియవృత్తులచే సమంబులగు నర్థంబు లందు వైషమ్యంబును బ్రియాప్రియంబులును లేక నిస్సంగంబు సమదర్శనంబు హేయోపాదేయవిరహితంబునై యారూఢంబైన యాత్మపదంబు నాత్మంచే జూచుచుండు. జ్ఞానరూపుండును బరబ్రహ్మంబును బరమాత్ముండును నీశ్వరుండును నగు పరము పురుషుం డేకరూపంబు గలిగియుండియు దృశ్యద్రష్టృకరణంబుల చేతం బృథగ్భావంబు బొందుచుండు. ఇదియ యోగికి సమగ్రం బగు యోగంబునంజేసి ప్రాప్యంబగు ఫలంబు గావున విషయ విముఖంబులగు నింద్రియంబులచేత జ్ఞానరూపంబును హేయగుణ రహితంబును నగు బ్రహ్మంబు మనోవిభ్రాంతింజేసి శబ్దాది ధర్మంబగు నర్థరూపంబున దోంచు. అది యెట్టు లహంకారంబునం దోంచునని యడిగితివేని, నహంకారంబు గుణరూపంబునం జేసి త్రివిధంబును, భూతరూపంబునం బంచవిధంబును, నింద్రియరూపంబున నేకాదశ విధంబును నై యుండు. జీవరూపుండగు విరాట్పురుషుండు జీవ విగ్రహంబైన యండంబగు జగంబునం దోంచుచుండు. దీని శ్రద్ధాయుక్తం బయిన భక్తిచేత యోగాభ్యాసంబునంజేసి సమాహిత మనస్కుండై నిస్సంగత్వంబున విరక్తుండైనవాండు వొడగనుచుండు. అది యంతయు బుధజనపూజనీయచరిత్రవు గావున నీకుం జెప్పితి. సర్వయోగ సంప్రాప్యుండగు నిర్గుణుండు భగవంతుం డని చెప్పిన జ్ఞానయోగంబును మదీయభక్తియోగంబును నను రెండు నొక్కటియ. ఇంద్రియంబులు భిన్నరూపములు గావున నేకరూపంబయిన యర్థం బనేక విధంబు లగున శ్లోకంబగు బ్రహ్మం బనేక విధంబులుగం దోంచు. మఱియును,
1023

సీ. అంబ! నారాయణుం డఖిలశాస్త్రములను
సమధికానుష్ఠిత సవనతీర్థ
దర్శన జప తపోధ్యయన యోగక్రియా
దానకర్మంబులం గానఁబడఁడ;
యేచిన మనము బాహ్యేంద్రియంబుల గెల్చి
సకలకర్మత్యాగసరణి నొప్పి
తలకొని యాత్మతత్త్వజ్ఞానమున మించి
యుడుగక వైరాగ్యయుక్తిఁ దనరి
తే. మహితఫలసంగరహితధర్మమునఁ దనరు
నట్టిపురుషుండు దలపోయ నఖిలహేయ
గుణములనుబాసి కల్యాణగుణవిశిష్టుఁ
డైన హరినొందుఁ బరమాత్మునవఘుఁ డగుచు. 1024

వ. అది గావున నీకుం జతుర్విధ భక్తియోగ ప్రకారంబుఁ దేటఁబడ నెఱింగించితి; అదియునుంగాక కాలరూపయగు మదీయగతి జంతువులయందు నుత్పత్తి వినాశరూపంబుల నుండు. అవిద్యాకర్మ నిర్మితంబులైన జీవునిగతు లనేక ప్రకారంబులై యుండు. అదియు జీవాత్మ వానియందుం బ్రవర్తించి యాత్మగతి యిట్టిదని యెఱుంగక యుండునని చెప్పి మఱియు నిట్లనియె. ఇట్టి యతిరహస్యంబగు సాంఖ్యయోగప్రకారంబు ఖలునకు, నవినీతునకు, జడునకు, దురాచారునకు, డాంబికునకు, నింద్రియలోలునకుఁ, బుత్త్రదారాగారాద్యత్యంతాసక్తచిత్తునకు, భగవద్భక్తిహీనునకు, విష్ణుదాసులయందు ద్వేషపడువానికి నుపదేశింప వలదు. శ్రద్ధాసంపన్నుండును, భక్తుండును, వినీతుండును, ననూయారహితుండును, సర్వభూతమిత్త్రుండును, శుశ్రూషాభిరతుండును, బాహ్యార్థజాత విరక్తుండును, శాంతచిత్తుండును, నిర్మత్సరుండును, శుద్ధాత్ముండును, మద్భక్తులయందుఁ బ్రేమగలవాఁడును, ననన్యకాంతావిముఖుండును, నిష్కాముండును నగు నధికారికి నుపదేశింప నర్హంబగు. ఈ యుపాఖ్యానం బే పురుషుండేనిఁ బతివ్రతయగు నుత్తమాంగనయేని శ్రద్ధాభక్తులు గలిగి మదర్పితచిత్తంబునన్ వినుఁ, బఠియించు, నట్టి పుణ్యాత్ములు మదీయ దివ్యస్వరూపంబుఁ బ్రాపింతురని చెప్పెను. అని

మైత్రేయుండు విదురునకు వెండియు నిట్లనియె. ఈ ప్రకారంబునం గర్దమదయితయైన దేవహూతి గపిలుని వచనంబులు విని నిర్ముక్త మోహపటల యగుచు సాష్టాంగ దండప్రణామంబు లాచరించి, తత్త్వవిషయాంకిత సాంఖ్యజ్ఞాన ప్రవర్తకంబగు స్తోత్రంబుసేయ నుపక్రమించి కపిలున కిట్లనియె.

## అధ్యాయము - 33

సీ. అనయంబు విను మింద్రియార్థమనోమయం
బును భూతచయమయంబును నశేష
భూరిజగద్బీజభూతంబును గుణప్ర
వాహకారణమును వలను మెఱయు
నారాయణాభిఖ్యనాఁ గల భవదీయ
దివ్యమంగళమూర్తిఁ దేజరిల్లు
చారుభవద్గర్భసంజాతుఁ డగునట్టి
కమలగర్భుండు సాక్షాత్కరింప
తే. లేక మనమునఁ గనియె; ననేకశక్తి
వర్గములు గల్గి సుగుణప్రవాహరూప
మంది విశ్వంబుదాల్చి సహస్రశక్తి
కలితుఁడై సర్వకార్యముల్ గలుగఁజేయు. 1026

వ. అంత, 1027

తే. అతులభూరియుగాంతంబునందుఁ గపట
శిశువవై యొంటి కుక్షి నిక్షిప్త నిఖిల
భువననివహుండవై మహాంభోధినడుమ
జారువటపత్రతల్పసంస్థాయి వగుచు. 1028

తే. లీల నాత్మీయపాదాంగుళీవినిర్గ
తామృతము గ్రోలినట్టి మహాత్మ! నీవు
గడఁగి నా పూర్వభాగ్యంబుకతన నిపుడు
పూని నాగర్భమున నేడు పుట్టితయ్య. 1029

వ. అట్టి పరమాత్ముండవయిన నీవు, 1030

సీ. వరుస విగ్రహపారవశ్యంబునను జేసి
రఘురామ కృష్ణ వరాహ నార
సింహాదిమూర్తు లంచితలీల ధరియించి
దుష్టనిగ్రహమును శిష్టపాల
నమును గావించుచు నయమున సద్ధర్మ
నిరతచిత్తులకు వర్ణింపఁదగిన
చతురాత్మతత్త్వ విజ్ఞాన ప్రదుండవై
వర్తింతు వనఘ! భవన్మహత్త్వ
తే. మజునకయినను వ్రాకువ్వ నలవిగాదు
నిగమజాతంబు లయిన వర్ణింపలేవ
యెఱిఁగి సంస్తుతిసేయ నే నెంతదాన
వినుతగుణశీల! మాటలు వేయునేల! 1031

వ. అదియునుంగాక, 1032

క. ధీమహిత! భవన్మంగళ
నామస్మరణానుకీర్తనముగల హీనుల్
శ్రీమంతు లగుదు రగ్ని
ష్టోమాదికృదాళికంటె శుద్ధులు దలఁపన్. 1033

వ. అదియునుంగాక, 1034

క. నీనామస్తుతి శ్వపచుం
డైనను జిహ్వాగ్రమందు ననుసంధింపన్
వానికి సరి భూసురుఁడుం
గానేరఁడు చిత్రమిది జగంబుల నరయన్. 1035

ఉ. ఈ విధ మాత్మలం దెలిసి యెప్పుడు సజ్జనసంఘముల్ జగ
త్పావన మైన నీగుణకథామృత మాత్మలఁ గ్రోలి సర్వతీ
ర్థావళిఁ గ్రుంకినట్టి ఫలమందుదు రంచు సమస్తవేదముల్
వావిరిఁ బల్కుఁగావునను వారలు ధన్యులు మాన్యు లుత్తముల్. 1036

వ. అదిగావునఁ బరబ్రహ్మంబవును బరమపురుషుండవును బ్రత్యజ్ఞానో
విభావ్యుండవును సమస్తజనపాపనివారక స్వయంప్రకాశుండవును
వేదగర్భుండవును శ్రీ మహావిష్ణుండవును నగు నీకు వందనంబు

లాచరించెదను అని స్తుతించినం బరమపురుషుండును మాతృవత్స
లుండును నగు కపిలుండు గరుణారసార్ద్రీహృదయకమలుండై జనని
కిట్లనియె. 1037

తే. తవిలి సుఖరూపమును మోక్షదాయకంబు
నైన యీ యోగమార్గమే నంబ! నీకు
నెఱుఁగ వివరించి చెప్పితి; నిది దృఢంబు
గాఁగ భక్తి ననుష్ఠింపు కమలనయన! 1038

క. జీవన్ముక్తి లభించుం
గావున నేమఱక తలఁపు కైకొని; దీనిన్
వావిరి నొల్లనివారికిఁ
దావలమగు మృత్యుభయము, దవ్వగు సుఖమున్. 1039

క. అని యిట్లు దేవహూతికి
మన మలరఁగ గపిలుఁ డాత్మమార్గం బెల్లన్
వినిపించి చనియె నని విదు
రునకున్ మైత్రేయమునివరుం డెఱిఁగించెన్. 1040

వ. అట్లు కపిలుం డేఁగినఁబిదప దేవహూతియుం బుత్త్రిండు సెప్పిన
యోగమార్గంబున విజ్ఞానంబు గలిగియుండియుం బెనిమిటివైన
కర్దమునిం దనయుం డైన కపిలునిం బాసి నష్టవత్సయగు గోవు
చందంబునం దల్లడిల్లుచుఁ గపిలమహామునిం దలంచుచుం గర్దమ
తపస్సామర్థ్యంబున నైన యట్టి 1041

ఉ. మానితసౌరభప్రసవమంజుల పక్వఫలప్రవాళభా
రానతచూతపోతవిటపాగ్రనికేతన రాజకీరస
మ్మాని సుఖానులాపపరిమండిత కర్దమతాపసాశ్రమో
ద్యానవనప్రదేశ కమలాకరతీరనికుంజపుంజముల్. 1042

వ. వెండియు, 1043

సీ. అంచితస్ఫటికమయ స్తంభదీప్తిచేఁ
గొమరారు మరకతకుడ్యములను
సజ్జాతివజ్రాల సజ్జాలరుచులచే
భాసిల్లు నీలసోపానములను

దీపించు చంద్రకాంతోపలవేదుల
విద్రుమగేహాళీవిలసితముల
హాటకరత్నకవాటశోభితముల
నలరిన సౌధశాలాంగణముల

తే. వరపయఃఫేనపటలపాండురకరీంద్ర
దంతనిర్మిత ఖట్వాంగ ధవళపట్ట
రచితశయ్యాళులను జతురంతయాన
కనకపీఠాది వస్తుసంఘముల నెల్ల. 1044

వ. మఱియు వికచకమల కుముద సౌగంధిక బంధుర సుగంధానుబంధి గంధవహాశోభితంబును నరవింద నిష్యంద కందళిత మరంద రసపాన మదవదిందిందిర సందోహ ఝుంకార సంకులంబును నై చెలువారు బావులు గలిగి పురందరసుందరీనందితంబైన కర్దమాశ్రమంబుఁ బరిత్యజించి కుటిలంబులైన కుంతలంబులు జటిలంబులుగా ధరియించి సరస్వతీబిందుసరోవరంబులం ద్రిషవణస్నానంబు గావించుచు నుగ్ర తపోభారంబునం గృశీభూతశరీరయై నిజకుమారుండును బ్రసన్నవదనుండును గపిలనామధేయుండును నగు నారాయణుని సమస్తవ్యస్త చింతలచే ధ్యానంబు సేయుచుఁ బ్రవాహరూపంబైన భక్తియోగంబునను నధికవైరాగ్యంబునను యుక్తానుష్ఠానజాతంబై బ్రహ్మాత్మావపాదకంబగు జ్ఞానంబును విశుద్ధమనంబును గలిగి, 1045

సీ. అనయంబు నాత్మనాయకుఁడును విశ్వతో
ముఖుఁ డనంతుఁడు పరముఁడు నజుండు
చతురుండు నిజపరిజ్ఞాన దీపాంకుర
మహిమ నిరస్తసమస్తభూరి
మాయాంధకారుఁ డమేయుఁ డీశ్వరుఁ డగు
నా పరబ్రహ్మంబునం దవిరత
బద్ధతత్త్వజ్ఞానపరతచే నిర్ముక్త
జీవభావమున విశిష్టయోగ

తే. భవ్యసంప్రాప్తనిర్మల బ్రహ్మభావ
ములను గలిగి సమాధిచే నెలమిఁ దనరు
నపునరావృత్తమగు త్రిగుణప్రధాన
తత్త్వములనొప్పి సంతతోదారనియతి. 1046

తే. కలలఁ దోఁచినవస్తుసంఘముల మేలు
కని కనుంగొనఁగాలేని మనుజుపోల్కిఁ
బొలఁతి దనయాత్మమఱచి యిమ్ముల సధూమ
మైన పావకుగతి నుండె నంతలోన. 1047

క. గురుయోగశక్తిచే నం
బరతలమున కెగసి సత్కృపామయుఁడగు నా
పరవాసుదేవుచరణాం
బురుహాయుగన్యస్తచిత్తమును గల దగుచున్. 1048

వ. ఇట్లు కపిలోక్తమార్గంబున దేవహూతి శ్రీహరియందుఁగలసె. అయ్యంగనారత్నంబు మోక్షంబునకుం జనిన క్షేత్రంబు సిద్ధిపదం బనుపేరంబరఁగి ప్రసిద్ధివహించె. అంత నక్కడఁ గపిలుండు తల్లిచేత ననుజ్ఞాతుండై సిద్ధచారణ గంధర్వాప్సరో మునినివహ సంస్తూయ మానుం డగుచు సముద్రునిచేత దత్తార్హణ పూజా నికేతనంబులు వడసి సాంఖ్యాచార్యాభిష్టుతంబగు యోగంబు నవలంబించి లోకత్రయశాంతికొఱకు సమాహితుండై స్వపిత్రాశ్రమంబు విడిచి యుదగ్భాగంబునకుం జనియె నని మైత్రేయమహాముని విదురున కిట్లనియె. "తండ్రీ! యీ యుపాఖ్యానంబు నాకుఁ గోచరించినరీతి నీకుం జెప్పితి. ఇది కపిలదేవహూతి సంవాదం బత్యంతపావనంబు, కపిలప్రణీతంబు నయిన యోగంబు. దీనిం బరమభక్తియుక్తుండై యెవ్వండు పఠించు నెవ్వండు విను నట్టి పుణ్యాత్ములు విగతపాపులై గరుడధ్వజుండైన పుండరీకాక్షుని శ్రీచరణారవిందంబులం బొందుదు" రని మైత్రేయుండు విదురున కెఱింగించిన విధంబున శుకయో గీంద్రుండు పరీక్షిన్నరేంద్రునకుఁ జెప్పెను అని సూతుండు శౌనకాది మహామునులకు నీ కథావృత్తాంతంబు సెప్పిన విని ప్రహృష్ట హృదయులై "మునికులోత్తమా! భవద్వాక్పూరం బగు భగవ త్కథామృతంబులు గ్రోలుచుండ మా మనంబులు దనివోవ వింకను దరువాతి వృత్తాంతంబులు మాకు విశదంబులుగ వినిపింప నీవ యర్హుండ" వని యడుగుటయు, 1049

చ. జనకసుతామనోవిమలసారసకోమలచంచరీక చం
దనశరదిందుకుందహారతారమరాళపటీరచంద్రికా
వినుత యశోవిశాల! రఘువీర! దరస్మితపద్మపత్రలో
చన! నిటలాంబకప్రకటచాపవిఖండన! వంశమండనా! 1050

తరలము. పరమపావన! విశ్వభావన! బాంధవప్రకరావనా!
శరధిశోషణ! సత్యభాషణ! సత్కృపామయభూషణా!
దురితతారణ! సృష్టికారణ! దుష్టలోకవిదారణా!
ధరణిపాలన! ధర్మశీలన! దైత్యమర్దనఖేలనా! 1051

మాలిని. దివిజగణశరణ్యా! దీపితానంతపుణ్యా!
ప్రవిమలగుణజాలా! భక్తలోకానుపాలా!
భవతిమిరదినేశా! భానుకోటిప్రకాశా!
కువలయహితకారీ! ఘోరదైత్యప్రహారీ! 1052

గద్యము. ఇది శ్రీపరమేశ్వరకరుణాకలిత కవితావిచిత్ర కేసనమంత్రి పుత్త్ర సహజపాండిత్య పోతనామాత్య ప్రణీతంబయిన శ్రీ మహాభాగవతంబను మహాపురాణంబునందు విదురనీతియు, విదురుని తీర్థాభిగమనంబును, నుద్ధవసందర్శనంబును, గౌరవ యాదవ కృష్ణాది నిర్యాణంబును, గంగాద్వారంబున విదురుండు మైత్రేయునిం గనుటయు విదురమైత్రేయసంవాదంబును, జగదుత్పత్తి లక్షణంబును, మహదాదుల సంభవప్రకారంబును, మహదాదులు నారాయణు నభినందించుటయు, విరాడ్విగ్రహప్రకారంబును, శ్రీమహాభాగవత భక్తికారణంబగు పద్మసంభవు జన్మప్రకారంబును, బ్రహ్మతపంబును, బరమేష్ఠికిఁ బుండరీకాక్షుండు ప్రత్యక్షంబగుటయు, బ్రహ్మకృతంబైన విష్ణుస్తోత్రంబును, గమలసంభవుని మానససర్గంబును, బరమాణువుల పుట్టువును, భూర్భువస్సువరాది లోక విస్తారంబును, గాలదివసమాస వత్సరాది నిర్ణయంబును, నాయుఃపరిమాణంబును, జతుర్యుగ పరిమాణంబును, బద్మసంభవు సృష్టి భేదనంబును, సనకాదుల జన్మంబును, స్వాయంభువమనువు జన్మంబును, శ్రీహరి వరాహావతారంబును, భూమ్యుద్ధరణంబును, సూకరాకారుండైన హరిని విధాత స్తుతించుటయు, దితికశ్యప సంవాదంబును, గశ్యపుండు రుద్రునిం బ్రశంసించుటయుఁ, గశ్యపు వలన దితి గర్భంబు ధరించు

టయుఁ, దత్ప్రభావంబునకు వెఱచి దేవతలు బ్రహ్మసన్నిధికిం జని దితిగర్భప్రకారంబు విన్నవించుటయు, సనకాదులు వైకుంఠంబున కరుగుటయు, నందు జయవిజయుల కలిగి సనకాదులు శపించుటయు, శ్రీహరిదర్శనంబును, బ్రాహ్మణ ప్రశంసయు, సనకాదులు హరిని నుతించుటయు, హిరణ్యకశిపు హిరణ్యాక్షుల జన్మప్రకారంబును, హిరణ్యాక్షుని దిగ్విజయంబును, సవనవరాహహిరణ్యాక్షుల యుద్ధంబును, బ్రహ్మ స్తవంబును, హిరణ్యాక్షువధయు, నమరగణంబులు శ్రీహరి నభినందించుటయు, హరి వరాహావతార విసర్జనంబు సేయుటయును, దేవతిర్యఙ్మనుష్యాదుల సంభవంబును, గర్దమ మహాముని తపంబునకు సంతసించి శ్రీహరి ప్రత్యక్షం బగుటయుఁ, గర్దముండు స్వాయంభువమను పుత్త్రియైన దేవహూతిం బరిణయం బగుటయు, దేవహూతి పరిచర్యలకు సంతసిల్లి కర్దముండు నిజయోగ కల్పితంబగు విమానంబునందు నిలిచి సహస్రదాసీపరివృతయైన దేవహూతిం గూడి భారతాదివర్షంబులు గలయం గ్రుమ్మరుటయు, దేవహూతి గర్దమునివలనఁ గన్యకా నవకంబును, గపిలునిం గనుటయుఁ దత్కన్యకా వివాహంబులును, గర్దముని తపోయాత్రయుఁ, గపిల దేవహూతి సంవాదంబును, శబ్దాదిపంచతన్మాత్రల జన్మ ప్రకారంబును, బ్రహ్మాండోత్పత్తియు, విరాట్పురుష కర్మేంద్రియ పరమాత్మ ప్రకారంబును, బ్రకృతిపురుష వివేకంబును, నారాయణుని సర్వాంగస్తోత్రంబును, సాంఖ్యయోగంబును, భక్తియోగంబును, జీవునకైన గర్భసంభవ ప్రకారంబును జంద్ర సూర్య మార్గంబును, బితృమార్గంబును, దేవహూతి నిర్యాణంబును, గపిలమహాముని తపంబునకుం జనుటయు నను కథలుం గల తృతీయస్కంధము. 1053

# పద్యముల వివరణము

864. టీక : మాతృవత్సలుండు = తల్లియందు ఆపేక్ష గల వాడు ; తత్త్వమార్గ ప్రదర్శకుండు = సృష్టి నిజస్వరూపమును కనుపించునట్లు చేయువాడు.

తా. ఇట్లు చెప్పి మైత్రేయుడు విదురునితో కర్దమ ప్రజాపతి తపోవనమునకు వెడలిపోయిన తరువాతి కథను వివరించుచున్నాడు. కర్దముడు వనమునకు వెడలిపోయిన తరువాత కపిలుడు తల్లియందు వాత్సల్యము గలిగి ఆమెతో గూడి బిందుసరమున నివసించెను. దేవహూతి యొకనాడు బ్రహ్మ పలుకులు దలచుచు తత్త్వమును దర్శనము చేయించగల కపిలమహర్షిని చూచి ఇట్లనెను.

865. టీక : అసత్ + ఇంద్రియ ఘర్షణమున = చెడ్డదియైన (మాయయైన) ఇంద్రియముల యొరపిడిచే ; వసుమతిన్ = భూమిపై ; నిర్విణ్ణ = నిర్వేదము చెందినది, కష్టము పొందినది ; వనరెడి = దుఃఖించునట్టి ; అసదృశ = సాటిలేని ; మోహతమస్ + వినిరసనంబు = మోహమను చీకటిని పూర్తిగా తిరస్కరించుట ; అనఘాత్మ = పుణ్యాత్ముడా ! ; ఏవెరవునన్ = ఏవిధమున ; ఘటించున్ = సందర్భపడును.

తా. ఓ మహాత్మా! ఇంద్రియములు కేవలము మాయకు సంబంధించినవి. వాని యొరపిడిచే దుఃఖపడు స్థితిలో నున్నాను. అట్టి నాకు ఈ వశముగాని అజ్ఞాన మను చీకటిని మరల పొందకుండు నట్లు జ్ఞానోదయము పొందుటకు సందర్భపడు మార్గమేది ?

(తాను ఆత్మస్వరూపము. ఆత్మసద్వస్తువు. అనగా నిజమైన అస్తిత్వము కలది. దేహము, మనస్సు, ఇంద్రియములు పొందునట్టి ప్రవర్తనలు అసద్వస్తువులు. అనగా సత్యముగాని కల్పనములు. వాని ఘర్షణము వలన గలుగునట్టి తెలివి అజ్ఞాన మనబడు చీకటియే. దానిని మాటిమాటికి తొలగించుకొనుటకు సాధన చేసినను మరల మరల క్రమ్ముచుండును. అట్లు క్రమ్మకుండ శాశ్వతమైన సుఖానందము పొందునట్టి మార్గమేది యని ప్రశ్న.)

866. టీక : పటుఘన = దట్టమైన మేఘముల యొక్క ; నీరంధ్ర = సందులేనట్టి ; తమఃపటల = చీకటి అల్లికచే ; పరీవృత = ఆవరింపబడియున్న ; జగత్ ప్రపంచము = కదలుచున్న పంచ భూతాత్మక సృష్టి ; ఎక్కటి లోచనము = సూటియైన యొకే కన్ను ( అద్వితీయమైన దృష్టి ) ; మహిత + ఉత్కట రుచిన్ = గొప్పగా వెలుగొందుచున్న కాంతితో ; భానుకైవడిన్ = సూర్యునివలె.

తా. దట్టమైన మబ్బులు గ్రమ్మినపుడు అవి సూర్యుని కడ్డుగా నావరించి ఈ లోకమునకు చీకటి పుట్టించును. అపుడు సూర్యుడు లోకమున కద్వితీయమైన లోచనమై తన కాంతితో ఆ మబ్బులను వర్షింపజేసి తాను మరల లోకమునకు వెలుగు నిచ్చును. అట్లే ఇంద్రియముల ప్రవర్తనములు జీవులకు అజ్ఞానాంధ కారము కలిగించి ఆవరింపగా నీవు అద్వితీయమైన నేత్రమువలె ఆ జీవులకు ఆత్మవికాసమును ప్రసాదింతువు.

( మనస్సునకు, నింద్రియములకు సృష్టియం దనేకత్వము భాసించును. ఆత్మ జ్ఞానియగు గురువు ప్రసారమున మరల ఆత్మ జ్ఞానము కలిగి ఏకత్వము సిద్ధించును. ఇదియే అనన్యస్థితి. అనగా భగవంతుని అస్తిత్వము మాత్రమే భాసించునట్టి స్థితి. )

867. టీక : భూరి = ఎక్కువైన ; మదీయమోహతమమున్ = నా అజ్ఞాన మను చీకటిని ; పెడఁబాపన్ = ప్రక్కకు తొలగించుటకు ; నిరవద్య = వంకపెట్టుటకు వీలులేనివాడు ; నిరంజన = చూపునకు నితరసాధనము లక్కరలేనివాడు ; నిర్వికార = మార్పులకు గురికానివాడు ; సంసారలవిత్ర = సంసారబంధమునకు త్రవ్వుగోల వంటివాడు; బుధసత్తమ = జ్ఞానులలో నుత్తముడు ; సర్వశరణ్య = అందరిచే శరణు పొందదగినవాడు ; ధర్మవిస్తారక = ధర్మమును వ్యాపింప చేయువాడు ; సర్వలోకశుభదాయక = సమస్త మంగళములను కలిగించువాడు ; నిత్యవిభూతినామకా = శాశ్వతమైన వైభవమును నిర్వహించువాడా !

తా. నీవు లోపము లేని వాడవు. సహాయ మక్కరలేని దర్శనము కలవాడవు. మార్పులకు గురికాని వాడవు. సంసార బంధమును పెల్లగించగలవాడవు. జ్ఞానులలో నుత్తముడవు.

అందరికి శరణాగతరక్షకుడవై ధర్మము విస్తరించి, జీవులకు శుభములు సమకూర్చి శాశ్వత వైభవమును నిర్వహింతువు. అట్టి నీవు గాక నా మోహాంధకారమును తొలగింప సమర్థులింకొక రెవ్వరు?

(ఇంకొక రను భావమును లేకుండ బోగొట్టి సర్వాంతర్యామిత్వము అనబడు అనన్యదృష్టిని స్థాపింపగలవాడవు.)

868. అనింద్య తపోనిధి = నిందలేని తపస్సునకు నిధియైన వాడు; సన్నుతి = చక్కని స్తోత్రము; అనుపమ = సాటిలేని; సత్కృపాకలితుడు = సద్గుణమగు దయతో కూడినవాడు; సజ్జన నిచయ + అపవర్గఫలసాధనము = మంచివారి సమూహామునకు మోక్షఫలము నిచ్చు సాధనము.

తా. "ఓ తపస్వీ! నిన్ను శరణు బొందెదను. నన్ను రక్షింపుము" అని దేవహూతి వినయముతో ప్రార్థించి వేడుకొనగా కపిలు డపరిమిత దయాపరిపూర్ణుడై తల్లి వాక్యమును విని ఇట్లనెను. (ఆమె వాక్యము సజ్జనులు మోక్షము పొందుటకు సాధనమైన పరిప్రశ్నము.)

869. టీక: మందస్మిత లలిత + ఆనన కమలుండు = చిరునవ్వుతో అందమైన ముఖపద్మముగలవాడు: నెమ్మనమునన్ = నిండుమనస్సున; ప్రమోదము = సంతోషము; అనయంబు = మిక్కిలిగా; కడలుకొనన్ = దిక్కులందు వ్యాపింపగా; నిజ జననికిన్ = తన తల్లికి.

తా. తల్లి మాట విని మనసున సంతోషించి ప్రశాంతమైన చిరునవ్వుతో కపిలు డిట్లనెను:

870. టీ: ఘనభవబంధ + అపవర్గకారణము = గొప్ప సంసారబంధమునకును, మోక్షమునకును కారణము; ఏచిన = ఉద్రేకించినట్టి; త్రిగుణ + ఆసక్తంబు = మూడు గుణములచే అంటుకొనబడినది; సంసృతిబంధకారణంబు = సంసార మను బంధమునకు కారణము.

తా. తల్లీ! వినుము. జీవుని చిత్తమే సంసారబంధమునకును, మోక్షమునకును కారణము. అది త్రిగుణములయందు ఆసక్తి

చెందినపుడు సంసారబంధకారణ మగును. ఆసక్తి చెందనపుడు మోక్షకారణ మగును.

871. టీ : నారాయణ + ఆసక్తము = నారాయణునియందు తగులుకొనినది ; మునికుల + అబ్ధిచంద్రుఁడు = మునికుల మను సముద్రమునకు చంద్రుని వంటివాడు ( మునులకు సంతోష ముప్పొంగ జేయువాడు ) ; అర్థిన్ = కుతూహలముతో.

తా. ఆ చిత్తము నారాయణుని యందు అంటుకొని నిలిచినచో మోక్షమునకు కారణమగునని కపిలుడు తల్లితో చెప్పెను. ఇంకను కుతూహలముతో నిట్లు వివరించెను :

( మనస్సు ఒక వస్త్రఖండము వంటిది. దానియందు ఏ వస్తువు నంటించిన, దాని వాసన లంటును. జేబుగుడ్డలో కర్పూర ముంచినచో కర్పూరవాసన యంటును. ఇంగువను కట్టినచో ఇంగువ వాసన యుండును. అట్లే భావములు దేనియందు ప్రసరించిన దాని వాసన లంటును. ఆ వాసనలచే జీవుడు బంధింప బడును. అదే జేబుగుడ్డలో నిప్పుకణికను మూట కట్టినచో దాని వాసన యంటుట ఉండదు. జేబుగుడ్డ దగ్ధమై పోవును. అట్లే నారాయణుని స్మరించినచో జీవికి బంధ విమోచనము సిద్ధించును.)

872. టీక : అహంకార మమకారరూప = 'నేను, నాది' అనబడు రూపములైన ; అభిమాన జాతంబులు = అభిమానించుట వలన పుట్టినవి ; కామ లోభ + ఆది = కామము, లోభము మొదలగు ; కలుషవ్రాతంబులు = దోషముల సమూహములు ; విముక్తంబు = విడువబడినది ; సుఖ దుఃఖ వివర్జితంబు = సుఖము చేతను, దుఃఖము చేతను విడువబడినది ; ఏకరూపంబు = ఒకే రూపము గలది ; పరుడు = ఉత్తమమైనవాడు ; పరమపురుషుండు = ఉత్తమమైన పురుషుని రూపమువాడు ; నిర్భేదనుండు = విడదీయుటకు వీలుకానివాడు ; స్వయంజ్యోతి = స్వతంత్రమైన వెలుగు ; ఇతర వస్తు + అంతర + అపరిచ్ఛిన్నుండు = ఇతర వస్తువుల సందులలో విడగొట్టరానివాడు ; ఉదాసీనుండు = ఊరక చూచుచుండువాడు ; తత్ + మయంబు = వానిచే నిండినది, వానిచే చేయబడినది ; హత + ఓజస్కంబు = అప్పగింపబడిన ప్రకాశము గలది ;

యుక్తంబు=కూడినది ; పొడగాంచి=పరికించి చూచి ; పరతత్త్వసిద్ధి = ఉత్తమమైన నిజ స్వరూపము లభించుట ; నిఖిలాత్మకుండు = సమస్తము ఆత్మగాగలవాడు, సమస్తమునకాత్మయైనవాడు; నియుజ్యమానంబు = ప్రయోగింపబడినది ; సంగంబు = అంటుకొనుట ; ఇంద్రియార్థాది + అసత్ + విషయంబుగన్ = ఇంద్రియ గోచరమైనవానివలన కలిగిన చెడ్డది లక్ష్యముగా ; అశిథిలంబు = వదులు కానిది ; సద్విషయంబు = మంచివస్తువు లక్ష్యముగా కలది ; అంతఃకరణ సంయమన హేతుభూతంబు = మనస్సును దగ్గరకు కూర్చుకొనుటకు కారణమైనది ; అనర్గళ = గొళ్లెములేని ; మోక్షద్వారంబు = మోక్షమునకు దారి ; సహనశీలురు = ఓర్పుగలవారు ; సుహృత్తులు = హితము గోరిన మిత్రులు ; కారుణికులు = కరుణగలవారు ; పరిత్యక్త కర్మఫల స్వభావులు = విడిచిపెట్టబడిన కర్మఫలముల స్వభావము గలవారు ; విసృష్ట స్వజన బంధుజనులు = తనవారు, బంధువులు అను భేదమును విడిచిపెట్టినవారు ( అందరిని దేవుని రూపములుగా చూచువారు ) ; మత్ పదాశ్రయులు = నా పదము లాశ్రయించిన వారు ; మత్ గుణధ్యాన పారీణులు = నా గుణములను ధ్యానించుటయందు పారము చూచిన వారు ; మత్ కథాప్రసంగ=నా కథల ప్రసంగములచే; సంభరిత=చక్కగా నిండిన; శ్రవణానందులు = వినుటయం దానందము చెందువారు ; మదీయ కథలన్ = నాకథలను ; నొడువుచున్ = చెప్పుచు ; ఆధ్యాత్మిక + ఆదితాపత్రయంబు = ఆధ్యాత్మికము మొదలగు మూడుతాపములు ( అధ్యాత్మము, అధిదైవము, అధిభూతము అను వాని వలన కలిగిన మూడు విధములైన బాధలు ) ; తపింపఁజేయన్ జాలదు = తాపము పొందింపలేదు ; సర్వసంగ వివర్జితులు = అన్ని సంబంధములను విడిచినవారు ; అపేక్షణీయంబు = కోరదగినది ; సకల దోషనివారకంబు = అన్ని దోషములను నివారించునది ; సర్వప్రాణి హృత్ + కర్ణ రసాయనంబులు = సర్వజీవుల హృదయములకు, చెవులకు రుచి పుట్టించునవి ; మద్గుణ + ఆకర్ణనము = నా గుణములను వినుట ; కైవల్యమార్గదంబుగా = మోక్షమార్గము నిచ్చునదిగా ; మత్ + విరచిత = నాచే కల్పింపబడిన ; జగత్ కల్పన + ఆది = లోకముల సృష్టి మొదలగు ; విహారచింత =

విహరించునట్టి ఆలోచన ; దృష్టశ్రుతంబులు = చూచినవి, విన్నవి ; ఐహికాముష్మికంబులు = ఇహలోకమునకు, పరలోకమునకు సంబంధించినవి ; చిత్తగ్రహణార్థంబు = చిత్తమును గ్రహించుట కొరకు ; ఋజువులు = సూటియైనవి ; సంయుక్తుండు = కూడినవాడు ; ప్రకృతిగుణ సేవనంబు = ప్రకృతి గుణములను సేవించుట ; వైరాగ్యగుణ విజృంభితము = వైరాగ్యగుణముచే విజృంభించినది ; మత్ + అర్పిత = నాయందు దర్పింపబడిన ; ప్రత్యక్ + ఆత్మకుండను = ప్రత్యక్షమైన ఆత్మస్వరూపుడను ; అంతఃకరణనియుక్తునిన్ = మనస్సునందు నిలిపిన వానిని.

తా. అహంకారము, మమకారము, రూపము, దానియం దభిమానము మున్నగువాని వలన పుట్టిన కామ క్రోధములతో కూడి యుండుట చిత్తమునకు బంధ కారణము. వానినుండి విడివడి చిత్త మెప్పుడు పరిశుద్ధమగునో అప్పుడు సుఖ దుఃఖము లుండవు. ఒకే రూప ముండును. అదే స్వరూపము. దానికే పరమపురుషుడు గోచరించును. ( ఆ చిత్తమే పరమపురుషుని రూప మగును గనుక అతడు గోచరించును. )

ఈ పరమపురుషుడు ప్రకృతి కన్న పైనున్నవాడు. ( ప్రకృతి చిత్తమున కేర్పడు ప్రత్యేక భావము. ) ఆ పురుషుడు విభాగమునకు లొంగడు. ( ఆ చిత్తమే పురుషుడని తెలియును గనుక విభాగము సాధ్యపడదు. ) అతడు వెలుగు రూపము వాడు. ( వెలిగించుట, వెలిగింపబడు మరియొక వస్తువు అనునవి యుండవు. ) అతడు సూక్ష్మస్వరూపుడు. ( స్థూలత్వము వలన వస్తు భేదము సంభవించును. అది కరగిపోవు స్థితి అన్నిటికన్న సూక్ష్మము. మంచుగడ్డలను పాత్రలో వేరువేరుగా నిలుప వచ్చును. అవి నీరుగా కరగినప్పుడు వేరుగా నుండుట సాధ్యము కాదు. ) అతడు మరియొక వస్తువుగా తెలిసికొనబడుటకు లొంగడు. మరియు దేనితోను జోక్యము కలిగించుకొనడు. ( విగ్రహమున కాధారమైన బంగారమునకు విగ్రహములోని నవ్వు మొగము, ఏడుపు మొగము అంటవు. మరియు విగ్రహ మందు స్థాపింపబడిన దేవతల భేదములు గాని, శివుడు విష్ణువు

మున్నగు పేర్లచే తెలియబడు భేదము గాని అంటదు. శివపూజ గాని, విష్ణుపూజ గాని చేయుమని అతడు కల్పించుకొని చెప్పడు. ) అట్టి పురుషునే పరమాత్మ అందురు.

అంతర్యామి యగు పరమాత్మ దర్శన మిచ్చినపుడు చిత్తము నకు ప్రపంచము యొక్క ప్రత్యేక సామర్థ్యము మాయ మగును. జ్ఞానము, వైరాగ్యము, భక్తి అను వానిని చిత్తము యొక్క ప్రకృతిగా సంకల్పించినప్పుడే ఆ చిత్తము ప్రకృతి కతీతమై ఈ స్థితి సిద్ధించును. ఈ గుణముల నలవరచుకొని నారాయణుని యందు భక్తిభావమును కల్పించుకొనవలెను. నారాయణుడు సత్యము గనుక ఈ కల్పింపబడిన భక్తిభావము సత్యమగును. ఇట్టి సాధనమార్గముతో నితర మార్గములు సాటికావని యోగులు బోధింతురు. ( "ఇతరము" నంగీకరించినచో చిత్తమునకు, చిత్తముచే చూపబడు వానికి, సంబంధము తెగిపోవును గనుక నితర మార్గములు సరికావు. దీని తాత్పర్య మేమనగా చిత్తముతో దేవు నెట్లు భావించినను సరియైన మార్గము లభింపదు. చిత్తమున దేవుని అంతర్యామిత్వము భాసించినపుడు మాత్రమే సరియగు మార్గము లభించును. ఇదియే చిత్తమును సమర్పించుట లేక సర్వసమర్పణము. అది లేనిచోట భక్తియన్నది పేరు మాత్రమే. )

ఇంద్రియములచే గమనింపబడు విషయములకు అస్తిత్వము లేదు. ( పొడవైన వస్తువును చూచినపుడు ఆ పొడవు చిత్తము నకు సంబంధించిన కొలతయే గాని, ఆ వస్తువునందు లేదు. తెల్లని వస్తువును చూచినపుడు ఆ తెలుపు కంటికి సంబంధించినదే గాని వస్తువునకు సంబంధించినది కాదు. ఒకని పేరు విన్నపుడు అది చెవికి సంబంధించిన ధ్వనియే గాని ఆ వ్యక్తిది కాదు. "ఈమె నా భార్య" అని తెలిసినపుడు అది మనస్సునకు సంబంధించినదే గాని ఆమెకు సంబంధించినది కాదు. ) ఆ విషయములయందు సంబంధము కలుగుట జీవునకు బంధ మనబడును. ఈ బంధముగల జీవులకు అది బిగిసిపోవుట యుండును గాని వదులగుట యుండదు. ఈ సంబంధమే చిత్తమందలి అంతర్యామియైన నారాయణునితో పెట్టుకొన్నచో మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము చక్కగా

సంయమము చెందును. అనగా దేవుని లోనికి కూడదీసికొనుట జరుగును. అట్లు చేయువారు సాధుజనులు. వారికి మోక్ష ద్వారము అడ్డులేని దని తెలియును.

ఈ స్థితిని పొందుటకు నభ్యసింపవలసిన అంశములను చెప్పు చున్నాను. 1. పరిస్థితు లెట్లున్నను, పరిసరవ్యక్తుల స్వభావము లెట్లున్నను సంతోషముతో సహించుట. 2. శరీరము ధరించిన సమస్త జీవులకు హితముచేయుటకు, మిత్రుడుగా నుండుటకు యత్నించుట. 3. శాంతస్వభావము. 4. కరుణ. 5. తా మాచరించు కర్మఫలములను "నా" కొరకు విడిచిపెట్టుట. 6. తన వారు, చుట్టములు అను సంబంధములను విడిచిపెట్టి నా పాదము లాశ్రయించుట. (అనగా చుట్టములకు చేయవలసిన మేలు, ఉపకారాదులు మానుట యని అర్థముకాదు. వారిలో బంధుత్వాదులను చూచుట మాని మిగిలినవారియందు వలెనే అంతర్యామిని చూడవలెను.) అప్పుడు నా గుణములను ధ్యానించుటలో పారము చూచినవా రగుదురు. (ఎవ్వరిలో సద్గుణములైనను నారాయణుని గుణములుగా తెలిసికొనుట జరుగును.) ఎవరి సత్కథలయందైనను నా కథలనే చెప్పుకొందురు. వారే పరమభాగవతోత్తములు. వారిని ఆధ్యాత్మికము మొదలగు మూడు విధములైన తాపము లంటవు. వారే సంగములను విడిచినవారు. వారితో సంగమును కోరి యభ్యసింపవలెను. (ఇదియే సత్సాంగత్యము.) దాని వలన సకలదోషములు నివారకము లగును. సర్వజీవుల హృదయములకు, చెవులకు మాధుర్యము కలిగించు నా కథలయందు ప్రసంగ మప్పుడు కలుగును. నా గుణములను వినుచుండుటచేత త్వరలో క్రమమార్గములైన శ్రద్ధాభక్తులు పుట్టును. అవియే కైవల్యమునకు దారి చేయును.

ఈ జగత్కల్పన మంతయు నేను కల్పించినదే యని జ్ఞప్తి యుంచుకొని విహరించుచుండవలెను. (లేనిచో తాను కల్పించు కొనిన భావముల జగత్తునందు చిక్కుకొనును.) అట్లు విహరించు చున్నపుడు నిజమైన భక్తి యుదయించును. అప్పుడే ఇంద్రియ సుఖములనుండి విమోచనము కల్గును. విన్నవి, కన్నవి అగు ఇహపర సుఖముల నుండి మనస్సు విడివడును. చిత్తమును

కూడగట్టుకొనుటకు సూటియైన యోగమార్గములు తెలిసి, నచ్చి, కలిసి వచ్చును. అట్టి యోగి ప్రకృతి గుణములను చక్కగా సేవించుట చేతను, వైరాగ్యగుణములు విజృంభించుట చేతను, జ్ఞానయోగము చేతను, నాయం దర్పణబుద్ధితో కూడిన భక్తి యోగము చేతను నన్ను ప్రత్యగాత్మగా దర్శించును. (ప్రత్యగాత్మ యనగా సాక్షాత్కరించిన ఆత్మ. తాను దేవునితో నిండి యున్న దేవుని రూపము గోచరించును.) అట్టి దేవుని అంతఃకరణము నందు నియోగించును. (తాను పను లాచరించుట మాని తన యందున్న దేవు డాచరించుట జరుగును.) ఇట్లు బోధింపగా దేవహూతి మరల నిట్లు ప్రశ్నించెను :

873. టీక : భవత్ + గుణపరము = నీ గుణములే గమ్యముగా గలది ; భవపాప ప్రణాశము = సంసార పాపములను నశింప జేయునది ; ముక్తిశ్రీ లాభము = ముక్తిసంపద లభించుట ; రయమునన్ = వేగముతో.

తా. ఏవిధమైన భక్తిసాధనము నీ గుణములే గమ్యముగా నుండునో, సంసార పాపములను నశింప జేయునో, ముక్తిసంపదను లభింప చేయునో ఆ భక్తియొక్క విధానమును వివరింపుము.

874. టీక : భవత్ + ఉదీరితము = నీచే నుచ్చరింప బడినది ; తత్ + అంగంబులు = దాని విభాగములు ; తద్గత = దాని యందున్న ; తత్త్వ + అవబోధంబులు = నిజస్వరూపమును అవగతము చేయునవి ; ససాకల్యంబుగన్ = అంశములతో గూడ.

తా. ఇంకను నీ వంగీకరించిన యోగసాధన మార్గము, దాని యంగములు, అందుండి బోధపడు తత్త్వజ్ఞానమును మంద బుద్ధినైన నాకు బోధపడునట్లు సూక్ష్మాంశములతో కూడ స్పష్టముగా వివరింపుము అని కోరగా కపిలు డిట్లనెను :

875. టీక : సకలపదార్థ పరిజ్ఞాన తత్త్వపారీణము = సమస్త పదార్థములను గూర్చిన జ్ఞానము, యథార్థ స్వరూపముయొక్క పారము చెందినది ; ఆమ్నాయ విహిత = వేదశాస్త్రమునందు చెప్పబడిన ; కర్మాచారములు = పనుల నాచరించుట ; తివుటమై = సంతృప్తితో ; నైసర్గికంబు = సహజము ; నిర్హేతుకము =

హేతువు లేనిది ; గరిష్ఠంబు = ఎక్కువ గొప్పది ; భుక్త + అన్నంబు = తిన్న యన్నము : దీప్త జఠరాగ్ని = ప్రజ్వలించిన కడుపులోని అగ్ని (ఆకలి) ; లింగ దేహనాశకంబు = లింగ దేహమును నశింప జేయుట ; సద్గుణవ్రాత = సద్గుణముల సమూహము కలదానా !; యోగ లక్షణ సమేత = యోగలక్షణములతో కూడినదానా !

తా : తల్లీ ! వినుము. ఈ సృష్టియందు గల సకల వస్తువుల పరిజ్ఞానము నెరిగి, వాని కతీతమైన తత్త్వజ్ఞానమును కూడ తెలిసి దేవతల గణములు నిత్యసంతృప్తితో సృష్టిని నడిపించుచుందురు. వారు వేదశాస్త్రముల యందలి సత్కర్మ లాచరించు చుందురు. కనుక సృష్టియందలి ఆ యా వస్తువులకు ఆ యా లక్షణము లుండుట వాని వాని స్వభావమగుచున్నది. ఇట్లు స్వభావము లేర్పడుటకు హేతువేమియును లేదు. ( భగవదనుగ్రహమే హేతువు. కనుక దేవతలు ఆ యా ధర్మములను ఆ యా వస్తువులకు కలిగించు చుండుటలో నహంకారమును చెందుట లేదు. తాము నిమిత్తమే యనియు, ముఖ్యకారణము కాదనియు, కారణ మన్నది లేదనియు భగవంతు డట్లనుగ్రహించుట యొక్కటే యిన్నింటికిని కారణ మనియు మరువక వర్తించుచున్నారు. కనుకనే వారు నిత్య సంతోషము కలిగి దేవతలైరి. వారు ఈ కర్మలను ఆచరించు చున్న లోకమును స్వర్గమనియు, నాకమనియు చెప్పుదురు. స్వర్గ మనగా సు + వర్గము లేక మంచివారి గుంపు. నాక మనగా న + అకము, దుఃఖము లేని అస్తిత్వమని యర్థము. ఉదాహరణమునకు : చక్కెర తియ్యగా నుండుట, ఉప్పు ఉప్పగా నుండుట, నీరు పల్లము నకు పరుగెత్తుట, నిప్పు ఊర్ధ్వమునకు మండుట మొదలగునవన్నియు పదార్థ ధర్మములు. వానిని వర్తింప జేయు వెలుగులే దేవతలు. కాని వారికి ప్రత్యేక మనస్సుండదు కనుక తాము వానిని వర్తింప జేయుచుంటిమని నమ్మక నిర్హేతుకమగు భగవదాజ్ఞగా నిర్వర్తించు చున్నారు. వారు ఏ పదార్థమున కెట్టి స్వభావము కలిగింపవలెనో తెలియజేయు తెలివి వారియందే వారి స్వభావమై యుండును. దానినే వేదమందురు. కనుక వారాచరించునవి వేదోక్తకర్మలు. ఇట్లు వేదోక్త కర్మల నాచరించు చున్నను భగవత్కర్మ నాచరించు చున్నామని తెలిసి యుండుటయే భక్తి. )

కనుక తల్లీ! నరులు గూడ వేదోక్తకర్మ లాచరించుచు నిర్హేతుకమైన భగవత్సేవ చేయవలెను. ఇది ముక్తికన్న గొప్పది. (ముక్తికావలెననుకొనుట కన్న నిజమైన ముక్తిని కలుగ జేయు మార్గము నవలంబించుట.)

జీర్ణాశయ మందలి ఆకలి అగ్నియై అన్నమును జీర్ణము చేయుచున్నది కదా! అట్లే జీవు లాచరించిన కర్మలను, వాని ఫలములను భక్తి భరించును. దానితో జీవుని లింగదేహము నశించును. అట్టి విష్ణుభక్తి యొక్క వైభవములను వివరింతును.

876. టీక : అమలిన భక్తిన్ = నిర్మలమైన భక్తితో ; మత్ + చరణారవిందయుగ్మమున్ = నా పాదపద్మముల జంటను ; కౌతుకులై = కుతూహలము కలవారై ; ఇతర + ఇతర అనులాప ములన్ = ఒకరితో నొకరు చేయు సంభాషణలయందు (తమకన్న నితర వస్తువులను గూర్చి చేయు సంభాషణము లందు) ; మదీయ = నా యొక్క ; దివ్య తను పౌరుషముల్ = దివ్యదేహమందలి పురుషుని భావములు ; అనిశంబున్ = ఎల్లప్పుడును ; మత్ + అర్పిత సర్వకర్ములై = నా యందు సమర్పింపబడిన సమస్త కర్మలు గలవారై.

తా. కొందరు మహానుభావులు నిర్మలమైన భక్తితో నా పాద పద్మములను హృదయమున నిలిపి కుతూహలముతో నా కథల వృత్తాంతములనే పరస్పర సంభాషణలుగా ప్రసంగించుకొను చున్నారు. ఆ సంతోషమున నాకు సమర్పణగా చేయునట్టి సర్వ కర్మలయందు వర్తించుట తప్ప మోక్షమునందు గూడ నిష్టము లేనివారై యున్నారు.

(మోక్షమందు కన్న అర్పణ బుద్ధితో ఆచరించు సత్కర్మల యందే వారి కాదర మెక్కువ. కారణ మేమనగా సమర్పణ బుద్ధితో పను లాచరించుచుండు సందడిలో వారికి మోక్షము గుర్తురాదు. ఇట్లు మోక్షమను పదము గూడ తమ్ము బంధింపకుండుటయే మోక్షము గాని, ఆ పదము నందలి వ్యామోహము మోక్ష మెట్లగును? అది వారికి తెలియును. కర్మయోగమునకు, మోక్షమునకు నిట్టి అవినాభావ సంబంధ

మున్నదని తెలియుట చాల దుర్లభము. దీనిని గ్రహింపని అజ్ఞానముచే కొందరు చిత్త పరిశుద్ధి వరకు మాత్రమే సత్కర్మాచరణ ప్రయోజనమని భ్రమపడుచుందురు. భాగవతమతము ప్రకారము భగవత్సమర్పితములైన సత్కర్మ లాచరించుచున్నప్పుడు మాత్రమే మోక్ష స్థితి సిద్ధించును.)

877. టీక : చారు = అందమైన ; ప్రసన్న = అనుగ్రహమును కలిగిన ; వక్త్ర + అరుణ లోచనములు = మొగములు, ఎర్రని కన్నులు మొదలగునవి ; వరదాన కలితములు = వరము లిచ్చుటతో కూడినవి ; తనరు = విస్తరించు ; మత్ + దివ్య + అవతార వైభవములు = నా దివ్యములైన యవతారముల గొప్పదనములు ; తదీయ + ఆలాపములు = వాని పలుకులు ; సన్నుతించుచున్ = చక్కగా స్తోత్రము చేయుచు ; తివుటన్ = తృప్తితో ; తత్ + దివ్య విలసత్ + అవయవ = ఆ దివ్యత్వముతో వెలుగొందుచున్న అవయవములు ; ఉదార = ఉత్తమ లక్షణముగల ; సుందర = అందమైన ; నవవిలాస = క్రొత్తసొగసులతోడి ; మందహాస = చిరునవ్వులు ; మనోహర = మనస్సు నాకర్షించునట్టి మధుర వచన రచనలు, తీయనిమాటల కూర్పులు ; అపహృత మనః ప్రాణులు = కొనిపోబడిన మనస్సు, ప్రాణము గలవారు ; ఎలమిన్ = కుతూహలముతో ; నిశ్శ్రేయస + ఇచ్ఛ = మోక్షమునందు కోరిక.

తా. కొందరు భాగవతోత్తములు ప్రసిద్ధములైన నా పురాణ రూపములను స్మరించుచుందురు. అందమైన ముఖము, ప్రసన్నములైన కన్నులు కలిగి వరముల నిచ్చుచున్న దివ్యములైన నా యవతార వైభవములను మనస్సున నిలుపుకొందురు. తమ యోగమహిమచే నిట్టి నా రూపములను అనుభవించుచుందురు. నా పలుకులను గూర్చి పొగడుకొనుచుందురు. "ఎంత చక్కని అవయవములు! ఏమి యందము! ఏమి సొగసుల చిరునవ్వులు! ఏమి మధురమైన సంభాషణ!" అని యొకరితో నొకరు ముచ్చటించుకొనుచుందురు. ఆ ముచ్చటలచే హరింపబడిన మనస్సు, ప్రాణము గలవారై యుందురు. ఇక మోక్షమును కోరుటకు వారికి తీరిక యెక్కడ?

(ఈ పద్యమునందు కొన్ని సాధన విధానము లిమిడి యున్నవి :

1. పూర్వము నారాయణుడు ఈ ఈ విధముల రూపములలో నవతార మెత్తెనని రూపకల్పనము చేసికొనుట, శిల్పచిత్రకళా విగ్రహ నిర్మాణ, దేవాలయ నిర్మాణాది సత్కార్యములలో నిమగ్నులై మోక్షమును గూర్చి చర్చించుకొను నవకాశము లేకుండుట.

2. తమ భర్తను గూర్చియో, భార్యను గూర్చియో, బిడ్డను గూర్చియో ముచ్చటించుకొనుటలో అంతర్యామిత్వ భావనలో పరవశత్వ మొందుట. వారు భగవంతుని రూపములని స్మరించుచు "ఏమి నవ్వులు! ఏమి పలుకులు!" అని మెచ్చుకొనుట. గోపిక లీ మార్గము నవలంబించిరి.

3. ఆ స్మరణలో మనస్సు, ప్రాణము అపహరింపబడుట అనగా స్మరించుచు చనిపోవుట కాదు. సరియైన ధ్యానమున మనస్సు, ప్రాణము కలసి యొకటి యగును. తాను స్మరించుచున్న రూపము ఆ మనస్సును హరించినపుడు ప్రాణము గూడ హరింపబడును. అనగా తన ప్రాణముగా గాక అంతర్యామి సృష్టిలో కల్పింపబడిన ప్రాణముగా నుండును. ఈ స్థితియే పరవశత్వము. మనస్సు లయమగుట యిట్టి స్థితిలోనే జరుగును. దీనినే ప్రయాణ కాలమని భగవద్గీతలో కృష్ణుడు వర్ణించెను.)

878. టీక : కణఁకన్ = పూనికతో ; వెండి = మరియు ; మోక్ష నిరపేక్ష స్వాంతులు = మోక్షమునం దపేక్ష లేని మనస్సు గలవారు ; అణిమాది + అష్టవిభూతి సేవితము = అణిమ మొదలైన యెనిమిది వైభవములచే సేవింపబడునది ; నిత్య + ఆనంద సంధాయి = నిరంతరమైన ఆనందమును కలిగించునది ; గణన + అతీతము = లెక్కించుటకు లొంగనిది ; అప్రమేయము = ప్రమాణములకు తెలియనిది ; సమగ్రశ్రీకము = పరిపూర్ణమైన సంపద గలది ; సర్వలక్షణ సంయుక్త = అన్నిలక్షణములతో గూడినది ; వికుంఠలోక పదవిన్ = వైకుంఠలోకముయొక్క స్థితిని ; అతి + ఉన్నతిన్ = మిక్కిలి ఎత్తైన స్థానము ( అన్నిటికన్న గొప్ప స్థితి ).

తా. ఇట్లు వారు మోక్షమునం దిచ్ఛలేక చరించుచు గూడ మిక్కిలి యున్నతమైన వైకుంఠసౌఖ్యము ననుభవించు చుందురు. అందు అణిమాదు లెనిమిదియు విభూతులై వారిని సేవించు చుండును. వారి యానందానుభూతి నిర్వచించుటకుగాని, పరిమాణము చెప్పుటకుగాని, ప్రమాణములు చూపుటకుగాని లొంగునట్టిది గాదు. సమగ్రమైన లక్ష్మీవిలాసముతో, సర్వలక్షణములతో వెలుగొందుచుండును. (అణిమాదులు కావలెనని సాధించుకొనువారికి అష్టసిద్ధులుగా లభించును. మోక్షము కూడ కోరని భాగవతోత్తములకు ఐశ్వర్యములుగా పనిచేయును. అనగా వారు తమ ఈశ్వరుడుగా వారి నాశ్రయించి కొలుచుచుండును. ఈ స్థితి అంతర్యామికి ఒక్కనికే సాధ్యము గనుక ఈ సాధకులు అంతర్యామి స్థితిలో నుందురని భావము.)

879, 880. టీక: తనరుదురు = వ్యాప్తి చెందుదురు; మదీయ = నాయొక్క; కాలచక్రగ్రసనంబును = కాలమను చక్రముచే మ్రింగబడుటను; అనుపమ = సాటిలేని; సుఖవృత్తిన్ = సుఖవంతమైన ప్రవర్తనమున.

తా. అట్టి పుణ్యాత్ములు నా చేత నిర్మితమైన కాల చక్రముచే మ్రింగబడక సాటిలేనిది, శాశ్వతము అగు సుఖ మార్గమున ప్రవర్తించి వర్ధిల్లుదురు.

881. టీక: సముఁడై = తనతో సమానుడై; సుతత్త్వము = కొడుకుగా నుండుట; విశ్వాసంబు = నమ్మదగియుండుట; సఖిత్వము = మిత్రుడుగా నుండుట; హితవృత్తి = మేలుకోరు ప్రవర్తనము; సుహృత్త్వంబు = ప్రాణస్నేహితుని రూపము; సుమంత్ర + ఉపదేశము = మంచిమంత్రమును ఉపదేశించుట; నిజ దేశికుండు = తన గురువు.

తా. వారితో సమానుడనై స్నేహమున మెలగుటకు నేను పుత్రుని రూపమున పుట్టుదును. నమ్మకము కలిగి యుండుటకై సఖుడుగాను, మేలు కోరుటకై మిత్రుడుగాను చరింతును. మంత్రము నుపదేశించి గురువుగా లభింతును. పూజించుట కిష్ట

ద్వైవముగా ప్రత్యక్ష మగుదును. ఈవిధముగా వారి కాలచక్ర భయములను తొలగింతును.

(సంసారబద్ధులకు సుతునిపైన, మిత్రునిపైన, మేలుకోరు వానిపైన, గురువుపైన కూడ సరియైన నమ్మకము కుదురదు. కొడుకు తనమాట వినడేమోయని సందేహము, మిత్రులు మోసగింతురని భయము తీరవు. గురువునకు సమర్పణ బుద్ధిని తన మనస్సున కలిగించుకొన్నచో వాడేమడుగునో యని సందేహము! ఎవరిని నమ్ముదమన్నను లోకమున మోసమే కనుపించును.

సర్వము విష్ణుమయమని నమ్మినవారికి అందరి యందును భగవంతుని మూర్తులే కనుపించును. అన్ని సంబంధములతో అతడొక్కడే తిరుగుచుండును. ఒక్కొక్క సంబంధముతో సాధకుని యందు ఒక్కొక్క సద్గుణమును వికసింప జేయును. కొడుకువలన స్నేహభావము, మిత్రునివలన నొకరిని పూర్తిగా నమ్ముట, మేలు కోరువానివలన హృదయము విప్పి చెప్పగలుగుట సాధకునకు అభ్యాస మగును. అట్లే గురువువాక్కు వలన సర్వాంతర్యామి స్వరూపము బోధపడి, బంధచ్ఛేదనము కలుగును. దేవతార్చనము వలన అనన్యభక్తి అభ్యసింపబడును.

వయస్సు రూపమున కాలచక్రము తిరుగుచుండుట సంసారికిని, భాగవతునకును సమానమే. అది సంసారికి దుఃఖ సందేహాదులతో గడచును. భాగవతునకు అన్నిరూపములలో ద్వైవానుభవమున గడచును. సందేహము, దుఃఖము, వయోధర్మములు వాని గమనికనుండి జారిపోవును గనుక కాలచక్ర భయము లుండవు. కాలమునందలి ద్వైవవైభవమే గాని, అన్యవస్తు భీతి యుండదు.)

882, 883. టీక : భువి = భూమియందు ; దివిన్ = దేవలోకమునందు ; పలుమాఱు = చాలమార్లు ; ధన పశు పుత్ర మిత్ర వనితాతతి = డబ్బు, పశువులు, సంతతి, మిత్రులు, భార్య మొదలగువారి సమూహము ; తగులంబు = వ్యామోహము ; అనఘునిన్ = పుణ్యాత్ముని ; విశ్వతోముఖున్ = అన్నిదిక్కులయందు ముఖములు గలవానిని ; అనన్యగతిన్ = ఇతర మెరుగని మార్గమున ; ఘనమృత్యురూప భవ నీరధిన్ = మహామృత్యువు స్వరూపమైన సంసార సాగరమును ; తరియింపఁజేయుదున్ = దాటింతును.

తా. కపిలాచార్యు డిట్లు వివరించెను: జీవుడు భూమికిని, ఆకాశమునకును నడుమ పలుమారులు తిరుగుచు తనకు వేరుగా సంబంధించిన ధనము, గొడ్డు గోద, బిడ్డలు, మిత్రులు, స్త్రీజనము మొదలగు విషయములపై వ్యామోహము చెందక అన్నిరూపము లతో చరించుచున్న నిర్మలమూర్తియగు నన్ను భజించి అనన్య మైన జీవితము నిర్వహించినచో వానిని మహామృత్యు స్వరూప మగు సంసార సాగరము దాటించుటకు నే నున్నాను.

(1. ఆత్మ భూమ్యాకాశముల నడుమ పలుమారు చరించుట యనగా పుట్టి చచ్చుచుండుట. ఆత్మ చుట్టును దేహము ఈ భూమి నుండి పుట్టిన ఖనిజములతో నేర్పడును గనుక పుట్టుట యనగా పృథివీతత్త్వము నాశ్రయించి చరించుట. దేహము విడిచిన వెనుక ఆకాశముగ చరించును గనుక చచ్చుట యనగా ఆకాశ మున చరించుట. పృథివి అన్నిటికన్న స్థూలము. ఆకాశ మన్నిటి కన్న సూక్ష్మము. జీవి ఈ నడుమ కొట్టు మిట్టాడు చుండును. రక్తమునందు జలము; శ్వాసాదులయందు వాయువు, ఆకలి; వెచ్చదనమునందు అగ్ని తత్త్వముల నంటుకొని చరించుచుండును. ఇట్లు దేహ వ్యూహములకై పంచభూతములయందు చరించును.

ఆత్మకు గల సంగము పృథివితో మూలాధారమునను, జలములతో మణిపూరమునను, అగ్నితో స్వాధిష్ఠానమునను, వాయువుతో అనాహతమునను, ఆకాశముతో విశుద్ధి యందును కలిగి యుండును. ఇన్నిటిని సంస్కారములుగా అంటించుకొనిన మనస్సు ఆజ్ఞాచక్రముతో ముడిపెట్టుకొని యుండును. ఈ ముడి విడిపోవుట సహస్రారమునందలి సంకల్పమున నుండును.

తన చుట్టునున్న వస్తువులు, వ్యక్తులు గుణములతో, వేరు వేరు స్వరూప స్వభావములతో, పేర్లతో కూడి యుండును. వీని సహాయమున మనస్సు రూపకల్పనము చేసికొనును. దానివలన డబ్బు, బంధువులు, మిత్రులు వారితోడి సంబంధములు కల్పించు కొని చూడబడును. అభ్యాస వశముచే అవి సత్యములని నమ్మును. సత్యములు కావు గనుక దుఃఖాదులు కలుగుచుండును. ఇన్నిటి యందును గల అంతర్యామి యొక్కటే సత్యము. అది నా ప్రజ్ఞగా

వెలుగుచుండును. ఇందరిని వేర్వేరుగా కల్పించుకొని చూచినపుడు తా నల్లుకొనిన సంబంధములతో బంధ మేర్పడును. బంధమయ మైన జీవితమే సంసారము. అది సుఖ దుఃఖాదు లను అలలచే మార్పులను కదలికలను కలిగి యుండును. ఇన్నిటి యందును గల అంతర్యామిని మాత్రమే చూచుచున్న వానికి అన్యవస్తువు లుండవు. అదియే అనన్యదృష్టి. అది కలవారు ఈ చుట్టములు మున్నగు వారి రూపములను భేదములేక నా మూర్తులుగా భజించుచుందురు. వారి జీవితము నా కర్పితము గనుక మార్పులలో మునుగక దాటుచుండును. ఇట్లు దాటుటయే సంసార సాగరమును తరించుట.

2. ఇచ్చట ధనము, పుత్ర మిత్రాదులు మున్నగు వారి యందు సంగము మానుట యనగా వారిని విడిచిపెట్టుట యని అపార్థము చేసికొన్నచో వేదాంతము మెట్టవేదాంతముగా మారును. అట్టివారు గురువులైనను గూడ సేవచేయించుకొనుటయే గాని, చేయుట యెరుగక విడిచిపెట్టుదురు. అందరు నిట్లే వేదాంతు లుగా ముదిరినచో సేవచేయువాడు లేక నశింతురు. అందరును పల్లకీ నెక్కినచో మోచువా రెవరు? సేవాధర్మము కలిగి, అందరిని భగవంతుని మూర్తులుగా చూచుచు, నెవరికి తగిన సేవ వారు చేయుటయే సరియైన మార్గము. దీనితో పరమప్రేమ అనుభవము నకు వచ్చును. అదియే భక్తి. భగవంతుడు ప్రేమస్వరూపుడే గాని, వేదాంతి కాడు.)

884. టీక : రూఢిన్ = నిశ్చయబుద్ధితో; ప్రధానపురుష నాయకుండను = ప్రధానమునకు, పురుషునకు నాయకుడను. (ప్రధాన మనగా మూల ప్రకృతి. ఇది ఇరువదినాలుగు ప్రకృతు లుగా నుండును. ఇరువది యైదవ వాడు పురుషుడు లేక జీవుడు. ఈ ఇరువురియం దంతర్యామి నారాయణుడు. అతడు నేనను వెలుగుగా కపిలాచార్యుడను పేర నుపదేశించుచున్నాడు. ప్రధానము, పురుషుడు, నారాయణుడు అను ముగ్గురును భగవద్గీతలో క్షరపురుషుడు, అక్షరపురుషుడు, పురుషోత్తముడు అను పేర్లతో నుపదేశింపబడిరి. నారాయణుని అంశయే ప్రకృతి పురుషులుగా జీవలోకమునకు దిగివచ్చును.) భగవంతుఁడను = ఐశ్వర్యము లనబడు మహిమలతో గూడినవాడను;

జగత్ ప్రభుఁడను = లోకములను పాలించువాడను, తగిలిన = అంటు కొనిన ; భవభయంబు = సంసార భయము ; గడవంగ నోడుటన్ = దాటుటకు భయపడుట, చితి = అగ్ని ; ఇనుఁడు = సూర్యుడు ; తపించున్ = వేడిపుట్టించును. కలితము = కూడినది ; మత్ + చరణ భజనులు = నా పాదములను భజించువారు.

తా : నేనే ప్రకృతి పురుషుల రూపమున సృష్టిజీవులుగా నున్నాను. వారి యందు, వారిని నడిపించు నంతర్యామిగా కూడ నున్నాను. దేహాది వ్యూహములను కల్పించు మహిమలు గల వాడనుగా నున్నాను. ఈ జీవుల లోకములను ఆ యా ధర్మముల యందు నివసించువాడనుగా నేనే యున్నాను. కనుక ఏ కక్ష్యలో వెదకినను నాకంటె నన్యులు లేరు. అట్టి నాయందు చుట్టాలు మొదలగు నితరులను చూచి వారియందు వ్యామోహము కలిగి వర్తించువారు సంసార భయములలో పడి జీవింతురు.

నా యాజ్ఞను దాటలేకపోవుట వలననే భయపడి గాలి వీచుచున్నది. నిప్పు వెలుగు చున్నది. సూర్యుడు వేడి పుట్టించు చున్నాడు. ఇంద్రుడు వర్షించుచున్నాడు. నన్ను చూచి భయపడి, మృత్యువు పరుగు పెట్టుచున్నది.

కనుక ఈ సృష్టి విజ్ఞానముతో పాటు వైరాగ్యము సాధింప వలయును. అది భక్తియోగము వలన పుట్టును. నా యుత్తమ స్థితిని పొందుటకై యోగివరులు నా చరణములను భజించుచు నిర్భయులై తిరుగుచున్నారు.

( 1. గాలి వీచుట, అగ్ని వెలుగుట మొదలగునవి ఆ యా దేవతల ధర్మములు. దేవతలును, ఈ ధర్మములును అంతర్యామి లోని భాగములే గనుక మరియొక విధముగా ప్రవర్తించుట సాధ్యము కాదు. ఆ యా ధర్మముల ప్రకారమే వర్తింతురు. మన చేతులు మనలోని భాగములే గనుక మన సంకల్పము ననుసరించి పనిచేయుచున్నవి కదా ! మొగము కడుగుకొన వలెనని బుద్ధి పుట్టినచో మన చేతులు మన కన్నులను పొడువవు గదా ! మన అన్నమును నోటిలో పెట్టునుగాని కంటిలో, ముక్కులో పెట్టవు గదా ! ఇట్లు మన మాట వినుట ఎట్లు

సంభవించు చున్నది ? మనలోని భాగము లగుట వలననే. అట్లే భగవంతునిలోని భాగము లగుట వలన అగ్ని మున్నగువారు తమ తమ ధర్మముల ప్రకారము ప్రవర్తింతురే గాని తప్పి ప్రవర్తింప జాలరు.

2. సృష్టివిజ్ఞానము శాస్త్ర మనబడును. దాని నభ్యసించు చున్నపుడు దానికి ప్రత్యేకమైన సత్యాత్త్వము నంగీకరింపరాదు. అంతర్యామి యందే ప్రకృతి ధర్మముల సత్యాత్త్వ మంగీకరింప వలెను. అట్లు గాక విజ్ఞానశాస్త్రమునకే ప్రత్యేకమైన అస్తిత్వ మంగీకరించినచో మోసము కలుగును. కర్షకశాస్త్రము నభ్యసించువారు "ఉష్ణోగ్రతవలన మేఘము లేర్పడుచున్నవి. మేఘములు వర్షించుట వలన బీజము లంకురించుచున్నవి" అని నమ్మి కృషి కర్మ నారంభించినచో పండుట, పండకుండుట వానిపై నాధారపడి యుండదు. సకాల వర్షములు పడుట విజ్ఞానశాస్త్రము ననుసరించి జరుగదనియు, అంతర్యామి యందలి ధర్మముల ననుస రించి జరుగుననియు జ్ఞప్తియందుంచుకొనినచో తగిన విధముగా ప్రయత్నము చేయునే గాని, తన బుద్ధి శాస్త్రము, లెక్క ననుసరించి చేయడు. శాస్త్రవిజ్ఞానమును దైవదత్తముగా వినియోగించు కొనునేగాని, తనకు మార్గదర్శకముగా స్వీకరింపడు.

వాణిజ్యవిజ్ఞానమును ప్రత్యేకశాస్త్రమని నమ్మినవాడు, "ఇన్ని లక్షలు పెట్టుబడితో వాణిజ్యము చేసినచో, ఇంత లాభము వచ్చును" అని లెక్కలు కట్టి, అన్ని లక్షలు అప్పు తెచ్చి వాణిజ్యము చేయును. నష్టపోయి దెబ్బతినును. వాణిజ్య విజ్ఞానము దైవదత్తమని నమ్మినవాడు, తనకు దైవ మిచ్చిన దానితో వాణిజ్యము చేసి లాభము పొంది తృప్తిపడును.

కనుక విజ్ఞానశాస్త్రముతోపాటు అందలి విలువల యెడల వైరాగ్యముకూడ వహింపవలెను.

885. టీక : గురుభక్తిన్ = మహాభక్తితో ; మత్పరము = నాయందర్పింపబడినది ; అంతపర్యంతము = చివరివరకు ; చిరతర మోక్షోదయంబు = చిరకాలముగా మోక్షధర్మము వర్ధిల్లుట.

తా. అన్నిటియందు నే నున్నానను మహాభక్తితో నెంత కాలము చిత్తము ప్రకాశించునో అంతకాలము సజ్జనులకు నిహలోకమున శాశ్వత మోక్షానందము వర్ధిల్లు చుండును.

(ఇచ్చట నిహలోకమున దేహముండగా లభించునదే మోక్షమనియు, దానికొరకై దేహము విడువనక్కర లేదనియు స్థాపింపబడినది.)

886. టీక : సత్ + మునీంద్రుఁడు = మునులలో శ్రేష్ఠుడు; సంగతి = చక్కని మార్గము; వెండియున్ = మరియు; సమ్మోద చిత్తుఁడు = సంతోషించిన మనస్సుకలవాడు; కడంకన్ = నిశ్చయముతో.

తా. మహామునీంద్రుడైన కపిలుడు ఈవిధముగా విష్ణు నుద్దేశించిన భక్తియోగమార్గమును వివరించి, సంతోషముతో మరల నిట్లనెను :

887. టీక : అవ్వా! = తల్లీ!; తత్త్వలక్షణంబు = సృష్టి యథార్థ స్వరూపము యొక్క లక్షణము; ఏతత్ + తత్త్వ గుణంబులన్ = సృష్టిలోని ఈ యథార్థ విభాగములను, వాని గుణములను; హృదయ గ్రంథి విచ్ఛేదకంబు = హృదయమందున్న ముడి. (సందేహము) తెగగొట్టునట్టిది; ఆత్మదర్శన రూపంబు = తాననగా నెవరో దర్శించుకొనుటకు కావలసిన విధానము, ఆత్మ నిశ్శ్రేయస కారణంబు = తనకు మిక్కిలి శ్రేయస్సగు మోక్షమునకు కారణము; ఆత్మస్వరూపంబు = తానను వాని స్వరూపము; అనాది = మొదలులేనిది (ఎప్పుడు నున్నది, శాశ్వతము); పురుషుండు = పురములుగా శరీరములను నిర్మించుకొనువాడు; సత్త్వగుణ ఆది శూన్యుండు = సత్త్వము మొదలగు గుణములు లేనివాడు; ప్రకృతిగుణ విలక్షణుండు = ప్రకృతిలోని గుణము లన్నిటికన్న వేరైన లక్షణము గలవాడు లేక ఆ లక్షణములేవియు తనకు లేని వాడు; ప్రత్యక్ + స్వరూపుండు = ప్రత్యక్షమైన తన రూపము కలవాడు. (తా నున్నట్లు తనకు తెలియుటకు మరియొక ఆధార మక్కరలేదు. ఎవనికైనను తానున్నట్లు సొంతముగనే తెలియుచుండును. అదియే ఆత్మలక్షణము. ఎవ్వరిని గాని "నీ వున్నట్లు నీకెట్లు తెలియును? నే నున్నట్లు నాకెట్లు తెలియును?

దీనికి శాస్త్రప్రమాణమేమి ?” అని ప్రశ్నించు పిచ్చివాడుండడు. ఇట్లు తన్ను తాను తెలియుటయందు నిరంతరత్వమున్నచో ప్రత్యక్ స్వరూప మందురు. నిద్రపోవుచున్నపుడు తెలియదు గదా యనవచ్చును. నిద్రించుచున్నపుడు, చనిపోయినపుడు మనస్సు, ఇంద్రియములు లేవు గనుక తా నున్నట్లు వేరుగా తెలియదు. తననుండి మనస్సు వేరైనప్పుడే వేరుగా తెలియుట.) స్వయంప్రకాశుండు = తన వెలుగు కలవాడు (కంటికి వెలుగు మున్నగువానికి సూర్యుడో, చంద్రుడో, దీపమో కావలెను. వానియందంతర్యామిగా నున్నవాడు వారున్నప్పుడును, లేనప్పుడును ఉన్నాడు. ఉన్నాడనగా వెలుగుచున్నాడు. జీవుల దేహాదులలో తెలిసికొనువాడు, తెలిసికొనుట, తెలియబడు విషయము అను మూడిటి యందు తానే యున్నాడు. ఇట్లు స్వయంప్రకాశుడు కనుకనే మనకేదైనను తెలిసికొను బుద్ధి పుట్టుచుండును.) సమన్వితంబు = చక్కగా నన్వయింపబడినది ; గుణత్రయ + ఆత్మకము = మూడు గుణములతో కూడిన తన యునికి గలది ; అవ్యక్తంబు = వేరుగా గోచరింపనిది ; భగవత్ + సంబంధి = భగవంతునితో చక్కగా ముడిపెట్టుకొనినది ; యదృచ్ఛచేన్ = అప్రయత్నముగా సంభవించుటచేత ; లీలావశంబున = ఉండియు లేని విధమున ; గుణత్రయ మయంబు = మూడు గుణములతో నిండి, రూపములు ధరించునది ; స్వరూపంబు = రూపముతో కూడినది ; ప్రజాసర్గంబు = సంతతిని కనుట ; మోహితుండు = మోహము చెందినవాడు (ఒక దాని నింకొకటిగా గ్రహించుచున్నవాడు) ; విజ్ఞాన తిరోధానంబు = ఉన్నదానిని గూర్చిన తెలివి మాయమగుట ; ప్రకృతి + అభ్యాసంబునన్ = స్వభావమేర్పడి, దానివలన జరుగుచున్న దానిని తనయందారోపించుకొనుట (తాను చేయుచున్నట్లుగా నమ్మట); అన్యోన్యమేళనంబు = ఒకదానితో నింకొకటి కలియుట ; క్రియమాణంబులు = జరుగుచున్నవి ; పారతంత్ర్యంబు = ఇంకొకదానిపై నాధారపడుట ; కర్తృత్వశూన్యుండు = తానుచేయుట లేనివాడు ; సాక్షి = కన్నుగలవాడు (గమనించువాడు) ; ప్రకృతి + అధీనంబులు = ప్రకృతికి లొంగినవి ; సుఖ దుఃఖ భోక్తృత్వంబులు = సుఖమును దుఃఖమును అనుభవించుట ; ప్రకృతి విలక్షణుండు =

ప్రకృతిచే ప్రత్యేక లక్షణములు పొందినవాడు ; సత్ + అసత్ + ఆత్మక ప్రపంచంబు = ఉండుట, లేకుండుట తన లక్షణముగా గల పంచభూతాదులతో నేర్పడినది ; సత్ + అసత్ + వివేక పూర్వకంబు = ఉన్నది, లేనిది విడమరచుకొనుట మొదలుగా.

తా : కపిలు డిట్లనెను: " తల్లీ ! నీ కింతవరకును నారాయణుని యందు సాధింపబడు భక్తియోగమును వివరించితిని. ఇటుపైన తత్త్వమనబడు యథార్థ స్వరూపముయొక్క లక్షణములతో గల జ్ఞానమును వివరింతును. ఇది సృష్టియందలి వర్గముల నిజ స్వరూపము గనుక దీనిని తెలియుటవలన గూడ నరులు ప్రకృతి యొక్క గుణముల నుండి విడుదలచెంది, తామెవ్వరో తెలిసి ప్రకాశించుచున్నారు.

దీనిని చక్కగా తెలిసికొనుటవలన హృదయమునందున్న ముడి విడిపోవును. హృదయ మనగా గుండెకాయ కాదు. మనస్సునకు మెదడు ఎట్లు స్థానమో అట్లే హృదయమునకు గుండెకాయ స్థానము. హృదయము సంకల్పించినచో మాత్రమే గుండెకాయ పనిచేయును. హృదయము అను పదమునకు హృత్ + అయమ్ = " ఇదిగో ఇచ్చట నున్నాను " అను తెలివి. ఇందు తెలివియే తెలిసికొనువాడు, తెలియబడునది అను రెండు కొనలుగా నేర్పడును. ఒక త్రాటికి గల రెండు కొనలు ముడిపడినప్పుడు అది మూడవదిగా నేర్పడును, అట్లె తెలిసి కొనుట అను లక్షణము మూడవదిగా నేర్పడుచున్నది. ఈ మూడుగా ముడిపడుటయే జీవు డగుట. దీనివలన సందేహములు, సమాధానములు మొదలగునవి యేర్పడును. అవి అంతకుముందు జ్ఞానమునందు లేనట్టి కిరణములు. ఇవి జ్ఞానమునుండి రేగిన పీచు దారముల వంటివి. వీనికి వేరుగా అస్తిత్వము లేదు. కాని, వేరుగా అస్తిత్వము అంగీకరింపబడుచున్నది గనుక నివి అసద్విషయములు అనబడును. వీని యంగీకారము పేరే అజ్ఞానము. తత్త్వజ్ఞానమును సక్రమముగా తెలియుటవలన హృదయము ముడి విడి పడును. అఖండ స్థితి యేర్పడును.

ఈ తత్త్వదర్శనము వలన తాను తనకు దర్శన మిచ్చును. అపు డంతకు ముందున్న తన బంధములు తొలగును కనుక నిది మిక్కిలి శుభ ఫలము నిచ్చును. దానిని వివరింతును.

ఆత్మయే సృష్టియం దంతర్యామిగా నున్నాడు. అతడు మొదలు లేనివాడు. (మట్టితో కుండ చేయబడినప్పుడు అది కుండ అస్తిత్వమునకు మొదలు. కుండ పగులుట అంతము. అందలి మట్టికి అవి తెలియవు, మొదలుగాని, అంతముగాని కావు. కుండవంటిది సృష్టి. మట్టివంటివాడు ఆత్మ.)

ఇతడు పురుషుడు, అనగా పురములను నిర్మించుకొను స్వభావము కలవాడు. దాని వలననే సూర్యుడు, గ్రహములు, దేహములు వాని యందు, వాని చుట్టును నిర్మాణమగుచున్నవి. (ఏ దేహము ధరించునప్పుడు ఆ దేహమునకు సంబంధించిన అవయవములు, ఆకారములు, స్వభావములు నిర్మింపబడును. వాని నిర్మాణ సౌలభ్యమునకు విత్తనము, గర్భధారణము మున్నగు పురములు గూడ నిర్మింపబడును.)

అతడు సత్త్వము మొదలగు గుణములు లేనివాడు. (సత్త్వము, రజస్సు, తమస్సు అను త్రిగుణముల యందు నిండియున్నవానికి ఈ గుణములు లేవు. కుండయందున్న మట్టికి కుండ యాకార మెట్లు లేదో— అట్లే వానికిని లేవు.) అతడే ప్రకృతి గుణములతో తాత్కాలికముగా ప్రత్యేక లక్షణములు పొంది ప్రకాశించును. (మట్టికి కుండ గుణములు లేకున్నను, మట్టితో చేయబడిన కుండకు తనలో కొంత చోటు నిముడ్చుకొనుట, గాలి వచ్చుచు పోవుచుండుట, మరియు నీటినిగాని, ఇతర పదార్థములనుగాని ధరించి యుండుట, వంట మొదలగు ప్రక్రియలకు పనిచేయుట అనబడు తాత్కాలిక స్వభావగుణము లేర్పడుచున్నవి. ఇట్లే ఆత్మకు ప్రత్యేక స్వభావము లేర్పడి జీవుడుగా పనిచేయును.) అయినను అతడు సంకల్పించి నపుడు తన యునికిని తాను సూటిగా గుర్తింపగలడు. (దీని వలననే ఇతరులకన్న తాను వేరుగా నున్నట్లు కథ యేర్పడు

చున్నది. కథ చివర తాను సంకల్పించుటతో తా నీ కథకన్న వేరనియు, తానే సత్యమనియు, ఈ కథ తా నల్లుకొనుట వలన నేర్పడినదనియు దర్శన మిచ్చును.)

ఆత్మకు స్వయంప్రకాశము గలదు. అనగా తా నున్నట్లు తనకు తెలియును. (కనుకనే ప్రతి జీవికి నెవ్వరు చెప్పకుండగనే, యే శాస్త్ర ప్రమాణముతో సంబంధము లేకయే తానున్నట్లు తనకు తెలియును.)

ఆత్మ యనబడు తనలోనే ఈ సృష్టి సమస్తము చక్కగా కూర్పు చేయబడినది. (పువ్వులు దండగా కూర్పు చేయవలె నన్నచో పువ్వులు, దారము, దండ గ్రుచ్చువాడు వేరుగా నుండ వలెను. ఇందేది లభింపకున్నను దండ కూర్చ బడదు. కనుక ఇది సరియైన కూర్పుకాదు. ఈ మూడిటిని కూర్పుచేయగల అంతర్యామి చేయునది సరియైన కూర్పు. పువ్వులు, దారము సమవాయి కారణములు. దండ గ్రుచ్చువాడు నిమిత్త కారణము. ఈ మూడిటి యందున్నది దండ గ్రుచ్చుటకు కావలసిన నిజమైన కారణము. దానినే స్వభావము లేక ప్రకృతి యందురు. అన్నిటియందు నంతర్యామిగానున్న ఆత్మ ఈ ప్రకృతికి గూడ వెనుకనున్న కారణము. దానికి వెనుక మరియొక కారణము లేదు గనుక ఆత్మ అనాది. ప్రకృతి ఉపాదాన కారణము అగు చున్నది.)

ఈ ప్రకృతి మూడు గుణములతో మాత్రమే వ్యక్తమగు చుండును. తన ప్రవర్తనగా, స్వభావముగా వ్యక్తమగును గాని, తాను మాత్రము వ్యక్తము కాదు. (విద్యుత్ శక్తి వలన దీపములు వెలుగును, పంకాలు తిరుగును, రేడియోలు మ్రోగును. ఇవి యన్నియు విద్యుత్తునకు గల గుణములు. వీని వలన విద్యుత్తు యొక్క అస్తిత్వము తెలియబడుచున్నదేగాని, అది స్వయముగా గోచరించుట లేదు. అట్లే ప్రకృతియు త్రిగుణములుగా వ్యక్త మగునేగాని, స్వయముగా నెట్లుండునో తెలియదు.)

ఈ ప్రకృతి భగవంతునితో చక్కగా కలయిక చెంది యుండును. (భగవంతుడనగా పరబ్రహ్మము కాదు, పరబ్రహ్మము యొక్క వ్యక్తరూపము. పరబ్రహ్మమునుండి ప్రకృతి వెలువడుచు

లీనమగుచుండును. వెలువడినపుడు అందున్న భాగమందు గల పరబ్రహ్మమే భగవంతుడు. భగము అనగా తననుండి వ్యక్తమైన శక్తి, లేక ఐశ్వర్యము. అది కలిగినప్పుడే దేవుడు భగవంతు డనబడుచున్నాడు. అతనితో ప్రకృతికి గల సంబంధము చాల సుకుమారమైనది. దేవుడు దానిని వ్యక్తమగున ట్లాజ్ఞాపింపడు. అది వ్యక్తమగుచున్నప్పుడు అడ్డుపెట్టడు. అది వ్యక్తమగుట అతనికి క్రీడ. వ్యక్తమైన వెనుక దానియందుండుట, దానితో క్రీడించుట యుండును. శిశువునకు ఆకలి పుట్టినచో నేడ్చును. నవ్వు వచ్చినచో నవ్వును. పెద్దవారియందువలె అతని యేడ్పునకు, నవ్వునకు స్వకల్పిత కారణ ముండదు. తన యాకలికి, నేడ్పునకు, నవ్వునకు తానే కారణము. అవి కావలెనని కోరడు. ఇట్టి సంబంధమే భగవంతునకు, ప్రకృతికిని కలదు. అది వాని స్వభావము. అయినను దాని కతడు అతీతుడు.)

దేవుడు ప్రకృతియం దెందులకు ప్రవేశించుచున్నాడు? దీనికి కారణము లేదు. ప్రవేశింపవలె ననిపించుటయే కారణము. అది అట్లే జరుగుననుట సత్యముగాని దాని కొక కారణము లేదు. ఈ ప్రవేశించుటయం దతని కిష్టముండుటయు, లేకుండుటయు నుండవు. కాని అతని కది ఆటగా నుండును. అది మనోహరమైన అనుభవము. దానినే లీల అందురు.

అత డంతర్యామిగా నుద్భవించిన ప్రకృతి త్రిగుణాత్మకముగా వ్యక్తమగును. అందుండి జీవులు, గర్భధారణము, జననము మున్నగునవి కలుగును. ఇవి అన్నియు తనయందే జరుగుచుండుట గమనించుచున్నవాడు భగవంతుడు. అతనియందు ప్రకృతి పని చేయుచున్నపుడు అతడు భగవంతుడు. దానియం దత డున్నపుడు దాని గుణములతో కలిసినవాడుగా తెలిసికొనును. అప్పుడు గుణములతోఁగూడిన తన అస్తిత్వము సత్యమనిపించును. దానితో వ్యామోహపడును. అనగా ఆ గుణములు తనవి యని గమనించును. తన పూర్వవిజ్ఞానము మరుగుపడును. (మనము నిద్రించుచున్నప్పుడు మన మెరిగిన విషయములన్నియు నెట్లు మరుగుపడునో అట్లే! మరియు కలలో కనుపించు వస్తువులు తాత్కాలికముగా నెట్లు నిజ మనిపించునో అట్లే మోహము చెందును.) అట్టి స్థితిలో

అతడు జీవు డనబడును. ప్రకృతియు, తానును చిత్రముగా కలసి పోవును. ప్రకృతి గుణములు తన గుణములుగా కనుపించును. ( చెరువు నందలి మట్టితో గలసిన వాననీరు చెరువునీరని పిలువ బడును. పోపు పదార్థముల సారముతో కలయిక చెందిన నీరు చారుగా మరియొక పదార్థముగా గుర్తింపబడును. "చారు రుచిగా నున్నది" అందుము. ఆ రుచి నీటియం దారోపించుకొని చారనబడు నొకే పదార్థముగా నెంచబడును. అట్లే ప్రకృతి గుణములతో కలసిన జీవుడు ఆ గుణములు తనవిగా నమ్మును. )

అప్పటి నుండియు జరుగుచున్న పనులను తాను చేయు చున్నట్లు తెలిసికొనును. కర్తృత్వము తనయందు ఆరోపించు కొనును. ( ప్రకృతి సిద్ధముగా శ్వాస నడచుచుండగా తాను గాలిని పీల్చుచున్నట్లు నమ్మును, మాటాడవలెనని అనిపించినపుడెల్ల తా ననుకొనుచున్నాడని నమ్మును. అట్లే వివాహ మాడుట, సంతతి పొందుట మొదలగువాని విషయమునను. అట్లే పరిసర ములను గూర్చిన పట్టుదల గలుగుట, శత్రుమిత్రత్వాదులను ఆరోపించుకొనుట మొదలగునవియును. )

దానితో పరతంత్రత కలుగును. ( తా నాధారముగా పెరుగుచున్న దేహమును తన కాధారమని నమ్మును. ఒక్కొక్క ప్పుడు దేహమే తానని నమ్మును. దేహమునకు నొప్పి కలిగి నప్పుడు, నీరసము, రోగము కలిగినప్పుడు తనకు గలిగినవని అర్థము చేసికొని బాధపడును. తాను సంపాదించిన ఆస్తి తనకు రక్షణమని నమ్మును. తనపై నాధారపడినవారిని తన పోషకులుగా భ్రమపడును. తననుండి ఆచరింపబడుచున్న వృత్తి కర్మలను తా నాచరించుచున్నా ననుకొనును. ఆ వృత్తివలన తనకు సంక్రమించుచున్న జీవనోపాధి మరియొకని వలన జరుగుచున్నట్లు భ్రమపడి, వాడు తన రక్షకుడుగా భావించును. తన దుష్ప్రవర్తనమునకు వాడు కోపింపగా వానిని చూచి భయపడును. తన ప్రవర్తనమునకు జాగరూకత వహింపవలసినది బదులు వాని ప్రవర్తనకు భయపడుట జరుగును. ఇదియే స్వాతంత్రమును కోల్పోవుట లేక పారతంత్ర్యము. దీనితో బ్రతుకు పరాధీనమగును.) అట్టివాడు సంసారబద్ధుడు అనబడును.

దేహమునందున్నపుడు గూడ ఈ కర్మల కర్తృత్వమును తనయం దారోపించుకొనక ప్రకృతి గుణములవలన జరుగుచున్నవని తెలిసిన వాని తెలివి మరుగుపడదు. అతడు జీవు డనబడక ఈశ్వరు డనబడును. (ప్రకృతియం దున్న దేవు డెట్లు భగవంతు డనబడునో అట్లే హృదయమందున్న దేవుడు ఈశ్వరు డనబడును.) అతడు జరుగుచున్న కర్మలకు సాక్షి. (అనగా సాక్ష్యము చెప్పువాడు కాడు. ఊరక గమనించుచుండువాడు.)

ఈవిధముగా ఆత్మకు కార్యము, కారణము, కర్తృత్వము లేవు. అవి ప్రకృతికి అధీనములై జరుగుచుండును. వానితో ముడిపెట్టుకొన్నపుడు మాత్రము సుఖము, దుఃఖము జీవునిచేతనే అనుభవింపబడుచుండును. తాను వాని కతీతుడుగా నెరిగినపుడు ఆత్మ యనబడును.

ఇట్లు తత్త్వశాస్త్రమును కపిలాచార్యుడు వివరించి చెప్పగా దేవహూతి ఇట్లనెను : "తండ్రీ ! నీ వుపదేశించిన దానిని బట్టి పురుషుడు అస్తిత్వము గలవాడనియు, ప్రకృతి ఈ అస్తిత్వము లేని సృష్టికి కారణమనియు, ప్రకృతి పురుషుల సంబంధమే సత్యము, కల్పన కలిసి తోచుచున్న ఈ ప్రపంచమునకు కారణ మనియు తెలిసినది. ఈ ప్రకృతి పురుషుల లక్షణములు చక్కగా వివరింపుము. సత్, అసత్ అను వానిని విడమరచి తెలిసికొను తెలివిని ప్రసాదింపుము." అనగా ఆచార్యు డిట్లనెను :

888. టీక : త్రిగుణము = మూడు గుణములు గలది. అవ్యక్తము = వేరుగా కనుపింపనిది ; నిత్యము = ఎల్లప్పుడు నొకే విధముగ నుండునది ; సత్ + అసత్ + ఆత్మకము = ఉండుట, లేకుండుట అను తన యస్తిత్వము గలది ; ప్రకృతి విశేషములు = ప్రకృతియందలి ప్రత్యేక భాగములు ; విశిష్టము = తనయందీ విశేషములు గలది ; సత్ + విదులు = సత్ పదార్థమును తెలిసినవారు,

తా : నిజముగా నస్తిత్వముగల వస్తువును తెలిసిన జ్ఞానులు ప్రకృతిని అయిదు విధములుగా గుర్తించుచున్నారు :

1. మూడు గుణముల రూపమున వ్యక్తమగునది.

2. వ్యక్తము కానిది.

3. ఎల్లప్పుడు నుండునది.

4. ఉండుట, లేకుండుట అను లక్షణములు గలది.

5. ఈ నాలుగు లక్షణములకును ఆధారమైనది.

అందు 1. త్రిగుణముల రూపమున వ్యక్తమగు ప్రకృతి మొదటిది. 2. వ్యక్తము గాకుండ సకల సృష్టికిని స్వభావముగా పనిచేయునది. ఇందు త్రిగుణములు పుట్టునట్టి స్వభావము, త్రిగుణముల స్వభావములు కూడ నిమిడి యుండును. 3. నిత్యము అనబడు ప్రకృతి ఈ సృష్టికి తెరపట్టినట్లుండును. ఇది సినిమా ఆట కాధారమైన తెరవంటిది. 4. సదసదాత్మకము అనగా తెరపై జరుగు సినిమా కథ వంటిది. దీనికి ఉండుట, ఉండకుండుట అనబడు లక్షణములు శాశ్వతముగా నుండును. 5. ప్రధానము అనగా పై జెప్పిన నాలుగు విధములైన ప్రకృతులకును ఆధారమైన మూలము. ఇది ఆ నాలుగు కొమ్మల వృక్షమునకు విత్తనము వంటిది. దీనినే మూలప్రకృతి యని గూడ నందురు. వేదములలో నిది అదితి యనబడును. పురాణములలో అదితి యనబడు పాత్ర. ఈమె యందు మిగిలిన ప్రకృతి గుణములన్నియు దేవతలుగా పుట్టును.

889. టీక : చతుర్వింశతి తత్త్వాత్మకంబు = ఇరువది నాలుగు తత్త్వములు గలది ; జ్ఞాన కర్మాత్మకంబులు = జ్ఞానమునకు, కర్మకు సంబంధించినవి. ( జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు ) ; త్వక్ + చక్షుష్ + శ్రోత్ర - జిహ్వా - ఘ్రాణంబులు = చర్మము, కన్ను, చెవి, నాలుక, ముక్కు ; వాక్ + పాణి-పాద-పాయు + ఉపస్థంబులు = వాక్కు, చేతులు, కాళ్ళు, మూత్రావయవము, మలావయవము ; దశ + ఇంద్రియంబులు = పది ఇంద్రియములు ; అంతఃకరణ చతుష్టయంబు = లోపలి అవయవములు నాలుగు ; సగుణబ్రహ్మసంస్థానంబు = గుణములతో కూడిన బ్రహ్మకు నివాసమైనది ; పంచవింశక తత్త్వంబు = ఇరువది యైదవ తత్త్వము ; పురుషశబ్ద వాచ్యుండు =పురుషు డను పదముచే చెప్పబడువాడు ; పౌరుషంబు = పురుషుని లక్షణము ; ప్రకృతి గుణ సామ్యంబు = ప్రకృతిలోని గుణముల సమపాళము ;

నిర్విశేషుండు=తనయం దేదియు మిగులనివాడు (గుణములు మున్నగునవి తాను కాక, నిలబడినవాడు) ; చేష్టావిశేషంబు = ప్రవర్తనల ప్రత్యేకత ; ఉత్పన్నంబు = పుట్టునది ; జీవరాశి + అంతర్గతంబు = జీవరాసుల లోపల నున్నది ; బహిర్భాగ వ్యాప్తింజేసి = వెలుపలి భాగమున వ్యాపించి యుండుటచేత ; ఆత్మ మాయంజేసి = తన మాయచేత ; తత్త్వ + అంతర్గతుండు = ఇరువది నాలుగు తత్త్వములలో చిక్కుకొనినవాడు ; క్షుభితంబు = క్షోభ చెందినది ( కుదిలింపబడినది ) ; జగత్ + కారణంబు = సృష్టికి కారణము ; హిరణ్మయంబు = బంగారు రంగుతో నిండినది ( కిరణములతో నిండినది, హిరణ్యాగర్భాండము ) ; మహత్ + తత్త్వంబు = మహత్తు అనబడు తత్త్వము ; ప్రపంచబీజభూతుండు = ఈ పంచభూతాదుల సృష్టికి విత్తనము వంటివాడు ; లయ విక్షేప శూన్యుండు = లయమగుట, కదలి వచ్చుట మొదలగునవి లేనివాడు ; సూక్ష్మ విగ్రహంబునన్ = సూక్ష్మమైన రూపమున ; ఆత్మగతంబైన = తనయందు అస్తిత్వము చెందిన ; మహత్ + ఆది = మహత్తు మొదలగు ; స్వతేజోవిపత్తిన్ = తన వెలుగుయొక్క ప్రసారము చేత ; ఆత్మ ప్రస్వాపనంబు = తన్ను నిద్రింపజేయుట ; తమంబు = చీకటి ; గ్రసించెను = మింగెను.

889. తా : తల్లీ ! వివరించెదను వినుము. ఈ అయిదు విధములుగా పనిచేయుచున్న ప్రకృతి ఇరువది నాలుగు తత్త్వములుగా సృష్టియం దేర్పడును. పంచభూతములు, పంచతన్మాత్రలు, అయిదు జ్ఞానేంద్రియములు, అయిదు కర్మేంద్రియములు అనునవి ఇరువది తత్త్వములు. అంతఃకరణము లనబడు నాలుగింటితో కలసి ఇరువది నాలుగు తత్త్వము లగుచున్నవి. అవి ఈ దిగువ విధముగా నున్నవి :

1. పంచభూతములు ( Five states of existence ) : పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము.

2. పంచతన్మాత్రలు ( Five points of contact ) : శబ్దము, స్పర్శము, రూపము, రుచి, వాసన.

3. అయిదు జ్ఞానేంద్రియములు ( Sense Organs ): చర్మము, కన్ను, ముక్కు, చెవి, నాలుక.

4. అయిదు కర్మేంద్రియములు ( Gross Organs ) : వాక్కు, చేతులు, కాళ్ళు, మలావయవము, మూత్రావయవము.

5. నాలుగంతఃకరణములు ( Internal Organs ) : మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము.

ఈ ఇరువది నాలుగు తత్త్వములతో కూడినది ప్రకృతి (Nature). ఇది సగుణ పరబ్రహ్మమునకు నివాసము. అనగా గుణములతో కూడిన అంతర్యామికి స్థానము.

ఇది సృష్టి యంత్రాంగము. కాని, వీనితో సృష్టి యను యంత్రము నమర్చుటకును, దానిని వినియోగించి నిర్వహించుట కును ఒకడుండవలెను గదా ! అతడు ఇరువదియైదవవాడు. వీనినే కాలమందురు. కాలము వలననే సృష్టి సర్వము జరుగుచుండును. దీని చుట్టును మిగిలిన ఇరువది నాలుగు తత్త్వములు లోకము లుగా, దేహములుగా అల్లుకొనుచుండును. కనుక దేహధారి యగు పురుషుడే ఇరువదియైదవ తత్త్వమని పెద్దలు వివరింతురు. ఇతడే ఈ తత్త్వములకు బద్ధుడైనపుడు జీవుడనియు, బద్ధుడుకా డని జ్ఞప్తిగొనినపుడు ఈశ్వరుడనియు చెప్పబడును. ఈ పురుషుని స్వభావమే పౌరుష మనబడును. అదియే వానిచే కాలముగా గమనింపబడుచుండునని పెద్దలు వివరింతురు.

పురుషుని చుట్టును మిగిలిన తత్త్వము లేర్పడినపుడు వాని కొక ప్రత్యేక స్ఫురణ కలుగును. దానినే అహంకార మందురు. దానిచే మోహితుడై ప్రకృతిని సంసర్గముగా పొంది, జీవుడై భయము మొదలగునవి అనుభవించుచుండును. ప్రకృతి గుణ ములు సమపాళముగా నేర్పడినపుడు అందలి పురుషుడు వేరు వేరుగా వర్తింపక అంతర్యామియై యుండును. అప్పు డతడు భగవంతు డనబడును. అతని చేష్టలే ఈ సృష్టి అంతయును. ఆ చేష్టలు దేనివలన వెలువడునో అదియే కాలమనబడును. అది జీవరాసులలో నుండుటచేత పురుషు డనబడును. అదియే చుట్టును గమనింపబడినపుడు కాలమనియు, లోపల గమనింపబడినపుడు పురుషుడనియు తెలియబడును. ఈ మొత్తమును భగవంతుడు ప్రవర్తింపజేయుట తన మాయ, లేక ఆత్మమాయ అనబడును.

ఆత్మ మాయచేత ఇరువది నాలుగు తత్త్వములతో నివసించుట మొదలుపెట్టిన పురుషుడు జీవుడగుట కిష్టపడును. అతడు ఆ తత్త్వములను కలియబోసి, మధించినట్లు చేయును. దానివలన ఇన్ని తత్త్వములును కలిసి ప్రకృతి యొక్క చక్కని పాకముగా నేర్పడును. అదియే జగత్కారణము (Primordial Existence). దానియందు భగవంతుడు తన సృజనాత్మక శక్తిని వీర్యముగా వర్తింపజేయును. దానితో ఆ పాకము వెలుగుముద్ద యగును. (తా నున్నానని గమనింపు ప్రకాశించుటయే ఈ వెలుగు. అది నిద్రనుండి మేల్కాంచినట్లుండును.) ఈ వెలుగు ముద్దనే హిరణ్మయమైన అండమందురు. (కిరణమయమని అర్థము) ఇదియే మహత్తు అనబడు తత్త్వము (The cosmic mind). అందుండి భగవంతుడు వెలుగొందుచుండును. అది సూక్ష్మమైన వెలుగు. (అనగా కంటికి సంబంధించిన వెలుగు గాక మెలకువ యనబడు వెలుగు. అందు వెలుగుచున్న భగవంతుడు ఈ నానావిధ సృష్టికిని విత్తనముగా పనిచేయును. అయినను దానియందతడు సూక్ష్మశరీర రూపమున నీశ్వరుడై యుండును. కుండ యందలి మట్టికి కుండ పుట్టుట, పగులుట ఉండనట్లు, సృష్టియందున్న ఈశ్వరునకు సృష్టిలోని మార్పులు గాని, లయమందుట గాని అంటవు. అతడే ఈ మహత్తు మొదలగు తత్త్వములను వెలిగించుచుండును. అతనిని ఈ సృష్టి తత్త్వములు సృష్టియందు నిద్రించునట్లు చేయును. (గోడపై రంగుల బొమ్మను చిత్రించినప్పుడు గోడను మరచి బొమ్మను చూచుట జరుగుచున్నదిగదా! అట్లే పురుషుడు ప్రకృతిచేత చిత్రింపబడినవాడై తన్ను మరచి సృష్టిగా మేల్కాంచును. తన్ను మరచుటయే తనకు ప్రకృతి వలన కలుగు నిద్ర.)

అతడే మరల తన తేజస్సుతో ఈ మరచుట యను చీకటిని తొలగించుకొని తనయందు తాను ప్రకాశించును. (ఇదియే జీవులు మోక్షవిద్య నవలంబించి తరించుట.)

890. టీక : దివ్యము = తన వెలుగుతో నిండినది; వ్యూహచతుష్టయంబు = నాలుగు వ్యూహములు; సేవ్యంబు = సేవింపదగినది; భవ్యగుణా! = శుభమైన గుణములు గలవాడా

తా : ఈ పురుషుడు ప్రకృతియందు చరించుటకు నాలుగు వ్యూహము లేర్పడును. అవి చరించుటకు మూడు జగము లేర్పడును. వీనిని కొంత వివరించెదను వినుము :

(మూడు జగము లనగా భూః, భువః, సువః అను లోకములు. అందు భూలోక మనగా ఈ పంచేంద్రియములకు గోచరించు లోకము. భువర్లోక మనగా అంతరిక్షము. ఇదియే వ్యక్తికిని వ్యక్తికిని నడుమనున్న చోటు. సువర్లోక మనగా సృష్టిలో పురుషు డుండునట్టి లోకము. దేహమును చూపి, "ఇది దేహము" అని చెప్పుటకు వీలైనది భూలోకము. ఆ దేహ మున్న చోటు భువర్లోకము. దేహములందు ఒకరినొకరు "వాడు, వీడు" అని చెప్పుకొనునది సువర్లోకము.

వ్యూహములు అనగా సృష్టి వహింప బడునవి, లేక నిర్వహణ పరికరములు (Vehicles). ఇవి నాలుగు : వాసుదేవుడు, సంకర్షణుడు, ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు. వీరు మనలో మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారముగా పని చేయుదురు.)

891. టీక : ఊర్మిషట్కంబులన్ = అలలవంటి ఆరు కదలికలను ; ఓసరించి = ప్రక్కకు తొలగించి ; సురుచిర = చక్కని కాంతిమంతమైన ; షాడ్గుణ్య పరిపూర్ణము = ఆరు గుణములచే సంపూర్ణత చెందినది ; నిత్యము = ఎల్లప్పు డుండునది ; భక్తజన సేవ్యము = భక్తజనులచేత సేవింపబడినది ; తనర్చి = విస్తరించి ; వలనొప్పుచుండు = తీర్పు చెందుచుండునట్టి ; ఓలిన్ = వరుసగా ; రూఢిన్ = స్థిరముగా ; సరవిన్ = వరుసగా ; వైకారికంబు = వికారమునకు సంబంధించినది లేక రూపాంతరము చెందినది ; తైజసము = తేజస్సునకు సంబంధించినది ; తామసంబు = తమోగుణమునకు సంబంధించినది; మూడు తెఱఁగులన్ = మూడు విధములుగా ; తనరున్ = వ్యాప్తి చెందును ; గగనముఖభూతములకు = ఆకాశము మొదలు పంచ భూతములకు.

తా : వాసుదేవము అనబడు వ్యూహము సత్త్వగుణ ప్రధానమై, నిర్మలమై, శాంతమై యుండును. ఊర్ములు అనబడు

ఆరు విధములైన కలతలకు లోంగకుండును. (ఆకలి, దప్పిక, శోకము, మోహము, ముసలితనము, మృత్యువు అనునవి ఆరు విధములైన యూర్మికములు.) వాని స్పర్శ లేకుండ వసించు తత్త్వమే వాసుదేవతత్త్వము. అది మహత్తునకన్న అవ్వల నున్న శాశ్వత తత్త్వము. భక్తజనులు ఏ దేవుని రూపముననైనను ఆరాధించు తత్త్వ మిది యొక్కటే. అది చక్కని షడ్గుణముల చేత పరిపూర్ణమై యుండును. (తపస్సు, దానము, శౌచము, శమము, దమము, సత్యము అనునవి షడ్గుణములు.)

ఈ వాసుదేవ వ్యూహము మహత్తత్త్వమునందు నిండి స్థిరపడును. అట్లు స్థిరపడుటలో క్రియాశక్తి రూపము ధరించును (Potential energy). దానినే అహంకార మందురు. అది సత్త్వరజస్తమస్సుల విభాగము నొందును. సాత్త్వికాహంకారము అనేకరూపములను ధరించును. రాజసాహంకారము నే నను వెలుగును పుట్టించి వెలిగించును. తామసాహంకారము భూతములను స్థూలదేహాదులను కలిగించు కారణ మగును. వైకారికము అనబడు సాత్త్వికాహంకారము మనస్సునకు, ఇంద్రియములకు, పంచభూతములకు నుత్పత్తి స్థానముగా పనిచేయును.

892. టీక : ఇంద్రియ మేళనంబు = ఇంద్రియముల కలయిక గలది ; అర్థమాత్రంబు = ప్రయోజనము మాత్రమే కలది.

తా : ఈ వైకారికము దేవతల రూపముతో నుండును. (మనస్సునకు, నింద్రియములకు, పంచభూతములకు నధిపతులగు దేవతలు సాత్త్వికాహంకారముచే పుట్టుదురని భావము.) తైజసాహంకారము బుద్ధిరూపమున, ప్రాణమురూపమున నుండును. (బుద్ధిబలము, ఉచ్ఛ్వాస నిశ్వాసములు, పంచప్రాణముల ప్రవృత్తులు రజోగుణము వలన వర్తించుచున్నవి.) తామసాహంకారము ఇంద్రియములతో జరుగు కలయికల రూపమున నుండును. అవియే అర్థములు. వానినే ఇంద్రియార్థములు, లేక విషయములు అందురు. చూడబడు వస్తువులు, వినబడు వాక్యములు, సుగంధ దుర్గంధములు, రుచులు, శీతోష్ణములు మొదలగువాని రూపమున నుండును. ఇవి జీవికి అభ్యాసము రూపమున నంటుచున్నవి.

తమోగుణము మనకు గలుగు నభ్యాసముల కన్నిటికిని కారణము. కనుకనే అభ్యాసములను మార్చుకొనలేని లక్షణము తమోగుణము వలన కలుగుచున్నది. ఇది లేనిచో జీవికి వాసన లంటుటగాని, జీవితానుభవముగాని లేవు. యోగికి సదభ్యాసములు స్థిరపడుట కిదియే తోడ్పడును. త్రిగుణములు తన వశమున వర్తించువాడు యోగి. అట్టివాడే భోగి కాగలడు. త్రిగుణముల వశమున వర్తించు తామసుడు రోగి యగుచున్నాడు. )

893. టీక : అధిష్ఠించి = స్థానముగొని ; సహస్రఫణా మండల + అభిరాముఁడు = వేయిపడగలతో, చుట్టలతో నొప్పు చున్నవాడు ; తనరారు = విస్తరించు ; ఘనుఁడు = గొప్పవాడు ; మహిత = గొప్పవియగు ; భూత + ఇంద్రియమానసమయుఁడు = పంచభూతములు, నింద్రియములు, మనస్సుతో నిండియున్నవాడు ; ప్రకట = వెలువడునట్టి ; లక్షణ లక్షిత + ఉల్లాసి = లక్షణముల గుర్తులు గలిగి ప్రకాశించువాడు ; ఆ + మేటి = ఆ సమర్థుడు ; ఎలమిన్ = కుతూహలముతో.

తా. ఈ వైకారికమైన సాత్త్వికాహంకారము నధిష్ఠించి సంకర్షణు డనబడు వ్యూహ ముండును. అతడు వేయిపడగలు కలిగి చుట్టలు చుట్టుకొని యుండును. మొదలు, తుది అనునవి వానికి లేవు. పంచభూతములు, నింద్రియములు, మనస్సు వీనియందిమిడి యుండును. కార్యము-కారణము-కర్త అనబడు రూప భేదములతో నుండును. శాంతము, ఘోరము, మూఢత్వము మొదలగు లక్షణములతో వెలుగొందు చుండును. వీని వలననే మనస్సు అనబడు తత్త్వము పుట్టెను.

( వాసుదేవుని వ్యూహము వలన మహత్తు నుండి అహంకారము పుట్టెనని ఇంతకుముందు పద్యమున చెప్పబడినది. అందలి సాత్త్వికాహంకారము నుండి సంకర్షణ వ్యూహము వలన మనస్తత్త్వము పుట్టుట ఇచ్చట చెప్పబడినది. అందేర్పడు పంచభూతములు, ఇంద్రియ ప్రవృత్తులు, మనః ప్రవృత్తులు వేయి విధములుగా నుండును. అవి అనంతముగా వర్తించును గనుక నత డనంతు డనబడును. ఈ ప్రవృత్తులే అనంతుని వేయి పడగలు. ఇవి

మనస్సున నిమిడి యుండి, వెలుపలకు విప్పుకొను చుండును గనుక విప్పుకొనక ముందు లీనమై యున్న స్థితిలో చుట్టలు చుట్టుకొని యున్నట్లు చెప్పబడినది. ఏపనినైన చేయువాడు, చేయబడునట్టిది, చేయుట అనబడు మూడు విభాగములు దీనివలననే యేర్పడు చున్నవి. మరియు శాంతుడుగా ప్రవర్తించుట, కోపాదులతో భయంకరుడుగా తోచుట, సృష్టిలోని సంసర్గములకు వ్యామోహ పడుట మొదలగు లక్షణము లన్నియు వీనియందు ముద్రితములై యుండును. అవి పాము దేహమున పొలుసులవలె నుండును.)

894. టీక : కామ సంభవంబు = కోరిక పుట్టుట ; అనిరుద్ధ + ఆఖ్యంబు = అనిరుద్ధ మనబడునది ; హృషీకంబులకు = అవయవములకు ; అధీశ్వరంబు = ఆధిపత్యము వహించినది ; సకల యోగీంద్రసేవ్యంబు = సమస్త యోగీంద్రులచే సేవింప తగినది ; శరత్ + ఇందీవరశ్యామంబు = శరదృతువు నందలి నల్లకలువ వలె శ్యామవర్ణము కలది ; ద్రవ్యప్రకాశంబు = వస్తువులను ప్రత్యేకముగా తెలియజేయునది ; ఇంద్రియానుగ్రహంబు = ఇంద్రియముల ననుసరించి గ్రహించునది ; మిథ్యాజ్ఞానంబు = లేనిదానిని గుర్తించుట (భ్రమపడుట) ; ఇంద్రియ నిశ్చయంబు = ఇంద్రియములవలన ఇదమిత్థమని నిర్ణయించుట ; స్మృతి = ప్రత్యక్షముగా లేని వస్తువును స్మరించుట ; క్రియాజ్ఞానసాధనంబులు = పనుల యొక్క జ్ఞానమును సాధించునవి ; శ్రోత్రేంద్రియంబు = వినునట్టి ఇంద్రియము ; శబ్దగ్రాహి = శబ్దమును గ్రహించునది ; శ్రోతకు = వినువానికి ; జ్ఞానజనకంబు = జ్ఞానమును పుట్టించునది ; భూతంబులకు = ఆకాశముగాక మిగిలిన నాలుగు భూతములకు, జీవులకు ; బాహ్య+అభ్యంతరంబులన్ = వెలుపల, లోపల అను తావులకు ; ఆత్మ ప్రాణేంద్రియాదులు = ఆత్మయు, ప్రాణము, ఇంద్రియములు మొదలగునవి ; వికారంబు నొందు = వివిధములైన ప్రత్యేకాకారములు పొందును ; నభంబు = ఆకాశము ; స్పర్శగ్రాహి = స్పర్శవలన గ్రహించునది ; త్వక్ + ఇంద్రియంబు = చర్మ మనబడు నింద్రియము ; శైత్యంబు = చల్లదనము ; ఉష్ణత్వంబు = వేడి ; చాలనంబు = కదలించుట ; పరస్పర విభాగకరణంబు = ఒకదాని నుండి యింకొకటి విడదీయుట ; తత్ + మేళనంబు = దానిని

కలుపుట ; ద్రవ్య శబ్ద నేతృత్వంబు = ద్రవ్యమునకు శబ్దము కలిగించుట ; గంధవంతంబు = వాసన గలది ; ఘ్రాణేంద్రియంబు = వాసనచూచు నింద్రియము ; ద్రవ్య నేతృత్వంబు = ద్రవ్యమును నడిపించుట; శ్రోత్రేంద్రియ గ్రాహ్యము = చెవిచే గ్రహించబడుట; సర్వేంద్రియాత్మకత్వంబు = అన్ని యింద్రియములందు తానై పని చేయుట ; దైవప్రేరితంబు ; దైవముచే ప్రేరేపింప బడినది ; నేత్రేంద్రియ గ్రాహకంబు = కంటిచే గ్రహింప బడునది ; నేత్రగతంబు = కంటియందున్నది ; ఉపలంభకత్వంబు = అనుభవము కలది ; ద్రవ్య + ఆకార సమత్వంబు = ద్రవ్యముయొక్క ఆకారమునకు సమానమైనది ; ఉపసర్జనంబు = ప్రధానముకానిది, ముఖ్యముకానిది ; ద్రవ్యపరిణామప్రతీతి = ద్రవ్యముయొక్క పరిమితిని తెలియునట్లు చేయుట ; ద్యోతంబునన్ = ఉన్నట్లు తెలియుట వలన ; ప్రకాశంబు = ఉన్నది తెలియవచ్చుట ; పచనంబు = వంటవండుట ; పాకంబు = వండబడినది ; పిపాసా నిమిత్తంబు = దప్పికకొఱకైనది ; పానంబు = త్రాగుట : క్షుత్ + నిమిత్తంబు= ఆకలికొఱకైనది ; ఓదనంబు = అన్నము ; హిమమర్దనంబు = మంచును కరగించునది ; శోషణంబు = ఎండునట్లు చేయునది ; దైవచోదితంబు=దైవముచే ప్రేరేపించబడినది; రసనేంద్రియంబు= రుచిచూచు నింద్రియము ; = రసగ్రాహకంబు రుచిని గ్రహించునది ; భూతవికారంబు = పంచభూతముల వేర్వేరు కలయికలు గలది ; కషాయ = వగరు ; అక్త = చేదు ; కటు = కారము ; అమ్ల = పులుపు ; మధుర + ఆది = తీపి మొదలగు ; సాంసర్గిక ద్రవ్యవికారంబు = కలసియుండుటచే ద్రవ్యమునందు కలుగు మార్పు ; ఆర్ద్రము = తడిసినది ; తృప్తిదాతృత్వంబు = తృప్తి నిచ్చుట ; తత్ + వైక్లబ్యనివర్తనంబు = జీవియొక్క తాపమును నివారించుట; మృదూకరణంబు = మెత్తన జేయుట; కూపగతంబు= బావిలోనిది ; ఉత్ + గమించుట = పైకుబుకుట ; ఘ్రాణంబు = ముక్కు ; గంధగ్రాహకంబు = వాసనను గ్రహించునది ; వ్యంజన + ఆదిగతంబు = కూరలు, పచ్చళ్ళు మొదలగువానిలో నున్నది ; హింగు + ఆది నిమిత్తంబు = ఇంగువ మొదలగువానివలన కలిగినది ; మిశ్రగంధంబు = కలగలుపు వాసన ; కరంభంబు =

పెరుగన్నపు ముద్ద ; గృంజన + ఆదిగతంబు = జంతువుల మాంసము మొదలగువానియందు ; పూతి గంధంబు = పులిసిపోయిన వాసన ; ఘనసార + ఆది నిమిత్తంబు = పచ్చకర్పూరము మొదలగువాని వలన కలిగినది ; శతపత్ర + ఆదిగతంబు = తామరపూలు మున్నగువాని యందున్నది ; లశున + ఆదిగతంబు = వెల్లుల్లి మొదలగువాని యందున్నది ; ఉగ్రగంధంబు = తీవ్రమైన వాసన ; పరి + ఉషిత చిత్రాన్న + ఆదిగతంబు = చలిది ఎక్కిన పులి యోగిరము మొదలగువాని యందున్నది ; ఆమ్లగంధంబు = పుల్లని వాసన ; ద్రవ్య + అవయవ వైషమ్యంబు = ద్రవ్యమందలి పాళ్ళు హెచ్చు తగ్గులు ; ప్రతిమ + ఆది = బొమ్మలు మొదలైన ; సాకారతా + ఆపాదనంబు = ఆకారముతో కూడియుండుట కల్పింపబడినది ; జలాది విలక్షణ త్రయాంతర నిరపేక్షంబు = జలము, అగ్ని, వాయువు యొక్క ప్రత్యేక లక్షణములపై నాధారపడనిది ; జలాది + ఆధారత = నీరు మొదలగువాని కాధారమగుట ; ధారణంబు = ధరించుట ; ఆకాశాది + అవచ్ఛేదకత్వంబు = ఆకాశము, వాయువు, అగ్ని, జలము అనువానిని వేరుగా తీసియుంచుట ; సకలప్రాణి పుంస్త్వాభివ్యక్తీకరణంబు = సకల జీవులయొక్క పురుషత్వమును స్పష్టపరచుట ; పృథ్వీవృత్తులు = పృథివీ తత్త్వముయొక్క ప్రవర్తనములు ; నభః + అసాధారణ శబ్ద విశేష గ్రాహకంబు = ఆకాశముతో సామ్యము చెందని ప్రత్యేకమైన శబ్దమును గ్రహించుట ; శ్రోత్రంబు = చెవి ; వాయు+ అసాధారణ గుణవిశేష గ్రాహకంబు = వాయువుయొక్క సాధారణ గుణమునకు సంబంధింపని విశేషమును గ్రహించునది ; తేజస్ + అసాధారణ గుణవిశేష గ్రాహకంబు = వెలుగునకు సామాన్యముగాని ప్రత్యేక గుణమును గ్రహించుట ; అంభస్ + అసాధారణ గుణవిశేష గ్రాహకంబు = జలమునకు సాధారణము కాని ప్రత్యేక గుణమును గ్రహించునది ; రసన + ఇంద్రియంబు = రుచిచూచు నింద్రియము ; భూమి + అసాధారణ గుణవిశేష గ్రాహకంబు = భూమికి సహజము గాని ప్రత్యేక గుణమును గ్రహించునది ; ఘ్రాణ + ఇంద్రియంబు = వాసనచూచు నింద్రియము ; కార్యంబులు = చేయునట్టి పనులు ; వాయు + ఆదులు = వాయువు

మొదలగునవి ; కారణ + అన్వయంబు = కారణము సరిపడుట ; మహత్ + ఆది పృథివీ + అంతంబులు = మహత్తు మొదలు పృథివి వరకును గలవి ; పరస్పర మిళితంబులు= ఒకదానిలో నొకటి కలసినవి ; భోగ + ఆయతంబు=అనుభవములలో విస్తృతిచెందినది; కాల + అదృష్టత త్త్వము + ఆదులు = కాలము, అవ్యక్తము, తత్త్వము మొదలగునవి ; (త్రై)గుణ్యవిశిష్టుండు = మూడు గుణములతో ప్రత్యేకత చెందినవాడు ; అశేష నియామకుండు = సమస్తమును నియమించువాడు ; నిరంజన + ఆకారుండు = చూడబడు సాధనమున కందని ఆకారము గలవాడు ; అన్యోన్య క్షుభితంబులై = ఒకదాని నొకటి మథింపజేసినవి ; మిళితంబులు = కలుపబడినవి ; మహత్ + ఆదులు = మహత్తు మొదలగునవి ; అధిష్ఠాతృచేతన హితంబు= అధిష్ఠించినవాని ప్రజ్ఞ కనుకూలమైనవి.

తా : వైకారికము అగు అహంకారము వలన మనస్సను తత్త్వము పుట్టెను. అది మరల వికారములను పొందును. (అనగా స్థితులవలన మార్పులు చెందును.) మనస్సునకు చింతనము సహజము. చింతన మనగా యాలోచించుట. ఇవి రెండు విధములు :

1. సామాన్యముగా నాలోచించుట.

2. విశేషముగా నాలోచించుట.

మొదటిది సంకల్పము, రెండవది వికల్ప మనబడును. (కంటికి దృశ్యము ఎదురుకాగా మనస్సుపై బొమ్మ పడును. బొమ్మ పడినదని ఆలోచించుట సంకల్పము. బొమ్మను గూర్చి వేరుగా నాలోచించుట వికల్పము. ఉదాహరణకు : కంటికి బంగారు విగ్రహము కనిపించినపుడు కనిపించునది బంగారు మాత్రమే. విగ్రహము తయారుచేయువాని మనస్సు వలన చూచువాని మనస్సునకు రేఖామాత్రముగా ప్రయాణము చేయును. అపుడు ఇది బంగార మనుకొనుట మాని ఇది కృష్ణ విగ్రహ మనుకొనుట జరుగును. పూర్వ సంస్కారముచే కృష్ణావతారములోని లీలలు గుర్తువచ్చుట వికల్పము. ఇట్లే ఎదుట పాంచభౌతిక శరీరము కనుపించుట సంకల్పము. అది తన

భార్యయని తెలిసికొనుట వికల్పము. ఆమెతో గల పూర్వ సంస్కారముల యభ్యాసము వలన కామమో, క్రోధమో కలుగుట మరి యొక వికల్పము. ఈ వికల్పములు చిలువలు పలువలుగా అనంతములై పుట్టుచుండును. ఎన్ని పుట్టును అన్నది పూర్వా భ్యాసము ననుసరించి యుండును. కృష్ణవిగ్రహాదు లాధారముగా పుట్టిన వికల్పములు అన్నిటి యందలి అంతర్యామిపై భక్తికి దారితీయును గనుక బంధములను తొలగించుటకు మార్గములు భార్యాదు లాధారముగా పుట్టినవి. కామ క్రోధములకు, ఆవేశము లకు, కర్మాచరణమునకు దారితీయును గనుక సంసార బంధమునకు కారణమగుచున్నది. ) ఈ సంకల్ప వికల్పములవలననే సృష్టిలో మనము కోరుకొను వస్తువులు వేరువేరు లక్షణములుగా మెలగు చున్నట్లు కనుపించు చున్నవి. కనుక వీనివలననే కామములు పుట్టును.

ఈ తైజసాహంకారము వలననే మూడవది యగు అనిరుద్ధ వ్యూహము పుట్టెను. దానినే మన స్సనుచున్నాము. అనిరుద్ధుడు ఇంద్రియములకు దేవుడు. సకల యోగులును ఇంద్రియములను అంతర్ముఖములు చేసి ఇతనిని హృదయమున సేవింతురు. ఇతడు శరదృతువున విచ్చిన నల్లకలువవంటి రంగు కలిగి యుండును. ఇతని నుండియే బుద్ధి యను తత్త్వము పుట్టును. ( అంతర్ముఖులై ధ్యానించినచో బుద్ధియననేమో స్పష్టముగా తెలియును. ) బుద్ధి నుండి ఈ దిగువ శక్తులు కిరణములై ప్రసరించుచుండును :

1. ద్రవ్యమును ప్రకాశింపజేయు జ్ఞానము. దీనివలన వస్తువుల స్వభావము తెలియును.

2. ఇంద్రియవృత్తులను హద్దులలో నుంచి సద్వినియోగము చేయు జ్ఞానము.

3. సంశయము.

4. మిథ్యాజ్ఞానము లేక ఆరోపించుకొనుట.

5. నిద్ర.

6. నిశ్చయము.

7. స్మృతి.

8. జ్ఞానేంద్రియ, కర్మేంద్రియముల ఉపయోగము.

9. క్రియలను సాధించుకొనుట, సాధనములను కనిపెట్టుట. ( ఇంకను రహస్యప్రకాశము నందలి వివరణమును చూడుడు. )

ఈ తైజసాహంకారము వలననే ప్రాణమునకు గల క్రియాశక్తియు, బుద్ధికిగల జ్ఞానశక్తియు పుట్టును. ఈ శక్తులు రెండును ఇంద్రియములకు సంక్రమించును.

తామసాహంకారము వలన శబ్దతన్మాత్రము, దానివలన ఆకాశము, దానివలన వినుట పుట్టెను. చెవి శబ్దగ్రహణము చేయుట, అది అర్థమునకు ఆధారమగుట జరిగెను.

శబ్దతన్మాత్రమునుండి ఆకాశము, దానినుండి మిగిలిన నాలుగు భూతములును పుట్టెను. లోపల, వెలుపల యను భేదము పుట్టెను. ఆకాశమే ఆత్మకు, ప్రాణములకు, ఇంద్రియాదులకు నివాసము.

ఇన్నిటికిని సంచలనము కలుగచేయుటకై కాలము వ్యక్తమయ్యెను. ఆకాశమున కదలిక పుట్టుటవలన స్పర్శ పుట్టెను. దానినుండి వాయువు పుట్టెను. దానినుండి చర్మము పుట్టి స్పర్శజ్ఞానము కలిగించెను. మెత్తదనము, గట్టిదనము, చల్లదనము, వెచ్చదనము అనునవి స్పర్శజ్ఞానమునకు లక్షణములు.

వాయువునకు కదలించు శక్తి పుట్టెను. దానివలన ద్రవ్యమును విడదీయుట, కలుపుట పుట్టెను. దానివలన ద్రవ్యము యొక్క కణములు పుట్టినవి. అవి వాయువునందు లేచి చరించునట్టి లక్షణ మేర్పడి, వాసన చూచుట పుట్టెను. దూరమందున్న వస్తువుల వాసన సోకుటయు, అవి యున్నట్లు తెలియుటయు సంభవమయ్యెను.

శబ్దమునకు వినుట, వినబడుట ప్రధాన లక్షణములు. దానినాశ్రయించి అర్థము గ్రహింపబడును. కనుక అన్ని ఇంద్రియములకు సంబంధించిన జ్ఞానమును శబ్దార్థముల రూపమున శబ్దము నాశ్రయించి యుండగలదు.

వాయువునుండి స్పర్శగుణము, దానికి రూపకల్పనము కలుగును. దానినుండి తేజస్సు పుట్టెను. అది కంటిని స్పృశించుట వలన రూపము గ్రహింపబడుచున్నది. వస్తువులు ఉన్న చోటు తెలియుట, ఆకారము తెలియుట దీనివలన నేర్పడుచున్నది.

తేజస్సునకు గల లక్షణములు ప్రకాశించుట, పచనము, దప్పిక కలుగుట, ఆకలి, నీటిని ఆర్పుట అనునవి.

వెలుగునందలి యుష్ణోగ్రత మార్పుల వలన రుచి పుట్టును. దానినుండి జలము పుట్టును. దానిని గ్రహించు నింద్రియము పుట్టి, నాలుక యనబడును. ద్రవ్యముల కలయికలోని మార్పులవలన రుచినుండి రుచులు ఆరును పుట్టినవి. అందు వగరు, చేదు, కారము, పులుపు, తీపి, ఉప్పు ముఖ్యమైనవి. వీని కలయిక వలన అనంతములైన రుచులు పుట్టును.

జలమునకు గల లక్షణములేమనగా ద్రవ్యములలో మార్పు కలిగించుట, తడుపుట, ముద్దకట్టించుట, ప్రాణమునకు తృప్తి నిచ్చుట, జీవనాధారమగుట, దేహమున సామ్యము చేకూర్చుట, మెత్తపరచుట, తాపము పోగొట్టుట, భూమియందు జల లేర్పడుట.

రుచినుండి వాసన పుట్టెను. దానినుండి పృథివీతత్త్వము, దానినుండి వాసన చూచు నింద్రియము పుట్టెను. ద్రవ్యములోని భేదమును బట్టి వేరు వేరు వాసనలు తెలియుట పుట్టెను.

పృథివీతత్త్వము యొక్క లక్షణము లేవనగా ఆకారము నిలుపుట, ద్రవ్యము స్వతంత్రముగా నిలబడుట, ఇతర ద్రవ్యముల కాధారముగా నిలుచుట, ఆనుకొని అధారమగుట, ద్రవ్యమును విడదీయుట, జీవునకు దేహముగా పనిచేయుట. (ఇంకను రహస్యప్రకాశము నందలి వివరణమును చూడుడు.)

ఈ పంచభూతములకు పై జెప్పినవి సాధారణ ధర్మములు. వానిలో నసాధారణ ధర్మములను వేరుగా చెప్పెదను. ఆకాశము నకు శబ్దము, దానికి చెవి, వాయువునకు స్పర్శము, దానికి చర్మము. తేజస్సునకు రూపము, దానికి కన్ను, జలమునకు రుచి, దానికి నాలుక, పృథివికి గంధము, దానికి ముక్కు అసాధారణ ధర్మములు.

ఇందు మరియొక విశేష మున్నది. ఆకాశమునకు అసాధారణ గుణము శబ్దము మాత్రమే. వాయువునకు శబ్ద, స్పర్శములు రెండును అసాధారణములు. అగ్నికి శబ్ద, స్పర్శ, రూపములు మూడును ; జలమునకు శబ్ద, స్పర్శ, రూప, రసములు నాలుగును ; పృథివికి శబ్ద, స్పర్శ, రూప, రస, గంధము లైదును అసాధారణ గుణములు.

ఆకాశముకన్న సూక్ష్మమైనది అహంకారము. దాని కన్న సూక్ష్మమైనది మహత్తు. పంచభూతము లీ రెండిటిలో కలసి ఏడు తత్త్వములుగా నున్నవి. వీని ఫలితముగా పురుషుడు ప్రకృతిలో వ్యక్తమగుచున్నాడు. ఇవి పురుషుని పుట్టించి తమ్మనుభవించు నట్లు చేయుచున్నవి. పరమాత్మ కాలరూపమున వీనియందు అస్తిత్వము కలిగి, అంతుపట్టని విధమున నున్నాడు. ఈ తత్త్వముల నిర్మాణమున కతడు కారణమైనను త్రిగుణముల కతీతుడుగా నున్నాడు. ఇవి వానియందు పుట్టి, లయమందును గనుక అతీతుడై నియమించువాడుగా నున్నాడు. అతడు కాలస్వరూపముగా నుండుటవలన నివి పరస్పరము ఘర్షణము పొంది యుడికినట్లు కలిసినవి. ఒక దానిలో మిగిలినవి యుండుట సంభవించి యొక గ్రుడ్డు పుట్టెను. అది వేరుగా చైతన్యము రూపమున భగవంతుని పొందెను కనుక భగవంతుని చైతన్యమును కోల్పోయి వేరుగా వర్తించెను.

895. టీక : గురుశక్తి = గొప్పశక్తిగలది ; ప్రభవించెన్ = పుట్టెను ; విశేషాండము = ప్రత్యేకమైన గ్రుడ్డు ; అర్థిన్ = కుతూహలముతో ; పొదిగి = చుట్టును ఆక్రమించి ; అంబుముఖ + ఆవరణంబులు = జలము మొదలగు పొరలు ; దశగుణితంబులు = పదిరెట్లైనవి ; మేలుకట్లు = గుడ్డల విస్తృతిచే నిలుపబడిన పందిళ్ళ వంటి యలంకారములు ; పంకజ + ఉదరుని = విష్ణుమూర్తియొక్క ; లోలతన్ = చలనముతో ; హేమమయము = బంగారముతో చేయబడినది ( బంగారు రంగుగలది ) ; అభవుండు = పుట్టుక లేని వాడు ) ; అఖిలజేత = సమస్తమును జయించినవాడు ; విష్ణుపద భేదనంబు = ఆకాశమును భేదించుట.

**తా. ఈ గ్రుడ్డునందున్న ప్రజ్ఞ పేరు విరాట్పురుషుడు. అందు జలము మొదలగు నావరణములు వేరువేరుగా నొక్కొక్క**

దానికి మరియొకటి పదింతలై యేర్పడి పొరలుగా నుండును. అవి వస్త్రముల పొరలవలె నుండగా విష్ణుని రూపము ప్రకాశించును. ఈ గ్రుడ్డు మహాజలములలో తేలుచు, బంగారు రంగుగా నుండును. విష్ణు డంతర్యామియై ఆకాశమును విడదీసి ఈ గ్రుడ్డునుండి సమస్తమును పుట్టింపగలిగి యుండును.

(మన భూగోళమునందువలెనే ఈ గ్రుడ్డునందు మొదటి పొర పృథివీతత్త్వము. దానిపైన వరుసగా జలము, అగ్ని, వాయువు, ఆకాశము, అహంకారము, మహత్తు అను పొరలు ఒకదానికన్న నొకటి పదిరెట్ల పరిమాణముతో నేర్పడును.)

896. టీక : ఆననంబు = ముఖము (నోరు); వాణి = వాక్కు; వహ్ని = అగ్ని; నాసంబు = ముక్కు; ఘ్రాణేంద్రియంబు = వాసన చూచు నింద్రియము; అక్షులు = కన్నులు; చక్షువు = కన్ను; అభిధ్యానంబు = అభిముఖమై ధ్యానించుట; కర్ణములు = చెవులు; జాతమయ్యెన్ = పుట్టెను; శ్రోత్రేంద్రియంబు = వినునట్టి ఇంద్రియము; త్వక్ = చర్మము; శ్మశ్రురోమ వితానకములు = మీసములు, వెండ్రుకలు; ఓషధివ్రాతము = ఆహారధాన్యముల మొక్కలు; భవమొందెన్ = పుట్టెను.

తా. ఈ గ్రుడ్డునందు విరాట్పురుషుడు వెలుగొందును. వాని ముఖమునుండి వాక్కు, అగ్ని (ప్రాణాగ్ని, ఆకలి) పుట్టెను. ప్రాణములనుండి శ్వాస, ముక్కు పుట్టెను. ప్రాణవాయువులు పుట్టెను. వానినుండి కన్నులు, సూర్యుడు పుట్టెను. వానియందు ధ్యాన మేర్పడగా చెవులు, వినుట, దిక్కులు, జ్ఞానము పుట్టెను. చర్మమునుండి మీసములు, రోమములుగా ఓషధులు పుట్టెను. (గర్భమందలి అండమునకు నెట్లు పుట్టునో బ్రహ్మాండమునందివి అట్లే పుట్టెను.)

897. టీక : మేఢ్రంబు = రహస్యాంగము; రేతంబు = శుక్రము; ఆపంబు = జలము; గుదము = మలావయవము; అపానంబు = ప్రాణాపానములలో రెండవది.

తా : అండము నుండియే కాలక్రమమున మూత్రావయవము, శుక్రము పుట్టెను. శుక్రము నుండి జలములు వ్యక్తమయ్యెను. అట్లే మలావయవము, అపానస్పందనము, దాని నుండి మృత్యువు పుట్టెను. (అపాన మనగా వెలికి నెట్టునట్టి స్పందనము. దేహమును గూడ నెట్టివేయునది ఈ శక్తియే కావున దేహమునకు ఇదియే మృత్యువును కలిగించును.)

898. టీక : కరములు=చేతులు ; ఇరవుగన్=స్థానముగా ; పాదాంబురుహంబులు = పాదపద్మములు : గతి = గమనము ; హరి = ఉపేంద్రుడు (దిగివచ్చునట్టి విష్ణుని రూపము).

తా : ఆ గ్రుడ్డునందు చేతులు, వానియందు బలము పుట్టెను. ఆ రెండిటి వలన నింద్రుడను దేవత పుట్టెను. పాదములు పెరిగి, గమనము కలిగి, ఆ రెండిటివలన నుపేంద్రుడను దేవతపుట్టెను.

899. టీక : ఘననాడీపుంజము = గొప్పనాడుల సమూహము ; జఠరంబు = కడుపు ; దప్పి = దాహము ; అనయము = మిక్కిలి ; అబ్ధులు = సముద్రములు.

తా : ఆ గ్రుడ్డున నాడుల గుంపు పుట్టెను. అందు రక్తము ప్రవహించెను. దానినుండి నదులు పుట్టెను. పొట్ట యేర్పడి ఆకలి దప్పులు కలిగెను. అందుండి సముద్రము లేర్పడెను.

900. టీక : మనంబు = మనస్సు ; తుహినకరుఁడు = చంద్రుడు ; క్షేత్రజ్ఞుండు = దేహమున్నదని తెలిసికొనువాడు.

తా. హృదయ మేర్పడి, దాని నుండి మనస్సు, దాని నుండి చంద్రుడు పుట్టెను. దానినుండి బుద్ధియు, చిత్తము, బ్రహ్మయు, వాని నుండి ఈ మొత్తము తన దేహమని తెలియువాడును పుట్టెను. ఇట్లు గ్రుడ్డునుండి సృష్టి యేర్పడునట్టి పురుషుడు పుట్టెను.

901. టీక : వ్యష్టిరూపంబులు = వేరైన రూపములు ; వాక్ + ఆది + ఇంద్రియజాతంబు = వాక్కు మొదలగు వానిని వ్యక్తముచేయు ఇంద్రియముల సమూహము ; తత్ + అధి దేవతలు = వాని కధిపతులగు దేవతలు ; సమిష్టిరూపుండు = అన్నియు ఒకటియైన రూపము కలవాడు ; క్షేత్రజ్ఞుఁడు =

దేహము నాది యని గమనించువాడు ; ప్రవృత్తి ప్రవర్తకుండు = ప్రవర్తనమున వర్తించువాడు ; దేవ + అధిష్ఠితంబులు = దేవతలచే నాధిపత్యము పొందబడినవి ; ఈశ్వరున్ = వారికి కూడ నధిపతిని. ప్రవృత్తి + ఉన్ముఖున్ = ప్రవర్తించుటకు పూనుకొనిన వానిని ; తత్ + తత్ + అధిష్ఠాన + ఆదులన్ = తా నాధారములుగా గొనిన ఆ యా తావులను ; వాక్ + ఇంద్రియము = మాటాడు నింద్రియము ; విరాట్ కార్యంబు = విరాట్ పురుషుని పని ; వ్యష్టి శరీరజాతంబు = వేరు వేరు దేహభాగముల మొత్తము ; అనుత్పన్నంబు = ఇంకను పుట్టనిది ; నాస = ముక్కు ; చక్షురింద్రియంబు = కన్ను ; వృథాభూతంబు = వ్యర్థమైనది ; దిగ్దేవతాకంబు= దిక్కులు దేవతలుగా కలది ; కర్ణంబు = చెవి ; విరాట్ కార్య ప్రేరణ + అయోగ్యంబు = విరాట్ పురుషుని పనియందు పురికొల్పుటకు తగనిది ; త్వగింద్రియంబు = చర్మము ; అప్ + దైవంబు = జలము దేవతగా గలది ; రేతంబు = శుక్రము ; తత్ కార్య కరణ + అదక్షంబు = ఆ పని చేయుటకు సమర్థము కానిది ; పదంపడి = పిమ్మట ; అపానేంద్రియంబు = అపాన స్పందనమునకు కారణమైన ఇంద్రియము ; హైన్యంబు = నీచత చెందినది ; విష్ణుదేవతాకంబు = విష్ణువు దేవతగా కలది ; అనీశ్వరంబులు = ఆధిపత్యములు లేనివి ; ప్రాణేంద్రియంబు = హస్తము ; ఇంద్ర దైవతంబులు = ఇంద్రుడు దేవతగా కలవి ; ననదీకంబులు = నదులతో కూడినవి ; లోహితంబు = ఎర్రనిది ( రక్తము రూప మైనది ) ; ఉదరంబు = పొట్ట ; సింధువులతోడన్ = సముద్రములతో ; క్షుత్పిపాసలన్ = ఆకలి దప్పులను ; బ్రహ్మాధిదైవతంబు = బ్రహ్మయే అధిపతిగా కలది ; విరాట్ కార్యజాతంబు = విరాట్ పురుషుని పనుల మొత్తము ; అనుద్భూతంబు = పుట్టనిది ; చైత్యుండు = చిత్తమున కధిపతి ; క్షేత్రజ్ఞుండు = దేహము నాది యని తెలియువాడు; హృదయాధిష్ఠానంబు=హృదయము నివాసమై యుండుట ; సలిలకార్యభూత = జలముల ప్రవర్తనముచే నేర్పడిన ; ప్రవృత్తి + ఉన్ముఖుండు = ప్రవర్తనమునకు పూనుకొను సమర్థుడగువాడు ; సుప్తుండు = నిద్రించినవాడు ; ప్రాణాదులు = ప్రాణము మొదలగునవి; భగవత్ +అప్రేరితంబులు=భగవంతునిచే

ప్రేరేపింపబడినవి; ఉత్థాపన + అసమర్థంబులు = లేవదీయునట్టి సామర్థ్యము లేనివి ; అగ్ని + ఆదులు = అగ్ని మొదలగునవి ; స్వాధిష్ఠానభూతంబులు = తమ స్థానములుగా నేర్పడినవి ; అశక్తంబులు = శక్తి లేనివి ; అనవరతభక్తిన్ = ఎడతెగని భక్తిచే.

తా. విరాట్ పురుషునియందు పుట్టిన పంచభూతములు, తన్మాత్రలు, నింద్రియములు వాని అధిదేవతలు వేరువేరుగా నుండిపోయినవి. అవి ఏకత్వము నందుటకు సమర్థులు కాకపోయెను. కనుక పురుషుని తమయందు వ్యక్తము చేయలేకపోయెను. పురుషునియందే అవి వ్యక్త మగుచున్నవి. తమ తమ నివాసముల యందు మాత్రము నిలిచి యున్నవి. విరాట్ పురుషుని ముఖమున అగ్ని, వాక్కు వ్యక్తము కాగా నోరు మున్నగునవి పుట్టెను గాని, నోరుగలవాడు పుట్టునట్లుచేయుట వానికి చేతకాలేదు. అట్లే విరాట్ పురుషుని ముక్కున వాసన, వాయువు పుట్టి అట్లే యుండెను. వాని కంటిలో సూర్యుడు, చూపు పుట్టి వ్యర్థముగా నుండిపోయెను. చెవియందు వినుట, దిక్కుల జ్ఞానము పుట్టి వేచి యుండెను. చర్మము నుండి రోమములును, ఔషధులును ; పురుషావయవమునుండి రేతస్సును, జలములు కలిగినవి. పురీషావయవము నుండి పుట్టిన అపానము, మృత్యువు ; పాదములనుండి పుట్టిన గమనము, విష్ణువు ; చేతులయందు పుట్టిన బలము, ఇంద్రుడు ; నాడులయందు పుట్టిన నదులు, రక్తము ; ఉదరమునుండి పుట్టిన సముద్రములు, ఆకలి దప్పులు ; హృదయమున పుట్టిన మనస్సు, చంద్రుడు, బ్రహ్మ ; చిత్తమునందు పుట్టిన అభిమానము, రుద్రులును అట్లే నిలబడి యున్నారు. ఇన్నిటిని ఏకత్వమున నిలుపునట్టి జీవుడుగా దేవుడు దిగివచ్చి హృదయమున ప్రవేశించి చిత్తమున నిండెను. అప్పుడు విరాట్ పురుషుడు జలములలో వ్యక్తమైన బ్రహ్మాండమున నిలబడి సృష్టికార్యమునకు వర్తించెను. మెలకువ వచ్చినట్లు క్షేత్రజ్ఞుడై ఈశ్వరుడు ప్రవేశించిన క్షణమునుండి మాత్రమే ఈ దేహ భాగములు పనిచేయ నారంభించెను.

( విరాట్ పురుషుని దేహము నుండి ఏ ఇంద్రియాదులు, అధిదేవతలు నుద్భవించిరో వారే జీవుల ఇంద్రియాదులు, అధిదేవతలై

వర్తించిరని అర్థము. ఉదాహరణమునకు: తండ్రి శరీరమున ముక్కు, చెవులు మున్నగునవి యుండుటవలన వాని శుక్రమునుండి గర్భపిండమున మరల నవియే యుద్భవించెను. అట్లే విరాట్ పురుషుని దేహభాగములు మొట్టమొదట నేర్పడగా వాని వీర్యము నుండి జీవుల దేహభాగము లేర్పడినవి.)

ఈ శాస్త్రము మొత్తమును దర్శించి వివేకము పొందినవారు వైరాగ్యసంపన్నులై విరాట్‌పురుషునియందు నిరంతర భక్తి కలిగి ధ్యానింతురు. దానితో ప్రకృతి పురుషుల వివేకము కలిగి, జీవుడు ప్రకృతి కతీతుడై దేహములందు వర్తించును. ఇదియే మోక్ష స్థితి. ఈ వివేకము లేనిచో ప్రకృతితో సంబంధము కలిగి సంసారబంధ మేర్పడును.

902. టీక : జననుత = జనులచే నుతింపబడినవాడా! ప్రాకృత కార్యము = ప్రకృతియొక్క పని ; శరీరగతుండు = శరీరమున నున్నవాడు ; కడంగి =పూని ; ప్రాకృతములు =ప్రకృతికి సంబంధించినవి ; మోహము = లేనిదాని నున్నట్లు తెలిసికొనుట ; కరమనురక్తుండు = మిక్కిలి అనురాగము కలవాడు ; వికార విహీనుండు = మార్పులు లేనివాడు ; నిర్మల జల ప్రతిబింబితుండు = తేట నీటియందు ప్రతిబింబించినవాడు ; దినకరుని భంగి = సూర్యుని వలె ; మూఢుండై =మోహము చెందినవాడై ; తొడరి = పూని ; ప్రసంగవశతను = మిక్కిలి సంగమునకు లోనగుటచేత.

తా. శరీరము త్రిగుణములతో నిండినది, ప్రకృతి వలన నేర్పడినది. పురుషు డందుండియు ప్రకృతికి సంబంధించిన సుఖ దుఃఖముల వలన అనురాగము పొందక, మార్పులు చెందక త్రిగుణములు లేనివాడై యుండవచ్చును. అపు డతడు తేట నీటి యందు ప్రతిబింబించిన సూర్యునివలె ఆ నీటి నంటనివాడై యుండును. అందు పుట్టిన తాననుభావము ప్రకృతి గుణముల యందు తగులుకొనినచో నహంకార మగును. అపుడు మోహము పుట్టును. జరుగుచున్న సన్నివేశములకు తానే కర్త ననిపించును. ప్రకృతి దోషములను పొందును.

903. టీక : సుర = దేవతలు ; తిర్యక్ = జంతువులు ; మనుజ = నరులు ; స్థావర రూపములు= చెట్లు మున్నగు నడక లేని

జీవుల రూపములు, కర్మవాసన = చేయుచుంటి ననుకొనిన కర్మయొక్క సంస్కారము ; పరపై = విస్తృతమై ; మిశ్రయోనులన్ = వివిధములుగా కలసి వర్తించు జన్మలందు ; స్థిరముగన్ = స్థిరముగా ; సంసృతిన్ = సంసారమును.

తా. ఇట్లు ప్రకృతి నంటించుకొనిన యహంకారము దేవతలుగా, నరులుగా, జంతువులుగా, స్థావరములుగా రూపములను పొందును. కర్మల సంస్కారముల నభివృద్ధి చేసికొనును. వేరు వేరు గర్భములలో పుట్టి సంసారబంధము నేర్పరచుకొనును.

904. టీక : విషయధ్యానంబు = ఇంద్రియార్థములను స్మరించుట ; స్వాప్నిక + అర్థాగమ సంధానము = కలలో ధనము లభించినపుడు కలిగిన సంతోషాదుల కలయిక ; అసత్పథ మానసుఁడు = అస్తిత్వము లేని చెడ్డమార్గములందు పరువెత్తు మనస్సుకలవాడు ; లోలుండు = చంచలత్వము కలవాడు.

తా. సంసారబద్ధులై ఇంద్రియార్థములను స్మరించుచు, చరించుచు తా మనుకొనిన లాభములను పొందుచుందురు. వాని వలన గలుగు తృప్తి, కలలో సంపదలు కలిగినపుడు కలుగు తృప్తి వంటిది. వా రీవిధముగా దారితప్పి చెడ్డమార్గములలో ప్రవర్తించుచుందురు.

905, 906. టీక : మోక్షార్థి = మోక్షము కోరువాడు ; విరక్తి = అనురాగము లేకుండుట, వైరాగ్యము ; యోగమార్గ క్రియాభ్యాసయుక్తిన్ = యోగమార్గమందలి పనులను అభ్యసించుట.

తా. కనుక మోక్షము కోరువాడు మనస్సును వశపరచుకొనవలెను. యమము, నియమము మొదలగు యోగాంగముల నభ్యసించుట వలన నిది సాధ్యపడును. ఈ యభ్యాసము కుదరవలె నన్నచో మిగిలిన విషయములందు వైరాగ్యము పుట్టవలెను. వైరాగ్యము పుట్టవలె నన్నచో భక్తియోగము తీవ్రత చెందవలెను.

907. టీక : శ్రద్ధాగరిష్ఠుడు = శ్రద్ధయందు గొప్పవాడు ; మద్భావంబు = నా భావము : వర్ణిత మత్కథా కర్ణనంబు =

వర్ణింపబడిన నా కథలను వినుట ; అజాతవైరము = విరోధము పుట్టకుండుట ; నిఖిల ధర్మసంగతులన్ = సమస్త ధర్మములతో కలయికలను ; మితాశనుఁడు = మితముగా భుజించువాడు ; ఏకాంతి = ఒకడై యుండువాడు ; మనన శీలుఁడు = ఒకే ఆలోచన కలవాడు ; వీత మత్సరుండు = తొలగిన మాత్సర్యము కలవాడు ; ఆత్మ కలిత విజ్ఞాని = తా నను భావముతో కూడిన విజ్ఞానము కలవాడు ( తెలిసికొనబడు వస్తువు, తెలిసికొను వానితో నైక్యము చెందినవాడు ) ; ఘన శరీర పరిగ్రహ + ఉత్కంఠ = ఘనీభవించిన దేహము, దానిని పట్టుకొనియున్న వానియందు ఆతురత ; ఆగ్రహము = నేను, నాది యను పట్టుదల ; పాసి = తొలగి.

తా. ఈ సాధనచేయువాడు తొలుత శ్రద్ధను సాధింపవలెను. ( జీవితమం దెంతకాలమైనను ఒకే యుత్సాహము కలిగి కార్యాచరణ పూనుట శ్రద్ధ. ) నా యునికి ఎట్లు సత్యమో తెలిసికొనవలెను. ( నే నను భావము దేహము, మనస్సు, ఆదర్శములు మున్నగునవి కాక, నేను నేనే యని తెలియుటవలన నే నను పదమునకు అర్థము అంతర్యామియని తెలియును. ) నా పాదములను సేవింపవలెను. ( సృష్టియందలి జీవు లందరును అంతర్యామియందు తనవలెనే నేనై యున్నారని తెలియవలెను. అపుడు సృష్టియందలి వ్యక్తమైన యొక పాదము, అవ్యక్తమైన మిగిలిన మూడు పాదములను తెలియును. ) నా కథలను వర్ణించి చెప్పుకొనుచు వినుచుండవలెను. ( మహానుభావుల పుణ్యకథలన్నియు నా కథలే యని తెలియవలెను. అపు డవతారలీలలు స్పష్టమగును. ) జీవులందరి యందును సమదృష్టి నభ్యసింపవలెను. ఎవ్వరితోను వైరము పుట్టరాదు. బ్రహ్మచర్యము, మౌనము మొదలగు ఆత్మధర్మము లభ్యసింపవలెను. ఎప్పుడును సంతోషముగా నుండుట, మితముగా భుజించుట, సృష్టియం దెల్లెడ తా నొక్కఁడుగనే జీవించుట, మననము నభ్యసింపవలెను. మాత్సర్యము లేకుండవలెను. మైత్రి, దయ యను గుణము లభ్యసింపవలెను. తాను తెలుసుకొనగోరిన విషయము తానుగా తెలియవలెను. శరీరము, బంధుత్వముల యందు ఆత్రపడుట, అభిమానము తొలగించుకొని జీవించవలెను.

908 : టీక : జీవ + ఈశ్వర తత్త్వజ్ఞానంబు = జీవునియొక్క, ఈశ్వరుని యొక్క నిజస్వరూపము తెలియుట ; నివర్తితంబు = మరలింపబడినది ; తత్ + అవస్థానంబు = దానియొక్క వేరు వేరు స్థితుల క్రమము ; దూరీభూత + ఇతర దర్శనుండు = అంతర్యామి కన్న నితరమును చూచునట్టి లక్షణము తొలగిపోయినవాడు ; జీవ + ఆత్మజ్ఞానంబు = జీవుడు, తాను అనువారిని గురించి తెలియుట ; చక్షురింద్రియంబు = కన్ను ; ఆత్మనాయకుండు = తనను నడిపించువాడు ; నిరుపాధికంబు = ఆధారము లేలిది ; మిథ్యాభూతంబు = లేని దున్నట్లుగా నేర్పడినది ; సత్ + రూపంబు = ఉన్నదాని రూపము ; ప్రధాన కారణంబు = మూలప్రకృతికి కారణము ; అధిష్ఠానంబు = ఆశ్రయించి యుండుటకు స్థానము ; కార్యంబు = జరుగునట్టి పని ; సమస్త కార్యకారణ + అనుస్యూతంబు = కార్యకారణము లన్నిటిని అదికి యుంచునది ; సర్వవ్యాపకంబు = అన్నిటియందును వ్యాపించినది.

తా. పై చెప్పిన సాధన వలన జీవుడు, ఈశ్వరుడు అనువారి నిజస్వరూపము తెలియును. ( గుణములతో కూడిన ప్రకృతి నడుమ చిక్కుకొనినవాడే జీవుడు. వాని కధిపతిగా నడిపించుట తనకు చేతనగునని జ్ఞప్తియున్నవాడే ఈశ్వరుడు. ఇంటిలోని వారి అభిప్రాయముల ననుసరించుటకు ప్రయత్నించుచు చిక్కులలో పడి వారిని కూడ చిక్కుల లోనికి కొనిపోవునట్టి యింటి యజమాని యొక డుండును. మరి యొకడు వారి మాటలను వినక వారి కేమి కావలయునో గ్రహించి నడిపించు సామర్థ్యము గల యజమానియై యుండును. అందు మొదటివాని స్థితిలో నున్నవాడు జీవుడు. రెండవవాని స్థితిలో నున్నవాడు ఈశ్వరుడు. పై చెప్పిన సాధనచే జీవుడు తా నీశ్వరుడుగా తెలిసికొనును. )

ఈ జ్ఞానముచేత బుద్ధి వెనుకకు మరలును. అనగా అంతర్ముఖ మగును. ( జీవుడు బుద్ధిగా వెలువడి, మనస్సుగా దిగి వచ్చి, యింద్రియములుగా ప్రయాణము చేయుచు చుట్టు ప్రక్కల నున్న వస్తువులను, వ్యక్తులను గుర్తించుచుండును. వారి ననుసరించి మెలగుచు జీవుడుగా చిక్కులు పడును. ఇది బహిర్ముఖ స్థితి. ఇదికాక పై చెప్పిన సాధనచే వెలుపలి వారును, వస్తువులును

అంతర్యామి రూపముగా దర్శించును. దానితో మనస్సు, ఇంద్రియములు, బుద్ధియు తనలో నున్న అంతర్యామిని తెలిసి కొనును. కనుక వెలుపల కనుపించుచున్న వ్యక్తుల యందలి అంతర్యామినే తనలో కూడ చూచుకొనుట ఏర్పడును.)

అప్పుడు బుద్ధి యందలి అనేకములైన పరిణామ స్థితిగతులు చక్కగా దర్శన మిచ్చును. అవి తనయందే ఏర్పడిన రూపము లని తెలియును. అట్టి తాను అన్నిటియం దున్నానని తెలియును. అపుడు మరియొకటి యనబడు వస్తువుగాని, వ్యక్తిగాని లేదని తెలియును. (ఉన్నది తెలియుట వలన లేనిదానిని గూర్చిన భావములు మాయమగును.) అప్పుడు జీవునకు, ఆత్మకు గల భేదము తొలగిపోవును.

అట్టి స్థితిలో కంటితో సూర్యుని అస్తిత్వమును గ్రహించి నంత సూటిగా నారాయణుని దర్శించును. దేహమునందు వేరుగానున్న నేనను భావము అంతకుముందు క్రీనీడవలె నుండును. ఈ సాధన వలన నారాయణుని ప్రకాశమున ఈ క్రీనీడకు ఆధారము లేకుండ పోవును. దేహము తనకు ఆధారమని నమ్మినపుడు దేహమునకు వేరుగా అస్తిత్వ మున్నట్లు అనిపించును. మట్టియం దేర్పడిన కుండ మట్టికన్న వేరుగా నున్నట్లనిపించుట యిది. దీనినే మిథ్యాదృష్టి, లేక లేని దానిని చూచుట అందురు. దేహము ఆధారముగా కాక అంతర్యామి రూపముగ తెలియుటచే అందు వేరుగా నున్న నేనను భావము నిరాధార మగును. ఈ భావమే అహంకారము. నారాయణుని ప్రకాశముచే అది తొలగును.

అంతేకాదు. దేహమునందు సప్తధాతువు లుండును. అవి త్రిగుణాత్మకమైన ప్రకృతి వలన నేర్పడినవి. ఈ త్రిగుణములు మూలప్రకృతి వలన నేర్పడినవి. ఈ మూలప్రకృతియే సమస్తమును పుట్టించు స్వభావము. దానినే ప్రధానము అని కూడ అందురు. దానియందు కూడ ఈ సాధనలో అంతర్యామి ప్రకాశము దర్శన మగుటచే నారాయణుడే ప్రధానమునకు కూడ ఆధారమని తెలియును. ఐనచో వానినుండి ఈ ప్రధానము వెలువడుట ఎందులకు? దానినుండి త్రిగుణములును, లోకములును,

పంచభూతాదులు వేరుగా నేర్పడుట ఎందులకు? సృష్టి కార్యమునకు సృష్టి యెందులకు? దానికి కారణము లేదు. తనకు అట్లుండుట బాగుగా నుండుటయే కారణము. చూచుటకు గల కుతూహలమును తీర్చుటకు కన్ను లెట్లేర్పడుచున్నవో, అట్లే కార్యసాధనమై ఈ ప్రధానము నారాయణుని నుండి యేర్పడుచున్నది. ఇది యంతయు దర్శనమిచ్చును. అపుడు సృష్టియందున్న కార్యకారణము లన్నియు దారమునకు గుచ్చిన పూసలవలె నారాయణ స్మరణయందు కూర్పు చెందును. అప్పటి యనుభూతితో భగవంతుడు సర్వవ్యాపి యనియు ఈ సృష్టి వానిచే పరిపూర్ణ మనియు తెలియును. ఇది మనస్సునకు తెలియుట గాక తెలియవలసిన తీరున తెలియును.

909 : టీక : ఆత్మవేత్త = తన్నెరిగినవాడు ; గగనస్థుఁడు= ఆకాశమున నున్నవాడు ; దినకరుని = సూర్యునియొక్క ; గృహ కుడ్య జాలకములు = ఇంటిగోడల కన్నములు ; ప్రతిఫలములు = ప్రతిబింబించుట ; ఇనుని పగిదిన్ = సూర్యునివలె ; అర్థిన్ = కుతూహలమున ; మనోబుద్ధి + అహంకరణత్రయ నాడీప్రకాశము= మనస్సు, బుద్ధి, త్రిగుణముల యహంకారములు అనబడు గొట్టములనుండి వెలుగొందుట ; వలఁతి = సమర్థుడు ; అంచితశ్రీన్ = ప్రకాశించు శోభవలన ; తనర్చి = వ్యాపించి ; ఆత్మజ్ఞులు = తన్నెరిగినవారు.

తా. ఈ విధముగ తన స్వరూపము తనకు తెలిసినవానికి విష్ణుస్వరూపము తెలియును. (ఆత్మజ్ఞానికిని, బ్రహ్మజ్ఞానికిని భేదము లేదు.) దేహమందు ప్రకృతుల నడుమ నున్న జీవుడు ఇట్లు భగవంతుని దర్శించుట యొక నేర్పరితనము. ఇంటిలో కూర్చుండిన వాడు ఆకాశమున నున్న సూర్యుని చూడ లేడుకదా! అయినను అది పగటివేళయనియు, సూర్యుడున్నాడనియు తెలిసి కొనుచునే యున్నాడు. ఎట్లు తెలిసికొనుచున్నాడు? ఇంటిగోడలకు కిటికీలు, ద్వారబంధములు కలవు. ప్రాతయిండ్లకు పైన కన్నము లుండును. ఇన్నిటినుండి సూర్యుని కిరణములు ఇంటిలో ప్రవేశించి, ప్రతిబింబించి తన కన్నులకు చూడగల సామర్థ్యము నిచ్చుచున్నది. దానివలన సూర్యుడున్నాడని సత్యము నూహించు చున్నాడు. అట్లే మనస్సు, బుద్ధి, త్రిగుణాహంకారములు

మున్నగు కన్నములనుండి ప్రకాశించుచున్న అంతర్యామిని ప్రతిబింబ న్యాయముచేత సృష్టియందు చూచి గ్రహించుచున్నాడు.) ఇట్లే సాధనచే ఆత్మస్వరూపమును తెలిసికొను సామర్థ్యము కలిగినపుడు అనుభవించు శోభయే లక్ష్మి యనబడు సంపద. ఆమెతో కూడిన నారాయణుడే సర్వజీవులలోని అంతరాత్మయని ఆత్మజ్ఞులకు తెలియును.

910. టీక : పరమాత్మ + అనుషక్తుండు = భగవంతుని యందు వదలలేని సంబంధము పెట్టుకొనినవాడు ; భూతాది తత్త్వంబులు = పంచభూతములు మొదలగు సృష్టిలోని పొరలు, వాసనామాత్రంబు = సంస్కారములుగా మాత్రము ; అకార్య కరణంబులు = తమ పనులను చేయలేనట్టివి ; సుషుప్తి = గాఢ నిద్ర ; నిస్తంద్రుండు = మత్తులేనివాడు.

తా. ఈ సాధనవలన జీవుడు భగవంతుని యందు విడువని అభిలాషకలవా డగును. వానియందు కూడ పంచభూతములు మొదలగు తత్త్వము లుండును. అవి ప్రకృతియందు లీనమై యుండును. ప్రకృతి తనయందు లీనమై యుండును. అవి అన్నియు తనయందున్నట్లు మాత్రమే తెలియును. ఈ తెలివి తనయందు ఒక భాగముగా లీనమై యుండును. కనుక ఈ తత్త్వములందేవియు తాము చేయునట్టి పనులను చేయ జాలవు. చేయునట్టి సామర్థ్యము గోల్పోవును. (అసమర్థుడగు అధికారికి గుమాస్తాలు, పరిచారకులు ఎట్లుందురో సమర్థునకును అట్లే యుందురు. అసమర్థుని పరిచారకులు యజమానితో సంబంధములేని పనులను స్వతంత్రించి అనేకములను చక్కబెట్టుచుందురు. సమర్థుని పరివారము మాత్రము వాని వ్యూహమును నిర్వర్తించుటయే గాని స్వంతముగా వ్యవహరించుటకు సామర్థ్య ముండదు. ఇందు సాధనలేని జీవుని దేహేంద్రియాదులు అసమర్థుని పరివారమువలె స్వతంత్రించుచుండును. నారాయణ సాధన కలవాని పరివారము ఈ సామర్థ్యమును గోల్పోయి తనయందు సంస్కారములుగా నిమిడి యుందురు.)

అప్పుడు నిద్రపోవుచున్నవాని గాఢనిద్రలో అతని దేహము, స్వభావము, ఇంద్రియాదులు ఎట్లు సమర్థములుగా నుండునో

సాధకుని యందును అట్లే. కాని యొక భేదమున్నది. గాఢనిద్రలో నున్నవాడు ఇంద్రియాదులతో పాటుగానిన జీవుడు కనుక అవి నిద్రించునపుడు తానును నిద్రించును. సాధకుడు వాని వశమున లేడు కనుక నారాయణునియందు ఇంద్రియాదులు నిద్రించుచుండగా తాను నారాయణుని యందు మేల్కొని యుండును. అపుడు ఇతరము అను పొర తన్ను కప్పదు. ఇదియే పరమాత్మానుభవము అని కపిలు డుపదేశింపగా దేవహూతి మరల నిట్లు ప్రశ్నించెను.

911 : టీక : విమలాత్మ = నిర్మలమైన ఆత్మ స్వరూపుడా! గంధంబు = వాసన ; సలిలంబు = నీళ్ళు ; రసంబు = రుచి ; సంగతిన్ = కలయికచేత ; సతతంబు = ఎల్లప్పుడు ; పాయుట = తొలగుట ; భవభయంబులు = జన్మాది సంసార భయములు ; క్రమ్మరన్ = మరల ; జాడ = మార్గము ; దేవగుణ సుసేవ్య = దేవతల గుంపులచే చక్కగా కొలువబడువాడా! భక్తిలోక + అనుగంతవ్య = భక్తజనులు అనుసరింప వలసిన గమ్యస్థాన మగువాడా!

తా : నిర్మలమూర్తీ! ఈ పంచభూతములలో ఈ పృథివి కిని గంధమునకును గల సంబంధము ; జలములకు, రుచికిని గల సంబంధము ఒక్కదానిని విడిచి యొకటి యుండుటకు వీలులేనిది. అది విడదీయరాని సంబంధము. అట్టిదే ఆత్మకును, ప్రకృతికిని గల సంబంధము కదా! అట్టి సంబంధము ఒకమాటు కలిగిన తత్త్వ జ్ఞానముతో నెట్లు విడిపోవును? ఒకే మాటు ప్రకృతి గుణములు విడిపోవుట, స్వచ్ఛముగా ఆత్మ నిలబడుట ఎట్లు సాధ్యము? (తత్త్వ బోధవలన ఆత్మజ్ఞానము కలుగవచ్చునుగాని మరల మరల ప్రకృతి సంబంధము ఏర్పడుచుండదా?) అట్లుకాకుండ జన్మాది సంసార బాధలను మరల పొందకుండ నిల్చునట్టి మార్గ మేమి? చచ్చి మరల పుట్టని మార్గము కావలయునుకదా! (ఇచట చచ్చుట, పుట్టుట దేహముల విషయము కాదు. ప్రకృతి గుణముల విషయము. కానిచో మోక్షము వచ్చినపుడు జీవుడు చచ్చిపోవలసి యున్నచో మృత్యుభీతి వలన నెవ్వడును మోక్షమార్గమును అవలంబింపడు.) ఈ సందేహములు తొలగు నట్టి జ్ఞానమును ప్రసాదింపుము.

912. టీక : భగవంతుడు = సర్వశక్తి సంపన్నుడు ; అనిమిత్తము = కారణములేనిది (కోరికతో చేయని పని); స్వధర్మంబు= తా నాచరింపవలసిన మార్గము ; నిర్మల + అంతఃకరణంబు = మలినములేని మనస్సు ; సునిశితంబు = మిక్కిలి వాడియైనది (తీక్షణమైనది) ; సత్కథాశ్రవణ సంపాదితంబు = మంచివారి కథలను వినుటవలన సంపాదించుకొనినది ; దృష్ట ప్రకృతి పురుష యాథాత్మ్యంబు = చూడబడిన ప్రకృతి పురుషులయందు తానే యెట్లుండునో ఆ సత్యము ; కామ + అనభిష్వంగంబు = కోరికల నంటనీయకుండుట ; విరక్తి = ప్రత్యేకాభిలాష లేకుండుట ; తపోయుక్తంబు= తపస్సుతో కూడినది ; చిత్త + ఏకాగ్రత = చిత్తము నొక మార్గమును పట్టించుట ; దందహ్యమానంబు = తగులబడిపోవునది ; తిరోధానంబు = మాయమగునది ; అరణిగతంబు = అరణియందున్నది ; నిరంతరంబు = సందులేనిది ; దృష్టదోషంబు = చూడబడిన దోషములు గలది ; భుక్తభోగ = అనుభవింపబడిన భోగములు గలది.

తా. దేవహూతి ప్రశ్నకు భగవంతు డయిన కపిలు డిట్లనెను : "తల్లీ ! నీవుకోరినట్టి ఈ చచ్చి పుట్టని మార్గము నుపదేశించెదను వినుము. సాధకుడు అకారణముగా తనపనులు తాను చేయుచుండవలెను. (లాభము, సదుపాయము మున్నగునవి కారణము కారాదు.) మనస్సు నిర్మలముగ నిలుపుకొను యత్నము ఎల్లప్పుడుండవలెను. (ఇతరులు చేసిన యపరాధములు, తన కష్టములు స్మరింపబడరాదు.) నాయందు భక్తి తీవ్రముగా నుండవలెను. (అనగా అంతకన్న మిగిలిన పనులు మనస్సున నుండకుండుట, తీరకపోవుట, మిగిలిన పనుల నడుమ కొంతకాలము భక్తిసాధన చేయుట పనికిరాదు. అన్నిటిని వానియందర్పణముచేసి వాని పనులుగా మాత్రమే నడుపుటయందు తీవ్రప్రయత్నముండవలెను.) మంచివారి పుణ్యకథలను ఆసక్తితో వినవలెను. దానివలన మిగిలినవాని యందు వైరాగ్యము కల్గును. ప్రకృతి పురుషులు తన అంశలే అను సత్యము తెలియును. ఈ జ్ఞానము క్రమముగా బలిష్ఠ మగును. కోరికలయందు గల శ్రద్ధను తొలగింపవలెను. దానితో ప్రత్యేకమైన అభిలాషలు కరగిపోవును.

తపస్సుతో యోగాభ్యాసము చేయవలయును. చిత్తమును ఒకే మార్గమును పట్టించుటకు తీవ్ర సంకల్పముండవలెను. అపుడు పురుషుని యందలి ప్రకృతి (వాని స్వభావము) దగ్ధమై మాయ మగును. (తాను మిగులును.)

యజ్ఞార్థమై నిప్పు చేయుటకు అరణి యను సాధనము నుపయోగింతురు. (అది కొయ్యతో చేయబడును.) దానినుండి రాపిడివలన నిప్పు పుట్టును. దానిని చక్కగా రగుల్కొల్పి అందు అరణి నుంచినచో తగులబడిపోవునుకదా! అట్లే మనలోని దేహాదులతో గూడిన ప్రకృతి నుపయోగించి సత్కర్మాచరణ సాధనచే జ్ఞానమును పుట్టించి రగుల్కొల్పవలెను. దానివలననే ఆ ప్రకృతి దగ్ధమై పోవును. ఇట్లు తత్త్వదర్శనముచే జ్ఞానము బలీయ మగును. ప్రకృతివలన కలుగు దోషములేవో తెలియును. అపుడు జీవుడు తా ననుభవించిన ప్రకృతిని విడిచి నిర్ముక్తుడగును.

913. టీక : నైజ మహిమంబునన్ = సహజమైన గొప్ప దనముచేత ; మహా + ఈశునకున్ = అన్నిటిపై నధికారము కల వానికి ; అశుభవిస్ఫురణంబు = శుభముగాని దానిని రూపొందించుట ; అనయము = బొత్తుగా.

తా. ప్రకృతి యనగా స్వభావము. అది సహజమైన గొప్ప దనము గలది. దాని యధిపతి కనుక పురుషు డన్నింటిపై నధికారము గలవాడు. సృష్టిలో ప్రకృతి యందు పురుషు డుండును. (ప్రళయమున పురుషుని యందు ప్రకృతి లీనమగును.) అట్టి జీవరూపుడైన పురుషునకు ప్రకృతి యెన్నడును అశుభమును తల పెట్టదు. దాని విధమును వివరించెదను.

(పైన సాధకుడు ప్రకృతిని విడువవలెనని చెప్పెను. అంత మాత్రమున ప్రకృతి యశుభమును గలిగించు ననుకొనరాదు. రోగికి ఆరోగ్యము చేకూరవలసినపుడు భార్యకు దూరముగా నుండవలెనని వైద్యుడు శాసించును. అనగా భార్య శత్రువని యర్థము కాదు. అట్లే ప్రకృతి విషయమున పురుషుడును. పురుషుడు జీవుడు కానపుడు దేవుడుగా తన క్రీడ కొరకై ప్రకృతిని సృష్టించెను. కనుక అది సహజముగా గొప్ప పుట్టుక గలది. దాని

కోక మహిమ కలదు. తనయందు బద్ధుడైన పురుషుడు జీవుడుగా అజ్ఞానియై ప్రవర్తించును. అప్పుడు కూడ ప్రకృతి అతనికి కీడు చేయదు. సంసారబంధము ఏ మాత్రము అశుభమును కలిగింపదు.)

914. టీక : అనర్థకముల్ = కీడులు ; ప్రబోధమందు = మెలకువ వచ్చినపుడు ; అరయఁగన్ - పరిశీలింపగా ; మిథ్యలై = అసత్యములై ; ఘటింపనికైవడిన్ =సంధానము పొందని విధమున ; పర + ఈశ్వరునకు = అతీతుడైన అధికారికి ; ఆత్మనాథునకు = తనపై స్వామిత్వముగలవానికి ; సర్వశరీరికి = అన్నిశరీరములును ధరించినవానికి ; కర్మసాక్షికిన్ = కర్మలకు కేవలము సాక్షిగానున్నవానికి (సాక్షి యనగా సాక్ష్యము చెప్పువాడుగాదు. స + అక్షి = కన్నులు మాత్రము కలవాడు, దూరమునుండి చూచుచుండువాడు.) ; పరువడిన్ = క్రమముగా ; ప్రాకృతదోషములు= ప్రకృతికి సంబంధించిన దోషములు.

తా. పురుషుడు నిద్రపోయినపుడు స్వప్నములు కలుగును. అందు పీడకలలు కూడ వచ్చును. మెలకువ వచ్చుసరికి అందలి పీడలు తనవికావను తెలివి పుట్టును. అసత్యములని తెలియును. అట్లే ఆత్మజ్ఞానము కలిగి స్వామిత్వము నెరిగిన వానికి తన స్వభావమందలి దోషములు తనవి కావనియు, అసత్యము లనియు తెలియును. ఆత్మజ్ఞాని యనగా పరమేశ్వరుడని తెలియును. అతడే సర్వశరీరములను ధరించియున్నాడనియు, కర్మలకు కేవలము సాక్షిగా మాత్ర మున్నాడనియు తెలియును.

915, 916. టీక : వెండియున్ = మరియు ; అధ్యాత్మతత్పరుండు = ఆత్మ నధిష్ఠించి అదియే పరమైనదిగా నుండువాడు ; బ్రహ్మపదప్రాప్తిపర్యంతము = బ్రహ్మయొక్క పదవి లభించువరకును (సృష్టికర్త యగువరకు) ; సర్వార్థ వైరాగ్యశాలి = అన్ని ప్రయోజనముల యందును లక్ష్యము తొలగినవాడు ; సంపత్తి = సంపద ; పరఁగన్ = ప్రసిద్ధికలుగునట్లు ; ప్రబుద్ధుడై = మేలుకొని ; బహువారములు = పలుమారులు ; భూరి = ఎక్కువైన ; మత్ప్రసాద ప్రాప్తిమతిన్ = నా యనుగ్రహమును పొందు మనస్సుతో ; తనర్చు = విస్తరింపజేయునట్టి ; నిజపరిజ్ఞాన = తన పరిశీలనాత్మక

జ్ఞానముచే ; విచ్ఛిన్న = తెగిపోయిన ; నిఖిల సంశయుండు= సందేహములు కలవాడు ; నిర్ముక్తలింగదేహుండు = తొలగిపోయిన తన ప్రత్యేకత యను దేహము కలవాడు. యోగీంద్ర హృద్గేయము = యోగీంద్రుల హృదయమున కీర్తింపబడునది ; మదీయ దివ్యధామంబు = అప్రాకృతమైన నా వెలుగు.

తా. జన్మము లెత్తుటవలన కర్మబంధములు పెంచుకొనుటయే కలుగు ననుకొనరాదు. ఆత్మను గూర్చిన కుతూహలము పుట్టినవాడు చిరకాల మనేక జన్మ లెత్తుచుండును. చతుర్ముఖ బ్రహ్మలోకమైన సత్యము నందుకొనువరకును ఈ జన్మలలో సాధన జరుగుచునే యుండును. నా భక్తుల సాంగత్యము లభించుచునే యుండును. వారి యుపదేశములచే విజ్ఞానమున మెలకువ చెందుచునే యుండును. నా యనుగ్రహమును పొందునట్టి సంకల్పము పుట్టును. పరిజ్ఞానము సహజ గుణమై వికసించును. దానితో సంశయము లన్నియు తీరును. తన్ను వేరుగా గుర్తించుకొను చిహ్నమైన కర్మమయ, భావమయ దేహము తొలగిపోవును. ప్రయోజనములు ఏమియు లేవనియు, దైవానుభూతి యొక్కటే తానుగా నున్నదనియు తెలియును. అప్పుడు మునుల హృదయమున గానము చేయబడుచున్న నా వెలుగు తా నగును.

(హృదయమున గానము చేయబడునది ఓంకారము. దాని యర్థము 'నేను'. దానికి శ్వాస దేహముగా నున్నది. దాని మంత్రము 'సోహం' అనునది. ఈ రెండిటి వెలుగైన తన క్రీడార్థ మేర్పడినవే మనస్సు, ఇంద్రియములు, ప్రాణము, దేహము. వాని యర్థము నాది. ఇన్నిటి యందును అంతర్యామి ప్రత్యక్షమగుటచేత 'నేను – నాది' యను భావములతో గూడిన లింగశరీరము తొలగును.

ప్రయోజనము లన్నియు మనస్సు, దేహము మున్నగు వానియం దేర్పడినవి. వానియందు తాను అంతర్యామి యని తెలిసినపుడు ప్రయోజనములు తొలగిపోవును.)

917. టీక : అణిమాది + అష్టైశ్వర్యములు = అణిమ మొదలగు నెనిమిది ఈశ్వర సంపదలు ; అంతరాయంబులు =

అడ్డంకులు ; విగతసంగుండు=తొలగిన సంగము గలవాడు ; మదీయ చరణ సరోజ స్థిత = నా పాదపద్మములయందు నిలచిన ; లలిత + అంతరంగుండు = సుకుమారమైన హృదయభావముగలవాడు ; అపహసించి = ఎగతాళిచేసి ; నృపాత్మజకు = రాజకుమారికి. (రాజైన మనువు కూతురగు దేవహూతికి.)

తా. అణిమ మొదలగు నైశ్వర్యము లెనిమిదియు మోక్షమునకు విఘ్నములు. వాని యందు మక్కువ లేనివాడు, నా పాదపద్మములయందు నిలబడిన సుకుమారమైన హృదయ భావము గలవాడు నాయం దుండును. కనుక మృత్యుదేవతను పరిహసించి మోక్షము పొందును అని చెప్పి కపిలుడు యోగ సాధన స్వరూపమును, విధానమును వివరింతునని మరల నిట్లు చెప్పెను :

(దైవసాధన చేయువానికి అణిమ, లఘిమ మొదలగు సిద్ధులు లభించును. వానియం దభిలాష లేనివా డీశ్వరు డగును. కనుక సిద్ధు లైశ్వర్యములుగా మారును. అనగా వాని సహజ లక్షణములుగా చోటు చేసికొనును. వానియందు కూడ దృష్టి లేక అంతర్యామినే హృదయ పద్మమున ధ్యానించువాడు మోక్షమును పొందును. అతనికి మృత్యువు లేదని తెలియును. మృత్యువను పదమును విన్నప్పుడెల్ల పరిహాసముగా నుండును.

ఇంతదాక విశేషార్థ మిమిడి యున్నది. అణిమ మొదలగునవి యోగి సాధించుకొనునవి కాక ఈశ్వరుని యందున్న సృష్టి లక్షణములు కూడ. 1. అణిమ యనగా భగవంతుడే అణువులుగా దిగివచ్చుట. 2. మహిమ యనగా లావు, పొడవు మున్నగు లక్షణముల తోడి దేహములుగను, దేహభాగములుగను దిగి వచ్చును. 3. లఘిమ అనగా బరువులేని పంచప్రాణముల లక్షణము. 4. గరిమ యనగా దేహమునకు గల బరువు. 5. ప్రాప్తి యనగా ఒకరినొకరు మిత్రత్వబంధుత్వాదులచే పొందుట, ధనార్జనాదులు చేయుట. 6. ప్రాకామ్య మనగా కోరుట, నెరవేర్చుకొనుట. 7. ఈశ్వరత్వ మనగా అధికారము నెరపుట. సేవకులు, దారపుత్రాదులు తన మాటప్రకారము నడచుకొనుట,

8. వశిత్వ మనగా నితరులను, పరిస్థితులను వశపరచుకొనుట. ఇవి యోగి సాధించునవి కాక ఈశ్వరసృష్టి కొరకై యేర్పడిన సహజ గుణములు. ఇవి బ్రహ్మకు సంక్రమింపగా సృష్టి దిగి వచ్చినది. వీనియందు దృష్టి నుంచక అందలి అంతర్యామియందు భావము నిలిపినవానికి హృదయమున భగవంతుని చరణము నిశ్చల మగును. అట్టివానికి దేహాదులు యుండుట, లేకుండుట లేవుగనుక శాశ్వ తత్త్వముచే మృత్యువును తిరస్కరించుచున్నాడు. )

918. టీక : ధీనిధులు = బుద్ధిబలమునకు స్థానమైనవారు ; విమలంబు = మలినము కానిది ; మత్ + పదము = నా స్థానము.

తా. ఎంతటి బుద్ధిబలము కలవారైనను మనస్సును నిర్మలముగా నిలుపు సాధనను చేయుచుండవలెను. దానికి యోగాభ్యాస మొక్కటే మార్గము. మనస్సు నిర్మలమై యున్నంతకాలము నాయం దుందురు. కనుక యోగాభ్యాసమున నాచరింపవలసిన ధర్మములను వివరింతును.

919. టీక : శాస్త్ర వినిషిద్ధ ధర్మకర్మంబులు = శాస్త్రమున కూడదని చెప్పిన స్వభావమును పుట్టించు పనులు ; అర్థంబు = సంపద ; గ్రామ్యధర్మనివృత్తి = మోటుదనము, ఎడ్డెతనము కల స్వభావమును తొలగించుకొనుట ; రతి = మిక్కిలి ఆసక్తి ; విజనంబు = జనులు లేనిది ; నిర్బాధకంబు = బాధించు వంశములు లేనిది ; హింసారాహిత్యము = హింస లేకుండుట ; అస్తేయము = దొంగబుద్ధి లేకుండుట ; స్వాధ్యాయ పఠనంబు = గొంతెత్తి వేదాది గ్రంథములను పఠించుట ; ఆసన జయంబు = ఆసన మనబడు యోగాంగమున సిద్ధి కలుగుట ; స్థైర్యంబు = నిశ్చలత్వము ; ప్రాణవాయుస్వవశీకరణంబు = శ్వాసయొక్క గమనము తన వశమున నుంచుకొనుట ; ప్రత్యాహారంబు = ఇంద్రియముల నుండి వెలుపలకు ప్రయాణము చేయుచున్న మనస్సును వెనుకకు మరలించుట ; విషయంబులు = ఇంద్రియార్థములు ; ప్రాణ ధారణంబు = ప్రాణమును ధరించుట ; మానస + ఏకాగ్రీకరణంబు= మనస్సు నొక మార్గమును పట్టించుట ; అసత్ + మార్గంబు = చెడ్డమార్గము ; పరిహరించి = తొలగించి ; జితప్రాణుండు =

జయించిన ప్రాణగమనములు గలవాడు; అభ్యస్త = అభ్యసింప బడిన; కుశ + అజినచేల + ఉత్తరాసనంబు = దర్భలచాప, జింకచర్మము, వస్త్రము నొకదానిపై నొకటి పరచిన యాసనము; ఋజుకాయుండు = వంకరలేని దేహముగా కూర్చున్నవాడు; కుంభక రేచక పూరకంబులన్ = శ్వాసను నిలుపుట, విడచుట, పీల్చుట అనువాని గతులతో; కోశశోధనంబు = అన్నమయ, ప్రాణమయాది కోశములను శుద్ధిచేయుట; ప్రతికూలంబు = వ్యతిరేకించిన మార్గము; మయంబునన్ = వశపరచుకొను సాధనతో; ప్రతప్తంబై = మిక్కిలి వేడెక్కినదై; విగత = తొలగిపోయిన; చామీకరంబు = బంగారము; విరంజంబుల = మలినములు లేనిది, రజోగుణము లేనిది; జితమారుతుడు = గాలిని జయించినవాడు; క్రమ్మఱన్ = మరల; పావకునిచేత = అగ్నిహోత్రునిచే; కిల్బిషంబులు = పాపములు; సంసర్గంబులు= అంటిన సంస్కారములు; స్వనాసాగ్రావలోకనంబు = తన ముక్కుయొక్క కొసవైపు చూచుకొనుట.

తా: యోగాభ్యాస విధానము వివరించెదను. 1. మొదట శక్తివంచన లేకుండుట తన ధర్మములను నిర్వర్తించుట నభ్యసింపవలెను. (వృత్తిధర్మములు, ఆశ్రితులను పోషించుట మున్నగునవి.) 2. శాస్త్రమునందు నిషేధింపబడిన మార్గములను అవలంబించు నభిలాషను పుట్టించు పనులు చేయరాదు. 3. దైవికముగా లభించిన సంపదలతో సంతోషము పొందుట నభ్యసింపవలెను. (రానిదానికి బాధపడుట, పట్టుదల పనికిరావు.) 4. మహాభక్తుల పాదపద్మములను పూజించుచుండవలెను. 5. మోటైనవి, ఎడ్డెతనముతోకూడినవి అగు పనులు మానవలెను. (మోటైనవి యనగా భుజించుట, నిద్రించుట, కామప్రవృత్తి మొదలైన చేష్టలలో నితరుల కేవగింపు కలుగునట్లు ప్రవర్తించుట, బలాత్కారాదులు చేయుట, పరుషముగా పలుకుట, బూతులు అశ్లీలములు పలుకుట మున్నగునవి. ఎడ్డెతనమనగా స్నానాదుల యందును, ఆహారాది శుచిత్వమందును లక్ష్యములేకుండుట.) 6. మోక్షధర్మములందు మిక్కిలి యభిలాష నభ్యసింపవలెను. (వైరాగ్యము, శాంతగుణము, భూతదయ మోక్షధర్మములు.)

7. పరిశుద్ధమైన యాహారమును దేహమునకు కావలసినంత మాత్రము భుజింపవలెను. 8. జనసమ్మర్దము లేనిది, ఇబ్బందులు లేనిది అగు ప్రదేశమున నివసింపవలెను. 9. హింసయం దభిలాష యుండరాదు. 10. సత్యవాక్కును, దొంగబుద్ధి లేకుండుటను అభ్యసింపవలెను. 11. డబ్బునుకాని, వస్తుసంపదనుకాని కావలసినంతవరకే స్వీకరించు బుద్ధి నభ్యసింపవలెను. 12. బ్రహ్మచర్యము, తపస్సు, శుచిత్వము, సద్గ్రంథములను గొంతెత్తి చదువుట, దేవు నర్చించుట చేయుచుండవలెను. 13. ప్రయోజనములేని ఊహలుకాని, సంభాషణలుకాని యుండరాదు. 14. స్థిరముగా కదలకుండ కూర్చుండుటలో నదుపాయ మేర్పడ వలెను. 15. శ్వాసయొక్క గతులను వశపరచుకొనవలెను. 16. ఇంద్రియములను వశపరచుకొనుటకై ప్రత్యాహారము నభ్య సింపవలెను (శ్వాసగతియందు, హృదయ స్పందనమునందు మనస్సు నిలిపి దైవముగాస్మరించుటవలన ప్రత్యాహారమలవడును.) 17. ధారణ నభ్యసింపవలెను. (మనస్సును హృదయగతియందు నిశ్చలము చేయవలెను.) 18. దేహమందలి మూలాధారము మొదలగు స్థానములలో నొక్కొక్కదానిని హృదయమున ధ్యానింపవలెను. 19. ప్రాణాయామము నభ్యాసము చేయవలెను. (ప్రాణగతులను సమీకరణము చేయవలెను. దీని నభ్యసించుటకై భగవంతుని యవతారలీలలయందు గల ప్రవర్తనములను ధ్యానింప వలెను. దానితో మనస్సు భగవంతుని యందు లయమగును. దానివలన భగవంతునితో సమానమైన యాకారమును తన యందు నిలుపుకొనుట సిద్ధించును). 20 ఇంకను చేతనైన వ్రతములను, దానములను చేయవలెను. (వానివలన మనస్సులోని దుష్టసంకల్పము తొలగి ప్రాణాది ప్రవృత్తులు తన వశమునకు వచ్చును.)

అటుపైన శుచియైన ప్రదేశము నెన్నుకొని దర్భల చాపపై జింకచర్మము పరచి, దానిపై వస్త్రము పరచి, దానిపై సూటిగా కూర్చుండి శ్వాసను పీల్చుట, నిలుపుట, విడచుట చేయవలెను. దానితో అన్నమయ, ప్రాణమయ కోశములు శుద్ధి యగును. ఈ శ్వాస నొకమారు ఒక ముక్కు రంధ్రముతో పీల్చుచు రెండవ

దానితో విడువవలెను. మరల రెండవదానితో పీల్చుచు మొదటిదానినుండి విడువవలెను. చంచలమైన మనస్సు స్థిరమగును. యమము అనబడు యోగాంగమును తీవ్రముగా నభ్యసింపవలెను. దానివలన వేడి పుట్టి దోషములు భస్మమగును. కరగించిన బంగారము నుండి కల్మషము తొలగినట్లగును. రజోగుణదోషము మాయమగును. ప్రాణగతులపై స్వామిత్వమేర్పడును. మరల మరల ప్రాణాయామము చేయుటవలన వాత పిత్త శ్లేష్మములు అనబడు దోషములు హరించును. ధారణము నభ్యసించుటవలన పాపములు తొలగును. ప్రత్యాహారము నభ్యసించుటవలన పూర్వవాసనలు భస్మమగును. ధ్యానమబ్బుటవలన రాగద్వేషాదు లంటవు. త్రిగుణములు తొలగును. ఈ ధ్యానమును నాసాగ్రము చూచుచు నభ్యసింపవలెను. (నాసాగ్రమనగా ముక్కు చివరిభాగ మని కొందరును, భ్రూమధ్య మని కొందరును చెప్పుదురు. భ్రూమధ్య మనుటయే ఎక్కువమందికి సమ్మతము.)

920. టీక : దళత్ + అరవింద=విచ్చుకొనుచున్న పద్మము ; సుందరపత్ర = అందమైన రేకలు ; రుచిరాక్షున్ = వెలుగుతో కూడిన కన్నులు గలవానిని ; సలలిత= అందమైన ; శ్రీవత్సకలిత వక్షున్ =శ్రీవత్స మనబడు పుట్టుమచ్చతో కూడిన వక్షస్థలము గల వానిని ; నీలనీరదనీల = నల్లని మబ్బువలె నల్లగానున్న ; నీల+ఉత్పల శ్యామున్ = నల్లకలువపువ్వువలె శ్యామవర్ణము కల వానిని ; అలికుల + అలకమాలికా + అభిరామున్ = తుమ్మెదల వంటి ముంగురుల గుంపులు గల వానిని ; కౌస్తుభకలిత = కౌస్తుభముతో కూడిన ; ముక్తాహారయుతకంఠున్ =ముత్యముల హారముతో కూడిన కంఠముగలవానిని, యోగిమానసపంకజ + ఉపకంఠున్ = యోగుల మనస్సు అను పద్మమునకు సమీపమున నున్నవానిని ; సతతప్రసన్న=ఎల్లప్పుడును అనుకూలత చూపుచున్న; సస్మిత = చిరునవ్వుతోగూడిన ; వదనాంభోజున్ = ముఖపద్మము గలవానిని ; సలలిత = సౌందర్యముతోగూడిన ; అనర్ఘ్య = వెలకట్టలేని ; కటక = కడియములు ; కేయూర = బాహుపురులు అనబడు భుజాలంకారములు ; ముద్రికా = ఉంగరములు ;

తులాకోటిభూషున్ = అందెలు భూషణములుగా గలవానిని ; భక్త ప్రపోషున్ = భక్తులను పోషించువానిని ; కింకిణీయుత = మొల నూలితో కూడిన ; మేఖల + ఆకీర్ణ జఘనున్ = నడుము పటకా విస్తరించుకొనిన పిరుదుభాగములు కలవానిని.

తా. నాసాగ్రమునందు ఈ రూపమును ధ్యానింపవలెను : విచ్చుకొనుచున్న పద్మముల పత్రములవంటి కన్నులు, శ్రీవత్సమను పుట్టుమచ్చతో అందమైన వక్షస్థలము, నీలమేఘములతో నల్లకలువలతో సరిపోలిన చామనచాయ, తుమ్మెదల గుంపులవలె వరుస తీర్చిన ముంగురులు, కౌస్తుభమణి ముత్యాలహారములు గలిగి వెలకట్టలేని మణికుండలములు, కిరీటము, హారములు, కంకణములు కడియములు, బాహుపురులు, ఉంగరములు, అందెలు, మొల నూలితో బిగించిన పటకా ధరించి ప్రసన్నమైన చిరునవ్వు మొగమున కోటిసూర్యుల దీప్తితో వెలుగొందుచు యోగుల మనః పద్మములకు సమీపమై యున్న రూపమును ధ్యానింపవలెను.

( ఇన్ని ఆభరణములు మొదలగు వివరములను చెప్పుట యెందుల కనగా నొక్కొక్కదానినే ధ్యానించి మనస్సున స్థిరపరచుకొని రెండవదానిని కలిపి ధ్యానించుచు క్రమముగా మొత్తము వివరములతోడి రూపమును మనస్సున నిల్పు యత్నములో మనస్సు నిశ్చలమగును. )

921, 922. టీక : కంజాత కింజల్క పుంజ = పద్మముల కేసరముల సమూహము ; రంజిత = రంగు గలిగిన ; పీత కౌశేయ వాసున్ = పచ్చని పట్టువస్త్రము ధరించిన వానిని ; జగత్ + నివాసున్ = లోకమే నివాసమైన వానికి, లోకమునకు నివాసమైన వానికి ; శత్రు భీకర = శత్రువులకు భయము కలిగించు ; విహిత = కూడిన ; విగత మోహున్ = తొలగింపబడిన మోహము కల వానికి ; నుతభక్తలోక = స్తుతించు భక్తుల సమూహముయొక్క ; మనోనేత్ర వర్ధిష్ణు = మన స్సును కన్నును విశాలము చేయు వానిని ; లాలిత = బుజ్జగింపబడిన ; సద్గుణ + అలంకరిష్ణున్ = సద్గుణము లే అలంకారములైన శీలముగల వానికి ; వర కుమారక వయః పరిపాకున్ = శ్రేష్ఠమైన లేతవయస్సుకలవానికి ; సుశ్లోకున్ =

చక్కగా కీర్తింపబడిన వానిని ; యశస్ + విహారున్ = కీర్తియందు విహరించువానిని ; సకలలోక నమస్కృత = అన్నిలోకములచే నమస్కరింపబడిన ; చరణ కమలున్ = పాదపద్మములుగల వానిని ; భక్తలోక పరిగ్రహ ప్రకట శీలున్ = భక్తుల గణములపై నను గ్రహమును వ్యక్తముజేయు స్వభావముగల వానిని ; దర్శనీయ = చూడదగినట్టి ; మనోరథదాయిన్ = కోరికల నిచ్చు వానిని ; కీర్తనీయ = పొగడదగిన ; తీర్థయశస్ + మహనీయ మూర్తిన్ = పుణ్యతీర్థమువంటి కీర్తితో వ్యాపించిన వానిని.

తా. మరియు నారాయణు నిట్లు ధ్యానింపవలెను : తమ్మి పూలలోని కేసరములవలె రంగులు గల పచ్చ పట్టును ధరించిన వాడు, శత్రుభయంకరములైన శంఖ చక్రములు, గద, పద్మము ధరించిన నాల్గు బాహువులు గలవాడు, భక్తుల మోహము పోగొట్టువాడు, భక్తవరుల గణములకు మనోనేత్రమును వికసింప చేయువాడు, సద్గుణములచే నలంకరింపబడినవాడు, ఎప్పుడును లేత వయస్సు రూపమున వెలుగొందువాడు, సుందరమైన యాకారము గలవాడు, అన్నిలోకముల నమస్కార మందుకొనిన చరణ కమలములు గలవాడు, భక్తుల ననుగ్రహించు భావప్రకటనము గలవాడు, రూపొందించుకొనిన కోరికల నిచ్చువాడు నగు విష్ణువు నారాధింపవలెను.

923, 924. టీక : వెండియు = మరియు ; అనుపమ = సాటి లేని ; గుణసంపూర్ణునిన్ = గుణములచే నిండైనవానిని ; అనఘు నిన్ = పాప మంటనివానిని ; సుస్థిరునిన్ = చక్కని నిశ్చలుడైన వానిని ; గతునిన్ = గమనస్వరూపము కలవానిని ( నడుచుచున్న వానిని, పోవుచున్నవానిని ) ; ఆసీనున్ = కూర్చుండినవానిని ; శయానుని = పండుకొనినవానిని ; భక్తహృత్ + గుహా + శయనుని = భక్తుల హృదయమను గుహయందు శయనించిన వానిని ; సర్వేశ్వరున్ = సర్వమునకు ఈశ్వరుడు ( ప్రభువు ) అయినవానిని ; అనంతున్ = అంతములేనివానిని ; నుత-సత్ + చరితున్ = స్తోత్రముచేయబడిన సత్ప్రవర్తనలు కలవానిని.

తా : నీవు తలంచిన మంచిగుణముల సంపూర్ణస్వరూపమును ధ్యానింపుము. దానికి సాటి మరియొకటి యుండదు. ఉన్న చో

నీ భావము అసంపూర్ణస్వరూపమును గూర్చి ముచ్చట పడుచున్నదని నీకే తెలిసిపోవును. అంతకన్న సంపూర్ణత యున్న దనిపించినప్పుడు దానినే ధ్యానింపుము. ఇట్లు మరియొకటి సాధ్యము కానంతవరకు ధ్యానింపుము. అపుడున్న ధ్యానమే సాటిలేనివాడు, లేక భగవంతుడు. అట్టిభావము కలవాడు, అందు ధ్యానమున నున్న వాడు భగవంతుడు. వానిని పాప మంటదు. నిలబడిన, కదులుచున్న, కూర్చుండిన, శయనించిన రూపము లన్నిటిని వాడుగా ధ్యానింపుము ( ఇది విష్ణూపాసనము ). వీరందరు చోటులో మెలగుచున్నారు గనుక వీరిలో వ్యక్తమగుచున్న తెలివి చోటున నిశ్చలమై యున్నదని తెలియును. అదియే తమయందు తాను శరీరము రూపమున కదలుచున్నది. కూర్చుండిన శరీరములలో కూర్చుండి, పండుకొనిన శరీరములలో పండుకొని యున్నది. అయి నను దాని కీ స్థితులు లేవు. అందరిలోను నిశ్చలమై యున్నది. ఇట్లు ధ్యానించు భక్తుల హృదయములే గుహలుగా అందు నిశ్చలమై యున్నది.

అందరిలో నీశ్వరుడుగా వెలుగుచున్నది. ఆ రూపముల కున్న పరిమితత్వము దానికి లేదు. మంచివారి గుణములను మెచ్చుకొనువారి హృదయమున ఆ గుణములుగా మేల్కొని మెలగు చున్నది. కనుక ఆ రెండు హృదయములలో నున్న మంచిగుణము లతని వైభవములే. ( ఇది విభూతియోగమున వర్ణింపబడినది. )

( " 1. అది కదలును, అది కదలదు ; అది దూరమున నున్నది, అది దగ్గరగా నున్నది " అను యజుర్వేదమంత్రము ఈశావాస్య మనబడునది. దాని వివరణ మీ పద్యమున నున్నది.

2. సర్వవిషయములను గమనించుచు నింద్రియముల రూప మున మనస్సుగను, ప్రభావితమగుచున్న మనలోని ప్రజ్ఞ అహంకా రము. అందు మనస్సుగా, నింద్రియములుగా, పరిసరములుగా లోనినుండి వెలుపలకు వెలుగుచున్న ప్రజ్ఞ ఈశ్వరుడు, అహంకార మను పొరలోనుండి ఈశ్వరు డనువాడు కిరణ ప్రసారముచే

వెలుపలకు వెలుగుచుండును. " ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశే అర్జున తిష్ఠతి " అను బ్రహ్మవిద్య క్రిందు వివరణ మున్నది.)

925. టీక : విమలంబు = నిర్మలము ; మనస్ + విజ్ఞాన తత్త్వ ప్రబోధ మతిన్ = మనస్సు, విజ్ఞానము అను తత్త్వములను (ఈశ్వరుడుగా) మేలుకొలుపు సంకల్పముతో ; తదీయ = వాని యొక్క ; మూర్తివిభవధ్యానంబు = రూపసంపదను ధ్యానించుట ; చిత్తము = మనస్సు, ఇంద్రియవృత్తులు ; సర్వాంగ విమర్శన క్రియలకున్ = అన్ని అవయవములను విడమరచి చూచు వ్యాపారములకు ; తార్కొల్పి = సమీపించునట్లుచేసి ; ప్రతి+అంగమున్ = ఒక్కొక్క శరీరభాగమే ; సుమహాధ్యానము = మంచి పద్ధతిలో అపరిమితముపై మనస్సు నిలిపి ; శుద్ధాంతరంగంబునన్ = పరిశుద్ధమైన హృదయమున.

తా. మనస్సు విజ్ఞానము మనలో తమ తమ వ్యాపారములలో నుండునుగదా ! వానియందున్న వా డెవడో అతనియందు వానిని నిలుపవలెను. అప్పుడు మనస్సు నిర్మలమై పరిశుద్ధమగును. (అనగా మరియొక వస్తువు లంటని ఒకే మనస్సు సాధ్యమగును.) అప్పుడు మనస్సు, విజ్ఞానము ఉండుట మాని ఈశ్వరుడుగా మేల్కొనును (మనస్సే ఈశ్వరుడుగా తెలియును. మనస్సు అడ్డము వచ్చుట యుండదు. మనస్సును తొలగింపవలెనన్న నితరములగు దుర్బుద్ధు లుండవు.) ఈ ధ్యానము వలన నారాయణుని మూర్తి వైభవము ధ్యానమున నిలుచును. (అనగా మనస్సు, అభిప్రాయములు కరగిపోయి దానికి మూలమగు స్థితియే అంతర్యామిగా నుండును. అప్పుడు అది సాధకునకు సంబంధించిన మనస్సుకాక నారాయణుని అస్తిత్వమగును.) అట్టి స్థితిలో చిత్తము వేరుగా పనిచేయకుండుటకై నారాయణుని స్వరూపమందలి వివిధ భాగములను కల్పించుకొనవలెను. మొదట పాదములు, కాలిగోళ్ళు, మొదలగు వివరములను సృష్టించుకొనవలెను. అవి స్థిరమైన వెనుక చీలమండలు, పిక్కలు మొదలుగా నొక్కొక్కభాగమే శిరస్సుపై నున్న కిరీటము చివరివరకు ధ్యానింపవలెను. హృదయము పరిశుద్ధ మగును. దీనినే మహాధ్యానము అందురు.

926, 927. టీక : హలికులిశ=నాగలి, వజ్రము; అంకుశజలజ= అంకుశము, పద్మము ; ధ్వజచ్ఛత్ర = పతాకము, గొడుగు ; లాలిత= బుజ్జగింపబడిన ; లక్షితములు = గుర్తింపబడినవి ; సలలిత = సౌంద ర్యముతో కూడిన ; నఖచంద్ర = నఖము లను చంద్రకళలు ; చంద్రికా = వెన్నెలలు ; నిర్ధూత = ఎగురగొట్టబడిన ; మానస = మనస్సుయొక్క ; తమఃపటలములు = చీకటితెరలు ; సురుచిర = చక్కని కాంతితో కూడిన ; అంగుష్ఠ నిష్ఠ్యూత = బొటనవ్రేలి నుండి వెదజిమ్మబడుచున్న ; మండిత = అలంకరింపబడిన ; హర జటామండలములు = శివుని జడల చుట్టలు ; సంచిత ధ్యాన = కూర్పుచేయబడిన ధ్యానముచేత ; పారాయణ = శ్రద్ధతో పఠించుటచేత ; భూరి = అధికమైన ; కలుష పర్వత = పాపము లనబడు కొండలకు ; దీప్తకులిశములు = మెఱయుచున్న వజ్రములు ; దాసలోక = భక్తజనుల యొక్క ; మనోరథదాయకములు = కోరికల నిచ్చునవి ; చారు = అందమైన ; యోగిమనఃపద్మ = యోగుల మనస్సు అనబడు పద్మమునందు ; షట్పదములు = తుమ్మెదలు ; తనరిన = విస్తృతిచెందిన ; హరిచరణ + అబ్జములు = విష్ణుని పాదపద్మములు ; నిరుపమ ధ్యానమునన్ = సాటిలేని ధ్యానమున.

తా. విష్ణుని పాదములను మనస్సులో భావించుకొను విధానము చెప్పబడినది. ఆ పాదములందు హలరేఖ, వజ్రము, అంకుశము, పద్మము, పతాకము, ఛత్రము అనబడు శుభ లక్షణము లుండును. అందమైన గోళ్ళు చంద్రకళలవలె నుండి అందలి వెన్నెలలు భక్తుల మనస్సులందలి చీకటులను పారద్రోలును. కాలి బొటనవ్రేలి నుండి పుట్టిన గంగాతీర్థము శివుని జడల నలంకరించు చుండును. ధ్యానము, పారాయణముచేయు జనుల పాప పర్వతములను వజ్రాయుధము వలె బ్రద్దలుకొట్టు మహిమ ఈ పాదముల యందుండును. అవి భక్తుల కోరికలను తీర్చును. యోగుల మనస్సులను పద్మములను తుమ్మెదలవలె నాక్రమించును. ( పాదములు పద్మములవలె నుండి, మనస్సులు తుమ్మెదలుగా వ్రాలుట సామాన్య వర్ణనము. అందు సాధకుని ప్రయత్నము తెలియును. ఇచ్చట పాదముల అనుగ్రహశక్తి వ్యంజితమగును.

కనుకనే ఉపమానోపమేయముల ప్రయోగము మార్పు చేయబడినది.)

928. టీక : కమలజుమాత = బ్రహ్మదేవుని తల్లి; సురనికాయ = దేవతల సమూహము; సముంచిత = చక్కగా నొప్పుచున్న; సేవ్యమాన = సేవింపబడుచున్నది; కమలదళాభ నేత్రములు = పద్మముల రేఖలవంటి కన్నులు; హృత్ + ఈశ్వర భక్తి = తన హృదయమున కధిపతియైన వానియందు భక్తి (జీవుల హృదయములయం దీశ్వరుడుగా నిలిచినవానియందు భక్తి); కమల = లక్ష్మి; నిజ + అంకపీఠమునన్ = తన తొడయే పీఠముగా గొని; ఒత్తు = నొక్కనట్టి; పర + ఈశు = అతీతుడైన ఈశ్వరునియొక్క (పరమగు మోక్షమున కధిపతియైన); జాను యుగ్మము = మోకాళ్లజంట; హృదయ + అరవిందమునన్ = హృదయపద్మమున.

తా : బ్రహ్మదేవునకు తల్లియై సమస్తదేవతా పరివారముచే సేవింపబడుచున్న లక్ష్మీదేవి తన పద్మదళముల వంటి కన్నులతో హృదయమున కీశ్వరుడైన విష్ణుని యందు భక్తికలిగి, అతని పాదము లొత్తుచున్న దృశ్యమును కుతూహలముతో నిలిపి భజింపవలెను.

929. టీక : చారు = అందమైన; విహంగవల్లభు = పక్షుల రాజైన గరుత్మంతునియొక్క; విరాజమాన = వెలుగొందుచున్న; సుశ్రీరుచిన్ = చక్కని సంపద లొసగు కాంతులతో; అతసీ కుసుమద్యుతిన్ = నల్లవిసిపువ్వు కాంతితో; పంకేరుహనాభు = నాభి యందు పద్మముకలవానియొక్క; ఊరువులు = తొడలు; అకిల్బిషభక్తిన్ = కల్మషమంటని భక్తితో; మానస + అంభోరుహము = మనస్సను పద్మము; అంగనామణీ = స్త్రీలలో శ్రేష్ఠమైనదానా!

తా : గరుత్మంతుని భుజములమీాద వెలుగొందుచున్న సంపన్నత గలిగి నల్లవిసి పువ్వుల రంగుగల విష్ణుమూర్తి తొడలను నిర్మల మనస్సుతో ధ్యానము చేయువలెను.

930. టీక : పరిలంబిత = చుట్టును వ్రేలాడుచున్న; మృదుపీతాంబర = మెత్తని పట్టువస్త్రము; కాంచీగుణ =

మొలనూలు త్రాడు ; నినాదభరితంబు = శబ్దములతో నిండినది ; నితంబము = పిరుదల భాగము ; తద్దయున్ = మిక్కిలి.

తా : చుట్టును పొరలుగా చుట్టుకొని వ్రేలాడుచున్న మెత్తని పీతాంబరము, దానిపైన కట్టబడిన మొలనూలు, దాని చిరుగంటల శబ్దములు కలిగియున్న విష్ణుమూర్తి జఘన భాగమును ప్రేమతో ధ్యానింపవలెను.

931. టీక : భువన + ఆధారత్వంబు=లోకముల కాధారమైనది ; విధిజననహేతుభూతంబు = బ్రహ్మ పుట్టుకకు కారణమైనది ; ఆ + వనజాతము = ఆ పద్మము ; నాభీసరస్సు=నాభి యను కోనేరు.

తా. సర్వలోకములకును ఆధారమగు తగిన విధమున కూర్పుచెంది బ్రహ్మపుట్టుకకు కారణమైన పద్మము మొలుచునట్టి కోనేరువంటి ఆ విష్ణువు నాభిని ధ్యానింపవలెను.

932. టీక : దివ్యమరకతరత్న = మహిమాన్వితములైన మచ్చలు మున్నగు రత్నములచేత ; సందీప్త = చక్కగా వెలుగుచున్న; లలితకుచములను = అందమైన రొమ్ములను ; మౌక్తికావళి రుచులన్ = ముత్యాలహారముల కాంతులతో; తనరి = విస్తారమై ; ఇందిరా దేవి సదనము = లక్ష్మీదేవి నివాసము ; ఎసకమెసఁగు = ఇంపారునట్టి ; వక్షము = ఛాతి.

తా. దివ్యకాంతులుగల గరుడపచ్చలు, రత్నములు, మున్నగు నగలతోను, ముత్యాలహారములతోను మెఱసిపోవుచున్న వక్షస్థలమును లక్ష్మీదేవి నివాసముగా భావించి ఆత్మలో ధ్యానము చేయవలెను. (వక్షమును ఆత్మలో ధ్యానముచేయుట అనగా అది హృదయమునకు స్థానము కనుక హృదయమునందు ధ్యానము చేయవలెనని యర్థము.)

933. టీక : నిరతంబున్ = ఎల్లప్పుడు ; సజ్జన=మంచివారి యొక్క, మనోనేత్ర = మనస్సును కంటికి ; అభిరామ + ఏక = అద్వితీయమైన సౌందర్యముగల ; సుస్థిర = అచంచలమైన ; దివ్యప్రభ = దేవుని కాంతి ; రుచిశ్లిష్టంబు = కాంతుల అల్లికగలది ; వర యోగీశ్వర ; మహనీయులైన యోగీశ్వరులచేత ; వంద్యమానుఁడు = నమస్కరింపబడుచున్నవాడు ; సర్వస్వామి = అందరికిని

ప్రభువు ; లక్ష్మీశు కంధరము = లక్ష్మీపతియొక్క మెడ ; కదియించి = నొక్కిపట్టి ; తత్ + గుణగణ ధ్యానము = అతని గుణముల సమూహములను ధ్యానించుట.

తా. నిత్యము భజించునట్టి సజ్జనుల మనస్సను నేత్రమునకు అద్వితీయమై, స్థిరమైన సౌందర్యకాంతులు అల్లికలుగా గోచరించునట్టి కౌస్తుభమణిచే నలంకరింపబడిన విష్ణుమూర్తి కంఠ భాగము మహాయోగులచే నమస్కరింపబడుచుండును. అట్టి దృశ్యమును నిశ్చలముగా నిలిపి, ధ్యానము చేయవలెను.

934. టీక : ఘన = గొప్పదియైన ; మందరగిరి పరివర్తన= మందరమను పర్వతము గిరగిర తిరుగుట ; నికష + ఉజ్జ్వల = ఒరపిడిచే మెఱుగుపెట్టబడిన ; కనకరత్న + అంగదములు = బంగారమున రత్నములు తాపిన నగలు ; తనరారన్ = విస్తృతి చెందగా ; బాహురేఖలను = బాహువులను, కొమ్మలను.

తా. కూర్మావతారమున విష్ణుమూర్తి పైన మందర పర్వతము గిర గిర తిరిగెను. దాని రాపిడికి మెఱుగు పెట్టబడినట్లు వెలుగుచున్న రతనాల బంగారు నగలతో కూడిన చతుర్బాహువులు లోకపాలకులకు అభయమిచ్చుచున్నట్లున్నవి. అట్టి దృశ్యమును ధ్యానింపవలెను.

935. టీక : విమతజన + అసహ్యంబులు = శత్రువులకు సహింపరానివి ; సహస్ర + అరంబులు = వేయి అంచులు ; సరసిజ + ఉదర = పద్మనాభుడు ; కరసరోరుహంబు = హస్తమను పద్మము ; రాజహంస రుచిరంబు = రాజహంసవలె వెలుగునది ; అరాతిభట = శత్రువీరుల యొక్క ; శోణిత కర్దమము = రక్తమను బురదచేత ; లిప్త + అంగంబు = పూయబడిన దేహము కలది ; భగవత్ + ప్రీతికారిణి = భగవంతునకు ప్రీతిని కలిగించునది ; కౌమోదకి = విష్ణుని గద ; బంధురసుగంధ = నిండిన సువాసన ; గంధ + అనుబంధ = వాసనతో సంబంధము గల ; మంథర = చిక్కనైన ; గంధవహ + ఆహూయమాన = వాయువుచే పిలువబడుచున్న ; పుష్పంధయ = తుమ్మెద ; ఝంకారనినద విరాజి

తంబు = ఝుమ్మను శబ్దములతో వెలుగొందునది ; జీవతత్త్వంబు = జీవించియున్న నిర్మాణము కలది ( జీవులకు నిర్మాణమైనది ); వెండియు = మఱియును ; అంగీకరించు =అంగముగా నేర్పడుచున్న; అనురూపంబు = తగిన రూపము గలది ; మణి నిచయ మండిత = మణుల గుంపులచే నలంకరింపబడి ; ముకుర + ఉపమాన = అద్దముతో సాటియైన ; గండ మండలంబు = చెక్కిళ్ళ గుండ్రని భాగము ; సంతత శ్రీనివాస = ఎల్లప్పుడును లక్ష్మీదేవి నివసించు ; లోచన పంకజ కలితంబు = నేత్ర పద్మములతో కూడినది ; లాలిత = బుజ్జగింపబడిన ; భ్రూలతాజుష్టంబు = పూల తీగలవంటి ఒంపులు తిరిగిన కనుబొమలచే నిండినది ; మధుకర సమాన రుచి = తుమ్మెదలవంటి కాంతి ; చికురవిరాజితంబు = ముంగురులచే విలసిల్లునది ; నెగడు = ప్రసిద్ధికెక్కిన ; పాణిపంకేరుహంబులన్ = హస్త పద్మములను.

తా. అట్లే శత్రువులు నిలువజాలని వాడిదనము గల వేయి అంచులతో భయంకరమైన సుదర్శన చక్రమును ధ్యానింపవలెను. హంసవలె విష్ణుని చేతియందున్న పాంచజన్య మను శంఖమును తలపవలెను. శత్రువుల నెత్తుటి బురద పూయబడియున్న కౌమోదకి యను గదను భావింపవలెను. గుప్పుమని సుగంధములు వెదజల్లుచు గాలిలో తుమ్మెదలను పిలిచినట్లు ఆకర్షించుచున్న వైజయంతి యను వనమాలికను తలపవలెను. జీవుల హృదయము లందు జీవతత్త్వముగా వెలుగొందునట్టిది విష్ణుని వక్షమున వెలుగు కౌస్తుభము. దానిని ప్రత్యేకముగా ధ్యానింపవలెను. ( అనగా నెవని హృదయమందు వాడు ధ్యానింపవలెను. ఎచటనో విష్ణుని హృదయమున నున్నట్లు ధ్యానించినచో తన కేమియు లాభము లేదు. ) మరియు భక్తరక్షణము నంగీకరించుచున్నట్లు చెవుల యందు కదలాడు మకరకుండలముల కాంతులు బుగ్గలపై ప్రతిబింబించుట నభ్యర్థింపవలెను. లక్ష్మీదేవికి నిత్యనివాస స్థానములైన కన్నులను, కన్నుల కలంకారమైన చక్కని నిండైన కనుబొమ్మలను తలపవలెను. తుమ్మెదల గుంపులవంటి ముంగురు లతో ముద్దారునట్టి ముఖకమలమును ధ్యానింపవలెను. శరణా గతుల కభయమిచ్చుచున్న అతని హస్తములను భావింపవలెను.

936. టీక : గురుఘోరరూపకము = మిక్కిలి భయంకర మైన రూపము కలది ; పరఁగెడు=ప్రసిద్ధికెక్కిన ; తాపత్రయంబు= మూడు విధములైన తాపములు ( అధ్యాత్మము ; అధిదైవము, అధిభూతము అను కారణములకు చెందిన బాధలు ), విస్ఫష్టములు= చక్కగా విడువబడినవి ; కరుణ + ఆలోకములన్ = దయతో కూడిన చూపులను.

తా. మహాభయంకరరూపము దాల్చిన తాపత్రయమును శమింపజేయుటకు శ్రీహరిచే ప్రసారితములైన కరుణాకటాక్ష వీక్షణములను ధ్యానింపవలెను.

937. టీక : ఘనరుచి = గొప్పకాంతి కలది, మేఘముల కాంతి కలది ; ఉనిచి = ఉంచి ; సౌజన్యనిధి = మంచితనమునకు నిధివంటిదానా !

తా. మేఘములనుండి మెఱుపులు వెలువడుచున్నట్లు చక్కని కాంతులతోడి మందస్మితము చేయుచున్న విష్ణుని శోభను మనస్సున ధ్యానము చేయుట యోగుల కర్తవ్యము.

938. టీక : నతశిరులు = తలలు వంచినవారు (నమస్కరించినవారు ) ; శోకబాష్ప + అంబుజలధి = దుఃఖపు కన్నీటి సముద్రము ; సంశోషకము = చక్కగా శుష్కింపజేయునది ; అతి + ఉదారతమము = మిక్కిలి ఔదార్యముతో నిండినది ; హరిహాసము = విష్ణుని నవ్వు.

తా. నిమ్రతో ననుసరించునట్టి జనుల దుఃఖబాష్పముల సముద్రమును శుష్కింపజేయు నౌదార్యతతో కూడిన విష్ణుమూర్తి హాసమును ఆసక్తితో స్మరింపవలెను.

939. టీక : మకరకేతనునకు = మన్మథునకు ; మోహనంబు = మోహముకల్గించునది ; స్వకీయ = తనయొక్క ; భ్రూమండలంబు = కనుబొమ్మల ఒంపులతోడి భాగము ; రచితంబు = కల్పింపబడినది; మునిమనఃకుహర=మునుల మనస్సులను గుహలకు; సమ్మోదమానుడు = సంతోషపరచువాడు ; నవపల్లవ + అధర కాంతి = క్రొత్త చిగురుటాకు వంటి క్రిందిపెదవి కాంతి ; సంచిత= కూర్చబడిన.

తా. మహామునులకును, మన్మథునకును కూడ మోహము పుట్టించునట్టిది విష్ణుని మాయావిలాసము. దానిచే నిర్మింపబడి నట్లున్న విష్ణుని కనుబొమల సౌందర్యమును ధ్యానింపవలెను. మునుల మనస్సులకు సంతోషము కలిగించు మందహాసమును భావింపవలెను. చిగురుటాకుల నడుమ మల్లెమొగ్గలు కులుకు చున్నట్లు సొంపు గూర్చు నతని పెదవినుండి తొంగిచూచు పలు వరుసను మందస్మితము సమయమున భావనచేయవలెను. ఇట్లొక్క కళనే వేరువేరుగా తన ధ్యానమునకు స్థానముగా స్థిరపరచుకొని, అన్నిటిని ఒకేరూపుగా కూర్పుచేసికొనుటలో మనస్సు నిర్మల మగును అని పలికి కొంచెమాగి కపిలుడు తల్లితో మరల నిట్లనెను :

940. టీక : ప్రతిలబ్ధభావసంపన్నుఁడు = ప్రతిఫలముగా లభించిన భావసంపదకలవాఁడు ; చిరతర సద్భక్తి = చాలకాలము అభ్యసింపబడిన నిరంతర భక్తిభావన : ప్రవృద్ధంబు = మిక్కిలి వృద్ధిపొందినది ; అతిమోదము = పట్టరాని సంతోషము ; పులకిత శరీరుఁడు =పులకలుదేరిన శరీరము కలవాఁడు ; మహా+ఉత్కంఠన్ = మిక్కిలి ఆతురతతో ; జడిగొనన్ = వర్షింపగా ; పరితోష జలధిన్ = సంతోష సముద్రమున ; భవగుణ గ్రాహకము = సంసార గుణములకు మొసలి వంటిది ; పరంజ్యోతి = అన్నిటిని మించిన వెలుగు ; నియోగించి = నియమించి ; అనగవర్తనుఁడు = పుణ్య ప్రవర్తనము కలవాఁడు.

తా. ఈవిధముగా సర్వేశ్వరునియందే తన భావములను నిహితముచేసి, దానికి ప్రతిఫలముగా తాను పొందిన భావసంపదను మరల వానికే నర్పించుచుండవలెను. ఇట్లు చాలకాలము చేయగా నిజమైన భక్తి యుదయించును. అది మహాసంతోషరూపము ధరించి శరీరము పులకరించును. కన్నులలో ఆనందబాష్పములు వెలువడును. సంతోష సముద్రమున మునిగి జీవించును. భగవత్స్వ రూపము అగును. సంసారగుణము లన్నిటిని అదియే పట్టి మొసలివలె హరించును. ఈవిధమైన నా సంబంధము ననుకరించుట సరియైన ధ్యానము అనబడును. అప్పుడు అన్నిటికన్న పరమైన జ్యోతి అనుభూతమగును. మనస్సును దానియం దర్పింప వలెను. మోక్షము కోరువాడు చేయవలసిన పద్ధతి ఇది.

941. టీక : అపేక్షించు = కోరుకొను ; విముక్తంబు = విడిచి పెట్టబడినది ; భగవత్ + వ్యతిరిక్త + ఆశ్రయంబు = భగవంతునకు వ్యతిరేకమైన ఆశ్రయము కలది ; విషయ + అనంతరశూన్యంబు = అటుపైన మరియొక లక్ష్యము లేనిది ; నిర్వాణపదంబు = మోక్షస్థితి.

తా. కనుక ముక్తినిగోరు మహనీయుని చిత్తము భగవంతున కితరమైన లక్ష్యమునందు నిలువరాదు. భగవంతునికన్న మరియొక భావము మనస్సున శూన్యము కావలెను. ఈ స్థితి కల్గుటయే నిజమైన వైరాగ్యము. అది పొందుటవలన జీవుడు అనన్యస్థితి పొందును (అన్యములేని స్థితి). తన శరీరము మొదలగు భావములయందు గూడ వేరు భావన యుండరాదు. (అది దేవుని శరీరముగనే మనస్సు స్థిరపడవలెను. తన మనస్సు దేవుని మనస్సుగనే స్థిరపడవలెను.) పెద్ద వెలుగుమీద చిన్న వెలుగు పడినపుడు ఆ చిన్న వెలుగున కస్తిత్వముండదు. అట్టి స్థితిని పొందిన వాడే మోక్షము పొందినవాడు.

942. టీక : చరమము=చివరిది ; అన్యవిషయ నివృత్తము= ఇతర లక్ష్యములనుండి వెడమొగమైనది ; చిత్తవృత్తి + ఆదులు = చిత్తము వర్తించుట మొదలైనవి ; ఆత్మీయము = తనది, ఆత్మది ; సునిష్ఠుఁడు = మంచి నిష్ఠ కలవాడు ; అనయంబు = ఎల్లప్పుడు ; సాక్షాత్కృత + ఆత్మతత్త్వము = ఎదుట గోచరించిన తన అంతర్యామిత్వము ; జీవన్ముక్తుఁడు = జీవించియుండగనే ముక్తి చెందినవాడు.

తా. జీవుడు తన గమనికకు చిట్టచివరి లక్ష్యమునే భావించుచుండవలెను. అపుడు ఇతర విషయములనుండి మనస్సు విముఖమగును. చిత్తము యొక్క వృత్తులన్నియు భగవంతుని అంతర్యామిత్వముతో నిండును. తన గొప్పదనము అంతర్యామి గొప్పదనముగా తెలియును. దానియందు నిశ్చలత్వము సిద్ధించును. సుఖదుఃఖములు వచ్చుచు పోవుచుండగా నవి అహంకార లక్షణములని లక్ష్యపెట్టక వానియందుకూడ అంతర్యామినే చూచును. అపుడు ఆత్మతత్త్వము సాక్షాత్కరించును. వానినే జీవన్ముక్తుడని పెద్దలు

చెప్పుదురు. తన శరీరము నిలుచున్నది, కూర్చున్నది, తిరుగు చున్నది అను భేదము లుండక తానే నిండి యుండును.

943. టీక : మదిరాపానంబు = మద్యము త్రాగుట ; పరిధానంబు = కట్టుకొనినది ; అంబరంబు = వస్త్రము ; నశ్వరంబు = నశించునట్టిది ; ఉపేక్షించు=లక్ష్యముచేయడు; స్వాప్నిక శరీరంబు= కలలో గనుపించు దేహము ; యావత్ + కర్మఫల + అనుభవ పర్యంతంబు = కర్మఫలము లనుభవించుట పూర్తియగు వరకు ; పుత్ర దార సమేతంబు = బిడ్డలు, భార్య మున్నగు వానితో కూడినది ; ప్రపంచంబు = పంచభూతముల, పంచేంద్రియముల సృష్టి.

తా. మద్యము త్రాగి యొడలు తెలియనివాడు తన దేహముపై వస్త్రమున్నదో లేదో చూచుకొనక ప్రవర్తించును. మోక్షస్థితిలోనున్నవాడు తనకు దేహమున్నదో లేదో జ్ఞప్తి యుండక ప్రవర్తించును. ( దేహ వాంఛలను తన వాంఛలుగా భ్రాంతి చెందడు ) తన శరీరము దైవ శరీరమని తెలియును. కనుక దాని యస్తిత్వము దైవాధీనమని గ్రహించును. అది యెట్లును నశించునని తెలియును గనుక దానిపై దృష్టి యుండదు. అంతర్యామియగు తన తత్త్వమున నిశ్చలత్వము చెందియుండుటచే దేహము వేరుగా కనుపించదు.

కలలో కనిపించిన దేహము కల పూర్తియగువరకు కనుపించుచునే యుండును. అట్లే తన దేహము పూర్వకర్మ ఫలముల ననుభవించుట పూర్తియగువరకు దాని పని యది చేసికొనుచుండునని గ్రహించును. కలలో కనుపించిన జనులతో కలలోని శరీరమున వ్యవహరించుచున్నట్లు దార పుత్రాదులతో వ్యవహరించుచు కర్తవ్యమును స్వప్నమువలె నిర్వర్తించును. అది పూర్తియైన వెనుక కలనుండి మేలుకొనినవాడు ఎంత సులభముగా కలలోని పాత్రల నుండి విముక్తుడగునో అట్లే శరీరము విడుచు సమయమునకు దార పుత్రాదులతోడి సంబంధమును తన్నంటక విడుచును.

944. టీక : సుత దార మిత్ర + అనుజులు = కొడుకులు, భార్య, మిత్రులు, తమ్ములు ; మర్త్యుండు = మృత్యువుకలవాడు ;

( భౌతిక దేహము ధరించినవాడు ) ; భిన్నుడై = ఎదురుగా నున్న వాడై ; విస్ఫులింగ + ఉన్ముఖ విపుల ధూమములు = నిప్పుకణిక, కొరవి, పొగ ; హవ్యవాహనుడు = అగ్నిహోత్రుడు ; భూత + ఇంద్రియ + అంతఃకరణంబులన్ = పంచభూతములు, ఇంద్రియ ములు, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము ; ప్రకృతి రూప బ్రహ్మమునకు = ప్రకృతి రూపము గనుపించు దేవునకు ; పృథగ్భావము = వేరైనది.

**తా.** ప్రకృతి రూపమున నున్నది గూడ పరబ్రహ్మమే. అయినను అది ప్రకృతిరూపముకన్న వేరుగా నుండును గనుక ప్రకృతిని చూచుచున్నదై బ్రహ్మ మనబడును. సమస్త సృష్టిని తనయందు, తన్ను సమస్త సృష్టియందును చూచుచుండుట జరుగుచున్నది గనుక చూచుట యనగా తనకన్న వేరుగా కన్పించుట గనుక పరబ్రహ్మమునకు ప్రకృతియందలి పరబ్రహ్మము నకు ఈ చిన్న భేదము భాసించుచుండును. అది ఎట్టిదనగా నొక మండుచున్న కొరవియందు కొరవి వేరు ; నిప్పు కణిక వేరు ; పొగ వేరు ; వానియందున్నను అగ్నిహోత్రుడు వేరు ; కలలో భార్య, బిడ్డలు, తమ్ములు, మిగిలిన వ్యక్తులు కనిపించుచున్నను, అందరును తన మనస్సుచే చేయబడిన అంతర్యామిత్వము రూపములై యున్నను తాను చూచువాడుగా కలలోకూడ వేరుగా భాసించును. అట్లే జీవుడు తన భార్యా బిడ్డలు మున్నగువారికన్న వేరుగా సంబంధియై వర్తించును. దేహమందు అన్ని భాగములయందును జీవము మెలగుచున్నను జీవుడు దేహముకన్న వేరుగా దేహమున నుండును. అట్లే పంచభూతములు, ఇంద్రియములు, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అనువాని యందు జీవుడుగా నున్నను బ్రహ్మము వేరుభావమున నుండును. ఈ సత్యము నిశ్చల సాధకునకు బోధపడును.

945, 946. టీక : వెండియు = మరియు ; భూతావళి = జీవుల సమూహము ; తత్ + ఆత్మగత్వము = అదే తానుగా నుండుట ; ఆత్మీయ = తన యొక్క ; ఘనతర + ఉపాదానములు= గొప్పవియైన కూర్పులు ; ఇమ్ముల = కౌతూహలముతో ; ప్రకృతి గతుడు = ప్రకృతి యందున్నవాడు ; దేవ తిర్యక్ + మనుష్య =

దేవతలు, జంతువులు, నరులు ; స్థావర + ఆది = స్థావరములు మొదలగునవి ; వివిధ యోనులను = అనేక గర్భము లందు ; నిజగుణ వైషమ్యము = తన గుణముల వేరుదనము ; పేర్చి = కూర్చుకొని.

తా. మోక్షస్థితి చెందినవాడు మరియొక వస్తువును భావింపడు గనుక జీవులయందు తా నాత్మగా నిలబడి చూచు చుండును. కుండ చేయుటకు మట్టి ఎట్లాధారమో అట్లే ఈ సృష్టిలోని ప్రకృతి రూపములకు నాధారముగా నున్న తన్ను దర్శించు నిశ్చలత్వమున నుండును. అతని దివ్యజ్యోతి ఒక్కటియే అయ్యును బహుభావములతో తోచుచుండును. ( చెట్టు ఒక్కటియే అయినను కొమ్మలు, ఆకులు, పువ్వులు, పిందెలు మున్నగువానితో నున్నట్లు ) ప్రకృతిగతుడైన సర్వాత్మ ఒక్కొక్క గర్భము కల్పించి, అందు తాను దేవతలుగను, జంతువులుగను, నరులుగను, వృక్షాదులుగను వివిధరూపములతో పుట్టుచుండును. ఒక్కొక్క దానియందు మిగిలిన వానికన్న వేరైన గుణములు గలిగి వర్తించుచుండును. ఈ భేదము దేహ సంబంధమైనది.

947. టీక : సత్ + అసత్ + ఆత్మకము = ఉన్న రూపము, లేని రూపము నగు ఆత్మ ( ఉన్న రూపము సర్వాంతర్యామి, లేని రూపము ఒకరికొకరు కల్పించుకొను చుట్టరికములు, సంపదల విలువలు మున్నగునవి ) ; దుర్విభావ్యము = భావించుటకు కష్టమైనది ; స్వకీయము = తనది ; భవ్యస్ఫూర్తిన్ = శుభమైన వెలుగుతో.

తా. అంతర్యామియైన ఆత్మ అస్తిత్వముగల రూపముగను, లేని రూపములుగను వ్యక్తమగు చుండును గనుక భావించుటకు మిక్కిలి కష్టమై యుండును. తన ప్రకృతి యిట్లు వర్తించు స్వభావము కలిగియున్నదని తెలిసి సాధకుడు దానిని లక్ష్యపెట్టక శుభమైన వెలుగును పొందును.

948. టీక : మహత్ + ఆది = మహత్తు మొదలగునవి ; పరస్పర విలక్షణంబులు = ఒకదానితో నొకటి వేరైన లక్షణములు; సాంఖ్యంబు = జ్ఞానయోగము ; సర్వలోక విరక్తుండు = అన్ని

లోకములయందును వైరాగ్యము చెందినవాడు ; ప్రాణిలోకంబు = జీవులున్న లోకము ; వరాపరుండు = వరుడు, అపరుడు ( ఉత్తముడైన పరమాత్మ, అధముడైన ప్రకృతిబద్ధుడు ) ; మిథ్యాభూతంబు = అసత్యమైనది ; ఆత్మాభిమానంబు= తాననునాదరము ; ఆసక్తంబు ఎక్కువ సంబంధము గలది ; విభ్రాంతుండు = వివిధభ్రాంతులు కలవాడు ; చిరకాల ప్రసుప్తుండు = చాల కాలము నిద్రించిన వాడు.

తా. ఇట్లు తత్త్వము తెలిసిన వాడాత్మస్వరూపుడై నిజ స్వరూపమున వర్తించు" నని కపిలుడు చెప్పెను. విని దేవహూతి యిట్లనెను : "మహాత్మా ! మహత్తు మొదలగు సృష్టితత్త్వముల నెఱిగించితివి. ప్రకృతి పురుషుల లక్షణములను తెలిపితివి. ఒక్కొక్కటి మిగిలిన వానితో నెట్లు భేదము కలిగి యుండునో వివరించితివి. అన్నిటిలోని ఏకతత్త్వమునుగూడ నిరూపించితివి. ఇదే విధముగా సాంఖ్యమునందు నిరూపింపబడిన జ్ఞానముతో భక్తి యోగము నభ్యసించుట వివరించితివి. ఎన్ని చెప్పినను భక్తి యోగమే మోక్షమునకు కారణము. దానివలన సర్వలోకముల నుండి జీవుడు విరక్తుడగునట్టి విధానము వివరింపుము. జీవులకు సంసారము అనేకరూపములలో నుండును. అన్నిరూపములు నీవే. కాలముయొక్క స్వరూపము గూడ నీవే. అట్టి నీ కాల స్వరూపమునకు భయపడి జనులు పుణ్యకర్మలు చేయుచుందురు. (వయస్సు మించుచున్నదని త్వరపడి చదువుకొనుట, పరోప కారాదులు చేయుట కొందరు చేయుచుందురు. వారు వయస్సు గడచుచున్న రూపమున భగవంతుని చూచి భయపడి పుణ్యకర్మలు చేయుచున్నారు. ) ఒక్కొక్కడు దేహమే తాననుకొని మోహపడి దానియందభిమానము పెంచుకొనును. దానితో కర్మలయందాసక్తి పుట్టును. అనేక భ్రాంతులలో చిక్కుకొనును. సంసారస్వరూపమైన అజ్ఞానపు చీకటిలో చిరకాలము నిద్రించు చుండును. అట్టి జీవుని మేల్కొల్పుటకు నీవు యోగసూర్యుడవై ఉదయించితివి. కనుక నాకీ యంశములనుగూడ వివరింపుము." అని ప్రశ్నింపగా కపిలు డిట్లనెను :

949. టీక : ఫల సంకల్పభేదము = ఫలములు సంకల్పించుటలో భేదము.

తా. తల్లీ! వినుము. భక్తి నభ్యాసము చేయువారిలో తాము సంకల్పించు విధములు వేరు వేరుగా నుండును. వానిని బట్టి భక్తిసాధనలు పలువిధములుగా భాసించును.

950. తా. వానిని స్థూలముగా వివరింతును. భక్తిగూడ నుపాసించువాని యందలి ప్రధాన గుణము కారణముగా తామసిక భక్తి, రాజసిక భక్తి, సాత్త్విక భక్తి యని మూడు విధములుగ నుండును.

951. టీక : సతతహింస = ఎల్లప్పుడును హింసచేయుట ; అతిదంభ = మిక్కిలి కపటాడంబరము ; మాత్సర్యరోషతమము లను = మత్సరత్వము, రోషము, అజ్ఞానము ; భేదదర్శి = భేదములను చూచునది.

తా. ఎవనిభక్తియందు నిరంతర హింస, ఆడంబరము, ఓర్వలేనితనము, రోషము, అజ్ఞానము కలిగియుండునో, ఎవడు భేదములు చూచుచుండునో వాని భక్తి నన్నుద్దేశించినదే అయినను తామసము.

( దేవునకు జంతువులను బలి యిచ్చుట, నరబలి మున్నగునవి హింసామార్గము. అట్లే పాపాత్ములను చంపుట, ఆహారాదుల నొసగక బాధపెట్టి శిక్షించుచుంటి ననుకొనుట. అట్లే శుష్కోపవాసములు మున్నగు మార్గముల చేతను, దేవుని ఎదుట త్రాళ్లచే మోదుకొనుట, కత్తులు, సూదులు గ్రుచ్చుకొనుట మున్నగు పద్ధతులలో తమ దేహములను హింసించుట. దంభ మనగా ఆరాధించుటలో మహావైభవము కావలెనని కోరుట, ఎంత వ్యయమైనదో దానినిబట్టి భక్తికి విలువగట్టుట మొదలగునవి. మాత్సర్య మనగా నింకొక భక్తుడు మనకన్న భక్తితో కొలుచు చున్నాడని తెలిసి మండిపడుట. రోష మనగా నొక గురువు మరియొక గురువు మార్గమును ద్వేషించుట, ఒకనిశిష్యులు మిగిలినగురువు కన్న తమ గురువుగొప్పవా డనుకొనుట మున్నగు విధములుగా నుండును. అట్లే తన మతమునకు సంబంధింపని వారికి ఉద్యో

గాదులను లభింపకుండ జేయుట మున్నగునవి. భేదదర్శి యనగా అద్వైతమునకు, విశిష్టాద్వైతమునకు గల భేదమెట్టిదో నిరూపించి ఖండన మండనము చేయుట. వైష్ణవులు శివాలయమునకు, శైవులు విష్ణ్వాలయమునకు పోకుండుట, క్రైస్తవులు మిగిలినవారిని పాపులుగా వేరుచేసి చూచుట మున్నగునవి. వీనికి కారణము దైవ భక్తియే అయినను తామసగుణముచే కలుషితమై యుండును.)

952. టీక. ఘనవిషయ ప్రావీణ్యము = గొప్ప ఇంద్రియార్థములయందు నిపుణత ; యశము = కీర్తి ; అర్థిన్ = కోరికతో ; సౌజన్యనిధి = సుజనత్వమునకు నివాసమైనదానా !

తా. ఇంద్రియార్థముల ప్రావీణ్యముతో పూజించుట, ఐశ్వర్యము, కీర్తి మొదలైనవానిని కోరి పూజించుట రాజసభక్తి యనబడును.

(ఇంద్రియార్థముల ప్రావీణ్యము అనగా పూజార్చనలయందు మిక్కిలి సుగంధ ద్రవ్యములు, రుచికరములైన భోజనాదుల నైవేద్యము, చాల ఖరీదు గల కాషాయాంబరాదులు, బంగారు పొన్ను తాపి చేయించిన యోగదండము, భక్తికై మధుర సంగీతము, పూజాప్రదేశమునకై లక్షలు వెచ్చించుట, ధ్యానాసనాదులకు మెత్తని సోఫాలు, చాల నజరైన పులిచర్మము, లేడి చర్మము, ధావళీలు, బంగారుతీగచుట్టిన రుద్రాక్షలు, తులసి పూసలు, దేవుని బంగారువిగ్రహములు మున్నగు సాధనసంపత్తి యెడల నెక్కువ యాదరము చూపుట. రాగిపంచపాత్రకన్న వెండిపంచపాత్ర మంచిదని పట్టుపట్టుట మొదలైనవి. ఐశ్వర్య యశసాదు లనగా వాణిజ్యమున నెంత లాభమువచ్చిన అంత వైభవముగా పూజింతునని మ్రొక్కుకొనుట, తాను భక్తకోటిలో ప్రథమగణ్యుడుగా నుండవలెనని సంకల్పించి పూజించుట మున్నగునవి.)

953. టీక : అనుపమ = సాటిలేని ; పరిహారము = తొలగించుట ; భజనీయుఁడు = పూజింపదగినవాడు ; శోభన చరితుండు = శుభమైనప్రవర్తనముకలవాడు ; అనితర యోగ్యతన్ = ఇతరమునకు స్థానము లేకుండునట్లు ; జనహితకారి = జనులకు మేలు కలిగించునట్టివాడు ; నెగడన్ = ప్రసిద్ధికెక్కగా.

తా. స్వాత్త్వికుల యోగమార్గము వివరించెదను వినుము. పూర్వము ఆచరించిన పాపకర్మలకు పరిహారము భగవద్భక్తియని నమ్మవలెను. సమస్తము భగవదర్పణముగా సత్కర్మల నాచరింపవలెను. చేసిన పనులు జనులకు మేలుకూర్చునట్టివిగా నుండవలెను.

( దీనినిబట్టి నిరంతరము ముక్కు మూసుకొని ధ్యానమున నుండుట, మంత్రమును జపించుచు కూర్చుండుట, పీఠముపెట్టి యోగాభ్యాసము చేయుటలో అహోరాత్రములు గడపుట మున్నగు పద్ధతుల వలన జనుల కెవ్వరికి నుపకారము జరుగదు గనుక లాభము లేదని తెలియవలెను. అట్లే ఒంటరిగా కూర్చుండి అహోరాత్రములు వేదములో, రామాయణ, భారత, భాగవతాది గ్రంథములో చదువుకొనుచున్నను సాత్త్వికభక్తి సాధన కాదని తెలియవలెను. కర్మలను మానుట గాక సత్కర్మలను భగవదర్పణ బుద్ధితో ఆచరించవలెను. )

954. టీక : మనుసుత =మనువు సంతతిదానా ! ( దేవహూతి స్వాయంభువ మనువు పుత్రిక. ) మద్గుణ శ్రవణమాత్ర = నా గుణములను విన్నంతమాత్రమున ; అనఘుఁడన్ = పుణ్యాత్ముఁడను ; సర్వశోభనగుణాశ్రయుఁడన్ = సర్వశుభములు ఇచ్చు గుణములకు ఆశ్రయమైనవాడను ; తనరిన = ప్రసిద్ధికెక్కిన ; ఉదాత్తమనోగతులు = ఉత్తమమైన మనస్సుపోకడలు ; అవ్యయంబులు = తరుగనివి ; వననిధిగామి = సముద్రమువైపునకు పోవుచున్నది ; సురవాహిని = గంగానది.

తా : తల్లీ ! నా గుణగణములను వినుచుండుటవలన భక్తి లభించును. సర్వజీవులలో నున్న శుభగుణములకు నేనే ఆశ్రయుడను. ( ఏ మహానుభావుల సద్గుణములను విని మెచ్చుకొన్నను నన్ను స్మరించుటయే యగును. ) నేను హృదయములకు ఈశ్వరుడను. ( నేనను పదము హృదయములలో ఉన్న అంతర్యామికి చెందునట్లుగా వాడవలెను. ) అట్టి నన్ను చెందిన మానసిక సంకల్పములు వ్యర్థము కావు. సాగర సంగమము చెందుటలో గంగ ఎట్లు సార్థకమగుచున్నదో అట్లే నా స్మరణలో పుట్టిన మనోభావములు పరిపూర్ణము లగును.

955. టీక : హేయగుణరహితుఁడు = నిందింపదగిన గుణములు లేనివాడు ; నిర్హేతుకము = కారణము లేనిది ; మదీయ వ్రత + ఏక చిరతర భక్తిన్ = నా యందు వ్రతముగా ఏర్పడిన భక్తి యొక్కటే చిరకాలము ఉండుట.

తా. నేను నిందింపదగిన గుణములు లేనివాడను. (మానవుల గుణములలో నొకరి నొకరు నిందించుకొను గుణములను విడిచి పెట్టగా మిగిలిన భాగమే నేను.) అట్టి నా యందు భక్తిని అభ్యసించువారి లక్షణము ఎట్లుండునో తెలిపితిని. ఈ భక్తిని అకారణముగా అభ్యసింపవలెను. (దీనివలన మేలు కలుగునని మొదలగు భావములతో అభ్యసించినచో కొంత కాలమునకు ఆగిపోవును.) కనుక ఇది జీవిత వ్రతముగా ఏర్పడి చిరకాలము సాగవలెను.

956. టీక : సాలోక్యము = దేవుని దృష్టిలో నుండుట (దీనివలన దేవుని దృష్టిలో పడుదురు) ; సార్ష్టి = సకల సంపదలను, ఐశ్వర్యములను, దేవునితో సమానముగా పొందుట. (భక్తుని యందు భక్తుని అహంకార ప్రజ్ఞ వుండక దేవుని ప్రజ్ఞ ధ్యాన మార్గమున సిద్ధించినచో దేహాది సృష్టి సంపదలు సకలము వాని వే గనుక స్వామిత్వము కలుగును.) సామీప్యము = దేవుని సమీపమున నుండుట (మనస్సుతో ధ్యానించుటగాక మనస్సుగా దేవుడుండుట) ; సారూప్యము = దేవుని రూపములో సమానమైన రూపము పొందుట (తన దేహాదులు తనవి కానప్పుడు దేవుని రూపములే) ; సాయుజ్యము = దేవునితో ఒకటిగా కూడి యుండుట (ధ్యానించువాడు, ధ్యానింపబడు వస్తువు ఏకత్వ మందుట) ; నిజ మనోరథ ఫలదాయకంబులు = తమ కోరికలను ఫలింప చేయునవి ; మదీయసేవా విరహితంబులు = నన్ను సేవించుట నుండి వేర్పరచునవి ; ఆత్యంతికభక్తియోగంబు = అన్నిటిని మించిన భక్తియే యోగముగా పరిణమించుట ; మత్ + సమాన + ఆకారంబు = నాతో సమానమైన ఆకారము.

తా. నిష్కాములైన నా భక్తులకు భక్తియోగము వలన సమకూరని ప్రయోజనమని యుండదు. దేవుడు చూచిన చూపుతో

లోకములను చూచుట, తన సంపదలను దేవుని సంపదలుగా ఎరిగి సద్వినియోగము చేయుట, స్థూల సూక్ష్మాదుల యందును, జీవులయందును, తన పరివారము నందును దేవుడే భాసించుట, ధ్యానబలమున తన రూపమే దేవుని రూపముగా చరించుచుండుట, తన జీవితము దేవునియందే నడచుట, కలిగి వర్తింతురు. ఈ భక్తియోగమును ఆశ్రయించు మహాత్ములు దానిని తమ కోరికలు తీర్చుకొనుటకు వినియోగింపరు. దానివలన ప్రయోజనము ఆశింపరు. (ఆనందమే ప్రయోజనము కాని ఆనందమునకు ఒక ప్రయోజన ముండదు. ప్రయోజనమును ఉద్దేశించువానికి ఆనందము కలుగదు. బాలుడు క్రీడలలో మునిగి తేలుటలో క్రీడయే ప్రయోజనము గాని ఫలితమును ఆశించుట యుండదు.) ఇట్టి సాధన వలన మొదట రజస్తమస్సులు తొలగును. తరువాత సత్త్వగుణము కూడ తొలగి అనుభూతిని ఇచ్చును. త్రిగుణములు తొలగిన జీవుడు నాతో సమానమైన ఆకారముతో వర్తించును.

957. టీక : నిత్య నైమిత్తిక నిజధర్మము = నిత్యము, నిమిత్తము అను వానితో కూడిన స్వధర్మము ; గురుశ్రద్ధా గరిష్ఠత = పెద్దవారియందు, గురువునందు మిక్కిలి శ్రద్ధ నిలుపుట ; చతుర = చాతుర్యముతో గూడిన ; పాంచరాత్ర + ఉక్త = పాంచ రాత్ర మనబడు ఆగమమందు చెప్పబడిన ; హరిసమారాధ్య క్రియలు = విష్ణువును ఆరాధించు సత్కర్మలు ; నెటెన్ = నిండుగా ; వినుతి = స్తుతించుట ; సంశ్రవణము = వినుట ; కర్మసంగి = కర్మలు అంటువాడు ; సజ్జనప్రకర + అభిమానంబు = మంచివారిపై అభి మానము కలుగుట ; అనుకంప = దయ ; క్రియ + ఆది = పనులు మొదలగునవి.

తా. నా భక్తులు నిత్య నైమిత్తిక ధర్మములయందు శ్రద్ధ కలిగి యుండవలెను. (కర్తవ్యము మాని దైవారాధనము మున్నగునవి చేసినచో ఫలితము లేదు. నిత్యకర్మలు అనగా స్నానసంధ్యాదులు, దినచర్య, వృత్తిధర్మము, కుటుంబ పోషణము మొదలగునవి. నైమిత్తిక ధర్మములు అనగా తాను నిమిత్తముగా జరుగునట్టి లోకారాధన రూపములైన యజ్ఞార్థ కర్మలు.) పెద్దల యందు, గురువులయందు మిక్కిలి శ్రద్ధతో మెలగవలెను. పాంచ

రాత్రాగమమున చెప్పబడిన విధమున విష్ణుపూజనాదికము నిర్వర్తింపవలెను. నా విగ్రహములు కనుపించినపుడు స్తుతి, పూజ, నమస్కారము చేయవలెను. వాని కొరకై ఆచరించు సత్కర్మలయందుగూడ సంగము పనికిరాదు. (పూజ చేయలేనపుడు చేయలేకపోతినని దిగులు పడుట సంగము. దీనివలన దైవధ్యానమునుండి మనస్సు దిగులువైపునకు మళ్లును. ప్రత్యేక పర్వదినములలో ఉత్సవాదులను నిర్వహించినపుడు తరువాతి కాలమున అంత వైభవముగా జరుగుటలేదని బాధపడుట కర్మసంగము. అట్లే తాను ఆచరించిన పూజ మిగిలినవారి పూజకన్న ఎక్కువగా నున్నదా, తక్కువగా నున్నదా అని గమనించుట కర్మసంగము. అది పూజనుండి మనస్సును మరలించును. ఒక్కొక్కమారు పుణ్యక్షేత్రయాత్ర చేసివచ్చి మరల చేయలేకపోతినని దిగులు పడుట కర్మసంగము. ఇట్టి వికారములను మనస్సునకు కలుగనీయరాదు.) మంచివారితో కలసియుండుటకు నెప్పుడును ప్రయత్నింపవలెను. తనకన్న తక్కువవారియందు దయగలిగియుండవలెను. (వీడు నాస్తికుడని, వీనిభక్తి చంచలమని హేళన చేయరాదు. వానిని గూర్చి తక్కువగా చెప్పుకొనరాదు. వానికి గూడ సద్భక్తి కలుగవలెనని సంకల్పించవలెను.) యమ నియమాదులను పాటించి యోగాభ్యాసము నడుపవలెను. సాటివారితో మైత్రి నిలుపుకొనవలెను. (సాటివారితో విరోధము వున్నచో వారు తనకన్న తక్కువవారని అనిపించును. ఈ భావనలో దైవభావన దెబ్బతినును.) ఆధ్యాత్మికము, ఆధి భౌతికము, ఆధి దైవికము అను కార్యకారణములను తెలియవలెను. (అవి అన్నియు భగవంతుని లీలలని తెలియవలెను.) తెలిసినవానిని ఇతరులకు వివరింపవలెను.

958, 959. టీక : ఆర్జవము = సూటిగా ప్రవర్తించుట ; భగవత్పరులు= దైవభక్తులు ; కరము = మిక్కిలి.

తా. విష్ణుని సద్గుణ కీర్తనమునందు నిమగ్నులై జీవింపవలెను. ఇతరులతో ప్రవర్తనమున వక్రత, కపటము ఉండరాదు. దైవభక్తులను ప్రేమతో పూజింపవలెను. ఎవరియందును

అహంకార పడరాదు. అన్నిపరిస్థితులయందు మనస్సు నిశ్చల ముగా ఉండవలెను.

960. టీక : భగవదుద్దేశ = భగవంతుని లక్ష్యముగా కలిగియుండుట ; స్వధర్మకలితుడు=తన ధర్మముతో కూడినవాడు ; తగిలిన = అంటుకొనిన.

తా. ఈ చెప్పబడిన లక్షణములు కలిగి, తన ధర్మ నిర్వహణ మంతయు భగవదర్పితమని ఎరిగినవాడు పరిశుద్ధుడు. అతని మనస్సు పుణ్యస్వరూపము.

961. టీక : గురుతర = గొప్పవి ; విశిష్టుడు = ప్రత్యేకత గలవాడు ; పొందు = నివాసము ; పవనవశమునన్ = గాలివలన ; ఘ్రాణమునన్ = ముక్కున ; కరణిన్ = వలె.

తా. మహనీయములైన పుణ్యలక్షణములను, పవిత్రప్రవ ర్తనలను, నమస్తమును గ్రహించుచుండవలెను. వానిని కలిగి ప్రవర్తింపవలెను. తానుగాని, ఇతరులుగాని ఈ గుణములు కలిగి యున్నవారు ముఖ్యముకాదు. ఉన్నగుణములు ముఖ్యము. పువ్వులనుండి గాలికి వెలువడిన సుగంధమును పూవులతో సంబంధము లేకుండ ముక్కుతో ఎట్లు అనుభవించునో అట్లే వ్యక్తుల తర తమ భేద దృష్టులు లేక గుణములను అనుభవించి కీర్తించువాడు కావలెను.

962. టీక : అనిశము = ఎల్లప్పుడు ; సర్వభూత = సర్వ జీవులయొక్క ; హృదయ + అంబుజవర్తి = హృదయపద్మముల యందు వర్తించువాడు ; అవజ్ఞ = అవమానము ; మత్ + ప్రతి మార్చనావిడంబనము = నా విగ్రహములను అర్చించు మోసము ; మూఢుఁడు = మోహపడినవాడు ; భస్మకుండమునఁ = బూడిదతో నిండిన గుంటలో ; వేల్చినయట్టివాఁడు = హోమము చేసినవాడు.

తా. సర్వజీవుల హృదయములయందు నే నీశ్వరరూపమున ఉంటినని తెలిసి నన్ను జీవులరూపమున ఆదరింపవలెను. అట్టి నన్ను అవమానము చేసి నా విగ్రహములనుమాత్రము పూజించువాడు లోకమును మోసగించును. అతడు మోహముతో తన్ను తానే

వంచించుకొనును. ఎంత భక్తి చూపినను అది ఉచితము కాదు గనుక బూడిదలో పోసిన హోమద్రవ్యమువలె నిష్ఫల మగును.

963. టీక : నిఖిలభూత + అంతరాత్ముఁడ = సర్వజీవులలో ఆత్మగా ఉన్నవాడను ; భూతగణంబునందు = జీవరాసులయందు ; మాయావులు = మాయకలవారు ; సతతంబు = ఎల్లప్పుడు ; పాయక = విడువక ; వైరానుబంధనిరతులు = విరోధములను పెంచుకొనుటయం దాసక్తికలవారు ; కుటిలజనులన్ = వక్రబుద్ధులైనవారిని ; సామాన్య + అధికద్రవ్యసమితి = సామాన్యములు, గొప్పవి యగు వస్తువుల సమూహము ; మత్ + పదార్చన = నా పాదములు అర్చించుట ; కవిత సద్గుణ జటిలుఁడు = కూడిన సద్గుణములు జడలుగా అల్లుకొనినవాడు ( కపిలుడు ).

తా : తల్లీ ! నేను సర్వజీవులలో అంతర్యామినై ఉన్నాను. అట్టి నాకన్న జీవులను వేరుగా చూచువారు మోసకాండ్రు. వారు ఇతరులతో విరోధములు పెట్టుకొని జీవింతురు. వారి మనసుల యందు శాంతి ఎన్నడును కలుగదు. వారు సామాన్యమైనవి, అరుదైనవి అగు పూజాద్రవ్యములతో నా పాదములు అర్చించినను ఫలితమేమియు లేదు. వారి కుటిలతయే వారికి మిగులును అని చెప్పి కపిలుడు తల్లితో మరల నిట్లనెను :

( నిరంతర దీక్షలలో ఉన్నవారు, యజ్ఞయాగాదులు ఆచరించువారు కూడ నిత్యజీవితమున పరిసరవ్యక్తులయందు విరోధములు పెట్టుకొనువారు కలరు. కోర్టులో శత్రువును గెలుచుటకై ఆంజనేయమంత్రము జపించువారు కలరు. తన్ను తిట్టినవాడు నశింపవలెనని ఒకడు మిరియములతో ఆంజనేయమంత్ర హోమము చేయును. ఒక్కొక్కడు గంధపు చెక్కలతో, నేతితో హోమము చేయును. ద్రవ్యములు ఎంత మంచివైనను వైరము మనస్సున ఉన్నది గనుక అది తామసోపాసనము. క్రీస్తును నమ్మనివారు పాపులని క్రీస్తు భక్తుడు ద్వేషించును. అత డెంత ప్రార్థనచేసినను మనస్సున ఉన్నది పాపులే గాని క్రీస్తు కాదు. ఇట్టి భక్తివలన లాభము లేదు. )

964, 965. టీక : ఘన రస జ్ఞాన సంకలిత చేతనులు = గొప్ప రుచుల తెలివితో కూడిన తెలివి గలవి ; గంధ జ్ఞాన కలిత బృందములు = వాసన చూచు తెలివితో కూడిన గుంపులు ; శబ్దవేదులు = శబ్దమును గ్రహించునవి ; సత్ + రూపవేదులు = మంచి రూపమును ఎరిగినవి ; వాయసాదులు = కాకులు మున్నగునవి ; బహుపాదులు = అనేక పాదములు గలవి ; చతుష్పాదులు = నాలుగు పాదములు గలవి ; బలకొని = సామర్థ్యము గలిగి ; పాదద్వయము = రెండు పాదములు.

తా. తల్లీ ! చేతనము లేని రాళ్ళు, రప్పలు మొదలు మహానుభావుల వరకు అన్నియును దేవుని విగ్రహము లే. అందు రాతి విగ్రహముల కన్న చేతనములు గల కొయ్య విగ్రహములు మంచివి. ( రాతిని అర్చించుట కన్న చెట్టును పెంచి, పోషించుటలో ఎక్కువ భక్తి కలుగును. ) వృక్షములకు చైతన్యము స్పర్శ జ్ఞానము రూపమున ఉండును. వానికన్న రుచి తెలిసిన క్రిమి కీటకాదులలో చైతన్యము రుచి రూపమున మేల్కొని యుండును. ( చీమలు మున్నగువానికి పిండి, ముగ్గు రూపమున ఆహారము పెట్టుట ఎక్కువ భక్తి. ) అంతకన్న వాసన తెలిసిన జీవులెక్కువ మెలకువ గలిగి యున్నవి. అంతకన్న వినగలిగిన జీవుల యందు ప్రజ్ఞారూపుడైన దైవము ఎక్కువ మెలకువతో వ్యక్తమగును. వానికన్న రూపము చూచి గుర్తుపట్టగల కాకులు మున్నగువానియందు రూపగ్రహణశక్తిగా మేల్కొని యుండును. వానికన్న అనేక పాదములు గల జీవులలో బహుగమనాత్మక శక్తిగా మేల్కొని యుండును. వానికన్న నాలుగుకాళ్ళ జంతువులలో అన్ని ఇంద్రియముల రూపమున విప్పారిన మనస్సుగా మేల్కొని యుండును. వానికన్న రెండు పాదములుగల నరుని యందు తా నున్నట్టి తెలివి గూడ మేల్కొని యుండును. అట్టి నరులు తమలోని మెలకువ చేత నాలుగు విధములుగా వున్నారు.

966, 967. టీక : వేదవేత్తలు = వేదము తెలిసినవారు ; విలసిత = రూపొందిన ; వేద + అర్థవిదులు = వేదమునకు అర్థము తెలిసినవారు ; సమధిక = మిక్కిలి ఎక్కువయిన ; మీమాంసకులు=

విచక్షణ చేసిన వేదాంతులు ; నిజ ధర్మ విజ్ఞాన నిపుణులు = తా మాచరింపవలసిన పనులను మర్చిపోని నైపుణ్యము కలవారు ; సంగ వర్జిత చిత్తులు = అంటుకొను లక్షణము విడిచిన మనస్సు కలవారు ; సత్ + ధర్మపరులు = ఉత్తమ ధర్మము తెలిసినవారు ; మత్ + సమర్పిత = నా యందు అర్పింపబడిన.

తా. పై చెప్పిన నాలుగు విధములైన వారిలో బ్రాహ్మణులు ఉత్తములు. వారికన్న వేదము తెలిసినవారు ఉత్తములు. వారికన్న వేదార్థము తెలిసినవారు ఉత్తములు. వారికన్న సర్వ శాస్త్రముల సందేహములు తీర్పగల వేదాంతులు ఉత్తములు. వీరందరికన్న తమ పని ఏమో తాము గుర్తుంచుకొన్నవారు ఉత్తములు. వారికన్న తమ పనులు ఆచరించుటలో రాగ ద్వేషములు అంటనివారు ఉత్తములు. వారికన్న సృష్టి ధర్మము భగవంతుడని ఎరిగినవారు ఉత్తములు. వీరందరికన్న ఉత్తములు ఎవ్వరనగా పై చెప్పిన సర్వస్వభావములను, ప్రవర్తనములను గ్రహించి నాయందు అర్పణము చేసినవారు.

968, 969. టీక : సకల భూత గణములు = సమస్త జీవ రాసుల గుంపులు ; ఆనంద జలధిమగ్నములు = ఆనంద సముద్రమున మునిగినవి ; బహుమాన పురస్సరములు = గౌరవముతో కూడినవి ; అనయము = ఎల్లప్పుడు.

తా. అట్టివారిని చూచి సకలజీవులు మనస్సున ఆనంద పడుచుండును. వానిని గౌరవించుచుండును. స్తుతించుచుండును.

970. టీక : జీవస్వరూప + అనుప్రవిష్టుండు = జీవుల రూపమునను, తన రూపమునను లోపల ప్రవేశించి యున్నవాడు ; తత్ + వ్యతిరిక్తము = దానికి వ్యతిరేకమైనది ; కర్మవిచేష్టితంబు = కర్మలయందు ప్రవర్తించునవి, ప్రవర్తింపనివి ; భేద + ఆస్పదము= భేదములకు నివాసమైనవి ; అద్భుత ప్రభావంబు = ఊహింపరాని ప్రభావము కలవి ; మహత్ + ఆది = మహత్తు మొదలగు ; భయావహంబు = భయమును గలిగించునవి ; అంతర్గతంబు = లోపలనుండునవి ; గ్రసించుచు = మ్రింగుచు ; వశీకృత భూతుండు= వశమైన జీవులు కలవాడు ; భజించి = అనుభవించి ; అప్రమత్తుండు=

ఏమరుపాటు లేనివాడు ; తపించును = వేడి పుట్టించును ; తత్ + తత్ + కాలంబులన్ = ఆ యా సమయములయందు ; వృక్ష లతాదులు = చెట్లు, పూలతీగలు ; ఓషధులు = పంటకు వచ్చు నప్పటికి చనిపోవు మొక్కలు (ధాన్యము మొదలగునవి) ; సరిత్తులు = నదులు ; మేరలు = హద్దులు ; అవకాశము = చోటు ; అంకుర స్వరూపంబు = మొలకయొక్క రూపము ; సప్త + ఆవరణ + ఆవృతంబు = ఏడు ఆవరణలతో ఆవరింపబడి యున్నది : గుణ + అభిమానులు = గుణములను అభిమానించువారు : జగత్ + సర్గంబు = ప్రపంచమును సృష్టించుట ; పిత్రాదులు = పితృదేవతలు మున్నగువారు ; కాలుండు = యముడు ; మారకుండు = చంపువాడు.

తా : ఈశ్వరుడు జీవుని రూపమునను, తనచుట్టు నున్న జీవుల రూపమునను ప్రవేశించి యుండును. (జీవుని రూపము అహంకారము. అది శబ్దస్పర్శాదులతో ప్రభావిత మగును. దాని లోపల దాగియున్న నేనను ప్రజ్ఞ ఈశ్వరుడు. దానినుండి మనస్సును, ఇంద్రియములు కిరణములుగా వెలుపలకు వెలుగు చుండును.) జీవుని స్వరూపమున ఈశ్వరుడే ఉండును గనుక తనలో గాని, ఇతరులలో గాని ఈశ్వరుని దర్శించు సంకల్పము స్వరూప జ్ఞానమును కలిగించును. (నాటకమున రాక్షసుని వేషము ధరించి ఒకడు అద్దములో చూచుకొని హఠాత్తుగా ఉలిక్కిపడును. నిదానించి నవ్వుకొనును. అట్లే జీవుడు నిదానించి ఆత్మజ్ఞానము పొందును. అద్దములో రాక్షసుని చూచునది క్షణకాలము, మరల స్వరూపము గ్రహించినది స్థిరమైన కాలము.) అట్లే జీవుడు తనలో గాని, ఎదుటివారిలో గాని వ్యక్తులను చూచుట తాత్కాలికము. దైవమును చూచుట నిత్యము. సాటివారిని దైవవిగ్రహములుగా ధ్యానించుట శీఘ్రముగా ఆత్మజ్ఞానమును కలిగించును. ఈ ప్రయత్నమున యోగాభ్యాసము చేసినను, భక్తిమార్గమున ఉపాసించినను పరమాత్మను పొందును.

భగవంతుని రూపము ప్రకృతి పురుషులతోడి నానావిధ **రూపములుగను,** వానికి అతీతమైన తన రూపముగను రెండు

విధములుగా ఉండును. ఇందు మొదటి రూపమున దైవమును ధ్యానించినచో కర్మలు తనయందు చేష్టితములు కాకుండును. (రాక్షసుని రూపము ధరించినవాడు నాటకమున ప్రేక్షకులచే మెచ్చుకొనబడుచున్నప్పుడు ఆ మెచ్చుకొను వాక్యములను రాక్షసుడుగా విని ఆనందింపడు. నటుడుగా విని ఆనందెంచును. అట్లే ఇతరులలోని సద్గుణములను ప్రశంసించినపుడు వారిలోని దైవమే ప్రసన్నుడగును.)

(రాక్షస వేషధారిని ప్రశంసించినవారు నాటకము ఆపి పిలిచి సంభాషించినచో అతడు రాక్షసుని సంభాషణలు చేయక తన సంభాషణలే చేయును. నాటకము ఆగిపోయి రాక్షసుని చేష్టలు విచేష్టితములు అగును. అట్లే ముక్తిపొందినవాని శరీరమున త్రిగుణములు, సంసారబంధములు నామమాత్రముగా ఉన్నను చేష్ట లుండవు.)

ఇట్లు జీవులుగా వర్తించుచున్న భగవంతుని రూపము భేదములతో కూడి కనిపించును. ఈ కనిపించుటలో భగవంతుడు వారిలో కాలస్వరూపుడై యుండును. అట్టికాలము మహత్తు మొదలైన తత్త్వములకు ఆద్యంతములు చూచునదిగా ఉండును. ఈ ప్రకృతి తత్త్వములను నమ్మిన జీవునకు కూడ దేహాదుల సత్యత్వము భ్రాంతి గొలుపును. కాలము వాని ఆద్యంతములు చూచునదై భయము గొలుపును. (నాటకమున రాక్షసునకు ఒక ముని కనిపించి "నీ వింక పదినిమిషములలో చనిపోవుదువు" అని శపించును. రాక్షసవేషధారి మద్యము మత్తులోనుండి ఆ శాపము నిజము అనుకున్నచో తాను పదినిమిషములలో చనిపోవుదునని భయపడును. మద్యమువలన తాను చనిపోడను సత్యము జ్ఞప్తికిరాదు. అట్లే దేహాదులను సత్యముగా నమ్మిన వాడు తన ఆయుర్దాయమును గూర్చియు, జననమరణములను గూర్చియు భయపడును. ఈవిధముగా భగవంతుడు కాల స్వరూపుడై జీవులకు భయమును కలిగించుచున్నాడు.)

ఈశ్వరుడే సకలజీవులకు ఆశ్రయమై యుండి, వారి లోపలి నుండి కాలగతులుగా పనిచేయుచు జీవులను మ్రింగుచున్నాడు.

ఒకజీవి రూపమును ఇంకొక రూపముచే తినిపించుచున్నాడు. (జీవుడు తాను అంతర్యామియని భావింపలేక ప్రకృతిని అనుసరించి ఎలుకను పిల్లిగా, పిల్లిని కుక్కగా తినుచున్నాడు.) ఇట్లు జరుగుట సృష్టి యనబడు యజ్ఞస్వరూపములోని భాగము గనుక యజ్ఞ ఫలములను ఇచ్చుటకు జీవులను వశమందుంచుకొని ప్రభుత్వము నెఱపుచున్నాడు. అతనికి మిత్రుడు, శత్రువు, బంధువు లేరు. తాను సకలమునందు మేల్కాంచి యుండును. తనలో ఏమరుపాటు చెందిన జీవులను సంహరించుచుండును. (నాటకము రచించిన కవి కథాఘట్టముల రూపమున పాత్రలలో ప్రవేశించి వారి వారి ప్రకృతులను ప్రసాదించుచున్నాడు. పాత్రలుగా ప్రవర్తించుటలో కవియే పాత్రలకు బద్ధుడు. నాటకము రచించిన కవిగా పాత్రలను తన ఇష్టమువచ్చినట్లు నడుపుచున్నాడు.) జీవులు భగవంతుని రూపములే అయినను అతని ఆజ్ఞకు బద్ధులై నడచుచున్నారు. పంచభూతములు, దేవతలు, ఈ ప్రవర్తనమునకు బద్ధులు. వాని భయముననే వాయువు వీచుట, సూర్యుడు వేడి పుట్టించుట, మేఘాధిపతి వర్షించుట, తారాగణములు వెలుగుట, చంద్రుడు వెన్నెలను ఇచ్చుట, ఋతువులను అనుసరించి చెట్లు మున్నగునవి పుష్పించుట, ఫలించుట, నదులు ప్రవహించుట జరుగుచున్నవి. భూమి పర్వతములతోగూడ బరువుతో బ్రద్దలు కాక నిలిచియుండుట, ఆకాశము జీవులకు చోటిచ్చుట జరుగుచున్నవి. (ఇచ్చట భయము అనగా మరియొక విధముగా ప్రవర్తింపలేకుండుట.)

మహత్తు అనబడు తత్త్వము సృష్టికి మొలుచుకొని వచ్చు ధర్మమును ప్రసాదించును. అది ఏడు పొరలుగా ఆవరించి ఆ పొరల నడుమ సృష్టిని వృద్ధిచేయును. (మహత్తు, అహంకారము, పంచభూతములు అనునవి ఏడు ఆవరణలు.) సృష్టికర్తయైన బ్రహ్మ మొదలగువారు తమ తమ గుణములచేత వేరైన అస్తిత్వము కలిగి యున్నారు. కనుక వారు గుణములపై ఆధారపడిన దేవతలు. (దేవుడు వేరు, దేవతలు వేరు.) వారు గుణములచే నియమింపబడి ప్రవర్తించుటలో మేల్కాంచి యున్నారు. ఇందరిలో అంతర్యామియైన విష్ణువే వీరి అస్తిత్వమునకు ఆధారము. అందు

మేల్కొనిన పితృదేవతలు దేహముల యందు తండ్రులై దేహములను బిడ్డలుగా పుట్టించుచున్నారు. కాలము రూపమున యముడు యమించి మృత్యువు సహాయమున మరల కలిపివేయు చున్నాడు. ఇట్లు సృష్టిలోని సర్వలోకములును తమయందు అంతర్యామినే ధరించియుండి తాము అంతర్యామియందే తెరపైన బొమ్మలవలె వర్తించుచున్నారని వివరించి కపిలుడు కొంచెము విరామము ప్రసాదించి మరల ఇట్లు ఉపదేశించెను.

971. టీక : నెఱిన్ = నిండుగా ; పరాక్రమము = పరులను ఆక్రమించు లక్షణము ( దైవేతరమైన దానిని దైవముగా మేల్కొల్పుట ) ; కరువలి = గాలి ; విక్రమము = శౌర్యము.

తా. మేఘము గాలికి ఎగురుచుండును. దానికి గాలి యొక్క సామర్థ్యమును తెలిసికొనుట సాధ్యమా ? అట్లే నారాయణుని పరాక్రమమును తెలిసికొనుటకు ఎవ్వరికిని సాధ్యము కాదు. ( నడిపించునట్టి సామర్థ్యము గల వానిని గూర్చి నడచు కొనువాడు గ్రహింపగలుగుట ఎట్లు సాధ్యము ? )

972. టీక : మగువా = ఆడుదానా ! ; అర్థము = ప్రయోజనము, సంపద.

తా. సుఖమునకు కారణమైన మహాసంపద యేదో తెలిసి కొనలేక జీవులు మహాదుఃఖముల పాలగుచున్నారుగాని అంతయు భగవదాజ్ఞయని తెలియుట లేదు. ( సుఖమును గలిగించు సంపద యుండదు. ఉన్నచో సుఖముకన్న గొప్పదై యుండవలెను. ఉన్నదని నమ్మినవాని దృష్టిలో సుఖము అన్నమాటకు అర్థము తప్పు. సుఖమువలన సమస్తము చక్కబడును గాని సుఖము నేదియు సమకూర్చదు. ఆశ్రయింపవలసినది సుఖముగా నుండ దలచుటయే గాని సుఖము నిచ్చు ఇతర సంపదలను వెదకునట్టి డొంకతిరుగుడు పద్ధతి పనికిరాదు. ఇట్లు గ్రహింపగలిగిన వానికి సుఖమన్నను, భగవంతుడన్నను భేదము లేదు. )

973. టీక : అనిత్యంబులు = స్థిరముకానివి ; గృహ క్షేత్ర = ఇల్లు, పొలము ; పశు ధన సుత = పశువులు, ధనము, బిడ్డలు ; వధూ + బాంధవ + ఆది = భార్య, చుట్టములు మొదలగు.

ధ్రువముగా = స్థిరముగా ; జంతుసంఘాతము = జంతువుల సమూహము ; అర్థిన్ = కుతూహలముతో ; చొరఁగన్ = ప్రవేశింపగా ; అనుగమించును = వెంటపోవును ; నరకస్థుఁడు = నరకమున నున్నవాడు ; దేహి = దేహమందున్నవాడు ; ఆత్మీయదేహంబు = తన శరీరము ; తివిరి=పూనుకొని ; దేవమాయావిమోహితభావుఁడు = దేవతల మాయచేత మోహముచెందిన భావము కలవాడు.

తా. ఇల్లు, పొలము, పశువులు, ధనము, సంతతి, భార్య, చుట్టములు మొదలైన వానిని స్థిరము లని నమ్మికొని అవి సుఖకారణము లనుకొనువాడు మనస్సు పాడుచేసుకొనును. జంతువుల వంటి ప్రవర్తనమును అభ్యసించును. చేసిన పనులనుబట్టి, అభిలాషలనుబట్టి ఆ యా జంతువుల గర్భముల యందు పుట్టును. మరల వాసనాబలముచే గర్భనరకమునకు దారితీయు ప్రవర్తనను కలిగియుండును. వైరాగ్యము పుట్టదు. దేహమే పరమసౌఖ్యములకు కారణమని నమ్మి రోగము, ముసలితనము కారణముగా దేహ నరకములు అనుభవించును. అయినను దేహమునందు అభిమానము పోదు. (స్త్రీ పురుష సంబంధమైన కామమునందు ఆసక్తి పెంచుకొనుటచే తదాకర్షణమున జీవుడు అనేకగర్భములను వెదకికొని పుట్టును. జన్మకు ద్వారము గూడ కామద్వారమే కనుక పుట్టుకచేతనే కామవాసనలు ఉండును. ఇట్లు కామము కార్యకారణ రూపమై ప్రబలగా వైరాగ్యము వైపునకు మనస్సు మొగ్గదు. దానితో తన దేహమునందు అభిమానము ఎక్కువగును. కామములు అనుభవించునది దేహమున గనుక దేహాభిమానము పెరుగక తప్పదు. ఇది ముదిరి రోగస్థితిలోనైనను, వార్ధకముననైనను, ఎంత బాధాకరముగానున్నను ఆ దేహమునందే యుండవలెనని, దాని సుఖములు తాను అనుభవింపవలెనని అభిలాష మిగులుచుండుటలో నరకయాతనలు అనుభవించును.

974. టీక : తనయ = పుత్రులు ; వధూ = భార్య ; తత్ + తత్ + క్రియలన్ = ఆ యా పనులను ; దందహ్యమానదేహుండు = దహించుకొనిపోవుచున్న దేహము కలవాడు.

తా. బిడ్డలు, భార్య, పశువులు, డబ్బు, ఇల్లు అనునవి వాని మనస్సున ప్రాముఖ్యము వహించును. వానిని రక్షించుకొనుటకై ఆ యా పనులను సంకల్పించి చేయుటలో తీరుబడి లేకుండును. పనులు అయినవని కాలేదని పడు త్రిప్పలలో దేహము మిక్కిలి బాధ నొందుచుండును. (ఇది యంతయు సుఖముకొరకే యనియు, సుఖమే యనియు భ్రాంతిపడును.)

975, 976. టీక : దురితకర్మారంభమునన్=పాపపు పనులు సంకల్పించుటయందు ; తరుణీకృత = భార్యచే చేయబడిన ; గోప్యభాషణములు =రహస్యముగా మాట్లాడుటలు ; సుత లాలన భాషణముల్=బిడ్డలను బుజ్జగించుచు మాట్లాడుట ; చొక్కుచున్ = పరవశించుచు ; తత్ + కూటధర్మములు = ఆ మోసపు స్వభావములు ; తత్ + అభిమానుండు = దానియందు అభిమానము కలవాడు.

తా. మిక్కిలి మోహపడిన హృదయము కలవాడై పాపకర్మలను సంకల్పించి ఆచరించును. భార్య తనతో రహస్యముగా మాటాడుటనుగూర్చి ముచ్చటపడును. బిడ్డలను బుజ్జగించుచు తాను పలికిన పలుకులతో పరవశించుచుండును. ఇట్లు ఇంద్రియములయందు సుఖమును వెదకికొనుటలో ఒడలు మరచును. పోషణాదులకై మోసపు పనుల సంబంధము పెట్టుకొనుటవలన చిక్కులలో పడును. అవి యన్నియు సుఖములే యని నమ్మి ఆసక్తితో ప్రవర్తించును. (భార్యయందు, బిడ్డల యందు కలిగిన మోహము వారి కోరికలను తీర్చుటకై లోకమును మోసముచేయుటకు పురికొల్పును. అప్పుచేసియైనను పండుగకు చీర కొనవలెననియు, వాణిజ్యమున కల్తీచేసి, అసత్యములాడి ఎక్కువ ధనార్జనచేసి వారిని సుఖంపచేయవలెననియు భ్రాంతి పడును. చేసిన మోసమునకు ఇతరులచేతిలో అవమాన దండనాదులు కలుగును. అయినను "ఇదంతయు నా స్వార్థమునకు కాదుగదా! నన్నాశ్రయించుకొనిన వారిని పోషించుటకు మాత్రమే" అని సమర్థించుకొనును.)

977, 978. టీక : సతతమున్ = ఎల్లప్పుడు ; ధృతిన్ = ధైర్యముతో ; కుత్సితమతిన్ = నీచమగు బుద్ధితో ; భుక్తశేషము=

అనుభవింపగా మిగిలినది ; జీవనము + పోక = పొట్టగడువక ; అపరార్ధకాముఁడు = చెల్లిన వయస్సున కామములు ఉడుగనివాడు; సత్యము + ఎడలి = సత్తువ తగ్గి.

తా : అహోరాత్రములు శ్రమపడి సంపాదన చేయుచు, తెగించి యితరులను హింసించుచు, మూఢులై తనవారిని రక్షించుచుందురు. వారు తినగా మిగిలినదానిని తినుచుందురు. కొంత కాలమునకు పొట్టగడువని స్థితి వచ్చును. ముసలితనమున గూడ కోరిక లన్నీ మిగిలియుండును. దేహమున సత్తువ తగ్గును. కుటుంబ పోషణము తప్పనిసరి యగును.

979. టీక : బలిమి + చాలక = సత్తువ చాలక ; మందభాగ్యులు = అదృష్టము మందగించినవారు ; కుమతి = దుర్బుద్ధి ; క్రియాహీనుఁడు = పని లేనివాడు ; కార్పణ్యమునన్ = దీనత్వముతో ; అకించనుఁడు = అల్పుడు ; దార సుతాదులు = భార్య బిడ్డలు మొదలగువారు ; ఎగ్గింతురు = ఎగ్గులు పలుకుదురు ; కృషీవలుండు = పొలముపని చేయువాడు ; రోసిన పగిది = అసహ్యించుకొనునట్లు ; ముదిమి = ముసలితనము.

తా. సత్తువ తగ్గి, అదృష్టహీనుడై, దుర్బుద్ధితో కూడని పనులు చేయుటకు ప్రయత్నించును. ఫలింపక వృథాశ్రమ కలుగును. దీనుడగును. వానిని జూచి భార్య, బిడ్డలు, చుట్టములును తన్ను అశక్తుడని, పోషింపలేనివాడని నిష్ఠురముగా మాటాడుదురు. పొలము దున్నువాడు ముసలి ఎద్దును కొట్టి త్రోయునట్లు ప్రవర్తింతురు. సుఖము ఎచ్చటను కనుపించదు. పూర్వము తన పోషణలో ఉన్నవారే తన్ను పోషించుచుండగా అవమానపడును. ముసలితనము దేహబాధలు పుట్టించుచుండును.

980. టీక : వెడరూపు = వికృతమైన రూపము ; అడలఁగన్ = భయపడగా ; ఇల్వెడలగ = ఇంటినుండి బయటకు రాగా ; శునకము = కుక్క.

తా. తన వికృతమైన ముసలిరూపమును చూచి చుట్టములు భయపడి దూరముగా పోవుదురు. ఇంటినుండి కదలలేక ఇంటి కుక్కవలె భుజించుచు పడియుండును. దేహమున వణుకు పుట్టును.

981. టీక : మందము = తగ్గిపోయినది ; జఠరాగ్ని = ఆకలి ; అల్పాసి=కొంచెమే తినువాడు ; వాయువుచేత = వాతరోగము చేత ; చటులతర = మిక్కిలి భయంకరమైన ; కాలపాశ వశంగత + ఆత్ముఁడు = యముని పాశమునకు లొంగిన దేహము గలవాడు ; హృషీకములు = ఇంద్రియములు ; కష్టుఁడు = నీచుడు.

తా. రోగములు పట్టి పీడించును. ఆకలి తగ్గిపోయి, కొంచెమే భుజించును. వాతరోగముతో మిడిగ్రుడ్లు పడును. కఫము కంఠ మున నిండి గురకపుట్టును. చుట్టాలనడుమ పండుకొని యుండును. వారు పలుకరించిన పలుక లేడు. భయంకరమైన యమపాశముచే దేహము కట్టబడును. ఇక దారా పుత్రుల గతి యెట్లని దుఃఖము కలుగును. ఇంద్రియములు పనిచేయవు. నేర్చిన విద్యలు అక్కరకు రావు.

982. టీక : సరభస + ఈక్షణులు = భయముగొలుపు కన్నులు కలవారు ; త్రస్తహృదయుండు = భీతిచెందిన హృదయము కలవాడు ; శకృత్ + మూత్రంబులు = మలము, మూత్రము ; గళంబునన్ = కంఠమున ; యాతనా శరీరంబు = భౌతిక దేహమును విడిచిన వెనుక నిలబడు భావముల శరీరము ; దుర్గమంబు = చొర రానిది ; అభిముఖుండు = ఎదురైనవాడు.

తా. చనిపోవువేళకు భయంకరాకారులు, మిడిగ్రుడ్లవారు నగు యమదూతలు ఇద్దరు తన ముందు నిలబడుదురు. వారిని చూచి భయపడి మలమూత్రములు విడుచును. యముని పాశములచే కంఠమున బంధింపబడి దేహము విడిచి యీవలకు వచ్చును. వాసనలతో గూడిన శరీరము ధరించి, బలవంతముగా చాల దూరమైన దారివెంట నడిపింపబడును. అది చొరరాని దారిగా ఉండును. రాజదండనలకు రాజభటులచే కొనిపోబడు చున్న అపరాధివలె నడచును.

983. టీక : అనయము = మిక్కిలి ; శునకావలి = కుక్కల గుంపు : భక్ష్యమానుఁడు = తినబడుచున్నవాడు ; అనుపమ = సాటిలేని ; కాలకింకర = యమదూతలయొక్క ; తర్జనగర్జనంబు లన్ = భయపెట్టుచు పెట్టు కేకలను : కంపము = వణుకు ;

పురాతన = ప్రాతది; భవపాపకర్మ సముదాయము = సంసార పాపముల కర్మల సమూహము.

తా. దారిలో అడుగడుగున మూర్ఛ చెందుచు, కుక్కలచే పీకబడుచు, భయంకరులైన యమకింకరుల కోపపు కేకలకు అదిరి పడుచు, భయమున దేహము కంపించుచుండగా తాను పూర్వము ఆచరించిన పాపకర్మల వరుస అదే వరుసలో తన మనస్సునకు జ్ఞప్తికి వచ్చును.

984. టీక : అనుపమ = సాటిలేని; క్షుత్ + తృష్ణలు = ఆకలిదప్పులు; అంతర్ + వ్యథలను=లోపలి బాధలను; ఝంఝూనిల = ఉప్పెనగాలి; జ్వలత్ + జ్వలన = మండుచు వెలుగుచున్న; చండభానుప్రదీప్తి=భయంకరుడైన సూర్యుని వెలుగు; తప్తంబు= కాల్చబడినది; వాలుకామార్గ + అనుగత = ఇసుకదారి ననుసరించుట; తప్యమానగాత్రుండు = కాలుచున్న దేహము కలవాడు; కశలచేన్ =కొరడాలచేత;అడువంగన్ = బాదగా;ఆశ్రయశూన్యము =నీడలేనిది. తమము=చీకటి; నిరూఢుడు =స్థిరముగానున్నవాడు.

తా. అంతులేని ఆకలిదప్పులు పీడించు చుండును. (ఇవి ఆకలిదప్పుల స్మరణలు. దేహము లేదు గనుక తినలేడు, అవి తీరవు.) భయంకరమైన మధ్యాహ్నసూర్యుడు మిలమిల మెరయు చుండును. మిటమిటలాడు ఎండలో ఇసుక ఎడారులు వేయించిన ఇసుకతో నిండి యుండును. అందు తన్ను నడిపింతురు. నడచుచుండగా సుడిగాలులు రేగి ఆ ఇసుకను ఎత్తిపోయును. దేహము కాలిపోవు చుండును. నడువలేనప్పుడు వీపుపైన కొరడాల దెబ్బలు పడుచుండును. వికలాంగుడై మూర్ఛిల్లుచు లేచుచుండును. దారిలో గట్లులేని నీటిమడుగు లుండును. వానిలో పడి మునిగి లేచుచుండును. కన్నులు కనిపింపవు. చీకటులు అలముకొనును. అవి తా నాచరించిన పాపముల రూపములని గ్రహించును. ఎటు పోయినను తప్పించుకొను తావులేక పాతుకొనిపోయిన ట్లుండును. ఇట్టి మార్గమున యమభటులు తొంబది తొమ్మిదివేల యోజనముల దూరము నడిపించుకొని పోవుదురు.

985. టీక : ముహూర్త త్రయ కాలంబు = మూడు ముహూర్తముల కాలము (సుమారు ఒక గంట కాలము);

ముహూర్తద్వయంబు = రెండు ముహూర్తముల కాలము ( 40 నిమిషముల కాలము ).

తా. మహాపాపాత్ముడైన వానిని మూడు ముహూర్తముల కాలము, సామాన్య పాపములు చేసిన వానిని రెండు ముహూర్తముల కాలము నడిపింతురు.

986. టీక : అసి పత్రికలు = కత్తుల యాకులు ; ఒట్టుదురు= నెట్టుదురు ; నలియన్ = నలిగిపోవునట్లు ; మట్టుదురు = కాళ్ళతో త్రొక్కుదురు ; మత్తున్ = మదించినవానిని ; పెలుచన్ = సులభముగా.

తా. ఇట్లు నడిపించుచు యమభటులు యమపురమునకు కొనిపోయి మండుచున్న కొరవులు అంటింతురు. ఆకులవంటి కత్తులపైన పడద్రోయుదురు. మంటలలోనికి నెట్టుదురు. దేహము పచ్చడి యగునట్లు కాళ్ళతో త్రొక్కుదురు.

987. టీక : తప్తతోయములన్ = కాగిన నీటియందు ; ఉగ్రగదాసి ధారలన్ = భయంకరమైన గదలతోను, కత్తుల అంచులతోను ; ఇభేంద్ర పంక్తిన్ = మదపుటేనుగుల వరుసను ; ఊొప్పింతురు = త్రోలుదురు ; ఘోరభంగి = భయంకరమగు విధమున ; బిట్టు = మిక్కిలి ; ద్రొబ్బింతురు = నెట్టింతురు.

తా. మహాపాపులను యమలోకమున సలసల కాగుచున్న నీటిలో ముంచుదురు. గదలతోను, కత్తులతోను కొట్టుదురు. పొట్టలో ప్రేగులు త్రెంతురు. ఏనుగుల గుంపును మీదినుండి నడిపింతురు. ఘోర సర్పములచే కరపింతురు. మీదకు రాతి గుండ్లు దొర్లింతురు. దేహమును కోసి ఆ కండలను తినిపింతురు. ( ఇన్ని బాధలు తాను పూర్వము దేహమందున్నపుడు అనాచారముల వలన అనుభవించిన రోగ బాధలకును, శస్త్రచికిత్సాదులకును కలిగిన బాధల స్మృతులు. మనస్సు దేహబద్ధము కాదు గనుక పూర్వము కలిగిన బాధలకన్న ఈ స్మృతులు మిక్కుటమై భయంకరమగును. ఎన్ని బాధలు కలిగినను దేహము లేదు గనుక చచ్చుటకును, తప్పించుకొనుటకును వీలు లేదు. స్మరణములు గనుక పొమ్మన్నను పోవు. )

988. టీక : కుక్షింభరులు = పొట్టపోసికొనుట మాత్ర మెరిగినవారు ; భూతద్రోహంబు = జీవులకు చేసిన ద్రోహము ; నిరయంబు = నరకము ; కోలుపడి = పోగొట్టుకొని ; ఆపన్నుఁడు= ఆపదపొందినవాడు ; తమిస్ర = చీకటి ; అంధతామిస్ర = గ్రుడ్డి తనముతో గూడిన చీకటి ; రౌరవ + ఆదులు = రురువు లనబడు పురుగులచే తినిపించుట మున్నగు నరకములు ( పూర్వము దేహమున క్రిమిదష్టములైన వ్యాధులు కలిగి ఇప్పుడు వాని స్మృతులలోని క్రిములు భయంకరాకారము దాల్చి తినును. ) క్షీణపాపుఁడు=క్షీణించిన పాపములు కలవాడు ; పునర్నరత్వము= మరల మానవుడగుట.

తా. కుటుంబ పోషణము కొరకు తన కొరకు పొట్టపోసి కొనుటయే ముఖ్యముగా తలచి, అధర్మమున ప్రవర్తించి, ఇతరు లకు ద్రోహము చేసినవాడు ఇట్టి నరకమున పడును. తన సంపద పోగొట్టుకొని మొత్తుకొనుచున్నవానివలె తిరుగును. ఆ నరకమున చీకటిలో నడచుట, చూపు లేకుండ నడచుట, క్రిములు తన్ను నమలి భక్షించుచుండుట మొదలగు బాధ లుండును. ఇట్టి తీవ్రము లైన యాతనలు అనుభవించినపుడు పాపమంతయు క్షీణించును. ( స్మృతులు కరగిపోవును. మరల నరుడై పుట్టును. )

989. టీక : శశ్వత్ + ప్రకాశకుండు = శాశ్వతముగా ప్రకాశించువాడు ; ఘటకుండు = సంఘటనలు కూర్చువాడు ; క్రమ్మఱన్ = మరల ; తివిరి=ప్రయత్నించి ; దొరకొని=పూనుకొని ; పురుష రేతోబిందుసంబంధి = పురుషుని శుక్రబిందువుతో సంబంధము కలవాడు : వధూగర్భంబు = స్త్రీ గర్భము ; కలలంబు = బురద వంటి పదార్థము ; బుద్బుదము = బుడగ ; కర్కంధువు = రేగుపండు ; పేశి = మాంసము గలది ; మస్తకము = తల ; కరచరణములు = చేతులు, కాళ్లు.

తా. పూర్వకర్మను అనుసరించి రాబోవు జన్మము ఏర్ప డును. ఇన్నిటిని సంఘటించు భగవంతుడు వారిలోనే ఈశ్వరుడై యున్నాడుగదా ! కనుక మరల జీవుడు దేహ సంబంధము కోరును. పురుషునిలో ప్రవేశించి శుక్రమున బిందువుగా చేరి స్త్రీగర్భమున

ప్రవేశించును. అప్పటినుండి ఒకరాత్రి శుక్రశోణితముల ద్రవముగా ఉండును. అటుపైన అయిదు దినములలో బుడగవలె ఏర్పడును. తరువాత పదిదినములకు రేగుపండంత పిండము ఏర్పడును. అటుపైన మాంసపుముద్ద ఏర్పడును. అటుపైన గ్రుడ్డువలె పొరలేర్పడును. నెల పూర్తియగుసరికి తల యేర్పడును. రెండు మాసములకు కాళ్ళు, చేతులు ఏర్పడును.

990. టీక : మాసత్రయంబు = మూడు మాసములు ; నఖ రోమ + అస్థి చర్మంబులు = గోళ్లు, రోమములు, ఎముకలు, చర్మము ; లింగఛిద్రంబులు = పురుషావయము మొదలగు కన్నములు, క్షుత్ + తృష్ణలు = ఆకలిదప్పులు ; షష్ఠమాసంబున= ఆరవనెలలో ; పొదువంబడి = చుట్టబడి ; కుక్షిని = కడుపులో ; దక్షిణభాగమున = కుడిప్రక్క ; మాతృభుక్త = తల్లిచే తినబడిన ; ఏధమాన ధాతువులు = పెరుగుచున్న ధాతువులు ; జంతు సంకీర్ణంబు = జంతువులతో చెల్లాచెదురుగా నున్నది ; విట్ + మూత్రగర్తంబు = మలమూత్రములున్న గుంట ; క్రిమిభక్షిత శరీరుండు = పురుగులచే తినబడిన దేహము కలవాడు ; కటు = కారము ; తిక్త = చేదు ; ఉష్ణ = వేడియైనది ; లవణ = ఉప్పునిది ; తూర = పొక్కించునట్టిది ; ఆమ్ల + ఆది = పులుపు మొదలగు ; ఉల్బణంబులు = పెచ్చుపెరిగినవి ; పరితప్త + అంగుండు = తాపము చెందిన దేహముకలవాడు ; జరాయువునన్ = మావియందు ; ఆంత్రంబులు = ప్రేగులు ; భుగ్నంబు = వంగినది ; పృష్ట గ్రీవోదరుండు = వీపు మెడ పొట్ట కలవాడు ; స్వ + అంగ చలనంబు = తనదేహపు కదలిక ; శకుంతంబు = పక్షి ; దుష్కృతంబులు = చెడ్డపనులు; దీర్ఘ + ఉచ్ఛ్వాసంబు = పెద్ద నిట్టూర్పు ; లబ్ధజ్ఞానుండు = పొందిన జ్ఞానము కలవాడు ; విట్ + క్రిమిసోదరుండు = మలముతో, పురుగులతో ఒకే గర్భమున ఉన్నవాడు ; ప్రసూతిమారుతంబులు = పురిటి నొప్పులు ; వేపితుండు = వణకింపబడినవాడు ; యాచమానుండు = యాచించుచున్నవాడు ; దేహాత్మదర్శి = దేహమును, ఆత్మను వేరుగా చూడగలవాడు ; పునర్ + గర్భవాసంబు = మరల గర్భమున నివసించుట;

బంధనభూతంబు = కట్టబడినట్టిది ; కృత + అంజలిభూతుండు = దోసిలి యొగ్గినవాడు.

తా : మూడు మాసములకు గోళ్లు, రోమములు, ఎముకలు, చర్మము, నవరంధ్రములు ఏర్పడును. నాలుగవ మాసమున సప్తధాతువులు వేరగును. అయిదవ మాసమునుండి ఆకలి దప్పు లుండును. ఆరవ మాసమున మావియందు పొదుగబడును. తల్లి గర్భమున కుడివైపునను పెరుగుచుండును. తల్లి స్వీకరించిన అన్నపానీయములతో ఆకలి దప్పులు తీర్చుకొనును.

ధాతువులు పెరిగి దేహప్రమాణము పెరుగుచుండగా స్పర్శాది జ్ఞానములు పూర్వవాసనాబలముచే కలుగును. తా నున్నచోట అనేకజీవులు తిరుగుచుండును. మలమూత్రాదులకు దగ్గర పొరలలో నుండును గనుక తల్లి శరీరమున రోగాదు లున్నచో క్రిములు తిరుగుచుండును. తల్లి దండ్రులు ఆచారము, శుచిత్వము ఎరుగని ఎడ్డె మనుష్యులు అయినచో గర్భస్థునకు క్రిములు, రోగాదులు సంక్రమించును. తెలివి తప్పుట, మూర్ఛ మొదలగునవి కూడ కలుగుచుండును. తల్లి ఆహార నియమములను ఎరుగని పశువైనచో రుచులు పుట్టి ఉప్పు, కారము, చేదు, పులుపు గల ద్రవ్యములను ఎక్కువగా తినుచుండును. మక్కువతో మసాలాలు మెక్కును. గర్భస్థునికి ఒడలు మంటలెత్తుచుండును. క్షారపదార్థములు, పులిసి బుడగలు తేరిన నురుగులు వచ్చిన పదార్థ ములను ఆమె కోరును. ( పుల్లమజ్జిగ, మద్యములు, పులిపొంగ రాలు మొదలగునవి. ) ఆ యా దినములలో శిశువు తీవ్ర బాధలకు గురియగు చుండును. మావిచే కప్పబడి రక్షింపబడుచున్నను తల్లి వికృత చేష్టలచే ప్రేగులలో చిక్కుకొనును.

గర్భమున శిరస్సు మోపి, ముడుచుకొని పండుకొనును. అవయవములను కదలించుటకు చోటు లేదు. పంజరమున చిలుక వలె మనస్సు స్వేచ్ఛను కోరినను దేహమునకు అవకాశ ముండదు. అప్పు డతనికి దైవదత్తమగు జ్ఞానము కలుగును. పూర్వజన్మ యందు తాను చేసిన దుష్కర్మలు తలపునకు వచ్చును. ( మనస్సు నకు కాలవిభాగము లేదు గనుక అవి పూర్వజన్మవి అని తెలియదు.

ఈ జన్మలో ఇంకను కర్మలు చేయలేదు గనుక పూర్వ స్మరణలే కర్మలుగా భాసించును. స్వప్నమున ఎప్పుడో చనిపోయినవారు మనతో తిరుగుచున్నట్లు కనిపించునుగదా! అట్లే ఇదియును.) పూర్వ పాపస్మరణలకు ఉలికిపడుచు నిట్టూర్చుచుండును. (శ్వాస లేదుగనుక నిట్టూర్పు స్పందన రూపమున ఉండును. అప్పుడు పిండము స్పందించుచున్నది యందురు.) సుఖ ముండదు. ఏడవ నెలయందు ఈ జ్ఞానము, చేష్టలు కలుగును. అపరిశుద్ధ ప్రదేశమున ఉంటిసని బాధ కలుగును. మలముతోను, క్రిములతోను ఏకోదరుడై అటు నిటు కదలుచుండును. అప్పుడు తల్లికి నొప్పులు కలుగును. ప్రసవవేదన అనాచారమువలన అకాలమున కలుగగా అతడు వణుకుచుండును.

దేహము వేరుగా, ఆత్మ వేరుగా తెలిసికొను ప్రజ్ఞ ఉండును. దానినుండి బయటపడవలెనని కోరుట తెలియును. ఉన్న స్థితికి భయపడుట తెలియును. సప్తధాతువులును బంధనములవలె తోచును. చేతులు దగ్గరగా ముడుచుకొని యుండుటవలన పూర్వవాసనాబలమున నమస్కారము చేసి దేవుని స్మరించును. "నే నిందెట్లుంటిని? ఎవరి వలన ఉంటిని" అను ప్రశ్న పుట్టి దైవఘటన స్ఫురించును. భగవంతుని ప్రార్థించును.

991. టీక : అనయము = మిక్కిలి, భువన రక్షణము = లోకములను రక్షించుట ; స్వేచ్ఛాను రూపమునన్ = స్వేచ్ఛను అనుసరించిన విధమున ; భయవిరహితము = నిర్భయమైనది ; పద వనజ యుగంబు = పాద పద్మముల జంట ; అర్థిన్ = కోరికతో.

తా. నిత్యము లోకములను రక్షించుటయే తన ఇచ్ఛగా స్వతంత్రుడై ఉద్భవించుచున్న విష్ణుమూర్తియొక్క పాదపద్మములను నిర్భీతినై ధారాళమైన భక్తితో స్తుతింతును. (దేహమునకు స్వేచ్ఛలేక తల్లి గర్భమున ప్రజ్ఞా స్వరూపుడై వున్న జీవుడు తనకును, దేహమునకును గల భేదము గమనింపగల బ్రహ్మ జ్ఞానముతో నుండును. కనుక దేహబంధములు లెక్కచేయని నిర్భీతి దేనివలన కలుగునో తెలిసికొనగలిగి యుండును. అది

యెడ తెగని విష్ణు భక్తియే అని గ్రహించును. అనగా దేహమునకు వేరుగా అస్తిత్వమున్నదని నమ్మక దేహ మపుడు గూడ విష్ణువే యని గుర్తుంచుకొనుటకు యత్నించును. లేనిచో దేహమునకు వేరైన అస్తిత్వమును అంగీకరించిన వాడగును. అపుడు దేహము తానే యని బద్ధుడగుట కలుగును. లేదా దేహబంధము చూచి భయపడినవా డగును. రెండును దుఃఖ కారణములే. )

992. టీక : పంచభూత విరహితుండు = పంచభూతములు లేనివాడు ; పంచభూత విరచితంబు = పంచభూతములచే నిర్మింప బడినది ; ఇంద్రియగుణ + అర్థ చిత్ + ఆభాస జ్ఞానుండు = ఇంద్రియములు, వాని గుణములు, ఇంద్రియార్థములు అనువాని యస్తిత్వము గ్రహించుటవలన వాని రూపముచెంది నిల్చిన ప్రతిబింబ జ్ఞానము కలవాడు. ( ఇంద్రియములు అంతర్యామిత్వము నుండి పుట్టినవి. అందు అంతర్యామిత్వమును స్మరించినచో జ్ఞానస్థితి యుండును. ఇంద్రియాదులను స్మరించినచో ఆభాస జ్ఞానస్థితి యుండును. మట్టితో చేయబడిన కుండ విషయమున మట్టి జ్ఞప్తియున్నచో సహజవస్తువు. కుండ జ్ఞప్తియున్నచో కల్పిత వస్తువు. అందు మొదటిది సహజ జ్ఞానము. రెండవది ఆభాస జ్ఞానము. )

తా. నాకు పంచభూతములు లేవు. అయినను పంచ భూతములచే నిర్మాణమైన దేహమునందు కప్పబడి యున్నాను. కనుక ఇంద్రియములు, ఇంద్రియార్థములు, ఇంద్రియగుణములు మున్నగువాని రూపము చెందిన తాత్కాలిక జ్ఞానస్వరూపుడనై యున్నాను.

993. టీక : నిఖలభూత + ఇంద్రియమయము = సమస్త భూతములతో, ఇంద్రియములతో నిండినది ( భూతములు అనగా పంచభూతములు లేక వానితో రూపముకట్టుకొన్న జీవరాసులు); మాయా + అవలంబన = మాయను అవలంబించుట ( రూపాదిక మైన మాయగా జ్ఞానము ఉండుట ) ; మహితకర్మబద్ధుండు = గొప్ప కర్మబంధము కలవాడు ; దందహ్యమానంబు = దహించు చున్నది ; జీవచిత్తంబు = జీవుని చిత్తము ( మనస్సు, ఇంద్రియ

ప్రవృత్తులు కలిపి చిత్తము అనబడును) ; అవికారము =మార్పులు లేనిది ; ముఖ్యచరితుఁడు = అన్నిటికన్న మొదట చెప్పదగిన వృత్తాంతము కలవాడు, లేక ముఖమునందు స్తుతిరూపమున చరించువాడు ; అకుంఠితశౌర్యుఁడు = కుంటుపడని ప్రతాపము కలవాడు ; పరంజ్యోతి = అన్నిటికి పైనున్న వెలుగు ; కృపాశాంత మతి = దయతో శాంతమైన మనస్సుకలవాడు ( దయాగుణమును అభ్యసించువారి మనస్సులందు శాంతగుణము రూపమున వసించు వాడు ) కడఁగి = పూని ; పరముఁడు = ఉత్తముడు ; అస్మదీయ = నాయొక్క ; దుర్భర = భరింపరాని ; ఉదగ్ర = చెలరేగుచున్న ; భీకరగర్భనరకవేదనలన్ = భయంకరమగు గర్భస్థితియను నరక బాధలను.

తా. సర్వజీవరాసులును, వానియందలి పంచేంద్రియములు, పంచభూతములు మొదలగునవి అన్నియు తన రూపములే. తాను సత్యము. రూపములు మాయ. తాను అట్టిమాయను అంగీక రించును. కనుక కర్మబద్ధుడై వర్తించుచున్నట్లు ఉండును. ( జీవుడుగా కర్మబద్ధుడై ఉండును. అంతర్యామిగా కర్మాతీతుడై ఉండును. ఉన్నది ఒక్కడే గనుక కర్మబద్ధుడై ఉండుట తనకు అంగీకారమైన క్రీడ. నిజముగా కర్మబద్ధుడై జీవుడుగా చరించుట, భయపడుట మున్నగు లక్షణములు తన క్రీడలోని భాగములు. అయినను జీవునకు సత్యములు. ) ఇట్టి మాయలతో జీవుని చిత్తము దహించుకొనిపోవు చుండును. దానియందు అంతర్యామి ఎట్టిమార్పు లేనివాడై పరిశుద్ధుడై వర్తించును. అతని జ్ఞానము అఖండము. అనగా తెలియువాడు, తెలియుట, తెలియబడినది అను ఖండములు కాలేదు. అట్లున్న వాడే ముఖ్యచరితుడు. అనగా వాని కర్తవ్యమే ధ్యానమునకు ముఖ్యము. (ప్రవర్తనను అంగీకరించినను అంతర్యామిత్వము ముఖ్యముగా నిలిచినచో స్తుతింపబడు జీవుల సద్గుణముల రూపములన్నియు వాని వైభవములే యగును. ) అతని వెలుగు మార్పులచే కుంటుపడినది. దానిని ధ్యానించువాడు కూడ అట్టి స్థితియందే ఉండును. కనుక ధ్యానించువారికి ఆదర్శమై పరమైన జ్యోతి యతడే. జీవుల తెలివి ఖండము కనుక ఆ తెలివికి ఆదర్శమైన తాను సర్వజ్ఞుడు. అతడు ఎప్పుడును దయాగుణముచే

శాంతమైన మనస్సుకలవాడు. దయాగుణమును అభ్యసించువారిలో శాంతమనస్సుగా అతడుండును. అతడు ప్రకృతి పురుషులకన్న పైనున్నవాడు. (సృష్టియంతయు ప్రకృతి. అందు అంతర్యామి పురుషుడు. ఈ రెండిటియందు అంతర్యామి పరమాత్మ.) అట్టి వానికి నమస్కరింతును. భయంకరగర్భముల స్థితినుండి శాంతి కలిగింపుమని వేడుకొందును.

994. టీక : అనవుడు = అని పలుకగా ; ఘనమోహులు= గొప్ప మోహము కలవారు ; గుణకర్మనిమిత్త = గుణములు, కర్మలు నిమిత్తకారణములుగా గల ; సాంసారికమార్గసంచార ములు = సంసారబద్ధుడైన జీవుని మార్గములలో సంచరించుట ; ధృతి + చెడి = ధైర్యము పోగొట్టుకొని ; ఏ యుక్తియు = ఏ విధానము ; తద్గుణధ్యాన = వాని గుణములను ధ్యానించుట ; తత్ + మూర్తిదర్శనములు = వాని మూర్తిని దర్శించుటలు ; ప్రబోధకలితముగ = మేలుకొలుపుతో కూడినట్లు ; సుగుణకదంబ= సద్గుణముల కలయిక కలది.

తా : అపుడు కపిలునితో తల్లి యిట్లనెను : "మహాత్మా! గుణములు, కర్మలు జీవుని మనస్సును పరమాత్మనుండి సృష్టి వైపు లాగును. (అవి భగవంతునిలో భాగమని గుర్తుండక స్వతంత్రముగా కనిపించును) అపుడు జీవి సంసారబద్ధుడగును. ధైర్యము తప్పును. అలసట చెందును. దిక్కు తెలియకుండును. విష్ణుపాదములను ధ్యానించుట మరచిపోవును. అట్టివానికి ఏ మార్గమును అవలంబించినను పనికిరాదు. భగవంతుని అనుగ్రహము ఒక్కటే శరణ్యము. అట్టి స్థితియందు వాని గుణము లను ధ్యానించుట, వాని మూర్తిని దర్శించుట ఎట్లు సాధ్య మగునో మెలకువలతో ఉపదేశింపుము" అని కోరగా తల్లితో కపిలుడు ఇట్లనెను : (సంసారబాధలలో చిక్కుకొనినపుడు దైవధ్యానము గుర్తుండనివాడు గుర్తు తెచ్చుకొనుట ఎట్లు సాధ్యము ? దానికి భగవదనుగ్రహము ఒక్కటే శరణ్యము. ప్రశ్నించుటకు నాకు నీవు దొరకుట, నీవు నా సందేహమును తీర్చుట అనుగ్రహముయొక్క రూపములని భావము.)

995. టీక : కాలత్రయంబు = భూతము, భవిష్యత్తు, వర్తమానము ; జంగమ స్థావర + అంతర్యామి = కదలునవి, కదలనివి యగు వానిలో నిండియున్నవాడు ; జీవకర్మ మార్గంబులు = జీవుల పనుల దారులు.

తా. అట్టి ఈశ్వరుడు మూడు కాలముల యందును నిండి యుండును. అన్ని వస్తువుల యందును, కదలెడి జీవు లందును, కదలని శిలలు మున్నగువాని యందును తానే యుండును. జీవుడు స్వతంత్రముగా తన కర్మలు సృష్టించుకొనును. అందు బద్ధులైన వారికి తాపత్రయములు కలుగును. వారు వానిని సర్వాంతర్యామిగా భజించి బాధలు పోగొట్టుకొందురు. ( జీవులు చేయవలసినది చేయుటకన్న చేయదలచినది చేయుచుందురు. దానితో కర్మ బంధము ఫలితముల రూపమున చుట్టుకొనును. దానితో తాపములు కలుగును. పోగొట్టుకొనుటకై ధనికులు మున్నగువారిని ఆశ్రయింతురు. అనగా వారి రూపములలో నున్న నారాయణుని ఆశ్రయింతురు. క్రమముగా మనస్సు కొన్ని జన్మలవెంట పరిప్రశ్నము చేసికొని అంతర్యామిని ధ్యానించుట నేర్చును. బాధలు కొంత కొంత శమించుచుండును. )

996. టీక : ఘనక్రిమి = పెద్ద పురుగులు ; విట్ + మూత్ర రక్త గర్తము = మలమూత్రములు, రక్తము గల గుంట ; జఠరాగ్ని = ఆకలిమంట ; తంతప్యమాన దేహుండు = తపింపచేయబడుచున్న దేహము కలవాడు.

తా. తల్లీ! జీవుడు గర్భమున క్రిముల నడుమను, మలమూత్రము రక్తముల గుంటలో మునిగి తేలుచు, ఆకలితో దహించుకొనుచున్న దేహము కలిగి యుండును.

997. టీక : నిర్గమింపన్ = వెలువడుటకు ; ఎన్నికొనుచు = లెక్కపెట్టుచు.

తా. దీనమైన ముఖము కలవాడై అట్టి గర్భనరకమునుండి వెలువడగోరి, నెలలను లెక్కపెట్టుకొనును. ఈ గర్భమునుండి వెలువరించువారు కలరా యని వెదకును.

998. టీక : ప్రతి + ఉపకారము = తిరిగి మేలుచేయుట ; శమ దమాది యుక్తంబు = శాంతి, మనోనిగ్రహము మొదలగు వానితో కూడినది.

తా. దీనులను రక్షించువాడు దేవుడు ఒక్కడే. ఈ గర్భము నుండి అతడే నన్ను వెలువరింప గోరెదను. దానికి నే నేమి ప్రత్యుపకారము చేయగలను ? చేయుటకు నా దగ్గర ఏమున్నది ? అంజలి మాత్రము ఘటించి యున్నాను. ఒక్కటే కోరెదను. ఈ రాబోవు జన్మము శాంతితో, మనోనిగ్రహముతో ఉండవలెను. దానికి కావలసినది విజ్ఞానము. దాని దీపపు మొగ్గవంటివాడు ధ్యానమున నాలో వెలుగుచున్నవాడు. వాడు నాకన్న ముందు నుండి యున్నాడు. వానినుండి చూపు చెదరకుండునట్లు చూచెదను. (తల్లి ప్రశ్నించిన భగవదనుగ్రహము యొక్క రూపము జీవునకు వేదనల సమయములలో ఎట్లు లభించునో దాని వైఖరి వివరింప బడినది. ఆపదలలో నివారణ మార్గమునకై మనస్సు కార్య కారణములను వ్యక్తుల రూపమున, ద్రవ్యరూపమున, సన్నివేశముల రూపమున వెదకుచుండును. బాధ పట్టరానిది అయినపుడు ఆ రూపములను చీల్చుకొని మనస్సు అంతర్యామియొక్క రూపముల వైపునకు మళ్లును. ఇట్టిదే వాని అనుగ్రహము.)

999. టీక : నెలకొని = నిండై ; ఆలయము = స్థానము ; బహిఃప్రదేశము = వెలుపలి చోటు ; అనుపమ = సాటిలేని ; దేశమాయా విమోహిత + ఆత్ముండను = ఒక ప్రదేశమునందు మాయచే మోహింపబడినవాడు ; పరిశ్రమణశీలి = మిక్కిలి కష్టపడు స్వభావము కలవాడు ; భూరి సంసార సాగర + ఉత్తార ణంబు = విస్తారమైన సంసార మను సముద్రమును దాటుట.

తా. నిండిన అనేక దుఃఖములకు స్థానమైన ఈ గర్భ నరకము వెలువడుటకు నేను సమర్థుడను గాను. (కనుక ఇది యంతయు గర్భనరకముగా ధ్యానింపక దైవక్రీడగా ధ్యానించెదను.) అట్లుకాక దీనిని భరింపలేనను భావము కలిగి వెలుపలకు వచ్చినను దేశకాలాదుల నడుమ మాయలో చిక్కి, మోహపడి, భయంకర మైన సంసార చక్రమున శ్రమలను కల్పించుకొనుచుండవలసినదే

గదా! (ఇది యంతయు దైవకల్పనమని తెలియక దీనినుండి వెలువడవలెనని కొట్టుమిట్టాడిన వెనుక వెలువడినను పరిసరముల భావనలో చిక్కుకొందునే గాని అప్పుడును దైవభావన కలుగదు. గర్భ నరకము అని భ్రమపడుచున్నది. దైవఘటన మను జ్ఞానము కలుగనిచో పుట్టిన వెనుక సన్నివేశముల జ్ఞానమే యుండును గాని దైవఘటన ధ్యానముండదు గదా! ఉన్న పరిస్థితులకు భయపడి ప్రార్థించువాడు దైవానుగ్రహమును చూడలేడు. ఉన్న పరిస్థితులు దైవలీలలలో భాగములని మొదట భావింప గలిగినపుడే జీవితమున అనుగ్రహ మన ఎట్టిదో తెలియగలదు.) కనుక ఈ గర్భమున గలుగు శోకము పోగొట్టి సారథియై నడుపుచున్నట్టి జ్ఞానమే పుట్టిన వెనుక సంసార సాగరమును గూడ దాటి రక్షించునని నమ్ముచున్నాను. అట్టి ఆత్మజ్ఞానమును స్మరింతును.

1000, 1001. టీక : పరగుచు = ప్రసిద్ధమగుచు; దుర్వ్యసన భాజనము = చెడ్డబాధలకు స్థానము; ఘన దుఃఖ మూలము = గొప్ప దుఃఖమునకు కారణము; తూంట్లు = కన్నములు; క్రిమి సంభవము = పురుగులు పుట్టునవి; దుస్తర = దాటరాని; బహు గర్భవాసములు = అనేక గర్భములందు వసించుట; సంగతి = కూడిక; భూరి = అధికమైన; భవసాగరతారక = సంసార సాగరమును తరింపచేయునట్టి.

తా. అతనిని మరచి యితరమైన ఈ పరిస్థితిని గమనించినచో ఈ గర్భనరకము సత్యమగును. అది సకలబాధలకు, దుఃఖములకు మూలము. దీనితో దేహము కన్నములతో కూడిన బొమ్మగా కనిపించును. ఈ గర్భమున పురుగులు కరచుచుండును. ఇట్టి గర్భవాసములు ఎన్ని కలుగునో చెప్పలేముకదా! అవి సత్యత్వము చెందు భావన దాటరానిది. దానిని పోగొట్టుటకై నారాయణుని పాదపద్మములను స్మరింతును.

1002. టీక : కృతనిశ్చయుఁడు = నిశ్చయించుకొన్నవాడు; ఏఁచిన = అతిశయించిన; విమలజ్ఞాని = నిర్మలజ్ఞానము కలవాడు; వెడలనొల్లకుండన్ = వెలువడ నంగీకరింపకుండ.

తా. ఇట్లు నిశ్చయించుకొని, నిర్మలజ్ఞానము కలవాడై జీవుడు గర్భమునుండి స్వతంత్రించి వెలుపడు కోరికను విడిచి పెట్టును. తొమ్మిది మాసములు జరుగును.

1003. టీక : అధోముఖున్ = దిగువగానున్న నోరు కలవానిని ; ఘనదుఃఖభాజనుండు = గొప్ప దుఃఖమునకు స్థానమైన వాడు ; విగతజ్ఞానుండు = విడిచిన జ్ఞానము కలవాడు ; రక్త దిగ్ధాంగుడు = నెత్తుటితో పులుమబడిన దేహము కలవాడు ; విష్ఠాస్థక్రిమి = మలమందున్న పురుగు ; జడుండు = తెలివిలేనివాడు ; నిజభావ + అనభిజ్ఞులు = తన భావము ఎరుగనివారు ; అభిమత + అర్థములు = ఇష్టమైన కోరికలు ; అనేక కీట సంకులంబు = పలు పురుగులచే లుకలుక లాడుచున్నది ; పర్యంకంబు = శయ్య ; కండూయమానంబులు = దురద పుట్టునవి ; ఆసన + ఉత్థాన గమనంబులు = కూర్చుండుట, లేచి నిలబడుట, నడచుట ; మశక మత్కుణ మక్షికాదులు = దోమలు, నల్లులు, ఈగలు మొదలగునవి ; వ్యథంబడు = బాధింపబడు ; దోదూయమానుండు = ఎగురగొట్టబడువాడు ; విగతజ్ఞానుండు = విడిచిన జ్ఞానము కలవాడు ; శైశవంబు = శిశుత్వము ; తత్ + తత్ + క్రియా + అనుభవంబు = ఆ యా పనుల యనుభవము ; పౌగండ వయస్సు = అయిదేండ్లు దాటినతర్వాత వయస్సు ; తత్ + అనురూపములు = దానికి తగినవి ; అధ్యయనాది దుఃఖంబులు = చదువు మున్నగు బాధలు ; అభిమత + అర్థఫలప్రాప్తి = ఇష్టమైన కోరికలు ఫలించుటకు ; వృథ + ఆగ్రహంబు = వ్యర్థమైన కోపాదులు ; తత్ + అర్థములు = దానికొరకైనవి ; దుష్పురుష సంగమంబు = చెడ్డవారి సహవాసము ; శిశ్నోదర పరాయణుండు = కామము, తిండి ఆదర్శములుగా కలవాడు ; వర్ధిష్యమాణరోషుండు = పెరుగుచున్న రోషము కలవాడు ; నిజనాశంబు = తాను నశించుట.

తా. పదియవ మాసమున అధోముఖుడై, ఉచ్ఛ్వాస నిశ్వాసములు లేక ఉక్కిరి బిక్కిరియై, దుఃఖపడి, భూపతనము చెందును. పూర్వమున్న జ్ఞానము మరుగుపడును. రక్తముతో తడిసి మలములో పడు పురుగువలె నేలపై పడి ఏడ్చును.

మూఢునివలె తన యుద్దేశములు ఎరుగనివారిచేత పెంచ బడును. తనబాధలు చెప్పలేడు. కావలసిన వానిని అడుగ లేడు. పండుకొని కూర్చుండుటకు, లేచుటకు, నడచుటకు సాధ్య పడదు. మంచమున పురుగులు, నల్లులు, దోమలు, ఈగలు కుట్టినను తోలుకొనుట చేతకాదు. దురదపుట్టినచో గోకికొన లేడు. అటు నిటు మిట్టిపడుచు పురుగువలె శోకించుచుండును.

శిశువు వయస్సున ఇట్టి అనుభవములు కలిగి మెల్లగా అయిదేండ్ల తరువాతనుండి కొంత తన బాధ్యత తనదిగా ఉండును. ఆటుపైన చదువు లను పేర కొన్ని బాధలను అనుభ వించును. (ఈ చదువులు అనేక శాస్త్రముల భారమును కలిగించునుగాని సుఖమునకు మార్గమును చూపవు. నిజమైన చదువు భగవదనుగ్రహమున గాని కలుగదు. అది కలుగనంత వరకు చదువు లన్నియు మానవకల్పితములైన భావపంక్తి, అక్షరపంక్తి యగును. వీనిని విడిచి నిజమైన చదువు అబ్బుట దైవానుగ్రహము. అది ప్రహ్లాదచరిత్రలో వివరింపబడును.) ఆటుపైన యౌవన వయస్సు వచ్చును. కోరికలు పుట్టును. వానిని తీర్చుకొనుటకు సాహసబుద్ధి పుట్టును. తీరనపుడు వ్యర్థమైన కోపము, తీరినపుడు మిక్కుటమైన కామము కలిగి పంచభూతముల ఘర్ష ణలో బాధలే పడును. అహంకార మమకారములు పొంది సంకల్పములు చేయును. వాని ననుసరించి కర్మలు ఆచరించును. సంసారమున చిక్కుకొనును. చెడ్డవారి సహవాసము అబ్బును. కామము, తిండి ఆదర్శములై తిరుగును. విఘ్నములతో రోషము పెరుగుచుండును. పట్టుదలలు పెరిగి దుఃఖము అనుభవించును. కోరికలు ముదిరి తన వినాశము కలిగించు పనులకు ప్రేరేపించును.

1004. టీక : ధృతి = ధైర్యము; క్షమ = ఓర్పు; శమము = శాంతి; దమము = మనస్సును నిగ్రహించుట; అసత్సంగము = చెడ్డవారి సహవాసము; మూఢహృదయులు = మోహముచెందిన హృదయము కలవారు; దేహాత్మబుద్ధులు = దేహమే తానని నమ్మువారు; అంగనామోహ= స్త్రీ మోహము; పాశబద్ధకేళీమృగంబులు= త్రాటిచే కట్టబడిన పెంపుడు జంతువులు; శోచ్యభావులు = శోకము పొందదగిన సంకల్పములు కలవారు;

తా. తల్లీ! చెడ్డవారి సాంగత్యమువలన సత్యము, శుచి, దయ, ధైర్యము, మౌనము, సిగ్గు, ఓర్పు, బుద్ధిబలము, పేరుప్రతిష్ఠలు చెడును. శాంతి యుండదు. మనస్సు వశమున ఉండదు. కనుక మూఢులై వర్తించువారితో తిరుగరాదు. అశాంతితో బాధపడువారితో స్నేహము చేయరాదు. దేహమే ఆత్మ యనుకొనువారు స్త్రీమోహమున తిరుగుచుందురు. వారి బ్రతుకంతయు మోహమను త్రాటిచే బంధింపబడి ఆడువారు, ఆడుకొను పెంపుడు జంతువుల బ్రతుకువలె ఉండును. తమ మనస్సు ఇతరుల వశమున ఉన్నవారు దుఃఖము నిరంతరము అనుభవించుచుందురు. వారితో సహవాసము చేయుట సాధకునకు తగదు. స్త్రీ సంగము అన్నిదోషములకన్న బలీయము. (1. అజ్ఞానమునందు గాని, బాధలయందు గాని వున్నవారిని దయతో చూడమని యోగసాధనయందు చెప్పబడినది. ఇది దానికి విరుద్ధముగా ఉన్నదనరాదు. సాధన కాలమున మాత్రము సాంగత్యము భ్రష్టత కలిగించును. అజ్ఞానులపై, దీనులపై, దయ చూపుట సాధనలో నిశ్చలత చెందినవాడు చేయవలసిన పని. తాను చాంచల్యమున బడి, యితరులను ఎట్లు రక్షించును? సాధకుడు ప్రారంభదశలో దుస్సాంగత్యము పరిహరింపవలె ననుట తప్పనిసరి. 2. తల్లితో సంభాషించుచు స్త్రీ సంగము దోష మనుట బాగుగా నున్నదా అనవచ్చును. ఇచ్చట సంగము దోషమని చెప్పబడినదిగాని స్త్రీ దోషి యని చెప్పబడలేదు. పురుషునకు స్త్రీ సంగము వలెనే స్త్రీకి గూడ పురుష సంగము సాధన కాలమున పరిహరింపవలసినది. తల్లితో సంభాషించుటలో పామరునకు గూడ సంగముండదు గనుక ఇట్లు చెప్పుట తప్పుకాదు. సర్వజ్ఞుడైన అవతారమూర్తి చెప్పుట ఎన్నడును తప్పుగాదు. మిగిలినవారు చెప్పలేరు గదా!)

1005. టీక: భారతి = సరస్వతి; ప్రజాపతి = బ్రహ్మ; మృగరూపధారిణి = ఆడు లేడి రూపము ధరించినది; తదీయ = ఆమె యొక్క; రూపరేఖావిలాసంబులు = ఆకారము, అందము, శోభ; ఓటువడి = లొంగిపోయి; వివశీకృతి + అంతరంగుండు = వశము కాని హృదయము కలవాడు; విగతత్రపుండు = సిగ్గు విడిచినవాడు;

తత్ + అనుధావనంబు = దాని వెంట పరుగెత్తుట ; హేయంబు = ఏవగింపుగలది; అంగనాసంగంబు= స్త్రీ సాంగత్యము; అస్మదీయ= నాయొక్క ; నాభికమలసంజాత = బొడ్డున తమ్మిపూవునందు పుట్టిన ; చతుర్ముఖ నిర్మిత = బ్రహ్మచే సృష్టింపబడిన ; మరీచి + ఆది + ఉద్భూత = మరీచి మొదలగువారికి పుట్టిన ; కశ్యప + ఆది కల్పిత = కశ్యపుడు మొదలగువారిచే సృష్టింపబడిన ; కామినీజన మధ్యంబునన్ =కామముగల స్త్రీల నడుమ ; విఖండితమనసుండు= తెగి ముక్కలైన మనస్సు కలవాడు.

తా. దీనినిగూర్చి ఇతిహాస మొక్కటి యున్నది. వివరించెదను వినుము : పూర్వము సృష్టికర్తయైన బ్రహ్మ తనభార్యయగు సరస్వతిని ఆడు లేడి రూపమున ఉండగా చూచెను. దాని రూపమునకు, అందచందములకు లొంగిపోయి మనస్సు వశము తప్పెను. సిగ్గువిడిచి తానును లేడిరూపము ధరించి దాని వెంట పరుగెత్తెను. అది యేవగింపని భావింపలేదు. కనుక నా నాభికమలమున పుట్టిన ఈ చతుర్ముఖుని వలననే గదా మరీచి, కశ్యపుడు మున్నగు ప్రజాపతులును, దేవతలును, మనుష్యులును సృష్టింపబడిరి. ( అతని సంస్కారమునకు లోబడినవారే గదా ! ) కనుక కామము గల స్త్రీల మధ్య తిరుగుచు మనస్సు వికలము కాకుండువారు దేవ మనుష్యాదులలో ఎవ్వరును లేరు. మహా తపశ్శాలియైన నారాయణఋషి యొక్కనికి తప్ప మరెవ్వరికిని అది సాధ్యము కాదు. ( సరస్వతి లేడిరూపమున ఉండగా చతుర్ముఖుడు కాముకుడై వెంటపడె నన్నది వేదములలోని ఇతిహాసము. దీనికి వేదార్థ మున్నది. అనగా రహస్యార్థము. మృగ శబ్దమునకు జంతువని శ్లేష. చతుర్ముఖబ్రహ్మ ఈ సృష్టిని భౌతికముగా కల్పింపవలసినపుడు రూపము, అందము అనునవి పుట్టినవి. స్త్రీ పురుష భేదము తప్పనిసరి యయ్యెను. రెండింటి దేహములందును తానే నిండియుండెను. తననుండి నామరూపాదికమైన సృష్టిని ఉచ్చారణముగా సృష్టించెను. అది సృష్టిగా ప్రసరించి అతని వాక్కుగా వెలువడెను. ప్రసరించి వచ్చినది గనుక ప్రవాహము, లేక సరస్వతి యనబడెను. ఆమె మాత్రము వివిధ దేహరూపములలో ఉన్నదిగాని తానుగా లేదు. అందంతర్యామిగా తా నుండ

వలె నన్నచో తా నా రూపముల వెంట పడవలెను. అంతేకాదు. ఆడ మగ రూపములు ధరింపవలెను. కామము పొందవలెను. సిగ్గులేక క్రీడింపవలెను. ఇట్లు భౌతికసృష్టి యంతయు స్త్రీ పురుష సంబంధమైన కామము నుండియే పుట్టవలెను గనుక సృష్టికి కామ సంస్కారము తప్పించుకొనలేని బంధము. దానికి మనస్సు లొంగ కుండుట సత్యము కాదు. లొంగకుండవలె నన్నచో ఆవాతావరణము నకు గురికారాదు. కామము చెందిన స్త్రీల సహవాసము సాధకుడు విడువవలెను.

నారాయణఋషి యొక్కనికి ఈ సంస్కారము వర్తింపదు. నారాయణుడే ఋషియై తపస్సును ఉదాహరణముగా చేసి జీవులకు ధారపోసెను. కనుక వానియందు అది వర్తింపదు. నారాయణుడు అతడుగా నంతర్యామిగా నుండగా జీవులు నేర్చుకొన లేరు గనుక నారాయణుడు ఋషిగా దిగివచ్చెను. తనతో జీవాంశను నరుడను ఋషిగా గొనివచ్చెను. వారి తపస్సువలననే నరజాతిలో తపస్సు, ఇంద్రియ నిగ్రహము, శాంతి, దయ, మోక్ష విద్య, సంస్కారములు నుండెను. లేనిచో నరులు కల్పించుకొను వాఙ్మయశాస్త్రజాలమున ఈ విద్య లుండుట సాధ్యముకాదు.)

1006. టీక : కామినీ రూపము=కామముగల స్త్రీరూపము ; సతుల సంగంబుల = స్త్రీల సాంగత్యము.

తా. పురుషులు కామముగల స్త్రీలయందు వ్యామోహము చెందుట మాయవలన. అది నావలన సంభవించుచున్నది. గనుక జీవులు మోహపడక తప్పదు. సాధకులు యోగము నభ్యసించు నపుడు స్త్రీలతో సహవాసము చేయరాదు. (మాయ లేనిచో స్త్రీ పురుషులు ఒకరి నొకరు కామింపరు. మాంసపు ముద్దవలె, అస్థిపంజరములవలె లేక పరమాణువుల సముదాయమువలె కనుపింతురు. మోహము లేనిచో కామము లేదు. కామము లేనిచో భౌతికసృష్టి లేదు. ఈ సృష్టి దేవుని క్రీడ గనుక మోహము కూడ అతని మాయలోని భాగమే. జీవుడు దానిని దాటగోరుట క్రీడలోని భాగమే కనుక సంగదోషము విడుచుట కూడ క్రీడా విధానములో భాగమైన యోగసాధనము. )

1007. టీక : మత్ + పదసరసీరుహ = నా పాదపద్మముల ; సేవానురక్తి = సేవించుటయం దనురాగము ; నారీ సంగంబు = స్త్రీల సాంగత్యము ; నెరయ ద్వారము = నరకమునకు ద్వారము.

తా. ధారణను అభ్యసించుటకు ధీరతకావలెను. దానికి నా పాదపద్మములు ఆశ్రయింపవలెను. ఆశ్రయింపవలెనని కోరిక పుట్టినవారు స్త్రీ పురుష సాంగత్యమును నరకద్వారముగా మనస్సులలో భావింతురు. (నరకద్వారమనగా గర్భనరకమునకు ద్వారము. మోక్షసాధనచేయువానికి స్త్రీ పురుష సాంగత్యము నిషిద్ధమా అన్నచో జీవుడు చేయవలసిన కర్తవ్యముపై ఆధారపడి యుండును. కొన్నివందల జన్మలు ప్రకృతికి, భౌతికసృష్టికి తోడ్పడుటకు దేహధారి ప్రకృతిచే వినియోగింపబడును. అట్టి జన్మలలో స్త్రీ పురుష పరస్పరాకర్షణము ప్రకృతి సిద్ధమై యుండును. అప్పుడది నిషిద్ధము కాదు. నిషేధించుకొనినను కృత్రిమ మగును. అట్టి జన్మలలోకూడ మోక్ష స్థితికి అది అడ్డము కాదు. అటుపైన తన కర్తవ్యము పూర్తియైన వెనుక కలిగిన జన్మలలో అది తప్పనిసరి కాకుండును. అప్పుడు వాని సంకల్పము ప్రకృతిచే బద్ధము కాక వానికి స్వేచ్ఛగా ఉండును. అట్టి స్థితిలో ఆకర్షణ ఉండదు. అట్టివారు శుకాదులవలె, శంకర భగవత్పాదులవలె ఆజన్మ శుద్ధులుగా ఉందురు. వారికి గృహస్థ ధర్మమును అంటగట్టజూచినచో నరక ద్వారమే. వ్యాసునివలె పెద్ద ప్రయోజనములకు సంగమించినను వారికి సంగదోష ముండదు. అభిలాష మాత్రము వారికి ఉండదు గనుక దాంపత్యమున సుఖించుట వారి దృష్టిలో నరక ద్వారము.)

1008. టీక : తరుణీ రూపంబు = స్త్రీ రూపము ; బంధుర తృణ పరివృత కూపంబు = ఒత్తుగా పెరిగిన గడ్డితో ఆవరింపబడిన నూయి.

తా. జీవుడు స్త్రీ రూపము ధరించుటకూడ హరి మాయయే. అది గడ్డి ఎత్తుగా పెరిగి కనుపింపక కప్పబడియున్న నేలబారు నూతివలె మృత్యు స్వరూపము. (గడ్డి పెరిగినచోట నూయి ఉన్నట్లు గ్రహింపనిచో జీవులుపడి మృత్యువు పొందుదురు. అట్లే స్త్రీ పురుష సంగమము సుఖమువలె కనుపించుచు ఇతర కర్తవ్య

ములపై నుండి దృష్టిని మరలించి ఆయుర్దాయమును, దేహ పటుత్వమును హరించును. అట్లుకాక గమనించుకొని పోయినచో అది మృత్యురూపము కాదు. మూర్ఖునకు మృత్యుకారణమైన నూయియే బుద్ధిమంతునకు జలము నిచ్చుచున్నది గదా ! )

1009. టీక : ధన పశు పుత్త్ర మిత్ర = ధనము, పశువులు, సంతతి, మిత్రులు ; వనితాగృహ కారణభూతము = ఆడుది, ఇల్లు మొదలగు వానికి కారణమైనది ; తనువునన్ = శరీరమున ; పదంపడి = అటుపైన ; అనుగతము = అనుసరించునది.

తా. ధనము, పశువులు, పుత్త్రులు, మిత్రులు, భార్య, గృహము మున్నగునవి అన్నియు తన ఉనికిపై ఆధారపడి యున్నవి. తాను శరీరము ధరించినపుడు మాత్రమే అది కేంద్రముగా ఇన్నియును ఏర్పడును. ఆ యేర్పడిన వానిలో దేనిపై జీవుడు మమకారము ధరించునో దానికి తగిన శరీరమునే మరల ధరించును. ఇట్లు కర్మఫలమును కర్మలకు అనుగుణముగా అనుభవించును. మింటి కెగిరినను, దిక్కులకు పరుగెత్తినను, బిలములో దూరినను, ఎందైన దాగుకొనినను ఇది తప్పదు. ( మింటిపై పోవుట యనగా పక్షులను వేటాడినచో పక్షియై పుట్టును. బిలములో దూరుట యనగా బిలములో నివసించు జంతువుగా పుట్టుట. దిక్కులకు పోవుట యనగా అటు నిటు పరుగెత్తు జంతువుల దేహమును ధరించుట. దాగుట యనగా సర్పములు, వృశ్చికములు మున్నగు జన్మ లెత్తుట. దేనియందు మనస్సు తీవ్రముగా ఆకర్షింపబడెనో దానికి అనుగుణమైన దేహము సంక్రమింపక తప్పదు. అట్లయినచో స్త్రీ యందు మోహము చెందినవాడు ఆడుదియై పుట్టునా ? రాబోవు వచనమున ఇదియే వివరింపబడును. )

1010. టీక : నిరంతర = ఎడతెగని ; విత్త + అపత్య గృహాది ప్రదంబు = డబ్బు, సంతతి, ఇల్లు మొదలగువాని నిచ్చునది; మత్ + మాయ = నామాయ ; జీవన + ఉపాధి భూతంబు = జీవించుటకు ఆధారమైనది ; స్వ + ఆవాసభూత లోకంబు = తనకు నివాసమైన పంచభూతముల లోకము ; లోకాంతరంబు=మరియొక లోకము ; ప్రారబ్ధ కర్మఫలంబులు=ప్రారంభించిన కర్మల ఫలములు

(ఇప్పుడు చేయుచున్న పనుల ఫలములు); మృగయుండు = వేట కాడు; కాననంబునన్ = అడవియందు; భూత + ఇంద్రియ మనోమయంబు = పంచభూతముల, ఇంద్రియముల రూపములతో, మనస్సుతో చేయబడినది; దేహనిరోధంబు = దేహమును అడ్డగించుట; ఆవిర్భావంబు = పుట్టుట; సకల వస్తువిషయ జ్ఞానంబు = అన్ని పదార్థములకు ఇంద్రియములకు కలిగించు తెలివి; చక్షురింద్రియంబు = కన్ను; ద్రష్టృ దర్శనీయ యోగ్యతా ప్రకారంబు = చూచువానికిని, చూడబడువానికిని నడుమ గల సూటిని అనుసరించునది; భయకార్పణ్యంబులు = భయము, దీనత్వము; సంభ్రమంబు = కంగారు; ముక్తసంగుండు = సంగములు విడిచినవాడు; యోగవైరాగ్యయుక్తంబు = తగువిధమున కలుగవలసిన వైరాగ్యముతో కూడినది; సమ్యక్ + జ్ఞానంబు = చక్కగా కలిగిన తెలివి.

తా. జీవుడు పురుషశరీరము ధరించి స్త్రీయం దాసక్తి పొందును. దానితో ధనము, సంతతి, ఇల్లు మున్నగువానియందు శ్రద్ధ పెరుగును. ఆ కారణమున దానికి తగిన స్త్రీ శరీరమును తరువాతి జన్మలో పొందును. అదే వ్యామోహమున స్త్రీ శరీరము ధరించిన జీవుడు మరల పురుషశరీరము ధరించును. వైరాగ్యము చెందిన పురుషుడు ఎట్లు స్త్రీ వ్యామోహమును విడువవలెనో అట్లే స్త్రీ కూడ పురుష వ్యామోహమును విడువవలెను. పురుషదేహధారి నాశ్రయించుటవలన ధనము, బిడ్డలు, గృహములు కలుగునని ఆపేక్ష పడినచో భర్తలోని భర్తను చూడక మనస్సు ధనాదులను ఆశ్రయించుచున్నది కనుక వానితో పాటు తానును మృత్యువు పొందును.

జీవించుటకు ఆధారమైనది లింగదేహము. అనగా సంస్కారముల కలయికయైన భావము దేహము. దాని నాశ్రయించుకొని భౌతికదేహము ఏర్పడును. భౌతికదేహమును విడిచిన వెనుక పూర్వకర్మల సంస్కారమును లింగశరీరముతో అనుభవించును. దేహమునందున్నపుడు గూడ అనుభవించినది భావమయ దేహముతోనే. జీవుడు ఈ విధముగా కర్మాదులయందు ఆసక్తి

పెంచుకొనును. అవి శుభము నిచ్చునవిగానే యుండినను మృత్యు వనబడు నిత్యపరిణామ చంచలస్థితిలోనికి కొనిపోవుచుండును. అడవిలో వేటకాడు పన్నిన సాధనము లన్నియు లేడికి సుఖమయ ములుగనే కన్పించి మృత్యువును కల్పించును. అట్లే సంస్కార రూపములైన కర్మఫలములు లింగ శరీర భారముతో జీవుని మృత్యువునకు కొనిపోవును. దాని బలమున పంచభూతములతో, ఇంద్రియప్రవర్తనలతో, మనస్సుతో కూడిన దేహము కట్టుకొనును. అట్టి భౌతిక దేహము పుట్టుకను మన జన్మ మనుచున్నాము. దాని మరణమును మన మరణ మనుచున్నాము. ఇదియే సంగము. (చొక్కాపై ఎవడైన బురద కొట్టినచో నాపై బురద కొట్టె ననుచున్నాము. అట్లే ఇదియును.)

పరిసరమందలి సకల వస్తువులును ఇంద్రియ జ్ఞానమువలన అస్తిత్వమును స్థాపించుకొనుచున్నవి. (అందున్నది అంతర్యామి యైనను ఇంద్రియములకు వస్తువులుగా, వ్యక్తులుగా గోచరించును.) ఇంద్రియ వృత్తులలో మొదటిసాధనము జీవునకు చూచునట్టి శక్తి. చూచువాడు, చూడబడునది సమదూరములై సూటి కుదిరి నపుడు చూచుట సంభవించును. వస్తువు సహజముగా కనిపించును. ఈ రెండంశములను తిన్నగా చూడగలిగినచో రెండింటియందున్న అంతర్యామి యొక్కడే అని తెలియును. అదియే యోగదృష్టి. దానివలన కలుగునదియే యోగ్యత. అది కలిగినపుడు జీవునకు జనన మరణములు లేవు. (దేహాదులు ఇంద్రియములకు కనుపించునేగాని లేవని తెలిసినపుడు తనకు జనన మరణములు లేవని తెలియును.) అప్పుడు భయము, దీనత్వము, తొట్రుపాటు తొలగును. జీవుని విధానము దర్శన మిచ్చి జ్ఞానము కలుగును. కలిగి ధీరుడై సంగదోషము విడుచును. యోగసామర్థ్యమువలన వైరాగ్యము వచ్చును. పరిపూర్ణ జ్ఞానదర్శన మగును. మాయచే నిర్మింపబడిన లోకమున దేహాదులయం దాసక్తి మాని చరించును. ఇదే కర్తవ్యము.

1011. టీక : గృహమేధులు = గృహస్థులు ; తత్ + సాధనా + అనుష్ఠాన నిరతులు = దానిని సాధించుటకు అనుష్ఠానము

చేయుటలో నిష్ఠకలవారు ; వేదనిర్ణీత = వేదమున నిర్ణయింపబడిన ; భూరిభగవత్సద్ధర్మ = గొప్పదియైన భగవంతుని ధర్మమైన సత్ప్రవర్తనము ; తత్ + భక్తిపరాఙ్ముఖులు= వానిపై భక్తికి వ్యతిరేకమైనవారు; పైతృకకర్మముల్ =పితృదేవతల నారాధించు కర్మలు ; శిష్టచరితులు = పెద్దల ప్రవర్తనము కలవారు ; దేవపితృవ్రతాఢ్యులు = దేవపూజలు, పితృదేవతల పూజలు చేయుటలో గొప్పతనము కలవారు ; కామ్యచిత్తులు = కోరికలయందు మనస్సు కలవారు ; ధూమాదిగతులు = పొగ మొదలగునవి పోవు మార్గములు ; లుప్తము = లోపించినది.

తా. గృహస్థాశ్రమమును స్వీకరించి, ఆ యా ధర్మములు నెరవేర్చుచు ధర్మార్థకామముల కొరకు జీవితము నడుపుచు, ఆ మూడింటితో సంప్రీతులగువారున్నారు. వానిని సాధించుటయే అనుష్ఠానముగా దీక్షవహించినవారున్నారు. వేదమున నిర్ణయింపబడిన భగవద్భక్తిధర్మము అబ్బనివారున్నారు. వారు ప్రతిదినము దేవతాపూజ చేయుచు నిష్ఠతో పితృకర్మలు ఆచరించుచుందురు. పెద్దలకు సమ్మతమైన ధర్మమయ జీవితమును నిర్వహించుచుందురు. ఇట్లాచరించుటయెల్ల తమకోరికలు తీర్చుకొనుటకే, తమ సుఖజీవనము నడుపుకొనుటకే అయినవారున్నారు. వారు ధూమమార్గమున చంద్రలోకమును పొందుచున్నారు. పుణ్యములు తరిగిపోగా మరల భూలోకమున జన్మమెత్తుచున్నారు. (ధర్మార్థకామములు త్రివర్గ మనబడును. వానికొరకే జీవితము నడుపుట తప్పుకాదు. అర్థము నార్జించుటకు, స్వధర్మము నాచరించుటకు, కోరికలు తీరుటకు, సుఖపడుటకు అర్థము నార్జించుట వీరి మార్గము. ఇదియే ధర్మార్థకామ సమన్వయము. ఇందు పరమావధి కామము. అనగా ధనము, గృహము, భార్య, పేరుప్రతిష్ఠలు అధికారము మున్నగునవి. వానిని నిలబెట్టుకొనుటకు పుణ్యము నార్జింపవలెను. అనగా పదిమందికి సమ్మకము పుట్టుటకు, సద్భావము కలుగుటకు సత్కార్మ లాచరింపవలెను. వానివలన పేరుకొనిన సద్భావమే పుణ్యము. అది వినియోగించినచో తరిగిపోవును. ఎంత ఆర్జించినను పుణ్యఫలమింతే. అది డబ్బువంటిది. ఉన్నంత

వరకే మర్యాదగాని అయిపోయిన తర్వాత బీదవాడే. దానిపై ఆధారపడిన సుఖముకూడ అంతియే.

ఇందు గుప్తార్థము అనబడు వేదార్థ మున్నది. త్రివర్గముల సాధనకై వీరు దేవగణములను ప్రతిదినము ఉపాసింతు రనగా ఇతరులలో ఉన్న ఇంద్రియములు, మనస్సు మున్నగు దేవతలను స్తుతిరూపమున, మర్యాదలుచేయుట రూపమున, లౌక్యముగా ప్రవర్తించుట రూపమున ఆరాధించుచున్నారని యర్థము. ఇదియే కామాత్ములు, స్వర్గపరులు అగువారు వేదవాదరతులుగా చేయు నట్టి వైదిక దేవతోపాసన. అట్లే పితృకర్మలలో పితృదేవతలను సంతోషపెట్టుట యనగా స్త్రీ పురుష సాంగత్య సౌఖ్యము నిచ్చు పుష్టికరములైన ఆహారములను, వాజీకరణము లనబడు ఔషధము లను వేషభాషాదులను వినియోగించి, దేహపటుత్వము కాపాడు కొన చూచుట, యౌవనము పోషించుకొన చూచుట మొదలగు నవి. ఇవి వేదములలో పిండోత్పత్తి యనబడు సత్సంతాన సాధన కొరకు చెప్పబడినవిగాని ముసలివారు కూడ కక్కుర్తిపడి రత్నపురుష లేహ్యము తినుట, దంతములు కట్టించుకొనుట, జుట్టు నకు, మీసమునకు నల్లరంగు నలంకరించుకొనుట కొరకుకాదు.

( శిష్టచరితులు అనగా పెద్దలకు సమ్మతమగునట్లుగా ప్రవర్తించువారు. దానికి ఫలితము ఇహపరసౌఖ్యము. ఎన్ని చేసినను ఈ సత్కర్మల పుణ్యఫలము ఎప్పటికప్పుడు తరగిపోవుచునే యుండును. సత్కర్మలు కర్తవ్యములుగా ఆచరింపదగినవే కాని కామ్యకర్మలుగా ఆచరింపదగినవి కావు. కామ్యకర్మలుగా ఆచరించినవారికి కలుగునవి పుణ్యలోకములు. వారు పోవునది ధూమమార్గ మనబడును. నిప్పు, కట్టె, పొగ అనువానిలో నిప్పువంటివాడు జీవుడు. దేహము కట్టెవలె ఉపాధి. ఇంద్రి యాదుల స్వభావము, సంస్కారములు, కర్మలు, ఫలములు పొగవంటివి. మంటకు, కట్టెకు సంబంధమున్నవరకే పొగయొక్క అస్తిత్వము. దానిని స్వతంత్రమనుకొన్నచో శూన్యము మిగులును. అట్టి లోకమునే కామ్యకర్మలుగా సత్కర్మ లాచరించువారు పొందుదురు.

వారు చంద్రలోకమునకు పోవుదురని చెప్పబడినది. అనగా స్వయంప్రకాశము లేని ప్రతిబింబ స్వరూపమైన పుణ్యమును సుఖముగా పొందుదురు. దాని కెప్పుడును చంద్రకళలవలె పెరుగుట, తరుగుట యుండును. చంద్రుడు మనస్సునకు సంకేతము. వీరు కూర్చిన పుణ్యములు, వాని ఫలములు మనస్సుపై ఆధారపడి యుండును గనుక మృత్యువుతో అంతమై సంస్కారములు పొగ చూరినట్లు ఆవరించి, మరల సంస్కారమయమైన దేహమునకు దిగివచ్చుటకు కారణము లగును.

ఆత్మ సూర్యునివలె స్వచ్ఛమైన అగ్ని. మనస్సు చంద్రునివలె ప్రతిబింబరూపమైన లింగశరీరము. దేహము భూగోళమువంటి భౌతిక స్వరూపము. సూర్యునకు పెరుగుట, తరుగుట, లేకుండుట లక్షణము గనుక అంతర్యామి సాధనకు అతడు చిహ్నము.

1012, 1013: టీక: ప్రవిమల + అనంతభోగితల్పంబు= మిక్కిలి నిర్మలమైన అనంతుడను సర్పశయ్య; యోగ నిద్రచెందిన వాడు; విలయంబు = ప్రళయము.

తా: నిర్మలమైన అనంతు డనబడు ఆదిశేషుని శయ్యపై యోగనిద్రలో హరి యున్నవేళ సర్వలోకములును వానియందు లయమై యుండును. అట్టి సర్వేశ్వరుని గూర్చియే మహాను భావులు ధ్యానింతురు. (పై చెప్పిన ధూమమార్గమువారు గాక మోక్షమార్గమువారి ధ్యానము ఇచ్చట చెప్పబడినది. వారి మనస్సు భౌతికజీవితము యొక్క సుఖదుఃఖముల సర్దుబాట్లను గూర్చి ఆలోచింపక వానియం దంతర్యామిగా వెలుగు చున్న నారాయణుని ధ్యానించును. దానికి ధూమ లక్షణము ఉండదు. పొగలోగూడ అంతర్యామిని ధ్యానించునపుడు పొగ యనునది వేరొక స్థితికాదు. అట్లే దేహేంద్రియాదులయం దంత ర్యామిని ధ్యానించినచో దేహేంద్రియాదుల మాలిన్య ముండదు. నిర్మలస్థితి యుండును. ఆద్యంతము లుండవు. అదియే అనంతుడు లేక శేషుడు. దేహము శయ్యగా అంతర్యామి శయనించి యుండును. తనయందు తాను మేల్కొని యుండును గనుక ఇంద్రియములకు, మనస్సునకు నిద్రవంటిస్థితి యుండును. ఇదియే

యోగనిద్ర. మనస్సుపై ఆధారపడి జీవించువానికి పూర్తి నిద్ర వచ్చును; దానినే సుషుప్తి యందురు. తనయందు మేలుకొని యున్నవానికి యోగనిద్ర యుండును. అట్టి స్థితిలో ఇంద్రియములు, మనస్సు, దేహప్రవృత్తులు తనలో భాగమై వేరుగా అస్తిత్వము లేకుండును గనుక వానికి అది లయస్థితి లేక ప్రళయస్థితి యందురు. ఈ సాధన చేయువారి ఆనందము లింగశరీరముపై ఆధారపడదు గనుక దేహజననము, దేహత్యాగము అనువానిపై ఆధారపడదు. అనగా వారికి జన్మ లుండవు.)

1014. టీక : నిజభక్తి యుక్తిగరిమన్ = తన భక్తితో కూడిన గొప్పతనమున; పంకేరుహ + ఉదర = విష్ణుమూర్తి; విన్యస్త = ఉంచబడిన; శాంతస్వాంతులు = శాంతమైన మనస్సు గలవారు; పరివర్జించి = పరిత్యాగముచేసి; పంకజపత్ర + ఈక్షణ + ఇతర = విష్ణుమూర్తికన్న వేరైన; ధర్మ + ఏక నివృత్తులు = ఒకే స్వభావమునుండి మరలినవారు; సతతమున్ = ఎల్లప్పుడు; దైత్యారి = విష్ణువు.

తా. సమస్త సంగములను పరిత్యజించి, ముక్తి పొందువారు తమ భక్తిసాధనలో సమస్తధర్మములను విష్ణువునందు సమర్పణము చేయుదురు. శాంత మనస్సుతో ఉందురు. విష్ణుమూర్తికన్న ఇతరమునందు మనస్సు వారికి ప్రసరింపదు. సందులేని విష్ణు ధ్యానమే వారియందు నిలిచియుండును. (దైత్యులు ఇంద్రియ మనఃప్రవృత్తులలో దుష్ట సంకల్పముగా పుట్టుచున్నారు. వారికి స్థాన ముండదు గనుక విష్ణుని ధ్యానించుట దైత్యులను సంహరించు వాని ధ్యానమే యగును.)

1015. టీక : అర్థిన్ = కుతూహలముతో; అర్చిరాదిమార్గ గతుండు = వెలుగు మొదలగు మార్గములలో ఉన్నవాడు; విశ్వతోముఖుండు = అన్ని దిక్కులను తన ముఖములు కలవాడు; విమలయశుఁడు = నిర్మల కీర్తి కలవాడు; జగత్ + ఉద్భవస్థాన సంహారకారణుండు = లోకముల పుట్టుకను, నిలకడను, లయము నకు కారణుడైనవాడు; అవ్యయుండు = తరుగనివాడు; అజుడు= పుట్టనివాడు; పరావరుండు = ఊర్ధ్వలోకము, అధోలోకము తన

మయమే అయినవాడు; పురుషోత్తముఁడు = క్షరపురుషునకు, అక్షరపురుషునకు అంతర్యామియైనవాడు; మానిత = గౌరవింపబడిన; అపునరావృత్తి మార్గము = వెనుదిరిగిరాని మార్గము; ప్రవిమల + ఆనంద = స్వచ్ఛమైన ఆనందమే; తేజోవిరాజమాన= తన తేజస్సుగా వెలుగుచున్న; దివ్యపథమున = వెలుగైన మార్గమున.

తా. వారు నేను, నాది యను భావములు లేనివాడు, అర్చిరాది మార్గమున ఉన్నవాడు, మహానుభావుల సత్ప్రవర్తన రూపమున ప్రవర్తించువాడు, అందరి ముఖములు తన ముఖము లే అయినవాడు, అందరికిని తెలిసినదంతయు తానే యైనవాడు, సృష్టి స్థితి లయములకు కారణుడు, స్థితియేగాని సృష్టి లయములు లేనివాడు అగు నారాయణునే వారు ధ్యానింతురు. దేహాదులైన స్థూల లోకములు, ఇంద్రియాదులైన దేవతల లోకములు, ఆత్మ, జీవుడు అను రూపములన్నియు వాని రూపములుగానే ధ్యానింపవలెను. క్రిందివాడైన క్షరపురుషుడు, సూక్ష్మరూపుడైన అక్షరపురుషుడు వానియందే ధ్యానింపబడుదురు. ఇట్టి ధ్యానము చేయువారు తిరిగిరాని మార్గమును చేరుదురు. ( దేహాదులు జన్మించు చున్నను వారు జన్మింపరు. ) ధ్యానించు తామే వాని తేజస్సుగా నుందురు. ధ్యానింపబడువాడు వేరుగా ఉండడు. ఈ వెలుగే ఆనందముగా వారి సుఖస్థితియై ఉండును. అట్టి వారే ధీరులు.

1016. టీక : హిరణ్యగర్భున్ = బ్రహ్మను; ద్విపదార్థ + అవసానంబు = రెండు పదార్థముల చివరిభాగము ( 71 మన్వంతరములు ఒక బ్రహ్మ అహస్సు. మరియొక 71 మన్వంతరములు బ్రహ్మ రాత్రి. ఈ రెండును రెండు పదార్థము లనబడును. ); ప్రళయంబు దనుక = ప్రళయము వరకు : చతురాననున్ =చతుర్ముఖుని ; సకల సంహర్త = సమస్తమును సంహరించువాడు ; గత + అభిమానంబులు = పోయిన అభిమానములు ; సర్వ + ఉత్కృష్టుండు = సమస్తమున కన్న పైవాడు ; శ్రుత + అనుభావుండు = వినబడిన అనుభావము కలవాడు ; నిర్ద్వంద్వుండు = ద్వంద్వములు లేనివాడు.

తా. కొందరు తెలియక సృష్టికర్త యగు బ్రహ్మను ఉపాసింతురు. అనగా సృష్టిలో అంతర్యామిగనే దేవుని దర్శింతురు

గాని సృష్టికి అతీతునిగా దర్శింపలేరు. వారు పంచభూతములను, ఇంద్రియములను, మనస్సును జడములని భావించి, వానికన్న వేరై, సూర్యరూపమున బంగారు గ్రుడ్డుగా వెలుగుచున్న పరమాత్మను మాత్రము ధ్యానింతురు. వారి దృష్టిలో స్థూల లోకాదుల సృష్టి అంతర్యామికన్న భిన్నము. ఇట్లు హెచ్చు తగ్గులు చూచు వారు కనుక వారికి అంతర్యామి సాధన అందదు. వారు బ్రహ్మ సృష్టిలో రెండు పదార్థములు జరిగిపోవు వరకు మోక్షమునకై వేచియుండవలెను. అంతవరకు సత్యలోకప్రజ్ఞలుగా చరించుచుందురు. బ్రహ్మలయమగు సమయమున వారును బ్రహ్మతో పాటు తమ అస్తిత్వమును కోల్పోయి నారాయణుని యందు లయ మగుదురు. పంచభూతములు, మనస్సు, ఇంద్రియములు, శబ్దాదులైన తన్మాత్రలు, చివరకు ప్రకృతిలో లీనమగు ప్రకృతి అంతర్యామిలో లీనమగును. అట్టి స్థితిలో ఈ సత్యలోకవాసులకు అంతర్యామి సంహరించు వాడుగా కనబడును. అట్టి సంహారము ద్వారమున వారు నారాయణుని చేరుదురు. అట్లుకాక సర్వజీవుల హృదయపద్మములందున్నవాడు, జీవులు మాటాడుచున్నపుడు వినబడుచున్నవాడుగా నీవు వానిని ధ్యానము చేయుము. సుఖము, దుఃఖము మొదలగు జంటలను దాటగలవు. (భగవంతుడు సుఖ స్వరూపుడని ధ్యానించువారు సుఖ దుఃఖములను అనుభవింతురు. అది ధూమ మార్గము. అనుభవించువానికొరకేర్పడిన లోకము. కపిలుడు ఉపదేశించిన మోక్షమార్గము జీవుడు అనుభవించుటకు కాదు, జీవుడుగా దేవు డుండుటకు. ఇదియే భగవద్గీతలోకూడ ప్రతిపాదింపబడినది. దీనినే నారాయణలోకమందురు. నారదుడు భాగవతము మొదట తన పూర్వజన్మ వృత్తాంతమున మూడవ స్థితిలో చేసిన సాధనగా చెప్పబడినది ఇదియే.) ఈ ధ్యానమునకు గమ్యమగువాడే పురాణపురుషుడు. తల్లీ! వానినే శరణుపొందుము. (వానికి సర్వభావములతోను శరణుపొందుమని అర్జునునకు ఉపదేశించెను. సర్వభావము లనగా పుత్ర మిత్ర కళత్రాదులు, గృహ క్షేత్ర ధన దారాదులు, స్త్రీ పురుష సాంగత్యాదులు, సంకల్ప వికారాదులు.)

1017. టీక : స్థావర జంగమ ప్రతతి = కదలనివి, కదలునవి అగు వస్తువుల సమూహము ; ఆఢ్యుఁడు = ముఖ్యుడు ; అకలంకశ్రుతిగర్భుఁడు = వంక లేని వేదమే తన గర్భముగా గల వాడు, వేదముయొక్క గర్భమైన సారము రూపముగా వెలుగువాడు ; పరముఁడు = తనపై నింకేమియు లేనివాడు ; ఈశుండు = హృదయమున వున్న దేవుడు ; సేవక = సేవించువారు ; కుమార = సనక సనందన సనత్కుమార సనత్సుజాతులు ; సగుణ బ్రహ్మంబు = గుణములతో కూడిన అంతర్యామి ; లీలాగతిన్ = విలాసార్థము.

తా. అచేతనములు, సచేతనములు తన రూపమే. వేదము తన వైభవమే. తనపై నింకేమియు లేదు. అయినను ప్రతి హృదయమునను తానే జీవుడుగా మేలుకొని క్రీడించుచున్నాడు. అతడు సేవించువారిలో సేవించువాడు. యోగులలో యోగి. సనత్కుమారాదులలో కుమారుడు. అట్లే దేవాదుల రూపములలో అస్తిత్వము తానే. ఇట్లు చూచుటయే నిజమైన యోగాభ్యాసము. (యోగ మనగా ఏకత్వము. వానియందు ఇన్నియు అంగాంగీ భావమున ఇమిడి వర్తించుట దర్శనమగును.) ఇట్లు భజింపబడు వానినే సగుణబ్రహ్మ మందురు. అత డిట్లున్నది అతని క్రీడార్థము. (సగుణబ్రహ్మము తక్కువ దేవు డనియు, గుణాదులు మాయ యనియు, వానిని తొలగించి స్వచ్ఛమైన నిర్గుణపరబ్రహ్మమును దర్శింపవలెననియు పాటుపడుటవలన క్లేశమే మిగులును. గుణాదులు, మాయ భగవద్వ్యతిరేకములుగా చూడబడును గనుక ఈ ధ్యానమున భగవంతు డంతర్యామి కాడు. అవ్యక్త పరబ్రహ్మమును ఉపాసించువారికి దుఃఖమే గతి యని భగవానుడు గీతలో చెప్పెను. నిర్గుణపరబ్రహ్మము స్వచ్ఛమైన దేవు డనియు, సగుణ పరబ్రహ్మము తక్కువ వాడనియు దేవుని పక్షమున సాధకుడు అభిమాన పడ నక్కర లేదు. గుణములన్నియు గుణాతీతు డనబడు సముద్రమున తరంగముల వంటివి.)

1018, 1019. టీక : సద్గుణ వ్యతికరము = మంచిగుణముల సమ్మేళనము ; ఈ చాడ్పునన్ = ఈ విధమున ; కర్మవినిర్మిత = కర్మలచే నిర్మింపబడిన ; ఐశ్వర్యపార మేష్ఠ్యములు = అధికారముల

మేర లంతమైన చోటులు ; క్రమ్మఱన్ = మరల ; ఆమ్నాయకర్మాను సారము = అధిష్ఠించిన కర్మలను అనుసరించినది ; అప్రతిషిద్ధము = అడ్డగింపబడనిది ; నిత్యనైమిత్తిక + ఆచారనిపుణులు = నిత్య కర్మలు, నిమిత్తకర్మలు ఆచారములుగా గొని నిపుణతచెందిన వారు ; రజోగుణకలితచిత్తములు = రజోగుణముతో గూడిన మనస్సులు ; సకాములు = కోరికలు కలవారు ; హరిపరాఙ్ము ఖులు = హరికి పెడమొగమైనవారు ; త్రయివర్గికపురుషులు = త్రివర్గములకు సంబంధించిన జీవులు.

తా. అట్టి సర్వేశ్వరుడే కాలకాలములయందు తన గుణ ముల కలయికచే పుట్టుచుండును. ( సూర్యకిరణముల రంగులచే సూర్యోదయము కనిపించినట్లు. ) ఆ గుణముల కలయికలలోనే ఋషులు, దేవతలు మున్నగువారు పుట్టుచున్నారు. వారి స్వభావముల తీరులై వారి కర్మలు పుట్టుచున్నవి. అనగా సర్వే శ్వరుడు వారి కొరకు వారి కర్మలను నిర్ణయించుచున్నాడు. అతని వైభవములే వారి వారి అధికార శ్రేణులుగా హద్దులేర్పడి, అందు వారు ఆధిపత్యము వహించుచున్నారు. దానితో నొక్కొక్క డొక్కొక్క పురుషుడుగా ఏర్పడుచున్నారు. వారందరు ప్రళయ మున వానితో ఒకటియై సృష్ట్యారంభవేళ మరల వానినుండి గుణవైభవములుగా దిగివచ్చుచున్నారు. ( మఱ్ఱిచెట్టంతయు తన సమస్తభాగములతో విత్తనమున ఒకటియై మరల వృక్షము మొలచునపుడు వేర్వేరుగా విచ్చుకొనునట్లు. )

ఈ పరమార్థమును ఎరుగక కొందరు ఆ యా దేవతల కర్మలు స్వతంత్రములైన వేదోక్తకర్మలని నమ్ముచున్నారు. ఆ కర్మలకు ఆ దేవతలు అధిపతులని నమ్మి ఉపాసించుచున్నారు. ( ఒక ప్రభుత్వాధికారి అధికారమును ప్రభుత్వము ఇచ్చినదిగా మరచి, అధికారి యొక్క శక్తిగా నమ్మి వానిపేరు చెప్పు కొని టికెట్టు లేకుండ సినిమాలకు పోవుట మొదలగు హక్కులు అనుభవించినట్లు. దీనివలన పట్టుబడుట, పెచ్చుపెరిగినచో అధికారికి గూడ భంగము కలుగుట జరుగును. అంతేకాక ఈ హక్కులు అధికారకాలము హద్దులలో నుండును. కనుక చంద్రలోకమునకు

సంబంధించిన ధూమమార్గములు. వాని ఫలితము సుఖ దుఃఖములేగాని, పుణ్యముల వినియోగమేగాని ఆనందముకాదు.) వారు ఆ కర్మల ఫలితముల సామర్థ్యములపై నమ్మకము గలిగి శ్రద్ధతో నిత్యనైమిత్తికములైన యజ్ఞయాగాదులను ఆచరించు చున్నారు. వారు సకాములైన దైవభక్తులు. వారు ఇంద్రియము లను జయింపలేరు. పితృదేవతలు మున్నగువారిని ఉపాసించి గృహములయందు వర్తించుచుందురు. ధర్మార్థకామములే వీరికి ముఖ్యముగాని వాని సమర్పణవల్ల కలిగిన శాశ్వత పదవికాదు. ఇన్నియు వేదోక్త కర్మలే అయినను వీరిది వేద వ్యతిరిక్తమైన మార్గము. వేదము అంతర్యామిని స్థాపించును.

1020. టీక : వినుతగుణ + ఉత్తరుండు = స్తుతింపబడిన గుణములకన్న అతీతుడు ; ఉరు విక్రముండు = వ్యాపించుచున్న పరాక్రమము కలవాడు ; తత్ + మన్నన లసత్ కథామృతము = వానిని ధ్యానించుటచే కలిగిన వృత్తాంతమును తరుగని స్థితి ; దుష్కథల్ = చెడ్డ వృత్తాంతములు ; మధుర + జనభక్ష్యములు = తీయనివి, నేతితో చేయబడినవి యగు పిండివంటలు ; పురీషము = మలము.

తా : మహనీయుల గుణములను స్తుతించుకొనునపుడు అవి వాని గుణములే యగును. అతడు వానికి అతీతుడుగా ఉండును. ఇట్లు జీవుల హృదయములను ఆక్రమింపగల హరిని ధ్యానించి, అట్టి కథలను మననము చేయుచు సంప్రీతితో ఆస్వాదింపవలెను. కొందరు అట్లుగాక యితరుల దుష్కథలు వినుటయందే సంతోషపడి వివేకమును కోల్పోవుచున్నారు. తీయనివి, నేతితో చేసినవి అగు పదార్థములను విడిచి మలమునకై అపేక్షపడు పంది వంటి ప్రవర్తన మిది. (ఇతరుల దుష్కథలు అనగా ఇతరులు చేసిన చెడ్డపనులు చెప్పుకొని తమ కన్న తక్కువవారని సంతో షించుట. నాస్తికులు, పాషండులు, దొంగలు, వ్యభిచారులు, మున్నగువారిని గూర్చి చెప్పుకొనుచు వారెట్లు చెడిపోవుచున్నారో కుతూహలముతో వివరించుకొని "లోకమిట్లు పాడైపోవుచున్నది" అని ధర్మపన్నాలు పలుకుట మున్నగు పద్ధతులవలన ముక్తికి

దూరమగుదురు. ఇతరుల సద్గుణములను కీర్తించుకొనునపుడు మనస్సు ముచ్చటపడి సంతోషించును. దుర్గుణములను నిందించునపుడు మనసు అసహ్యించుకొనుచుండును గనుక క్లేశానుభూతి కలుగును. అయినను అభ్యాసవశమున దానియందే కుతూహల పడుట చూచుచున్నాము. సాధకుడు ఆ మార్గమునకు పోరాదు. )

1021. టీక : ధూమమార్గగతులు = పొగదారులలో పోవువారు ; పొలిసినవారు = నశించినవారు ; తొంటి = మొదటి ; విహ్వలమతిన్ = మొత్తుకొను మనస్సులతో ; గర్భగోళపతన + ఆది = తల్లిగర్భమందు పడుట మొదలు ; పరేతధరాగత + అంతము = శ్మశానభూమికి పోవు వరకు.

తా. ధూమమార్గమున చరించుట నభ్యసించి, పితృలోకములను పొంది సుఖించుచున్నవారు పుణ్యము తరగిపోయినంతనే మరల తమ బిడ్డలకు బిడ్డలై పుట్టుదురు. గర్భనరకము మొదలు శ్మశానమునకు పోవుటతో అంతమగునట్టి కర్మఫలమును ఇహలోకమునందు అనుభవించుచున్నారు. ( పితృలోకమునందలి వారి నుపాసించువారు కోరునది స్త్రీ సౌఖ్యాదులు గనుక వారు మరల గర్భనరకము అనుభవింతురు. పితరుల మహిమచే తమ బిడ్డలకు బిడ్డలుగా పుట్టుదురు. ఆ పుట్టుటలో గర్భనరకమును అనుభవించుటయు, పుట్టినది మొదలు చేసికొను కర్మఫలముల సుఖదుఃఖములలో చిక్కుకొనుటయు, తమ సంకల్పములన్నియు తమ చావుతో నష్టమగుటయు జరుగును. ( పితృదేవతలను ఉపాసించువారు బిడ్డలకు బిడ్డలై పుట్టుదురనుటలో వేదార్థమైన మర్మమున్నది. తన శుక్రమునుండి సుతుని దేహము పుట్టును. వాని శుక్రము నుండి వాని సుతుని దేహము పుట్టును. ఇట్లు శుక్ర ద్వారమున తామే మరల మరల దేహకల్పనము చేసికొనుచున్నారు. అంతర్యామిభావన లేదు గనుక తరతరముల లక్షణములు, పోలికలు, జీవగుణములుగా తామే మంచి చెడ్డలతో మరల రూపొందుచున్నారు. ఇచ్చట మనస్సు, ఇంద్రియములు సంస్కారములుగను, దేహము లింగదేహమునకు స్థూలరూపముగను పుట్టి జీవుడు ఆ ప్రజ్ఞలలోనే యుండి శాశ్వతమైన అస్తిత్వము మాటుపడి యుండును. కనుక మరల మరల చనిపోయి పుట్టుచున్న

తనలోని భాగమే తాను మొత్తముగా జీవించును. శుక్రము ద్వారమున స్థూలదేహ నిర్మాణశక్తులు కాలప్రవాహమున ఇంద్రియాది ప్రజ్ఞలైన దేవతలలో ముసలితనము, రోగము మున్నగు రూపములుగా పోరాడి చనిపోవుచుండుటయే దేవ దానవ యుద్ధముగా వేద పురాణాదులలో చెప్పబడినది. శుక్రముతో మరల ఈ దానవ స్థూలశక్తులు పునరుజ్జీవితము చేయబడును. కనుక శుక్రుడు మృతసంజీవినీ విద్యచే చనిపోయిన రాక్షసులను బ్రతికించుచు దేవతలతో యుద్ధము చేయించుచున్నాడని చెప్ప బడెను. )

1022. టీక : అనఘున్ = పుణ్యాత్ముని ; సత్ +మనమున= మంచిమనస్సుతో ; పునరావృత్తి = తిరిగి వచ్చుట.

తా. పరమాత్ముడైన అనంతస్వరూపుడు, హృదయమున కీశ్వరుడు, పురుషోత్తముడు అనువానినే సంతోషముతో, మంచి మనస్సుతో భజింపుము. మరల తిరిగిరాని ముక్తి లభించును.

1023. టీక : ప్రయుక్తంబు = ప్రయోగింపబడినది ; వైష మ్యంబు = హెచ్చుతగ్గులు కలది ; నిస్సంగంబు = అంటుటలేనిది ; హేయ+ఉపాధేయ విరహితంబు = ద్వేషపడుట, ఇష్టపడుటలేనిది ; ఆరూఢంబు = ఆరోహింపబడినది ; ఆత్మపదంబు = తనస్థితి ; దృశ్య ద్రష్టా కరణంబులు = చూడబడునది, చూచువాడు, చూచునట్టి ఇంద్రియములు ; పృథగ్భావంబు = వేరగుభావము ; సమగ్రంబు= పరిపూర్ణము ; ప్రాప్యంబు = పొందదగినది ; విషయ విముఖంబులు= ఇంద్రియార్థములనుండి మరలినవి ; హేయగుణరహితంబు = ఏవ గించుకొను గుణములు లేనిది ; మనోవిభ్రాంతి = మనస్సుయొక్క తిరుగుడు ; అర్థాకారంబునన్ = ప్రయోజనమువలె ; త్రివిధంబు= మూడువిధములైనది ; పంచవిధంబు = ఐదు విధములైనది ; ఏకాదశ విధంబు = పదునొకండు విధములైనది ; జీవవిగ్రహంబు = సజీవమైన రూపము ; శ్రద్ధాయుక్తంబు = శ్రద్ధతోకూడినది ; సమాహిత మనస్కుండు=సన్నిహితమైన మనస్సుకలవాడు ; బుధజన పూజనీయ చరిత్ర = తెలిసినవారిచే పూజింపదగిన ప్రవర్తనకలది ; సర్వ యోగ సంప్రాప్యుండు = అన్ని యోగములచేతను పొందదగినవాడు.

తా. ఇట్లు చెప్పి కపిలుడు కొంచె మాగి మరల ఇట్లనెను: సృష్టియందు అతీతుడుగా వసించుచున్న దేవుడగు వాసుదేవుని యందు భక్తియోగము నభ్యసింపవలెను. దానితో వైరాగ్యము, జ్ఞానము కలుగును. అవియే పరబ్రహ్మసాక్షాత్కారమునకు సాధనములు. భగవద్భక్తితో కూడిన చిత్తము ఇంద్రియ ప్రవృత్తుల యందు సమముగా వర్తించును. అది కలవానికి హెచ్చుతగ్గులు లేవు. ఇష్టాయిష్టము లుండవు. కోరదగినది, తిరస్కరింపదగినది యుండవు. అంటుకొనని సమదర్శనము కలుగును. తా నన్నదేమో తనకు తెలిసి, ఆ తెలివియందు తానుండును. దానినే దర్శించుచుండును.

పరబ్రహ్మము జ్ఞానస్వరూపుడు. అతడే ఏకరూపుడై యుండియు ఈశ్వరుడుగా, సర్వరూపుడుగా చూచుచున్నాడు. చూచువాడు, చూడబడునది, చూచునట్టి ఇంద్రియములు అను వివిధత్వము పొందుచున్నాడు. ఇందలి ఏకత్వము యోగవిద్యచే యోగికి లభించును. వాని ఇంద్రియములు తమ లక్ష్యములనుండి వెనుకకు మరలును. (తమయందేమున్నదో ఆ లక్ష్యము లందును అదియే యున్నదని తెలియును.) అపుడు మూడింటికిని ఏకరూపము సిద్ధించును. ఏవగించుకొను గుణము లుండవు.

అట్టి పరబ్రహ్మమే మనస్సుయొక్క కదలికవలన శబ్దము, స్పర్శము మొదలగు ధర్మములుగా ప్రసరించుచున్నది. ప్రసరించి తానే స్వతంత్రమైన వస్తువుగా గోచరించుచున్నది. (కంటికి కనుపించునదే ఆకారము. అదే ఎదుటి వస్తువులోని అస్తిత్వముగా భ్రాంతి గొలుపును. ఆకారమే అస్తిత్వ మనుకొనును. సూర్యుడు బింబముగా కనిపించుట ఇట్టిదే. అట్లే పంచదార, అరటిపండు అను శబ్దములు ఉచ్చరించబడినపుడు ఆ వస్తువులవలె భ్రాంతి కలుగును. తిట్టుకొనుటవలన ద్వేషము, పొగడుకొనుట వలన రాగము అర్థములేని ఈ శబ్దము వలననే కలుగుచున్నవి.)

శబ్దాదులు అర్థములవలె భ్రాంతిగొలుపుట ఎట్లు సంభవించుచున్నదని అడుగవచ్చును. నేనను ప్రజ్ఞ గుణములై మూడుగా తోచును. అవియే సత్త్వరజస్తమస్సులు. అదే ప్రజ్ఞ.

పంచ భూతములుగా అయిదు రూపములు ధరించును. ఇంద్రియ ముల రూపమున పదునొకండు విధములుగా భాసించును. ఇట్లు అహంకారమే నానాత్వము చెందుచున్నది. దీనితో కూడిన వాడే జీవు డనబడును. ఇట్టి జీవులతో కూడిన ఒక జీవి దేహమే అండము అనబడును. అదియే మనకు జగత్తుగా తోచుచున్నది. దీనియందు గల నానాత్వభ్రాంతి తొలగుటకై అంతర్యామిభావన చేయ వలెను. యోగాభ్యాసమును జోడించవలెను. శ్రద్ధరూపమైన భక్తిని ప్రయోగింపవలెను. నిస్సంగత్వము కలుగును. అపుడు వైరాగ్య మబ్బి సమస్త స్వరూపుని సమగ్రముగా దర్శించును. తల్లీ ! నీవు పెద్దలచే గౌరవింపదగిన ప్రవర్తనము గలదానవు గనుక దీనిని సమగ్రముగా విప్పి చెప్పితిని. సర్వవిధములైన యోగ సాధనలచేతను పొందదగిన పరమాత్మ నిర్గుణుడని జ్ఞానయోగులు చెప్పుదురు. సగుణుడని నా భక్తియోగ ముపదేశించును. పదముల భేదమేగాని అనుభూతి యొక్కటే. ( కుండతో మట్టిని కుండకన్న వేరుగా చూచినను, కుండ యాకారమున చూచినను శ్రద్ధ కుండపై నుండక మట్టిపై నిలిచినపుడు అనుభూతి యొక్కటే. ) ఒక జీవికి ఇంద్రియములు అనేకము లున్నవి గనుక ఒక దేవుడు అనేక విధములుగా భావింపబడుచున్నాడు.

1024. టీక : సమధిక + అనుష్ఠిత = సమృద్ధిగా అనుష్ఠింప బడిన ; స్తవన = స్తోత్రము ; తీర్థదర్శన = పుణ్యతీర్థములను చూచుట ; అధ్యయన = వేదశాస్త్రములు చదువుట ; ఏచిన = పూనిన ; బాహ్య + ఇంద్రియంబులన్ = బహిర్ముఖములైన ఇంద్రియములను ; సకలకర్మత్యాగసరణిన్ = సమస్తకర్మల సంకల్పములను, ఫలములను పరిత్యాగముచేయు విధానమున ; ఫలసంగరహితధర్మము = ఫలితములయందు ఆసక్తిలేని స్వభావము ; హేయగుణములు = రోయదగిన గుణములు ; అనఘుడు = పుణ్యాత్ముడు.

తా. తల్లీ ! ఈ దృష్టి లేనిచో నారాయణుడు అంతర్యామి యైనను సర్వశాస్త్రములను పఠించువారికి కూడ కనబడడు. అనుష్ఠానములు, స్తోత్రములు, తీర్థయాత్రలు, జపతపములు,

వేదాధ్యయనము, యోగాభ్యాసము, యజ్ఞములు, దానాదులు చేసినను కనుపింపడు. మనస్సును, ఇంద్రియార్థముల వెంట పరుగెత్తు ఇంద్రియములను అంతర్యామిభావనచే గెలువవలెను. కర్మల సంకల్పములను వానికి సమర్పణ చేయవలెను. తన్ను వానికి అర్పణ చేయగా తాను వాడై తత్త్వస్వరూపుడగును. తరుగని వైరాగ్యము పుట్టును. కర్మలఫలితములయందు బుద్ధి ప్రసరింపకుండు అభ్యాసము కూడ అంతర్యామిభావన చేతనే సాధ్యము. ఇట్లు ఆచరించినవాడు దుర్గుణములను తొలగించుకొని, కల్యాణగుణముల పరిపూర్ణతగల విష్ణువు పదమును పొందును.

1025. టీక : చతుర్విధ = నాలుగు విధములైన ; కామరూప = కోరికలరూపమైన ; అవిద్యాకర్మనిర్మితంబులు = అజ్ఞానకారణమైన కర్మచే నిర్మింపబడినవి ; సాంఖ్యయోగప్రకారంబు = జ్ఞానము, యోగాభ్యాసము అనువాని విధము ; ఖలునకు = దుర్బుద్ధికి ; జడునకు = తెలివితక్కువవానికి ; డాంబికునకు = డంబము గలవానికి ; పుత్ర దార + అగారాది + అత్యంత + ఆసక్త చిత్తునకు = పుత్రులు, భార్య, ఇల్లు మొదలగు వానియందు పట్టరాని ఆపేక్షగల వానికి ; వినతుండు = వినయము గలవాడు ; సర్వభూతమిత్రుండు = సర్వజీవులకు మిత్రుడు ; శుశ్రూషా + అభిరతుండు = వినవలెనను గాఢమైన సంకల్పము కలవాడు ; బాహ్య + అర్థజాత విరక్తుండు = పరిసరములందలి ప్రయోజనముల యందు వైరాగ్యము కలిగినవాడు ; అన్యకాంతా విముఖుండు = ఇతరస్త్రీలను మొగమెత్తి చూడనివాడు ; మత్ + అర్పిత చిత్తంబు = నాయందర్పించిన చిత్తము ; కర్దమదయిత = కర్దముని ప్రియభార్య ; వినిర్ముక్తమోహాపటల = విడిపోయిన అజ్ఞానపు పొరలు గలది ; తత్త్వవిషయ + అంకిత = యథార్థ స్వరూపముచే గుర్తింపబడిన ; ఉపక్రమించి = ప్రారంభించి.

తా : నీకు నాలుగు విధములైన భక్తియోగముల ప్రకారము వివరించితిని. ( ఆర్తునకు, జిజ్ఞాసువునకు, అర్థార్థికి, జ్ఞానికి కావలసిన విధములైన భక్తియోగములు. ) నేను నా సంకల్పమును సృష్టియందు ప్రవర్తింపజేయుదును. కామము

రూపమైన నా అంతర్యామిత్వము జీవుల జనన మరణ రూపమున వర్తించును. జీవుడు అజ్ఞానముచే ఆచరించు కర్మలవలన అనేక గతు లేర్పరచుకొనును. జీవుడుగా వర్తించు ఆత్మ ఈ రూపమున ప్రవర్తించునని నిర్దిష్టముగా చెప్పుట సాధ్యముకాదు.

నేను నీకు ఉపదేశించిన ఈ సాంఖ్యయోగముల స్వరూపము పరమరహస్యము. ( దాచదగినదని అర్థముకాదు. అర్హత రానిచో విప్పిచెప్పినను రహస్యముగనే మిగిలిపోవు నని అర్థము. ) కనుక దీనిని తగినవారికే ఉపదేశింపవలెను. నీతిలేనివానికి, మూర్ఖునకు, ఆచారములేనివానికి, తన్ను గొప్పవానినిగా భావించుకొనువానికి, ఇంద్రియసుఖములందు మునిగియున్నవానికి చెప్పకుము. భార్య, బిడ్డలు, ఇల్లు, ధనము మున్నగు వాని యందు అపరిమితాసక్తితో తిప్పలుపడువానికి చెప్పకుము. భక్తి లేనివానికి, భక్తులపై ద్వేషముగలవానికి తెలుపవలదు. శ్రద్ధ, భక్తి, వినయము కలిగి అసూయలేక సర్వజీవులయందు మైత్రి కలవానికి చెప్పవలెను. వినవలె నను తపన మిక్కిలిగా వుండవలెను. పరిసరముల యందలి మంచి అవకాశముల యెడల వైరాగ్యము పుట్టవలెను. మాత్సర్యము లేకుండవలెను. అప్పుడే వినుటకు చిత్తము శాంతపడును. నా భక్తులయందు ప్రేమ చూపవలెను. భార్యకాక యితర స్త్రీలను కన్నెత్తి చూడరాదు. అట్టివాడు ఉపదేశార్హుడు. దీనికి అర్హత కలుగుటలో స్త్రీ పురుష భేదము లేదు. పుణ్యపురుషు డైనను, పతివ్రతయైన ఉత్తమస్త్రీయైనను చాలును. శ్రద్ధ, భక్తి, నాయందర్పించిన చిత్తము కావలెను. అట్టి అర్హతతో దీనిని పఠించినను పుణ్యాత్ములై నా దివ్యస్వరూపము పొందుదురు. ఆచార్యుడైన కపిలుడు ఈవిధముగాతల్లికిఉపదేశించెనని విదురునితో మైత్రేయుడు తెలిపెను. మరల ఇట్లనెను : కపిలాచార్యుని వాక్యము లచే మోహము తొలగిన దేవహూతి తన గురువునకు సాష్టాంగ దండప్రణామము చేసెను. తాను పొందిన తత్త్వవిషయముతో నిండిన స్తోత్రము చేయుచు కపిలునితో ఇట్లనెను :

1026. టీక : అనయంబు = మిక్కిలి ; ఇంద్రియార్థ మనో రయంబు = ఇంద్రియార్థములపై మనస్సుపడు వేగము ; భూతచయ

మయంబు = పంచభూతములతో చేయబడినది ; అశేష = సమస్తమైన ; భూరిజగద్బీజభూతంబు = ఈ మహాసృష్టికి విత్తనము వంటిది ; అభిఖ్య = పేరు ; చారు = అందమైన ; భవత్ + గర్భసంజాతుఁడు = నీ గర్భమున పుట్టినవాడు ; కమలగర్భుండు = బ్రహ్మ ; సహస్ర శక్తి కలితుఁడు = వేయిశక్తులతో కూడినవాడు.

తా. ఇంద్రియార్థములు, మనస్సు, పంచభూతములు, ప్రకృతి, గుణముల ప్రవాహము మున్నగు సమస్తముతో మెరపులు మెరయుచున్న నీ దివ్యమూర్తి నారాయణ శబ్దముచే తెలియబడుచున్నది. దానిని భావించుటకు చతుర్ముఖుడు యత్నింపగా సాధ్యపడలేదు. ఆ ప్రయత్నముననే అనేక శక్తులతో గుణప్రవాహరూపమైన ఈ సృష్టిని కల్పించెను. అట్టి నీ నారాయణ తత్త్వము సహస్ర శక్తులతో కూడి అతనియందు నిండగా సమస్తకార్యములును పుట్టినవి.

1027, 1028, 1029. టీక : అతుల = సాటిలేనివి ; భూతియుగాంతంబు = మహాప్రళయము ; కుక్షినిక్షిప్త=కడుపునదాచిన ; నిఖిలభువన నిలయుండవు = సమస్త లోకములకు స్థానమైనవాడవు ; చారు=అందమైన ; వటపత్రతల్పసంస్థాయి = మఱ్ఱియాకు పాన్పుపైని వాలినవాడు ; పాదాంగుళీవినిర్గత + అమృతము = కాలివ్రేలునుండి వెలువడిన అమృతము.

తా. మహాప్రళయమున మాయ శిశువు రూపము ధరించి నీవు ఒంటరివాడవై ఈ సకలలోకముల సృష్టిని గర్భమున దాచితివి. మహాసముద్రము నడుమ చక్కని మఱ్ఱియాకుపై పరుంటివి. నీ కాలివ్రేలినుండి వెలువడిన అమృతమును నీవే గ్రోలితివి. అట్టివాడవు నా భాగ్యవశమున నేడు నా గర్భమున పుట్టితివి. ( కాలివ్రేలు అనగా సృష్టికి అంతము. ముఖము అనగా సృష్టికి మొదలు. ఆద్యంతములు కలుపుట వలన సృష్టి మండలాకారమై అమృతత్వమును పొందినది. శిశువు అనగా సమస్తమునకు విత్తనము వంటివాడు. ఏ తల్లి గర్భమున బిడ్డ పుట్టినను వాడే అవతరించెనని దర్శింపవలెను. ఇది కపిలుని ఉపదేశమునకు ఎరిగిన స్తోత్రము.

1030, 1031. టీక : విగ్రహపారవశ్యంబు = ఆకారముల యందు పరతంత్రత నొందుట ; మూర్తులు = ఆకారములు ; అంచితలీల= సొగసైనట్లు ; నయమునన్ = చక్కని పద్ధతిలో ; చతురాత్మతత్త్వవిజ్ఞానప్రదుండవు = ఆత్మయొక్క నాలుగు తత్త్వముల విజ్ఞానమును ఇచ్చినవాడవు. ( వాసుదేవుడు, సంకర్షణుడు, అనిరుద్ధుడు, ప్రద్యుమ్నుడు అను తన నాలుగు వ్యూహములకు సృష్టిలో మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అను తత్త్వములుగా ప్రసాదించినవాడు, వాని సహాయమున జీవులకు తత్త్వజ్ఞాన మిచ్చినవాడు. ) భవత్ + మహత్త్వము = నీ గొప్పదనము ; అజునకు = బ్రహ్మకు ; నిగమజాతంబులు = వేదముల గుంపులు.

తా. అట్టి పరబ్రహ్మవగు నీవు ఆకారములపై ముచ్చటపడి రఘురాముడుగను, కృష్ణుడుగను, వరాహమూర్తిగను, నరసింహమూర్తిగను రూపములు ధరించితివి. దుష్టులను శిక్షించి శిష్టులను కాపాడితివి. ధర్మమునందు నిషగలవారికి జ్ఞాన దర్శనమును ప్రసాదించుటకై చతుర్వ్యూహములతో దిగి వచ్చితివి. నిన్ను స్తుతించుటకు బ్రహ్మకుగాని, వేదములకుగాని అలవికాదు. నేనెంతదానను. ( ఈ పద్యమునకు మూలమైన శ్లోకము ప్రక్షిప్తము. కారణ మేమనగా రామావతారము, కృష్ణావతారము త్రేతా ద్వాపరయుగముల లోనివి. కపిలుడు మానవసృష్టి ప్రారంభ స్థితిలోనే ఆచార్యుడు. స్వాయంభువమనువు మనుమడు. )

1032, 1033. టీక : ధీమహిత = బుద్ధిబలమున మహనీయుడా ! ; భవత్ + మంగళనామస్మరణ = నీ శుభమైన నామము స్మరించుట ; అనుకీర్తనము = ఇతరులతో కలిసి పాడుట ; అగ్నిష్టోమ + ఆదికృత్ + ఆళి = అగ్నిష్టోమము మొదలగు యజ్ఞములు చేయువారి వరుస.

తా : బుద్ధిమంతుడా ! శుభమైన నీ నామస్మరణము చేసినను, పదిమందితో కలసి పాడినను దరిద్రులు శ్రీమంతులగుదురు. అగ్నిష్టోమాది యజ్ఞములు చేసినవారికన్న పరిశుద్ధులగుదురు.

1034, 1035. టీక : శ్వపచుండు = కుక్కలను వండి తినువాడు ; భూసురుఁడు = బ్రాహ్మణుడు.

తా : భక్తితో నీ నామస్మరణమును చేయువాడు కుక్క మాంసము తిన్నవాడైనను వాని నాలుక పరిశుద్ధి యగును. వానితో భక్తిహీనుడైన బ్రాహ్మణుడు ఎన్నడును సాటిరాడు.

1036. టీక : సర్వచతుర్థావళిన్ = సమస్తపుణ్యతీర్థములందు ; వావిరి = నోరు విప్పి.

తా : సజ్జనుడు నీ తత్త్వమును దర్శించుచు లోక పవిత్రమైన నీ గుణ కథాకీర్తనము చేసినను, గ్రోలినను సర్వ పుణ్య తీర్థములయందు స్నానము చేసిన ఫలితము పొందుదురని వేదములు నోరు విప్పి ఘోషించుచున్నవి. కనుక అట్టి మహనీయులే పూజనీయులు.

1037. టీక : ప్రత్యక్ + మనోభావ్యుండవు = ప్రత్యక్షముగను, మానసికముగను భావింపదగినవాడవు (కనుపించు వస్తువులుగను, ధ్యానింపబడు వెలుగుగను గూడ నిన్ను దర్శింపవలెను.) ; సమస్తజనపాపనివారక = సర్వజీవుల పాపములను పోగొట్టునట్టి ; స్వయంప్రకాశుండు = ఆత్మస్వరూపమైన వెలుగు ; మాతృవత్సలుండు = తల్లియందు ఆపేక్షగలవాడు ; కరుణారస + ఆర్ద్రహృదయకమలుఁడు = కరుణారసముతో తడిసిన హృదయపద్మము కలవాడు.

తా : పరబ్రహ్మ (నిర్గుణము,) పరమపురుషుడు (సగుణము) అగు నీవు ప్రత్యక్షముగను, ధ్యానరూపముగను దర్శింప దగినవాడవు. ఆత్మప్రకాశస్వరూపుడవు. వేదము నీ గర్భము. అట్టి నీకు నమస్కరించెదను అని స్తుతింపగా తల్లిపై ప్రేమగలిగి కపిలుడు కరుణార్ద్రహృదయుడై ఇట్లనెను.

1038. టీక : కమలనయన = కమలములవంటి కనులు కలవాడా ! ; సుఖరూపమును = సుఖము యొక్క స్వరూపమును ; మోక్షదాయకంబును = మోక్షమును కలిగించునదియును ; ఈ యోగమార్గమును = ఈ యోగమార్గమును ; ఏను = నేను ; నీకు నెఱుఁగ = నీకు తెలియునట్లుగ ; ఇది దృఢంబు = ఇది దృఢమైనది ; భక్తి ననుష్ఠింపు = భక్తితో అనుష్ఠింపుము.

